పౌరసాశ్మై జనియించితిన్ ప్రభు! సరేపోనీ మరీ జన్మకున్
పరమోపజ్ఞనిధాన దివ్యధిషణా భ్రాజిష్ణువౌ విశ్వనా
థరసోదంచిత సాహితీ విమల తీర్థస్నాన పూతాత్ముగా
కరుణింపదగు ముక్తిమాట అటు పై కాశ్మీర నేత్రచ్ఛవీ!

—రామకోటిశాస్త్రి (ఆనందచేతన, 1958)

# విశ్వనాథ వైఖరి

రచయిత

**కేతవరపు రామకోటిశాస్త్రి**

కూర్పు

**కాత్యాయనీ విద్మహే**

జిజ్ఞాస ప్రచురణ
వరంగల్లు

**VISWANATHA VIKHARI**
(Critical Essays on Viswanatha Literature)
**KETHAVARAPU RAMAKOTI SASTRY**
(26-12-1931 - 28 10-1991)
**Jignasa Prachurana**

ప్రథమ ముద్రణ
28 అక్టోబరు, 1994

**వెల : రూ. 50/-**

ప్రచురణ
**శ్రీమతి కేతవరపు ఇందిరాదేవి**
5 11-136/5, పశ్యంతి,
కాకతీయ విశ్వవిద్యాలయం రోడ్డు,
విద్యారణ్యపురి, వరంగల్లు - 506 009

ప్రతులకు
**సవోదయా బుక్ హౌజ్**
ఆర్య సమాజ మందిరం ఎదురుగా,
కాచిగూడా చౌరస్తా,
హైదరాబాదు

ముద్రణ
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు 611413, 600547

# విషయ సూచిక

జిజ్ఞాస నాన్నకు ఇష్టమైన ప్రక్రియ 1991 లో అగస్టు 13 న గురజాడ కన్యాశుల్కం శత జయంతి సంరంభ ఆరంభాన్ని సందర్భంగా చేసుకొని నాన్న జిజ్ఞాస వేదికను ప్రారంభించారు కూడా అందుకని నాన్న పుస్తకాలను 'జిజ్ఞాస ప్రచురణ' గా తేవాలని అనుకొన్నాం జిజ్ఞాస ప్రచురణలలో రెండవదిగా ఇప్పుడు ఈ "విశ్వనాథ వైఖరి" అనే పుస్తకాన్ని తీసుకువస్తున్నాం ఇది విశ్వనాథ శత జయంతి సంవత్సరం కనుక, నాన్న అభిమానించి ఆదేపనిగా అధ్యయనం చేసిన రచయిత కనుక విశ్వనాథ రచనలపై నాన్న వ్రాసిన విషయాలను పుస్తకరూపంతో తీసుకొని రావటానికి ఇది తగిన సమయం అనుకొని ఈ పని చేశాం

నాన్న విశ్వనాథ రచనల మీద ఎప్పుడేమి వ్రాశారో చెప్పి, తమదగ్గరున్న వ్యాసాలను వెతికి తీసి ఇచ్చి సంకలనం కూర్పుకు తగిన సలహాలు సూచనలు ఇచ్చిన ఆచార్య సుప్రసన్నగారు, ఆచార్య సంపత్కుమార గారు - ఈ పుస్తకం ఇంత సమగ్రంగా రావటానికి ప్రధాన కారకులు వాళ్ళకు నాన్నతో వున్న స్నేహ సాన్నిహిత్యాలు అటువంటివి మాపట్ల వున్న వాత్సల్యాభిమానాలు ఇటువంటివి

మాకిక దొరకవని నిరాశ చేసుకొని వదిలేసిన జాగృతి పత్రిక వ్యాసాలు రెండింటిలో "కల్పవృక్షమున శ్రీరాముని హాస్యశీలత" అన్న వ్యాసం తనదగ్గర వున్నదని వెతికి సమయానికి పంపించారు - డా కావూరి పాపయ్య శాస్త్రిగారు వారి స్నేహ సహాయాన్ని సదా గుర్తుంచుకొంటాం

ఈ పుస్తకం ప్రెస్సుకాపీ తయారు చేయటంతో శ్రీ మార్క యాదయ్య, శ్రీ ఎన్ కె రామారావు, శ్రీ జి కిషన్‌ప్రసాద్ శ్రీమతి శశిరేఖ తలా ఒక చెయ్యివేసి తోడ్పడ్డారు ప్రెస్సుపనిలో అండగా నిలబడ్డారు డా బి వాణి, శ్రీమతి లక్ష్మి వాళ్ళ అభిమానం, ఆప్యాయత, నాన్న పనిపట్ల మావలెనే స్పందించగల వాళ్ళ సాన్నిహిత్య స్నేహ లక్షణం ఎప్పుడూ మా మనసులో మెదులుతుంటుంది

పుస్తకానికి తగినపేరు ఖరారు చేయటం దగ్గరనుండి కవరుపేజీ రూపు రేఖలు నిర్ధారించుకోవటం వరకు అన్ని విషయాలలో ఆలోచనలను ప్రేరేపించి

ప్రోత్సహించారు శ్రీ డి. సోమేశ్వరరావుగారు, ఆచార్య కేతు విశ్వనాధరెడ్డిగారు వారికి మా కృతజ్ఞతలు. కవరు పేజీ అక్షరాలు వ్రాసిపెట్టి శ్రీ ప్రవీణ్ కుమార్ ప్రదర్శించిన స్నేహార్ద్రతా లక్షణాన్ని మళ్ళీ మళ్ళీ అనుకొంటాం.

పుస్తకం పని ఎంతవరకు వచ్చిందని ఎప్పటికప్పుడు అడుగుతూ ఈ పనిని చేసుకోవటానికి తగిన ఉత్సాహ శక్తిని అందించారు ఆచార్య మాదిరాజు రంగారావుగారు, ఆచార్య హరిశివకుమార్‌గారు. ఇంకా ఈ పనిపట్ల ఆపేక్ష చూపిన ఆప్తులు, మిత్రులు వున్నారు. వాళ్ళందరికీ కృతజ్ఞులం.

హైదరాబాదులో వుండి ప్రెస్సుపని సులువుగా చేసుకోగలగటానికి అవసరమైన లైబ్రరీ వసతి సౌకర్యాలను సమకూర్చిపెట్టారు మా భీమసేన్ నిర్మల్ మామయ్యగారు, కాత్యాయనత్రయ్యగారు. మేము చేసే పనులను ఇష్టంతో అభినందించే వాళ్ళిద్దరికి కృతజ్ఞులం.

పుస్తకాన్ని సకాలంలో చక్కగా ముద్రించి పెట్టిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ యాజమాన్యానికి, కార్మికులకు - కృతజ్ఞతలు.

పశ్యంతి
14-10-1994
విజయదశమి

కాత్యాయనీ విద్మహే
మైథిలీ ధీమహి
శ్రీగౌరి ప్రచోదయాత్

# 'విశ్వనాథ వైఖరి' - ముందు వెనుకలు

I

మా నాన్న కేతవరపు రామకోటిశాస్త్రిగారు విశ్వనాథ సత్యనారాయణ సాహిత్యాన్ని విశ్లేషిస్తూ వ్రాసిన వ్యాసాలను ఒక పుస్తకంగా అచ్చువేయాలని సంకల్పించి ప్రయత్నాలు ప్రారంభించినప్పుడు, నా దగ్గర వున్నవి - ఆయన విశ్వనాథ రచనల మీద నోట్సులాగా వ్రాసి పెట్టుకొన్న వ్యాసాంశాలు, అప్పటికే వేరువేరు పత్రికలలో అచ్చయిన రెండు మూడు వ్యాసాలు - మాత్రమే విశ్వనాథ వాఙ్మయ సూచిక (1974) లో 'విశ్వనాథ వాఙ్మయ విమర్శనములు' అనే శీర్షిక క్రింద సమీకరించబడిన రచనల జాబితా నుండి విశ్వనాథ రచనల మీద నాన్న వ్రాసిన వ్యాసాల వివరాలు సేకరించి వాటికోసం అన్వేషణ మొదలు పెట్టాను వాఙ్మయ సూచికకు ఎక్కని మరికొన్ని వ్యాసాల వివరాలు, ఈ పుస్తకంలో వుంటే బాగుండుననిపించిన మరికొన్ని రచనల వివరాలు ఆచార్య సుప్రసన్నగారు, ఆచార్య సంపత్కుమారగారు తెలియచేశారు చివరివరకు ఎంత ప్రయత్నించినా జాగృతి పత్రికలో అచ్చయిన "కల్పవృక్షమున శ్రీరాముని మనుజధర్మము" అనే వ్యాసం మాత్రం దొరకలేదు ప్రస్తుతానికి అదిలేకుండానే "విశ్వనాథ వైఖరి" అనే ఈ వ్యాసాల సంపుటిని పాఠకుల ముందుకు తీసుకు వస్తున్నాను

ఈ పుస్తకంలో మొత్తం 28 వ్యాసాలున్నాయి ఈ వ్యాసాలను విషయాన్ని బట్టి ముందుగా రామాయణ కల్పవృక్షానికి చెందిన వాటిని వరుసచేసి ఆధునిక కవిత్వానికి చెందింది ఆ తరువాత చేర్చి, నవలలమీద వ్రాసిన వ్యాసాలు ఆ పిమ్మట, ఇచ్చి జీవిత దృక్పథానికి సంబంధించిన వ్యాసాలు చివర చేర్చి కూర్చటం జరిగింది

వీటిలో 17 వ్యాసాలు 'రామాయణ కల్పవృక్షం' గురించి వ్రాయబడినవి 1956 నుండి ప్రారంభించి 1990 వరకు వ్రాసిన వ్యాసాలివి వీటిలో తొమ్మిది వ్యాసాలు ఇప్పటికే వేరు వేరు పత్రికలలో, సంపుటాలలో అచ్చయ్యాయి మిగిలిన ఎనిమిది వ్యాసాలు నాన్న అప్పుడప్పుడూ వ్రాసి అలా వదిలేసినవి అచ్చుకాని వ్యాసాలలో ఇంగ్లీషు వ్యాసం 1977 నాటిది కవితా సంభారం ఆగస్టు 1990 నాటిది ఈ రెండింటిని మినహాయిస్తే మిగిలిన అయిదు

వ్యాసాలలో ఏది ముందో, ఏది వెనుకనో చెప్పేవీలు కనిపించటం లేదు కనుక కాలక్రమ వరుసలో కల్పవృక్ష వ్యాసాలను కూర్చటం సాధ్యం కాదనిపించింది అందువల్ల విశ్వనాథను గురించి, కల్పవృక్ష రచనను గురించి పాఠకులు ఒక అవగాహనను ఏర్పరచుకోవటానికి వీలుగా వ్యాసాంతర్గత విషయాల ననుసరించి ఒక క్రమం ఏర్పరచటం జరిగింది రామాయణ కల్పవృక్షము అనే మాట దాదాపు అన్ని వ్యాసాల శీర్షికలలోను పునరావృత్తం అవుతుండటం వలన ఎట్లాగూ రామాయణ కల్పవృక్ష వ్యాసాలన్నీ ఒకే వరుసలో వున్నాయి కనుక శీర్షికల నుండి ఆ మాటను తొలగించే స్వాతంత్ర్యాన్ని తీసుకొన్నాను

ఈ వ్యాసాలలో నవ్యసంప్రదాయం గురించినవి రెండున్నాయి మొదటి వ్యాసం సాధారణంగా విశ్వనాథ అన్ని రచనలను ఆవరించుకొని వుండే నవ్య సంప్రదాయ ధోరణి లక్షణాన్ని ప్రస్తావిస్తే, మరొక వ్యాసం ప్రత్యేకించి రామాయణ కల్పవృక్షాన్ని కేంద్రంగా చేసుకొంది నవ్యసంప్రదాయ భావనను వివరించటంలో, దాని చారిత్రక సామాజిక స్వభావాన్ని చెప్పటంలో ఈ రెండు వ్యాసాలు పరస్పర పోషకంగా వుంటాయనిపించింది కనుక పాఠకుల సౌకర్యం కోసం రెండింటిని ఒక దగ్గరే వుంచటం జరిగింది విశ్వనాథ సాహిత్యాధ్యయనానికి కావలసిన తాత్త్విక భూమికను చర్చించిన వ్యాసాలివి

రామాయణ కల్పవృక్షం గురించి 35 ఏండ్ల మీద వ్రాసిన వ్యాసాలు కనుక అన్ని వ్యాసాలను కలిపి ఒక దగ్గర చూచినప్పుడు చెప్పిన విషయాన్నే మళ్ళీ మళ్ళీ చెప్పినట్లు కొన్ని సందర్భాలలో అనిపిస్తుంది ఒకే ఇతివృత్తాన్ని వేరు వేరు కోణాల నుండి అర్థం చేసుకొనే ప్రయత్నంలో వేరు వేరు కాలాలలో వ్రాసినప్పుడు పునరావృతి అనివార్యమవుతుంది దానిని పాఠకులు సహృదయతతో స్వీకరించాలి

ఈ పుస్తకంలో ఆధునిక కవిత్వానికి చెందిన వ్యాసం ఒక్కటే 'గిరికుమారుని ప్రేమ గీతాల'పై వ్యాసమది కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం పరిశోధన పత్రికగా 1976లో ప్రారంభించిన విమర్శినిలో నాన్న వ్రాసిన 'భావకవిత్వ విచారము' అనే వ్యాసం నుండి గిరికుమారుని ప్రేమగీతాలకు సంబంధించినంతవరకు అక్కడక్కడా విస్తరించి వున్న విషయాన్ని సమీకరించగా తయారైన వ్యాసమిది.

ఇకపోతే కథకు సంబంధించినది ఒకటి, నవలా సాహిత్యానికి సంబంధించినవి ఏడు - మొత్తం ఎనిమిది వ్యాసాలలో మూడు మాత్రం అచ్చయినాయి? మిగిలిన అయిదు నాన్న వ్రాసిపెట్టుకొన్న నోట్సు నుండి కూర్చినవి వీటిల్లో వేయి పడగలు గురించి నాన్న వ్రాసి పెట్టుకొన్న నోట్సు చాలా వివరాలతో వుంది ఒక విషయాన్ని అనేక కోణాలనుండి పదేపదే తరచి చూచిన లక్షణం అందులో కనబడుతుంది మదిలో మెదిలే ఆలోచనలను కాగితం మీద పెట్టి చూచుకోవటం అలవాటుగా వున్న నాన్న 'వేయి పడగలు' మీద వ్రాసుకొన్న నోట్సు ఆ నవలమీద ఆయన వ్రాయ తలపెట్టిన విమర్శకు సంబంధించిన బృహత్ప్రణాళికకు రేఖా చిత్రరూపం దీనిని ఆధారంగా చేసుకొని నాన్న 'వేయి పడగలు లోని ఇతి వృత్తాంశాల మీద ఇంకేమి వ్రాయాలనుకున్నారో - ఊహించుకోవలసిందే ఆ రూపం చెడకుండా, పునరావృతులను తొలగిస్తూ ఒక క్రమంలో ఆ నోట్సును తిరిగి వ్రాయటం నాకు అడుగడుగునా ఆశ్చర్యానందాలతో కూడిన అనుభవాన్నిచ్చింది

విశ్వనాధ సాహిత్య జీవిత దర్శన మెటువంటిదో విశ్లేషించే వ్యాసాలు ఇందులో రెండున్నాయి ఒకటి తెలుగు పత్రికలో అచ్చయినదే ఆ వ్యాసంలో వచ్చిన అంశాల స్పర్శ అంతగా లేకుండా మరికొన్ని వివరాలతో వింగడింపులతో వ్రాసిన వ్రాతప్రతి వ్యాసం రెండవది ఈ రెండు వ్యాసాలు విశ్వనాథ జీవిత దృక్పథాన్ని అర్థం చేసుకోవడానికి, ఆయన సాహిత్య సృజనలోకి వచ్చి చేరిన విలక్షణమైన విషయ ప్రతిపాదన పద్ధతిని, అభివ్యక్తి తీరును అర్థం చేసుకోవటానికి ఉపయోగపడతాయి

ఈ వ్యాసాలలోని భాష గురించి కూడా ఒక మాట చెప్పాలి ప్రారంభ వ్యాసాలలో భాష దీర్ఘ సమాసాలతో అన్వయ క్లిష్టతగల వాక్యాలతో వుంది భాషా సాహిత్యాల అధ్యయనంలో సామాజిక దృష్టికోణం నుండి ఏర్పడిన ప్రజాస్వామిక చైతన్యం కారణంగా తరువాతి తరువాతి వ్యాసాలలో భాష, వాక్య నిర్మాణం సారళ్య మవుతూ వచ్చాయి ఆ లక్షణం నవలల మీద వ్రాసిన వ్యాసాలలో, జీవిత దర్శనానికి సంబంధించిన వ్యాసాలలో ఎక్కువగా కనబడుతుంది ఏమైనా నాన్న భాషాసాహిత్య విమర్శ రచనలో విశ్వనాథ ప్రభావం తక్కువ దేమీకాదు.

## II

నాన్న విశ్వనాథ సత్యనారాయణ సాహిత్యాన్ని గాఢమైన అభినివేశంతో అధ్యయనం చేయటం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆనర్స్ చదువుతున్నప్పటి నుండి మొదలైంది అంతకు ముందు-అంటే, ఇంటర్ చదివిన కాలంలో నాన్నకు అభిమాన కవి జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు ఆయన పద్యాలను హాయిగా చదువుకోవటం కరుణశ్రీ పేరు నమూనాలో "వసంతశ్రీ' అని కలం పేరు పెట్టుకొని ఆయన ప్రభావంతో పద్యరచనను అభ్యాసం చేయటం అప్పట్లో చేసిన పని

ఆ అలవాటు ఆనర్స్‌లో చేరాక కూడా కొనసాగింది అప్పటికి అధ్యయనం చేసే సాహిత్య ప్రపంచ పరిధి విస్తరించింది పద్యనిర్మాణం మీద పట్టుకై ప్రయత్నిస్తూ చేసిన ఆనాటి అభ్యాసం సరదాగా-పద్యాలలోనే పోట్లాడుకోవటంగా, పోట్లాడుకోవటంగా, హాస్టల్ భోజనం మీద, ఆశుకవిత్వం చెప్పటంగా-సాగింది అప్పుడే నాన్న పద్యరచన పోటీలలో పాల్గొని ద్వితీయ బహుమతి పొందారు

దాదాపు ఆ తరుణంలోనే రామాయణ 'కల్పవృక్షం' ఒక కాండము తరువాత ఒకటిగా వెలువడ్డాయి అప్పటికి తనలో స్థిరపడుతూ వచ్చిన పద్య నిర్మాణ దృష్టికి సంతృప్తికరమైన రూపంగా కల్పవృక్షం ఆయనకు గోచరించింది దానితో ఆ రామాయణాన్ని చదివి ఆనందిస్తూ అభిమానించారు నాన్న. ఆ రకంగా విశ్వనాథ నాన్న ఎదమెదడులను తానై ఆక్రమించాడు

1953 నాటికి నాన్నకు విశ్వనాథతో ముఖాముఖీ పరిచయం ఏర్పడింది ఆ తరువాత కొద్దికాలానికే నాన్న గుడివాడ కాలేజిలో లెక్చరరుగా చేరి మూడేళ్ళు అక్కడే పనిచేశారు త్రిపురనేని మధుసూదనరావుగారి మాటల్లో చెప్పాలంటే 'గుడివాడ కాలేజీలో పనిచేసేటప్పటికే ఆయన విశ్వనాథ సాహిత్యంలో మునిగిపోయి ఉన్నాడు ' (అరుణతార డిసెంబరు 91/జనవరి 92) 1956 లో గుడివాడలో విశ్వనాథ షష్టిపూర్తి ఉత్సవం జరిగింది అప్పటినుండి రామాయణ కల్పవృక్షంమీద తాను ఏదో ఒకటి వ్రాస్తూనే వున్నారు విశ్వనాథ సాహిత్యమంటే కల్పవృక్షమే నన్నంత తీవ్రాభినివేశంతో వున్న రోజులవి హైదరాబాదులో పరిశోధక విద్యార్థిగా వుంటూ - తిక్కన భారతాన్ని అధ్యయనం చేస్తూ కూడా విశ్వనాథ సాహిత్యాన్ని గురించి సమాన భావశీల లక్షణం గల స్నేహితులతో చర్చలు, భావ వినిమయం జరుపుతునే వచ్చారు నాన్న

1969 లో వరంగల్లు పి జి సెంటరుకు వచ్చిన తరువాత అప్పుడే పుట్టి పెరుగుతున్న తెలుగుశాఖను విశ్వనాథ వాఙ్మయ జీవిత పరిశోధనా కార్యక్రమ నిర్వహణ ద్వారా సౌష్ఠవమైనదిగా చేయాలన్న ఉత్సాహశక్తితో ఆచార్య బిరుదు రాజు రామరాజుగారి ప్రోత్సాహంతో పని చేశారు ఆచార్య సుప్రసన్నగారు సైదోడు అయినారు 1972 జనవరిలో విశ్వనాథ వాఙ్మయ జీవిత పరిశోధనా కార్యక్రమాన్ని అధికారికంగా ప్రారంభించి - విశ్వనాథ రచనలను, విశ్వనాథ సాహిత్య విమర్శను, డైరీలు, లేఖలు తదితరమైన వస్తు సామగ్రిని, ఇంటర్వ్యూలు ప్రశ్నావళి మొదలైన పద్ధతుల ద్వారా విశ్వనాథకు సంబంధించిన సమగ్ర సమాచారాన్ని సేకరించి పెట్టారు 1974 లో విశ్వనాథ వాఙ్మయ సూచికను ప్రచురించారు విశ్వనాథ మరణానంతరం 19/7 లో విమర్శిని విశ్వనాథ వఙ్మయ జీవిత విశేష సంచికగా తీసుకురావటానికి ఎంతో పని చేశారు విశ్వనాథ సాహిత్య విమర్శను విస్తృత స్థాయిలో ప్రచురించాలని ఎన్ని ప్రణాళికలో వేశారు కానీ అవన్నీ ఆచరణకు రాలేదు 1980 నాటికి విశ్వనాథ పీఠాన్ని సక్రమంగా నిర్వహించె అవకాశాలు తగ్గిపోయాయి పోయినవి పోగా విశ్వనాథకు సంబంధించి సేకరించి పెట్టిన సమాచారం కొంత తెలుగు విభాగంలో ఆయన కృషికి, ఆకాంక్షకు గుర్తుగా మిగిలివుంది

## III

నాన్న 1955 నుండి 1975 వరకు ఇరవై ఏళ్ళపాటు విశ్వనాథ సాహిత్యం విషయంలో కల్పవృక్షం గురించి తప్ప మరే ప్రక్రియను గానీ, పుస్తకాన్ని గానీ పట్టించుకొని ఆలోచించలేదు విశ్లేషించలేదు వరంగల్లు ప్రాంతీయ వాతావరణ ప్రభావానికి లోనవుతూ ప్రజాస్వామిక దృక్పథాన్ని పెంచుకొంటూ సాహిత్య విషయాల అధ్యయన అధ్యాపనాలలోనూ, అధ్యయ నాంశాలలోను కాలానుగుణమైన మార్పుల అవసరాన్ని గుర్తించిన కారణంగా నవ్య కవిత్వాన్ని గురించి, నవల గురించి తీవ్రంగా ఆలోచించటం మొదలు పెట్టింది 1975 తరువాతనే విశ్వనాథ నవలలను అంతకు ముందు చదివినా విమర్శనాత్మక దృష్టిని అభివృద్ధి చేసుకొన్నది మాత్రం నవలను కాకతీయ విశ్వ విద్యాలయం తెలుగు ఎమ్మే విద్యార్థులకు అధ్యయనాంశంగా చేసిన క్రమంలోనే అంటే అది అతిశయోక్తి కాదు భ్రమరవాసిని, ఏకవీర నవలల మీద వ్రాసిన

వ్యాసాలతో తనదైన విమర్శాపద్ధతిని రూపొందించుకొన్నా నవలకు ప్రక్రియ పరంగాను, ఇతివృత్తపరంగాను సమకాలీన సమాజంతో వుండే సంబంధాన్ని బాగా గుర్తెరిగిన లక్షణం "వేయిపడగలు" విమర్శలో కనబడుతుంది

మహాకవి విశ్వనాథ వ్యాసం దగ్గర ప్రారంభించి ఒక భక్తిరచనగా రామాయణ కల్పవృక్షాన్ని సంభావించి వ్రాసినంత వరకు నాన్నలో విశ్వనాథ పట్ల ఆత్మాశ్రయ ఆరాధనా భావానిదే పైచేయిగా కనబడుతుంది రామాయణ కల్పవక్షాన్ని సంప్రదాయ కవితలో ప్రభువు అని కీర్తించి, ప్రభువు గురించి చెబితే ప్రజలను చెప్పినట్లే అని దానిని మాత్రమే ప్రస్తావించటంలో కూడా ఆ దృష్టే ప్రధానమైంది 1975 తరువాత ఈ అత్మాశ్రయ లక్షణం తగ్గుముఖం పడుతూ విశ్వనాథ సాహిత్యాన్ని వాస్తవ సామాజిక భూమిక నుండి అర్థం చేసుకొనే ప్రయత్నం ప్రారంభించారు నాన్న

రామాయణ కల్పవృక్షం వస్తువు, రచన కూడా ఆ ప్రయత్నానికి పెద్దగా అవకాశమిచ్చేవికావు అందువల్లనే రామాయణ కల్పవృక్షం గురించిన ఆరాధనాభావం, అందులోని శిల్పకళా వైశిష్ట్యం పట్ల ఆకర్షణా చివరివరకు ఆయనలో నిలిచే వున్నాయి

సాహిత్యాన్ని వాస్తవ సామాజిక భూమికనుండి అర్థం చేసుకోవటానికి అవకాశమిచ్చే స్వభావం నవలా ప్రక్రియకు విస్తృతంగా వుంది కనుకనే బద్దన్న సేనాని, వేయిపడగలు లాంటి నవలలను పట్టుకొని నాన్న తన ప్రయత్నం చివరివరకు సాగించారు విశ్వనాథ సాహిత్యం మీద - ముఖ్యంగా నవలలమీద, అందులోను బద్దన్న సేనానిమీద అరుణతారలో వ్యాసాలు వ్రాసి (1991) త్రిపుర నేని మధుసూదనరావు, 'వేయిపడగలు - సమకాలీనత - సార్వకాలీనత' వంటి పరిశోధనా గ్రంథం వ్రాసి (1989) కె వి రాఘవన్ - నవలల ద్వారా విశ్వనాథ సాధించదలచుకొన్న ప్రయోజనాన్ని గురించి నాన్న లోలోపల తీవ్రంగా మథనపడేందుకు తక్షణ కారకులయి వుంటారేమో ననిపిస్తున్నది

ఏమైనా రామాయణ కల్పవృక్షాన్ని గురించి వ్రాసిన విమర్శ వ్యాసాలలో లేని వస్తుగత దృష్టి నవలలపై వ్రాసిన వ్యాసాలలో అభివృద్ధి చెంది కనిపిస్తుంది

విశ్వనాథ జీవిత దర్శనం' వ్యాసాలతో సాహిత్య క్షేత్రంలో విశ్వనాథ స్థానాన్ని విలువ కట్టటంలో వ్యక్తిగత రాగద్వేషాలులేని ఒక సమాజ సాహిత్య దృక్పథం పదునెక్కి ప్రత్యక్షమవుతుంది 'మహాకవి విశ్వనాథ' వ్యాసానికీ విశ్వనాథ జీవిత దర్శనం వ్యాసాలకూ తేడా అంతా అక్కడే వుంది

విశ్వనాథ రచనలను అర్థం చేసుకోవటానికి భారతీయ మత తాత్త్విక విజ్ఞానం ఎంతగా వుండాలో ఆధునిక ప్రాపంచిక దృక్కోణం అంతగా వుండాలని ఈ వ్యాసాలన్నీ చదివితే అర్థమవుతుంది జ్ఞానతృష్ణ పెరిగేకొద్దీ సాహిత్యపు లోతులు, విలువలు తెలుస్తాయి ఆ తెలివిడి వైపుకు సాహిత్య విద్యార్థులను మేల్కొలిపి, విశ్వనాథ సాహిత్య అధ్యయనానికి ఈ పుస్తకం ఒక ప్రేరణ అవుతుందని విశ్వసిస్తున్నాను

తాము ఆగిన దగ్గరనుండి ప్రారంభించి, అవసరమైతే తమను సవరిస్తూ కూడా తరువాతి తరం విద్యార్థులు సాహిత్య అధ్యయనాన్ని మరింత ప్రయోజనవంతంగా నిర్వహించాలని ఆశించే మా నాన్న రామకోటిశాస్త్రిగారి స్మృతికి గుర్తుగా తెస్తున్న ఈ పుస్తకం ఆ మార్గంలో ఏమేరకు ఉపయోగపడినా ఈ కృషి ఫలించినట్లే

పశ్యంతి
5-10-1994

—కాత్యాయనీ విద్మహే

# మహాకవి విశ్వనాథ

ప్రతి దేశమునను, ప్రతికాలమునను కవుల సంఖ్య యధికముగనే ఉండును. వారిలో నుత్తమ కవులయు, మహాకవులయు సంఖ్య వ్రేళ్ళమీద లెక్క పెట్టుటకు తగినదిగా నుండును, భావుకతయుండి వ్రాయనేర్చిన ప్రతివాడును కవియగుట కభ్యంతరములేదు మొదటిది మానవనిష్ఠమగు నొక గుణము అది యున్నవాడు సమకూర్చుకొనవలసినది రెండవది వ్రాయుట యనగా వర్ణసమామ్నాయమును తెలిసి వ్రాయుటగాదు - శిల్పము తెలిసి వ్రాయుట ఇదియే రచన భావుకత యుండి రచన నేర్చినవారుత్తమ కవులు అట్టి వారిలో నొకడు ప్రాక్తన జన్మ సంస్కార వాసనా ఫలితముగా సత్ప్రతిభుడును, గాఢ ప్రతిభుడునునై ఒక క్రొత్త శిల్పమును కోమల చమత్కృత్యర్ధ్వమున ప్రదర్శించును అట్టివాడు మహాకవి యగును నన్నయ అట్టివాడు తిక్కనాదులట్టివారు విశ్వనాథ ఆ కోవలోని వాడు

ఒక కవిని మనము మహాకవి యనినంతమాత్రమున నతడుగాడు. తానుగా కావలయును అప్పుడు మనమనవలయును అందుముగూడ విశ్వనాథ తానై మహాకవియైనవాడు ఆ యగుట యెట్లు పొసగినదని మనము విచారింపవలయును అనగా ఆయన సృష్టించిన వాఙ్మయమును పఠించవలయును చదువుట చాలదు ఈ నేటివారు చదువుటకు కూడ శక్తిలేనివారు అట్టిచో పఠించుట యెట్లు పొసగును? అది చేయనిచో మహాకవి యర్థముగాడు విశ్వనాథ నేటి మనలో చాలమందికి అర్థముగాడు కొంతలో కొంత చదువుటయున్నది గనుక మనకు విశ్వనాథ తెలియును ఇది మొదటిమెట్టు ఇక అర్థము చేసికొనుటకు యత్నింప వలయును

---

కృష్ణాపత్రిక, జనవరి 1956.

మహా కవులందరును విమర్శకులు అనగా ఉచితానుచిత వివక్ష చేయగల దక్షులు వారు పూర్వకావ్యముల నట్లు చదువుదురు నన్నయ వ్యాసభారతము నట్లే చదివెను ఇట చదువుట యనగా పఠించుట సామాన్యుడు జాగ్రతగా పఠించుటయు విమర్శకుడు చదువుటయు నొక్కటియే సంస్కృత భారతమున వ్యాస హృదయ మున్నది నన్నయ దానిని గ్రహించినాడు తెనుగున ప్రపంచించినాడు సంస్కృత భారతబద్ధ నిరూపితార్థమే తెనుగు భారతము ఆ యర్థము సమగ్రముగా తెలియవలయుననచో 'ప్రసన్న కథాకలితార్థయుక్తి'లో నారయవలెను నన్నయ మార్గముననే తిక్కన సంస్కృత భారతము నర్థము చేసికొని తనదైన శిల్పమును ప్రదర్శించుచు తెనుగున వ్రాసినాడు ఎఱ్ఱన నన్నయ వలె వ్రాసినాడు రామాయణమును చాలమంది వ్రాసిరి వాల్మీకి హృదయమును అర్థము చేసికొనినవారు కారు భాస్కరుడీ విషయమున కపవాదమైనను, ఆ రామాయణమునంతను అతడు వ్రాయలేదు భాస్కరరామాయణ కర్తలందరును సమప్రతిభులుగారు అందువలన అది పూర్వ రామాయణములలో నుత్తమ తరగతికి చెందినదైనను అందా లోపముండనే యున్నది ఈ విషయము సామాన్యునకు తెలియదు తెలియకపోవుట లోపముగాదు అతడు సామాన్యుడు గదా! విశ్వనాథ ఈ విషయమును గ్రహించెను విమర్శకు డగుటవలన గ్రహించెను కవి యగుటవలన తానాలోపమును పూరించుట కుపక్రమించెను ఆ యుపక్రమణ ఫలితమే శ్రీమద్రామాయణ కల్పవృక్షము అది కారణముగా మహా కవియైనాడు విశ్వనాథ

ఆత్మ విశ్వాసమన్నది మహాకవి కొక లక్షణము నన్నయాదు లాత్మ విశ్వాసము గలవారు! విశ్వనాథ అట్టివాడు కవిత్రయమువారి భారతమును, విశ్వనాథుని రామాయణమును నిశిత దృష్టితో ఆమూలాగ్రము పఠించి,పరిశీలించి, మననము చేసినవారికా విషయము సుస్పష్టమగును నన్నయాదులలో గల వినయము విశ్వనాథునిలో లేదని కొందరనవచ్చును వారిది స్థూలదృష్టి సూక్ష్మ పరిశీలనమున విశ్వనాథుని వినయసంపత్తి నన్నయాదులలో లేదనిపించును- అది విశ్వనాథునిదైన శిల్పములోని విశేషము - అదియొక చమత్కారము వినయ మ్మనగా ప్రతివానిముందు చేతులు నలుపుచు ప్రవర్తించుటయని నేటి మన యభిప్రాయము అది సరికాదు ఎదుటి మానిసి యథార్థస్వరూపమును గ్రహించి అతడు నిజముగా గొప్పవాడైనచో వానియందు భయము, భక్తి, గౌరవము

నెరపుట ఒకనిని వినయవంతునిగా జేయును ఇతరుని మహత్తు తెలియవలయు నన్నచో ముందు తన విషయము తనకు స్పష్టముగా తెలియవలయును ఆత్మ దర్శన మన నదియే మహాపురుషులకు చేతనైనదది విశ్వనాథ మహాపురుషుడు అతడు రామాయణము వ్రాయుచున్నాడు రామాయణము వ్రాయునతనికి రామ మహత్తు తెలియవలెను విశ్వనాథకుకూడ తెలియవలెను అందుకై ఆయన తపస్సు చేసెను ఆయనకంటె పూర్వులావిషయమున కృషి చేసిరి వారిలో నొకడు దానిని పూర్తిగా గ్రహించెనట అతనిముందు విశ్వనాథ చేతులుమోడ్పక తప్పదు ఆ పని నాయన జేసినాడు రామమహత్తు కృత్స్నము శివునకు తెలియును రామాయణ కల్పవృక్షమున శివుని ముందున్న విశ్వనాథుని మనము దర్శించగలిగినచో వాని వినయసంపత్తి మనకవగతమగును అచట వినయమే విశ్వనాథ నీముందు వినయము చూపలేదని నీవనినచో నీవెవరవో నాకు తెలియ దనియు, వినయమననేమో యెఱుగవనియు స్పష్టము విషయపరిజ్ఞానము లేని నీముందు ఒక మహాకవి చేతులు నలుపుకోవలసిన యవసర మేమున్నది? ఏమియు లేని నీకే ఒక వ్యక్తి అణగిమణగి యుండవలయునని యున్నచో ఒక మహాకవికెట్లుండవలయును? ఆత్మవిశ్వాసముగలవాని వినయము సామాన్యులు గ్రహించలేరు మనము సామాన్యులము

మహాకవియైనవాడు తన రచనా శిల్పమును తానుగా నచ్చుటచ్చుట వ్యక్తము చేయును విమర్శకుడగుట దానికి కారణము నన్నయ తిక్కనాదులట్లు జేసినారు విశ్వనాథ అట్టి శిల్పమును ప్రదర్శించెను శ్రీమద్రామాయణ కల్ప వృక్షమున ఒక్కొక్క కాండమున ఒక్కొక కావ్యకళాశిల్పమును నవలంబించెను బాలకాండము అమరీకైశిక పారిజాతకుసుమోహ స్వాదువు సంస్కృతాంధ్ర సారస్వత సరసతావిశేషశేముషీ భరరసస్విన్నభాషలో అయోధ్య ప్రారంభింప బడినది అరణ్యకాండ కథాకథన శిల్పానౌక మార్గాభిరామము అమృతోక్త్యం చితము కిష్కింధాకాండము కోమల చమత్కృత్యర్థ్వనిర్మాణ సంపదనూ నోజ్జ్వల రమ్యభావ రససామగ్రీ సమగ్రము మునుముందు వీనిని సమగ్రముగా అర్థము చేసికొనవలయును అపుడు రామాయణమును పఠించవలయును మహా కవియైన విశ్వనాథుని మనమప్పుడు దర్శింప గలుగుదుము.

వాఙ్మయ ప్రక్రియలలో రూపకము కావ్యము అను రెండును శ్రేష్ఠములు మహాకవులీ రెండింటిలో నొకదానిని చేపట్టుదురు అనగా వారినా ప్రత్యేకమైన ప్రక్రియయే మహాకవిగా చేయుననుట వారు రెండవదానిని గూడ ఆదరింప వచ్చును కాళిదాసాది భారతీయ కవులు, షేక్స్పియరు మొదలయిన ఆంగ్ల కవులు రూపక ప్రక్రియను గ్రహించి, అందు తమ ప్రతిభను ప్రదర్శించి మహాకవులైనారు నన్నయ తిక్కనాది ఆంధ్ర కవులు కావ్య ప్రక్రియను గ్రహించి అట్లైనవారు విశ్వనాథ నన్నయాదులవంటివాడు మహాకవులే ప్రక్రియను గ్రహించినను రెండవదాని నుచితరీతిని నిర్వహించుచుందురు. రూపక మర్యాదల నతిక్రమించని కావ్యత్వము నిముడ్చుకొనినవి కాళిదాసాదుల గ్రంథములు కావ్య మర్యాదలకు విరుద్ధముకానంత నాటకతను కూర్చుకొనినవి నన్నయాదులవి వారును వీరును మహాకవులే విశ్వనాథ నన్నయాదుల మార్గముననైన మహాకవి

మహాకవికి భాషా ప్రభుత్వ మొక లక్షణము అది శబ్దవశీకరణైక శక్తి ఫలము, శబ్దము వశమగుట యనగా నోటికి వచ్చుటగాదు శబ్దమర్థవంతము ఒక్కొక్క శబ్దమున కొక్కొక అర్థము నిర్దిష్టము ఆ నిర్దిష్టార్థముతో నా శబ్దము సమయమునకు మనో నేత్రమునకు సోకినచో ఆ శబ్దము అతనికి వశమైనట్లు శబ్ద ప్రపంచమంతయు నొకనికట్లేయుండును వానికి భాషా ప్రభుత్వమున్నదన్న మాట ఇది కేవలము సంస్కారవాసనా ఫలితముగా వచ్చునదిగాదు, కృషినిబట్టి వచ్చును కృషి వ్యక్తి నిష్ఠము ఎవరెంత కృషిచేసిన అంత భాష వశమగును ఒక్కొక్కరి భాషా ప్రభుత్వ మొక్కొక రకముగా నుండును ఈ విభేదము వారి వారి కవితారీతులలో ప్రతిబింబించును నన్నయ తిక్కనల భాషా ప్రభుత్వములు వేరు శ్రీనాథ పోతనామాత్యులది వేరు పెద్దన తిమ్మనలది వేరు పదగుంఫనము రామకృష్ణుని భాషాప్రభుత్వమును స్థాపించినది రాయలవారి దదొక క్రొత్త ప్రభుత్వము ఇది యొక నా దేర్పడునదిగాదు కొంతకాలము కృషి చేయగా నొక నిర్దిష్ట దినమున నేర్పడునదియుగాదు వ్యక్తిలో పుట్టి క్రమక్రమముగా పెరిగి యున్నత స్థితికివచ్చి, ఆ వ్యక్తి నిష్ఠమైన ప్రతిభతో విడదీయరాని సంబంధమును పెట్టుకొనును రెండును ఏకముఖమున విజృంభించును తత్ఫలితముగా నొక మహా కావ్యముద్భవించును. భాషాప్రభుత్వమునకై చేయు కృషి తపస్సు

వంటిది తిక్కనవంటి వానికి నిర్వచనోత్తర రామాయణము పూర్తియగు నప్పటికి భాషాప్రభుత్వ మేర్పడలేదని చెప్పిన, దానిని సాధించుట యెంత కష్టమో అవగతము కావచ్చుననుకొందును విశ్వనాథుని భాషాప్రభుత్వము శ్రీమద్రామాయణమును పరిశీలించినచో మనము గ్రహించగలుగుదుము

మహాకవియైనవాడు మార్గదర్శియితగా నుండును అనగా నిన్ను చేయి పట్టుకొని తానుముందు నడచుచు తీసికొనిపోవుటగాదు అయన నడచుచుండును ఆ నడకలో ఒక ఒయారము, ఒక హుందాతనము, ఒక గాంభీర్యము, ఒక ప్రసన్నత, ఒక రీవి, ఒక మెలకువ, ఒక నైగనిగ్యము, ఒక యాకర్షణ, ఒక యందము, ఒక వైశిష్ట్యము - ఎడనెడ ప్రస్ఫుటములగుచుండును నీవు ప్రతిభావంతుడవైనచో వానిని గ్రహించగలవు, అట్లు నడువగలిగిన బాగుండునని నీవనుకొందువు ప్రతిభయున్నది గనుక యత్నింతువు కొంతకాలమున కట్లే నడచెదవు నీవు నీ వ్యక్తిత్వమును చంపుకొనకుండ నడచినచో గొప్పవాడ వగుదువు పూర్వ కవులందరిని విశ్వనాథ అట్లనుసరించి గొప్పవాడైనాడు ఆయన తన వ్యక్తిత్వ మాధారముగా నొక క్రొత్త మార్గమును నిర్మించినాడు భవిష్యత్సాహితీ స్రష్టలామార్గము ననుసరించక తప్పదు తిక్కనవలె విశ్వనాథ ఒక క్లిష్ట కాలమున పుట్టెను వీరశైవ వీరవైష్ణవములకు, దేశి మార్గకవితా రీతులకును సమన్వయమును సంధానించి ధర్మచ్యుతి కాకుండ తిక్కన 13 వ శతాబ్దమున కవిబ్రహ్మయై ఆవిర్భవించెను పాశ్చాత్య విద్య, నాగరకతా వ్యామోహము కారణముగా దేశీయ సంస్కృతీ సంప్రదాయములు వినాశమందు కాలమున, అట్లు కాకుండ చేయుటకు మహాకవి విశ్వనాథ యుద్భవించెను ఇరువురును దైవాంశ సంభూతులు ఇరువురును వారి బాధ్యతలను నిర్వహించిరి ధర్మచ్యుతి నిరువురును అంగీకరించరు, దేశభాషాభిమానము, సంస్కృతి సంప్రదాయముల మీద గౌరవము, దేశమునకొక క్రొత్త తేజమును గూర్పవలయునన్న ప్రగాఢమైనవాంఛ ఇరువురయందును నున్నది తిక్కన తరువాత వారు తిక్కన ననుసరించిరి విశ్వనాథ గూడ అట్లే అనుసరింపబడును

ఆంధ్ర కావ్యలక్ష్మికి విశ్వనాథ పూర్వు లేర్పరచిన అలంకారము లన్నింటిని పులికాపుచేసి తాను సముచితముగ నలంకరించినాడు- అలంకారములు పాతవేయైనను ఆ యేర్పాటు చేయుటలో నొక విశేషమున్నది అది వాని రచనా

విధానములోని చమత్కారము - చమత్కారయుతమైన ఆ విశేషము విశ్వనాథుని కావ్యమున నొక ఆస్తిత్వమును సంపాదించుకొనినది ఆ విషయమును పరిశీలించి గమనించిన లాక్షణిక శిరోమణి దానిని విశ్వనాథాలంకారమనినాడు ఆయన తన్మయుడై అనినాడు లక్ష్యలక్షణ సమన్వయ మికముందు జరుగును- ఒక మహాకవి పేరుతో ఇప్పటికొక అలంకారము లేదు విశ్వనాథుని పేర నొకడు తయారైనది ఇది ఆంధ్రదేశమునకు - అందును సమకాలిక సాహితీ లోకమునకు గర్వహేతువు వెనుకటినుండియు ఔత్తరాహులు సృష్టించిన కవితా రీతులు చాల యున్నవి తద్భిన్నమై విశ్వనాథోపజ్ఞమైన రీతి యొకడున్నదని లాక్షణిక శిరోమణి చెప్పెను - అది ఆంధ్ర రీతి

మహాకవి ప్రతి విషయమును అంతర్ముఖుడై దర్శించును అభ్యుదయమును అట్లే దర్శించును సన్నికర్షణము- సమైక్యము అభ్యుదయమునకు మొదటి మెట్లు ఇవి రెండు రకములు మానసికము, శారీరకము మొదటిది ముఖ్యము అది యేర్పడినచో రెండవది యేర్పడినట్లే కాక శారీరకము ముఖ్యమనినచో ఇది యేర్పడినను మొదటిది యేర్పడదు అది లేక అభ్యుదయము లేదు విశ్వనాథ అభ్యుదయ కాంక్షి గనుక మొదటిదానినే ప్రబోధించును ఆయన నవలలలోని వ్యంగ్యమదియే, అది యాయన సందేశము, మహాకవులున్నత భావముల నున్నత మార్గమున వ్యక్తీకరింతురు మన మామార్గమును ప్రవేశించిన గాని ఆ భావము లర్థముగావు

పూర్వాంధ్ర మహాకవులందరును ఒక్కొక్క విషయమున, విశేషమైన ప్రజ్ఞను చూపగా, వారందరిలోని గుణ విశేషములను తనలో నిముడ్చుకొని తన వ్యక్తిత్వమును అడుగడుగునను స్ఫుటము చేయుచు, భాష పేర ఒక రీతిని, తన పేర ఒక అలంకారమును సృష్టించుటకు శక్తుడైన విశ్వనాథ కారణజన్ముడు- యుగపురుషుడు - సమ్రాట్ - మహాకవి

> "ఆంధ్ర రీతి కథా రమ్య రసభావమహోదధిః
> సత్యనారాయణః శ్రీమాన్ విశ్వనాథ మహాకవిః
> విశ్వగో విశ్వతీర్థశ్చ సోయంజయతి భావుకః"

# విశ్వనాథ సత్యనారాయణ

విశ్వనాథ సత్యనారాయణగారు కవియా - అంతకంటే మంచి కవులున్నారు, నవలా రచయితయా-అంతకంటే మంచి నవలా రచయితలున్నారు అని ఈ విధంగా ఆయనను ఎన్నివిధాల త్రోసి రాజనవలయునని ఎవరెంత చేసిననూ ఆయన మాత్రము ఒకటి చేసికొని పోయినాడు తన కనుకూలురు, ప్రతికూలురు ఇద్దరూ ఉన్నారని తెలిసి, అందరూ కలిసికట్టుగా ఒప్పుకోక తప్ప నట్లుగా జాతీయ స్థాయిలో రచయితగా ఆయన తన స్థానాన్ని భద్రం చేసికొన్నాడు ఆయనను గురించి అందరూ అంగీకరించేది మరొకటి గూడా ఉన్నది ఆంధ్రభాషాసాహిత్యరంగమున ఆయనంత ప్రముఖుడూ, ప్రసిద్ధుడూ, వివాదాస్పదుడూ ఈ శతాబ్దంలో మరొకడు లేడు అని

ఆంధ్ర పౌరుషంతో ఆయన కవిగా ఆవిర్భవించాడు అంతరాత్మను పట్టుకొని అంతర్విశ్లేషణలతో నవలాకారుడై ప్రశస్తి కెక్కినాడు నాటక కర్తగా పరవర్తనం చెందినాడు భావ కవితా ప్రస్థాన గ్రంథ నిర్మాతయై ఆత్మలాభ ప్రాప్తికి దాంపత్యమును మార్గమునుగా ప్రబోధించినాడు శ్రీమద్రామాయణ భాష్యకారుడుగా ఆంధ్రావళిని కల్పవృక్ష చ్ఛాయలలో నిల్పి, తెలుగు సాహిత్య సరస్వతిని తన విద్యావైదుష్యంచేత, తన బుద్ధివైభవంచేత భారతీయ జ్ఞానపీఠ పురస్కారానికి యోగ్యంగా తీర్చిదిద్దినాడు అప్రతిహతంగా ఈ బహుళాంధ్రోక్తిమయ ప్రపంచకమును అరవై సంవత్సరాలు ఏలిన మరొక కవికుల గురువు ఆయన అంత స్వతంత్రుడు అంతటి విద్వత్కవి

సర్వ సాహిత్య ప్రపంచ మర్యాదల గురించీ సర్వ భారత భారతీ హృదయ సముద్రము లోతుపాతుల గురించీ నిర్ద్వంద్వముగా అభిప్రాయాలను ప్రకటించ గలిగిన అంతటి స్వస్థాన వేషభాషాభిమానము కలిగిన రస ప్రబుద్ధ ధీకుశలుడు- ఇతరుల ప్రసక్తి ఇక్కడరాదు గనుక - ఈ నేటికాలాన ఆయన తప్ప మరొకడు

---

విమర్శిని, జనవరి 1977,

లేదని చెప్పవలయును సమకాలికులయిన కవి సోదరులయందేకర్కరి యందును కనిపించని ప్రతిభావ్యుత్పత్తుల సమష్టి స్వరూప మాయన ఆయన తన సర్వ కవిత్వ మర్మవేత్రృతా లక్షణంచేత అధునికాంధ్ర సాహిత్య ప్రపంచ మును ప్రక్రియా వైవిధ్యంచేత కండబలిసిన దాని గుండె సొగసులను ప్రద ర్శించి తెలుగు పాఠకులను ఆశ్చర్యచకితులనుగా చేసినాడు

ఆయన ఋషి ఆయన శిల్పి ఆయన కవి ఋషియై తన ఋషిత్వ మును తెలుగు లందుకొనుటకు శిల్పియై తన శిల్పిత్వమును గుర్తు పట్టుటకు వీలుగా కవియై తన కవిత్వముయొక్క సుభద్రస్ఫూర్తికి విమర్శకుడై నవలా రచయితయై నాటక కర్తయై కథానికా రచయితయై గేయకవియై ఉపన్యాసకుడై ఊరక ఆదేపనిగా అర్ధమను అరవై సంవత్సరాలు ఆంధ్ర భాషా భాషీయుల వెంటబడి చెవిలో ఇల్లు కట్టుకొని అంతగా చెప్పిపోయిన ఆంధ్ర మహాకవి మరి యొక్కడు కన్పించుట లేదు

వ్యక్తులు చేసిన సమాజానికి వ్యక్తి ధర్మమును పరిపాలించు వ్యవస్థా ధర్మము లక్షణము వ్యక్తి ధర్మమునందు స్వార్థమునకు చోటున్నది అందువల్ల వ్యవస్థా ధర్మమే ధర్మము వ్యక్తులు ధర్మము నుల్లంఘింప జూచెదరు కవులు క్రాంత దర్శను లనగా విశ్వజత్సమాజముయొక్క సూక్ష్మ వ్యవస్థా ధర్మ దర్శ నము కలవారని యర్థము వ్యవస్థా ధర్మ లక్షణ లక్షితమైన సాహిత్యముతో స్వార్థముతోడి వ్యక్తిత్వ ధర్మమును గొప్పగా పాటించు వారికి పడదు వ్యష్టి దృష్టికల సాధారణులే జనములో ఎక్కువ సమష్టి దృష్టికల వ్యవస్థా ధర్మ నిబద్ధ బుద్ధియైన రచయితతో సాధారణులకు పడదు వ్యవస్థా ధర్మ పరులకు సమాజముతో పడకపోవుట లేదు విశ్వనాథతో పడని వారికంటే శ్రీశ్రీతో పడని వారి సంఖ్య తక్కువ కాదు వ్యవస్థా ధర్మబుద్ధులకాయవస్థలు తప్పవు తాదృ శులు మహాకవులు, అనన్యసామాన్యమైన సామాజిక దృక్పథము కలిగి తద్ధర్మ ప్రతిపాదనార్థము కావ్యరచన చేసిన మహనీయ శిల్పవేత్తలు మహాకవులు ఇది ప్రపంచ భాషా మహాకవులందరి లక్షణము విశ్వనాథ ఆ అందరితోటి పోటి వాడే కాని అతీతుడేమీ కాడు ఆ విధముగా వ్యవస్థా ధర్మ రక్షణ బుద్ధియై ఆధు నిక కాలమున ఆంధ్ర సాహిత్యమును మాంసలము చేసిపెట్టిన మహా మనీషి ఆయన

ఒక కవి యొక్క గానీ ఒక సాహిత్యము యొక్క గాని, ఒక జాతి యొక్కగానీ మహనీయత అంతకు పూర్వమున్న కవులతో, కావ్యములతో, సంస్కృతీ సంప్రదాయములతో ముడిపడియున్న అవినాభావము లోతుపాతుల మీద ఆధారపడి యున్నది సాహిత్యమునందెప్పుడును, తద్భాషా భాషీయుల జాతీయమైన ఆలోచనా విధానము యొక్క వైలక్షణ్యము కొట్టవచ్చినట్లుండును భారతీయ భాషా సాహిత్యములకింకొక వైలక్షణ్యమున్నది వీటన్నింటికినీ ప్రాంతీయమైన భాషా సహజత్వముతో పాటు భారత జాతీయ తత్త్వము అవినాభావముగా ఉండును తెనుగు సాహిత్యమునకు తెనుగుదనమొక లక్షణము భారతీయత మరొక లక్షణము ఈ రెండింటి యొక్క అవినాభావ లక్షణంతోనే ఆంధ్ర సాహిత్యము ఇంటా బయటా గూడా గెల్చుకొని రాగలుగుచున్నది మన తెలుగు సాహిత్యశైలి భారతీయమైన ఆలోచనా ధారతోను అందుకనువుగా ప్రాంతీయమైన తెలుగుదనము తోడి అభివ్యక్తితోనూ రూపుగట్టుకొనుచున్నది ఆంధ్ర భాషా మహాకవుల శైలీ విశేషములన్నియును ఈ విధముగా సూక్ష్మ సూక్ష్మ భేదములతో రూపుగట్టుకొన్నవియే భారతీయమైన ఆలోచనా విధానమనగా నదియొక తాత్త్విక దృక్పథము నన్నయ్యగారి భాషా సాహిత్యములకొక తాత్త్విక దృక్పథమును విశ్వశ్రేయః కావ్యమ్మని ప్రవచింపగా అది ఇట్లే కొనసాగివచ్చుచున్నది దానిని తెనుగు దనముతో కొనసాగించుకొని వచ్చుచున్న మహాపురుషుల వల్లనే ఈ సాహిత్య మింతవరకు వచ్చినది అట్టి మహాపురుషులలో విశ్వనాధ సత్యనారాయణగారొకడు మనము మన తెనుగు సాహిత్యమును అనుభవమునకు తెనుగు దనమును చూచుకొనుచు ఆలోచనలకు జాతీయతను అవలంబించుచు అధ్యయనము చేసికొనవలయును ఈ అవసరమును మిక్కిలిగా చేయుచు సాహిత్యమును కల్పించిన మహా రచయిత విశ్వనాథ ఈ కీలకమును పట్టుకొని పూర్వాంధ్ర మహా కవులను తిరిగి చదివినచో వారింకను లోతులలో అర్థమగుదురు విశ్వనాథ తన సాహిత్య వ్యవసాయము ద్వారా ప్రాచీనాంధ్ర కవుల కావ్య జీవితములను వికసింపజేసెను ఇప్పుడు ఆంధ్ర సాహిత్యమనగా తెలుగు భాషా భాషీయుల ఓడుపుదనము చేత సంస్కృతమైన మర్యాదల కొదిగిన విశ్వ శ్రేయోదాయకములయిన జాతీయతాభావ ధారాధోరణిగల వాఙ్మయ ప్రపంచమని యర్థము ఈ యర్థముమ పుష్కలముగా పండించి వెళ్ళిపోయినది విశ్వనాథ వారి ప్రథిత వాక్కలాపము

II

విశ్వనాథ సత్యనారాయణగారొక సంధి కాలంలో పుట్టినారు పందొమ్మి దవ శతాబ్దము చివరి దశాబ్దానికే సాంఘికార్థిక రాజకీయాది జీవిత రంగముల యందు విపరీతములయిన మార్పులు ప్రపంచ దేశములందు రామొదలు పెట్టి నవి ప్రపంచమంతా బ్రిటిషు సామ్రాజ్యమే గనుక ఇంగ్లాండులో వచ్చిన అన్ని మార్పుల ప్రభావం దాని వలన రాజ్యాల మీద అనివార్యముగా పడింది ఒక విధముగా గ్రామీణ జీవితమునకు, నాగరకతకు సంస్కృతీ సంప్రదాయములకు, సౌందర్య వాతావరణమునకు ఆ కాలము చరమగీతం పాడింది బస్తీ పారి శ్రామిక నాగరకత త్రోసికొని రావటం మొదలయింది విశ్వనాథ పుట్టి పెరిగి కాస్త ఊహ వచ్చేటప్పటికి గ్రామీణ వాతావరణమును త్రోసిరాజని బస్తీ పారి శ్రామిక నాగరకత విజృంభించుచున్నది దాని ఫలితమే శోభనాద్రిగారు బందరులో కాపురం పెట్టి విశ్వనాథకు ఇంగ్లీషు చదువు చెప్పించుట ఆ విధంగా విశ్వనాథ తన చిన్నతనంలో తన కన్నులముందు తాను తన స్వస్థాన వేషభాషల నుండి వేరు చేయబడుచున్న దాని తీవ్రతననుకోకుండానే అనుభవించినాడు అజ్ఞాత చైతన్యమునందు అననుకూలమైన అనుభవ తీవ్రత ఉన్నందువల్లనే ఆయన ఇంగ్లీషు విద్యను అభ్యసించిన కొద్దీ వచ్చిన విజ్ఞానము స్వస్థాన వేషభాషల యందలి పరమార్థమును ప్రదీప్తము చేయుటకును, ఆధునిక నాగరకత యొక్క వ్యాప్తి వలన దుష్ఫలితాలను చూడగలుగుటకును ఆయనను ప్రోత్సహించినది ఈ పరిస్థితికి దోహదము చేసినది భారత జాతీయోద్యమము ఆయనకు పది సంవత్సరాలు వచ్చేటప్పటికే వందేమాతరమన్న పిలుపు ప్రభావం ఆయన అజ్ఞాత చైతన్యమును తన్మయము కావించింది సంపూర్ణ స్వాతంత్ర్యమే లక్ష్య మన్న జాతీయ నాయకుల నినాద మంత్రము లాయన మనస్సుమీద పనిచేసినవి ఆయన బందరులోని ఇంగ్లీషు చదువంతా ఈ వాతావరణ ప్రభావమునకు లోబడి జరిగినదే బందరు వాతావరణము స్థాపించిన జాతీయ కళాశాలలో విశ్వనాథ అధ్యాపకుడుగా చేరి పని చేసినాడనగా, ఆంధ్ర పౌరుషముతో కవిగా అవతరించి నాడనగా చిన్నప్పటి నుండి ఉన్న అజ్ఞాత చైతన్యములోని కదలికలను భావించ వలెను

తానంతవరకు ఏది ప్రత్యక్షంగా అనుభవించినాడో, దేనిని గురించి జాతీయ స్థాయిలో ప్రబోధం జరుగుచున్నదో దేని పునరుజ్జీవనము పరమార్థముగా

స్వాతంత్ర్యోద్యమం సాగుచున్నదో దానిని భారత జాతీయ వ్యావసాయిక నాగరకతా సంప్రదాయము యొక్క మాయనుగుటను ప్రధానముగా చేసి ఆయన 1934 లో వేయి పడగలు వ్రాసి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి బహుమతిని గెలుచుకొన్నాడు వేయిపడగల సంగతి మరికొంత అర్థము కావలయునన్నప్పుడు ఆంగ్ల వాఙ్మయ రచయితలను హార్డీని, లారెన్సును జాగ్రత్తగా చదవటం మంచిది పారిశ్రామిక నాగరకత వలన సత్ఫలితాలు లేవని చెప్పటకు కాదు వేయిపడగలు పుట్టినది - దాని దుష్ఫలితాలి లాంటివి - దాని నాపుటకు వీలు కాదు గనుక చేతనైనంతలో జాగ్రత్తయన్న ప్రబోధమే దాని ప్రయోజనము సూర్యాస్తమయమును చంద్రోదయమును ఏక కాలమున జరుగుచున్న వాటిని వర్ణించుట వంటిది వేయిపడగల రచన

గ్రామీణ నాగరకతను కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించి బస్తీ పారిశ్రామిక నాగరకతను బ్రిటీషు సామ్రాజ్య నిర్వాహకులు వ్యాపింపజేయుచుండగా, వర్గ పోరాటముగా ముందుకు వచ్చి గతితార్కిక చారిత్రక భౌతికవాద సిద్ధాంతమును పట్టుకొని సర్వమానవ సమాజము యొక్క పూర్వోత్తర పరిస్థితులను, వాఙ్మయమును, కళలను మతములను, వేదాంతములను సమస్తమును పునర్విచారణకు పెట్టి తీర్పులు ప్రకటించుటకు పూనుకొన్నది మార్క్సిజము ఇందువల్ల మరొక క్రొత్త సమాజము యొక్క ఆవిర్భావమును మార్క్సిజం చూపగలిగింది ఇరువదియవ శతాబ్దం తృతీయ దశాబ్దం వచ్చేటప్పటికి మన దేశంలోకూడా మార్క్సిస్టు సోషలిజము ఒక పరమార్థ భూతమైన ఆదర్శంగా యువకులను ఆకర్షించింది

అయితే, మరొక్క విషయమున్నది ఆయన వ్యక్తిగా మార్క్సిస్టు మాత్రమేగాని కమ్యూనిస్టు కాడు అంటే కామందులు కాని కార్మిక కర్షక మహాజన సమాజము చేసెడు తిరుగుబాట్లతో ప్రత్యక్ష సంబంధ మేమాత్రమును పెట్టుకొన్నవాడుకాడు మార్క్సిజమును చేసిన తత్వశాస్త్రము-ఆర్థిక శాస్త్రము-సాంఘికశాస్త్రము- ఈ మూడు కేంద్రముల నుండి అనుభవమునకు తెచ్చుకొన్న విజ్ఞానం యొక్క ప్రభావము ఆయన సాహిత్యము నందు పుష్కలంగా ఉన్నది ఆదొక విశ్వశ్రేయోదాయకమైన తాత్విక దృక్పథమన్న అభిప్రాయము ఆదొక విశ్వజనీనమైన శాస్త్రీయ సామాజిక స్వరూప స్వభావాభివృద్ధి లక్షణ పరిశీలన దృక్పథమన్న అభిప్రాయం ఆయనకు లేదనటానికి వీలులేదు ఆవిధముగా

విశ్వనాథ ఆలోచనా విధానము మీద మార్క్సిజమున కంటె ముందు గాంధీ ఇజము యొక్క ముద్ర యున్నది మరియు ముందు వెనుకల బాహ్యాభ్యంతర సంకుచిత విశాల భౌతిక ఆధ్యాత్మిక సౌందర్య సంభావనా దృష్టి భేదముల చేత రెండైన పాశ్చాత్య భారతీయ సంస్కృతీ సంప్రదాయ భూములయిన పురాణ విజ్ఞానముల యొక్క విచారణ చేసెడు బుద్ధిబలము ప్రభావమున్నది మార్క్సిజమునకు వెనుకనున్న గతితార్కిక చారిత్రక భౌతిక ఆధ్యాత్మిక ధృక్పథ సమన్వయముమీద సామరస్యముమీద ఆయన చూపునున్నది ఆర్థిక రాజకీయ సాంఘిక సమ సమాజము నభిలషించి, అది లేనప్పటి విషమ పరిస్థితుల నాయన తన సాహిత్యమున వ్యంగ్యమర్యాదయా ప్రదర్శించినాడు ఆయన భారతీయుడు గనుక ప్రపంచ శాస్త్రీయ విజ్ఞానమును తన జాతీయ సంప్రదాయమున కనుకూలముగా కలసివచ్చిన దానిని వచ్చినంతగా గ్రహించినాడు అదే ఆయన పండించి పెట్టిపోయిన అర్థమంతయును

III

దేశము స్వాతంత్ర్యమును కోరుచున్నదనగా ఆత్మవిశ్వాస మొకటి కొనలు సాగుచున్నదని యర్థము స్వసామర్థ్యము మీద అచంచలమైన నిశ్చయ బుద్ధియే ఆత్మవిశ్వాసము. ఎదిరి సామర్థ్యము నది తృణముగా చూచు లక్షణమును కలిగి యుండును కలిగి యుండనిచో భారతీయులు ఆంగ్ల ప్రభుత్వము నెదుర్కొని కూలద్రోయగలిగి యుండెడివారు కారు విశ్వనాథ సత్యనారాయణ గారి వ్యక్తిత్వము రూపుగట్టుకొను వయస్సంతయు స్వాతంత్ర్యోద్యమ భావ తీవ్రతల చేత చుట్టుకొనబడి ఒత్తిడులకు లోనైనది ఆ ఒత్తిడుల ఫలితమే ఆ తరువాత విశ్వనాథ సత్యనారాయణ తనకు సంబంధించిన సర్వవిషయము లందును స్వయం నిర్ణయాధికారము తనకు కలదన్న ఒక తెలివితోడి ప్రవృత్తిని స్వాతంత్రోద్యమము వ్యక్తికి ప్రసాదించును అందువలన వ్యక్తికి తాను తన తనముచేత ఇతరుల కంటె విలక్షణుడనన్న భావము కలుగును ఈ వైలక్షణ్యము రాజకీయ ఆర్థిక సాంఘిక సాంస్కృతిక మత తాత్త్విక వైజ్ఞానికాది సమస్త జీవిత రంగముల యందును ప్రస్ఫుటముగా కన్పించును సాహిత్య రంగము దాని కపవాదము కాదు ఆధునికాంధ్ర వాఙ్మయమున స్వాతంత్ర్యోద్యమము యొక్క లక్షణ ప్రభావమునకు అన్ని విధములను లోనై మరియు తానై ప్రవర్తించినదొక్క విశ్వనాథ సత్యనారాయణగారని చెప్పిన చాలును. భారత జాతీయ

స్వాతంత్ర్యోద్యమ ప్రారంభమునకు ప్రేరణ కల్పించిన మహాశక్తి ఏది కలదో అది విశ్వనాథ వాఙ్మయమునకు జీవశక్తియై కూర్చున్నది

స్వరాజ్యము వచ్చిన తరువాత ఆయన సాహిత్య లక్షణమునందు మార్పు రాలేదు ఆయనకున్న స్వస్థాన వేషభాషాభిమాన ప్రబోధ ప్రచార లక్షణము స్వరాజ్యము రాకమును పెంతగా అభినందింపబడినదో వచ్చిన తరువాత అంతగా అభినందింపబడలేదు దానికనేక కారణములున్నవి గాంధీ గారి పద్ధతులే కొన్ని ఆమోదయోగ్యములు కాకపోయినవి జాతీయతా దృక్పథమునకు భంగము కలిగించని అంతర్జాతీయతా భావమునందు విశ్వనాథకంగీకారము కలదు తెలుగుదనముతోడి భారత జాతీయతా భావముతోడి అంతర్జాతీయ మానవాభ్యుదయము వెరసి విశ్వశ్రేయః కావ్యమన్న సిద్ధాంతమే ఆయన సిద్ధాంతము భారత జాతీయతకు సంకేతములయిన సర్వ సంస్కృతీ సంప్రదాయ విజ్ఞానమును ఆయన తన వాఙ్మయము ద్వారా తెలుగులకు వ్యాఖ్యానించి పెట్టి, జాతీయ స్థాయికి తన వారి నుద్ధరింపవలయునని ఆయన ధర్మనిబద్ధ బుద్ధియై అచంచల విశ్వాసముతో పని చేసెను అంత గట్టి విశ్వాసాలుండి అంత అభినివేశంతో రచనలు సాగించిన ఆధునికాంధ్ర రచయితలు ముగ్గురిలో విశ్వనాథ ఒక్కడూ ఒకడు మిగిలిన ఇద్దరూ ఇద్దరు అందులో ఒకరు గుడిపాటి వెంకటాచలం మరొకరు శ్రీరంగం శ్రీనివాసరావు బలమైన విశ్వాసాలుండడం, నిర్భయంగా వాటిని వెల్లడించగల్గడం - ఈ మాత్రం చాలును ఒక రచయితను గౌరవించడానికి అన్నా ఒక్క విశ్వనాథ సత్యనారాయణగారే అందుకు ప్రథమతః యోగ్యుడు కొన్ని విలువలు, కొన్ని విశ్వాసాలు, కొన్ని లక్ష్యాలు, కలిగి, వాటి కొరకు జీవితాంతం రచనలు చేసిన మహామనీషి విశ్వనాథ సంఘం బాగుపడటానికి విశ్వనాథ కపటం లేని కవిగా, నమ్మినదాన్ని దాచుకోక చెప్పే నిజాయితీపరుడుగా సమకాలికులంతా కలసి చేసిన దానికంటే ఎక్కువే చేశాడు

విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్య అంతర్యం అంతా కూడా సత్యాన్ని అసత్యాన్ని వేరు చేసి నకిలీ నాగరకతల వల్ల అసలయిన జాతీయ సంస్కృతీ సంప్రదాయము పొందిన ఆపదను ప్రదర్శించి, తన ప్రజలు సత్య మార్గం తప్పకుండా విజ్ఞానమును పొందవలయునని విశ్వనాథ వాఙ్మయమున కాత్మ విజ్ఞానము ఆనందము కాదని చెప్పిననూ మించుకొనిపోయినది లేదు.

జీవిత సమస్యలను విశ్లేషణ చేసి మంచి చెడ్డలను బేరీజు వేసి పరిష్కారములను సూచించుటలో ఆయన అనుసరించెడు హేతువాద దృక్పథము చాల గొప్పది విశ్వాసాలకు కూడా ఆయన హేతువుల నన్వేషించును ఒక జాతి జాతీయతకు సంప్రదాయం పునాది మనము భారతీయులమనగా మనదైన భారతీయత ఏదో ఉండవలయును అది లేకుండా మనం భారతీయులమనుట మూఢ విశ్వాసము అది ఉన్నదని, అది ఫలానా అని తన సాహిత్యం నిండా ప్రదర్శించిన భారత జాతీయ విజ్ఞాన ఖని ఆయన ఆయన సంప్రదాయ విశ్వాసం శూన్యం నుండి వస్తూత్పత్తి కాదన్న శాస్త్రీయ దృక్పథం మీద ఆధారపడినది ముఖ్యంగా సాహిత్యం యొక్క ఉత్పత్తికి మూలం తద్భాషా భాషీయుల సంస్కృతీ సంప్రదాయం అది యొక మహాశక్తి ప్రతిభావ్యుత్పత్తులకు సార్థక్యం కవి శక్తిమంతుడైనప్పుడే కలుగును ఆధునికాంధ్ర కవి పరంపరా వాహినీ సంసారమునం దిద్దరు ముగ్గురు కవి రచయితలను చెప్పవలసి వచ్చినను విశ్వనాథ సత్యనారాయణ గారితోనే మొదలుపెట్టవలయును కవి శక్తిమంతుడనగా నది అట్టివాడు తన సమకాలీన సమాజమును పట్టి పీడించుచున్న మన తెలివికి మించియుండుటకు వీలులేదు, మనము తెలుసుకొనవలసినది లేదు అను ఈ మొదలయిన మూఢ విశ్వాసాలను, అజ్ఞానాంధకారాలను నిర్మూలించి, ఆత్మవిశ్వాసం మీద సంప్రదాయ విజ్ఞానజ్యోతిని పట్టుకొని జాతీయాభ్యుదయ మార్గాన శాస్త్రీయంగా పురోగమించడానికి ప్రేరణ కలిగించే సాహిత్యాన్ని సృష్టించి, ఈ సంసార మిదెన్ని జన్మలకు నేని విశ్వనాథీయ భాషా సంక్రాంత ఋణంబు తీర్చగలదా అని తెలుగులు తలపోసికొనుచుండునట్లు చేసిపోయినాడు

ఆయన తన సాహిత్యం నిండా అంతఃకరణ చతుష్టయం అనబడే అంతరాత్మ పొరల్లో ఉన్న జీవ స్వభావాన్ని ఆశ్రయించుకొని ఉన్న మానవ సమస్యలకు రూపకల్పన చేసి, వీటి స్వరూప స్వభావములివ్వి, వీటికిది దోహదం, వీటికిది విరుగుడు అని వ్యాఖ్యానించినాడు చలంగారు కూడా రూపకల్పన వరకూ విశ్వనాథలాగానే చేశాడు అభ్యంతర ప్రేరణలకు మనిషి కొట్టుకొని పోకుండా ధర్మాధర్మ విచక్షణ మనిషిని నిలబెట్టుట సామాజికమైన సుష్ఠు వ్యవస్థకు అవసరమని విశ్వనాథ సహేతుకంగా ప్రబోధించినాడు వ్యక్తి సమాజమునకు లోబడి యుండుట వ్యక్తికి క్షేమమన్న శాస్త్రీయ దృక్పథమును అవలంబించి విశ్వనాథ రచనలు చేసినాడు ఇదే శాశ్వతమైన సత్యపథము ఇష్టము వైయ్య

క్తికము, ధర్మము సమష్టి సమష్టియైన వ్యవస్థా ధర్మమును నిలబెట్టుటకు వ్యక్తి త్యాగము చేయవలయునన్నది విశ్వనాథ సాహిత్య సందేశము ఈ సందేశమును ఆయన తన సాహిత్యం నిండా సృష్టించిన ఆశ్చర్యకరములయిన పాత్రల ద్వారా వినిపించినాడు భారత జాతీయ సంస్కృతీ సంప్రదాయ విజ్ఞానాల మీద హేతువాద బలంతో ఆయా పాత్రలను అంత అద్భుతావహంగా ఆయన తీర్చిదిద్దినాడు

రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు చెప్పినట్లు "వారి రచనలన్నీ లోకానికి సందేశాలే" నార్ల వేంకటేశ్వరరావు గారన్నట్లాయన నిస్సందేహముగా గొప్ప జీనియస్ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారన్నట్లు "వారితో సమకాలిత్వం నా మహాభాగ్యాలలో ఒకటిగా భావించుకొంటున్నాను"

## IV

ఇంతగా జాతీయ స్థాయి రచనలు చేసిన విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్య మనస్తత్వ లక్షణం గురించి ఆలోచించుటకు మానవ జాతి మొత్తానికి సంబంధించి అంటిపెట్టుకొనియున్న అజ్ఞాత చైతన్యము వద్దకు పోవలెను దాని ఆదిమ రూపాలలో పురాణ విజ్ఞాన లక్షణమొకటి ఈ పురాణ విజ్ఞాన మంతో ఇంతో ప్రతి మనిషిలోనూ ఉన్నప్పటికినీ ఉన్నట్లు అందరకూ తెలియదు తెలిసికొనుట అంత సులభము కాదు తమను వదలి ఇతరులను చూచు సాధారణ జనులకు అది అసాధ్యమనియే చెప్పవలయును మహామనీషులయిన రచయితలు తపస్సులు చేయువారు కనుక వారు తమను తాము విశ్లేషించి చూచుకోగలరు ఆలాగా చేసినప్పుడు విశ్వనాథకు తనలోని తన ఆదిమ పురాణ విజ్ఞాన రూపము కన్పించినది సాధారణ జన విషయం కాని, ఈ దర్శన స్థాయి అసాధారణమైన దగుటకు దీనికి సంకేతాత్మకత కూడా తోడ్పడినది మరియు ఈ దర్శన స్థాయి మనస్తత్వము శ్రీ అరవిందులు చెప్పినట్లు అంధ విశ్వాసాలకూ సంకుచిత మతాచరణలకు అతీతమై మహోన్నత ఆధ్యాత్మిక శిఖరాల సధిష్ఠించి ఉంటుంది మరియు "ఇట్టి మనః ప్రవృత్తి కలవారికి హైందవ గాథలు శక్తివంతంగాను, ప్రబోధాత్మకంగానూ ఉంటాయి ఒక్కొక్కప్పుడివి ఇతిహాస సాహస భావనకు కూడా దారితీస్తాయి ఇవి ఔచితీవిలసితమైన సత్యాన్వేషణోత్సుకతను, సౌందర్య కౌతూహలాన్నీ సమకూర్చుతాయి ఈ హైందవ పురాణగాథల్లో అభివ్యాప్తమైన

వినూత్నతే వాని జీవగఱ్ఱ"[1] ఈ విధమైన పురాణ విజ్ఞాన మనస్తత్వం ఇంతగా వికసించిన మరియు దాని వికసనము యొక్క అవసరమును ఇంతగా భావించిన ఆంధ్ర భాషా సాహిత్యకారులలో కాలక్రమమును బట్టి చెప్పినచో నన్నయగారి తరువాత శ్రీనాథుని తరువాత పెద్దన్నగారిని తరువాత విశ్వనాథ సత్యనారాయణ గారినే చెప్పవలయును బ్రహ్మాండాది నానా పురాణచయ విజ్ఞాన నిరతుడు బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధి- అతుల పురాణాగమేతిహాస కథార్థస్మృతియుతుడు- అని ఈ విధముగా తమను గురించి తాము చెప్పుకొన్న పూర్వాంధ్ర మహాకవులు హైందవ పురాణగాథలలో వినూత్నతను దర్శించి దాని ప్రాణశక్తిని తెనుగున కావ్యములుగా అచ్చులు పోసినవారు నవీన కావ్యరచనకు ముడి సరుకైన కథకొరకు వారు తమ పురాణ విజ్ఞానములోని అదిమ రూపాల దాకా గాలించిగానీ పూనుకొనినవారు కారు విశ్వనాథ యొక్క బ్రహ్మమయమూర్తి లక్షణము తాదృశమైన విజ్ఞానమయత్వము నందున్నది సమష్టి అజ్ఞాత చైతన్యము నందలి ఈ పురాణ విజ్ఞానము నందు మానవజాతియొక్క మహనీయతా బీజములన్నియు సుప్తావస్థలోనున్న వాటిని దార్శనికులయిన కవులు, రచయితలు మేల్కొలిపి, వాటిని తమ రచనల ద్వారా వికసింపజేయుదురు ఆధునికాంధ్ర వాఙ్మయ నిర్మాతలలో ఈ పని విశ్వనాథ చేసినట్లు మరొకరు చేయలేదు అయన ఒక్కడే ఈ ఇంత భారతమునకు ననంతుడనన్న పరవాలేదు తాదృశమైన మానవ మహనీయతా బీజ సంపుటి అద్వితీయ పరబ్రహ్మ వస్తువునకు చిహ్నము భారతీయ వేదాంతులు దానినే ఆత్మవస్తువులుగా దర్శించిరి విశ్వనాథ సత్యనారాయణ ఆధునిక మనో విజ్ఞానము నుండి భారతీయ వేదాంతమునకు పోయినాడా కాక అక్కడ మునిగి ఇక్కడ తేలినాడా అన్నదింకనూ పరిశోధించి తేల్చుకోవలసిన విషయము అనగా ఇప్పుడేమైనది? పురాణ విజ్ఞానమంతా అనాది సాంఘిక రాజకీయ మత

---

1 శ్రీ అరవిందులు పాశ్చాత్య నాగరకతా వ్యామోహమున పడి భారత జాతీయ సాహిత్య సంప్రదాయమైన పురాణేతిహాస విజ్ఞానమును తృణముగా తీసివేయుచు తమ పెద్దన్నగారు తమకు వ్రాసిన లేఖకు బదులు వ్రాసిన లేఖాంశము చూ భారతీయత - దాని నిజతత్త్వము పుట 13, 14

తాత్త్వికాది సర్వ సాంస్కృతిక విషయ వాసనా వాసితమన్నమాట ఈ యంత టికిని అడుగు పొరలలో జగదుత్పత్తి హేతువయిన స్త్రీ పుంసయోగ భావమున్నది. అక్కడి సమష్టి మీద సమస్తమును విశ్వజనీన భావ భావనా పరమేశ్వరముగా ఉంటుంది మహాకవులు రచయితలు అక్కడ జాగ్రద్దశను పొంది, లేచి వాఙ్మయ రథమును విశ్వశ్రేయోదాయకముగా నడిపించెదరు శ్రేయోదాయకముగా నున్నందువల్ల సమష్టి అజ్ఞాత చైతన్యమునందలి పురాణ విజ్ఞానమున దానినే సాంకేతికముగా దేవ దానవ యుద్ధాలుగా పురాణ గ్రంథములు కల్పించినవి. తాదృశమైన పురాణ విజ్ఞానముతోడి పరిచయాధిక్యము అనుభవమును తీవ్రతరము చేయగలదు తీవ్రానుభవము నభిలషించిన మనస్సు తన యాదర్శమునకు అనువుగా పరమ నిష్ఠురములయిన నైతిక ధర్మముల నవలంబించును విశ్వనాథవారి వాఙ్మయము నందంతటను నైతిక ధర్మనిష్ఠ ప్రభుత్వము చేయు చున్నట్లుండుననగా దాని తత్వమది పురాణ విజ్ఞానానుభవ మెంత తీవ్రము కానిదే ఆయన తాత తాతల నాటి కథలు త్రవ్విపోస్తానోయని బయలుదేరు తాడు? ఆయన కావ్యాలు, ఆయన నాటకాలు ఆయన నవలలు, ఆయన చిన్న కథలు ఆయన సమస్త రచనలు తదనుభవ తీవ్రత నుండి సముద్భవించినవే మానవ జాతి చరిత్ర ఎట్టిదని తెలిసికొనుట కాయన వాఙ్మయమును తెలుగువారు తొలిమెట్టుగా చదువుకొనవలయును నరజాతి చరిత్రలో గర్వకారణములు లేక పోలేదన్న సత్యమును వ్యాఖ్యానించిన సాహిత్య స్రష్ట విశ్వనాథ గతి తార్కిక మైన చారిత్రికావగాహనవల్లనే మానవజాతి పురోగమించగలదన్న విశ్వ సత్యము నాయన తన సాహిత్యము ద్వారా బహువిధముల ప్రదర్శించినాడు

## V

విశ్వనాథ సత్యనారాయణ తన బహిరంతర్ముఖాలను ఏవిధముగా దాచు కొనుటకు వీలుకానంత విస్తృతమైన వాఙ్మయమును సృష్టించుకొనినాడు ఆదీకాక అరవై సంవత్సరాలపాటు నూరు నూట పాతిక పుస్తకాలు రచించుటయే కాక వందల సంఖ్యలో ఉపన్యాసాలు చేయుచూ దేశము నాలుగు మూలలు సంచారముచేసి, ప్రజా సమూహములో పడి, వారితో క్రిందమీదై, తిట్టే తిట్లు దిని, ప్రేమించి ప్రేమింపబడి, మన్నించి మన్నింపబడి, దూషణ భూషణలను సమాన ముగా స్వీకరించిన ఒక మహా రచయితను అర్థము చేసికొనుటకున్నంత వసతి

మరొక ఒకటిరెండు పుస్తకాలు రచించిపోయిన రచయిత విషయమున ఉండదు ఆ యున్న అవకాశము నొక విధముగా తెలుగు ప్రజలు జారవిడువక విశ్వనాథను సరిగానే అర్థము చేసికొన్నారు అర్థము కానప్పుడు కాలేదని తిట్టినారు తప్ప ఆయన నెప్పుడును ప్రజలు తిరస్కరించలేదు తిరస్కరించినచో ఆయన పుస్తకాలవల్ల అంత డబ్బు సంపాదింపగలిగి యుండెడివాడు కాడు దూషణభూషణలకు ఇంతగా గురియగుచున్న ఈయన సాహితీ వ్యక్తిత్వముయొక్క అస్తిత్వము ఆ రెండింటికినీ అందక రెండింటినీ స్వాహా చేయగలిగిన వసిష్ఠుని బ్రహ్మదండములాగా ఎక్కడో ఉండి ఉంటుంది

విశ్వనాథ సామాజిక దృక్పథముగానీ మానవతా దృక్పథము కానీ, చారిత్రక దృక్పథముకానీ, సాంప్రదాయిక దృక్పథము కానీ ఏదీ సమగ్రము కాదని బుజావు చేయుట సులభము కావచ్చు ఆయన అన్నీ అర్ధసత్యాలే చెప్పినాడన్నది నిజమే కావచ్చును ఏ శాస్త్రమూ సర్వ సమగ్రము కాదు ఇది ఇంతే అనటానికి వీలులేదు ఆధునికాంధ్ర భాషా సాహిత్య నిర్మాతలలో ఆయన మొదటి రకము పనితనము కలవారిలో మొదలు పెట్టబడవలసినవాడు కానీ, సామాన్యుడు కాదు కదా! ఈ మాట అన్నచో ఇక సృష్టి ఆగిపోవుచున్నదని యర్థమా? విపరీతార్థములు పుట్టించుట మంచిదికాదు

మరొక విషయము కూడా ఉన్నది - అన్ని శాస్త్రాలకు, అన్ని కవిత్వాలకూ, కళలకూ, విద్యలకూ ప్రత్యక్ష ప్రయోజనమున్నప్పుడే విలువ అని అనటానికి వీలులేదు ప్రతి కార్యమూ సమాజానికి ప్రకృష్టోపకారకముగా ఉండితీరాలని అనుట శాస్త్రీయము కాదు మనిషిని చంద్రమండలానికి పంపటానికి టెక్నాలాజికల్ సైన్సు ఎంత డబ్బు మింగినదో లెక్కతెలియునా? దానివల్ల మానవ సమాజమునకు వెంటనే కలిగెడు ప్రయోజన మేమున్నది?

ఇది వృధా ఖర్చనవచ్చునా? ఎందుకనరాదు? మనిషి చంద్రమండలమునకు పోయి తిరిగి రాగలిగాడన్న భావము మానవ జాతి సమష్టి అజ్ఞాత చైతన్యములోనికి వెళ్ళిపోయినది దానియునికి యొక్క స్మృతి లక్షణముచేత మరికొన్ని వేల యేండ్లు మానవజాతి తన మనుగడను కొనసాగించుకొనగలదు అది వృద్ధ విజ్ఞానము దానినే భారతీయులమైన మనము సంప్రదాయముగా కలగాపులగము చేసి చెప్పుకొని పోవుచున్నాము

మనిషి బాహ్యాంభ్యంతర లక్షణము చేత భౌతిక ఆధ్యాత్మిక జీవితములను రెండింటిని జీవించుచున్నాడు భౌతిక జీవితమునకంటె ఆధ్యాత్మిక జీవితము సమష్టి లక్షణము కలది మహాకవులు, రచయితలు తమ పాత్రల ఆధ్యాత్మిక జీవితమును చిత్రించుట చేత తమ సాహిత్యమును విశ్వవ్యాప్తము చేసికొనగలుగుచున్నారు దానియందు సమష్టి లక్షణముండుటచేత అన్ని దేశకాలముల యందలి వారును ఆ సాహిత్యమును ఆస్వాదింపగలుగుచున్నారు

విశ్వనాథ శారదా హృదయమునం దేమున్నదనగా నిదంతయును ఉన్నది

ఆధ్యాత్మిక జీవన భావము సమష్టి లక్షణంచేత విశ్వసత్యముగా నిలబడ గలుగుచున్నది విశ్వసత్యనాధాయణ అనగా యూనివర్సల్ ట్రూత్సును గురించి అధికారికంగా చెప్పగలిగిన వాడని యర్థము ఆ స్థాయిలో ఆయా విషయాలను గురించి చెప్పటానికి ఒక విలక్షణమైన ప్రత్యభిజ్ఞ కావలయును ఆ చెప్పబడిన దాని లోతుపాతుల అవగాహనకును అంతే ప్రత్యభిజ్ఞ కావలయును

---

For it is the combination of intution and eognition that makes for evasive thrust from the unconcious and evasive mastery by the conscious The true evasive man to use Friend's phrase, has more at his disposal, special gifts, which enable him to adventure beyand the borders of the corridor of transformation - into the mysteries and mechanics of the process which impinges upon him the inner time - space world of his unconscious and from the outer time - space, world of reality He lives nearer to his dreams and at the same time he encompasses routine and penetrates beyand routine into the practical magic of ever changing ever subtle reality Intution and eognition, evasive thrus and evasive mastery - this is the quality and quantity - the sum and substance - of true genious and, to the degree tha one possesses these, one is a greater or a lesser evasiv worker - DANIEL SCHNEIDER, The Psychoanalyst an the Artist Pages 79, 80, 81

# నవ్య సాంప్రదాయ భావన– I

Neo - Classical Age, Neo, Classical Epic - ఈ మొదలయిన ఇంగ్లీషు సాహిత్య పదబంధాలలోని నియో అనే మాట కొత్త అనే అర్థంతో పాటు ఒక విధమైన ఉదారవైఖరిని - సహేతుకతను కూడా సూచిస్తుంది పాత పద్ధతిని కొత్త పరిస్థితులలో కొనసాగించటానికి చేసే ప్రయత్నాన్ని చెప్పేదిగా నియో శబ్దం రూఢమై కనిపిస్తున్నది [1]నియో శబ్దం అదెప్పుడూ విశేషంగానే వుంటున్నది అందువల్ల ఏదో ఒక విశేష్యాన్ని కొత్తదిగా చేసి చెప్పే సందర్భంలోనే నియో శబ్దం రంగంమీదికి వస్తుంది Neo-Darwinism, Neo Hehenism, Neo-Kantlianism, Neo - Pythagoreanism, Neo - Lamarckism - ఈ మొదలయిన ఎన్నో సందర్భాలలో అయా విషయాలను కాలాంతరంలో మార్పులతోను చేర్పులతోనూ పునరుద్ధరించటంగానూ కొనసాగించడంగానూ వున్న వాస్తవాన్ని నియో శబ్దం సంకేతిస్తున్నది

క్లాసిజంను పునరుద్ధరించినా కొనసాగించినా అదంతా నియో క్లాసిజం అవుతుంది క్లాసిజం అనేమాట ముఖ్యంగా ప్రాచీన గ్రీకు లాటిను భాషాసాహిత్య స్వరూప స్వభావ సంప్రదాయాన్ని చెప్పటానికి ఉపయోగపడుతున్నది క్లాసు అంటే కొన్ని ప్రమాణాల ననుసరించి ఒక పద్ధతిగా నడిచేవర్గమన్నమాట ఆ పద్ధతినీ ఆ ప్రమాణాలనూ ప్రబోధించే రచనలు క్లాసిక్సు అటువంటి రచనలు యూరపులో మొదటి గ్రీకు లాటిను భాషల్లో వచ్చాయి కనుక గ్రీకు లాటిను

---

1 ' The new emerges from the old, what comes after is explained by what comes before it, and nothing appears accidentally "

—VISSARION BELINSKY

తెలుగులో ఆధునిక కవితారీతులు (సం) ఆచార్య ఓద్దూరి సుబ్బారెడ్డి, తెలుగుశాఖ శ్రీ వెంకటేశ్వరా యూనివర్సిటీ, తిరుపతి 1992

భాషా సాహిత్య రచనా సంప్రదాయం క్లాసిజంగా రూఢమైంది అటువంటి క్లాసికల్ సంప్రదాయంలోని వస్తురచనా వైఖరులను, చిరకాలం శిరసావహింప బడిన సంగీత సాహిత్యాభిరుచులను ఉన్నతాలుగానూ ఉదాత్తాలుగానూ భావించి కాలాంతరంలో వాటిని పునరుద్ధరించటానికి కొనసాగించటానికి జరిగే ప్రయత్నాన్ని నియో క్లాసిజం అంటాం

క్లాసిజం అనే దాని అర్థం మరింత లోతుగా బోధపడటానికి మనం రొమాంటిసిజం అన్న శబ్దార్థాల వైపు చూడటం అవసరం ఎందుకంటే, అవి వ్యతిరేకార్థాలను చెప్పే శబ్దాలు కొనసాగటానికి క్లాసిజం కొత్తది ఉనికి లోనికి రావటానికి రొమాంటిసిజం ఉద్బోధకంగానూ ప్రేరకంగానూ పనిచేస్తాయి దేశకాలపరిస్థితుల పరిణామఫలితంగా విచ్ఛిన్నమైపోతున్న క్లాసికల్ సంప్రదాయ భావజాలాన్ని పునరుద్ధరించటంద్వారా- నవీకరించి పునరుజ్జీవింపచేయటం ద్వారా క్లాసికల్ సంప్రదాయాన్ని నవ్యసంప్రదాయంగా కొనసాగించవచ్చు ఇంగ్లీషు సాహిత్యంలో 18 వ శతాబ్దం ఉత్తరార్థంనుండి 19 వ శతాబ్దం పూర్వార్ధకాలంలో రొమాంటిక్ రివైవలిజం బలం పుంజుకొన్నది ఇది అంతవరకు అక్కడ సాహిత్యరంగంలో రాజ్యం చేస్తున్న నియో క్లాసిసిజానికి వ్యతిరేకంగా స్వతంత్రమైన ఇంద్రియానుభూతుల అభివ్యక్తిగానూ, కాల్పనిక ఆలోచనల కావ్యరచనగానూ, స్వేచ్ఛాస్వాతంత్ర్యాల, ప్రేమానురాగాల ఆరాధనగానూ ఆచరణగానూ ఉద్యమస్థాయినందుకొన్న భావాభినివేశం గ్రీకు లాటిను భాషాసాహిత్య కళారూప నిర్మాణ సంప్రదాయాన్ని క్లాసిసిజం అంటున్నందువల్ల - తదితర దేశభాషా సాహిత్య కళారూపనిర్మాణంలో ప్రాచీనతమమైన కళారూప నిర్మాణ సంప్రదాయాన్ని అనుసరించడాన్నికూడా క్లాసిజం అనీ నియో క్లాసిజం అనీ అనటం ప్రారంభమైంది యూరోపియను భాషా సాహిత్య కళారంగాల్లో ఆ విధంగా నియో క్లాసిజం ఆంగ్లసాహిత్యంలో 17 వ శతాబ్దం ఉత్తరార్థంనుండి 18 వ శతాబ్దం పూర్వార్థందాకా కొనసాగింది Dryden-Alexander Pope వున్న ఆ కాలాన్ని **Augustan age** అని కూడా అంటారు రెండవ ఛార్లెసును ఫ్రాన్సు నుండి తీసుకొనివచ్చి ఇంగ్లాండు సింహాసనంమీద ప్రతిష్ఠించినప్పుడు ఆయనరాకను ఆహ్వానిస్తూ డ్రైడను మహాకవి అగస్టస్ సింహాసనాధిష్ఠుతుడైనట్లున్నదని కీర్తించాడు అందువల్ల పునరుద్ధరింపబడిన ఛార్లెసు రాచరిక యుగంలో సాహిత్య కళారంగాల్లో

పునరుద్ధరింపబడిన క్లాసిజన్ని నియో క్లాసిజమనీ నిగూఢ అగస్టనిజమనీకూడా అంటారు

II

ఇంగ్లీషులో నియో క్లాసిజం రావటానికీ తెలుగులో నవ్య సంప్రదాయం బయలుదేరటానికి చాలా తేడావుంది ముఖ్యంగా మనదగ్గర ఈ ఇరవయ్యో శతాబ్దం మొదట్లో బలంగా ముందుకువచ్చిన జాతీయోద్యమ కాల్పనిక భావాభినివేశానికి వ్యతిరేకంగా తిరుగుబాటుగానూ జాతీయోద్యమ హిందుత్వ భావనకు అనుకూలంగా దోహదకారిగానూ బయలుదేరిన సాంప్రదాయిక ఆలోచనా విధానం ఆధునికమైన అభివ్యక్తి రామణీయకంచేత నవ్య సంప్రదాయంగా గుర్తింపులోకి వచ్చింది పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్ధంలోని సంస్కరణోద్యమానికి వ్యతిరేకం కాకపోయినా దాన్ని పక్కకునెట్టి కాల్పనికోద్యమం ఇరవయ్యో శతాబ్దంలో ముందుకు రావటానికి మంచి ఊపునిచ్చింది మన జాతీయోద్యమమే కాల్పనిక రచయితల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సంకీర్తనానికి అదే కారణం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు దేనికి? మన పురాణ వైభవాన్ని మనం యథేచ్ఛగా పునరుద్ధరించుకోటానికి, పునర్నిర్మాణం చేసుకోటానికి స్వేచ్ఛా స్వాతంత్ర్య భావనతోపాటు భూస్వామ్య రాచరిక యుగ శిథిల సౌందర్య సమారాధన భావనకూడా రొమాంటిసిజంలో భాగమే మన కాల్పనిక యుగ కవుల కవితల్లో ఈ లక్షణాలున్నాయి జాతీయోద్యమం బలపడుతున్నకొద్దీ అందుకనువుగా జన సమీకరణకూ ఏకత్వభావనయొక్క పెంపుదలకు సులభోపాయంగా కనిపించి ఆచరణలో పెట్టబడిన హిందూత్వభావన కాల్పనికతలోని భూస్వామ్య రాచరికయుగ శిథిల సౌందర్య సమారాధన భావనను తత్సౌందర్య పునరుద్ధరణ భావనకూ పునర్నిర్మాణ భావనకూ ప్రేరకంగా మార్చింది ఇప్పుడు మన మనుకొంటున్న నవ్య సంప్రదాయ భావనకు పునాది ఆ మార్పులోనే పడింది అవిధంగా రొమాంటిసిజానికి వ్యతిరేకంగా వచ్చిన తిరుగుబాటుగానే కాక పురాణయుగ వైభవ పునరుద్ధరణగా పునర్నిర్మాణంగా నవ్య సంప్రదాయ భావన బలపడింది అందువల్ల మన జాతీయోద్యమంలోని హిందూత్వపార్శ్వంతో నవ్య సంప్రదాయ భావకు రాజకీయంగాకంటే సాంస్కృతికంగా దోహదకారి లక్షణ సంబంధం వుంది హిందూపార్శ్వం వున్నదంటే ముస్లిం పార్శ్వంకూడా వున్నదన్నమాట 1905-6 సంవత్సరాల్లో జాతీయోద్యమంలో ఉప్పెనలా లేచిన స్వదేశీ ఉద్యమంలోనే హిందూ - ముస్లిం పార్శ్వాలు భారత ధర్మమండలి

పేరుతోనూ ముస్లింలీగు పేరుతోనూ బయటపడ్డాయి 1920 నుండి గాంధీగారు నాయకుడై మహాత్ముడుగా చేయబడ్డ మరుక్షణం నుండి జాతీయోద్యమంలో హిందూ - ముస్లిం కూటాలు క్రమంగా మిత్ర వైరుధ్యాల నుండి వ్యతిరేకంగా అభివృద్ధి అయినాయి ఆ విధంగా జాతీయోద్యమంలోని హిందూత్వం స్వదేశీ భావనతో సమైక్యమై జాతీయ విప్లవకారులకు వ్యతిరేకంగా జాతీయ మతాభినివేశాన్ని అవలంబించిన కారణంగా అందుకు సాంస్కృతిక దోహదకారిగా నవ్యసంప్రదాయ భావనబలం పుంజుకొన్నది మరొకటికూడా వున్నది 1925-30 సంవత్సరాల్లో జాతీయ విప్లవ పోరాటకారుల ఆశయ రూపకల్పనగా ఏర్పడ్డ కమ్యూనిస్టుపార్టీ ఆలోచనా రీతికి సాహిత్యపరంగా సాంస్కృతిక దోహదకారి లక్షణంతో అభ్యుదయోద్యమం మొదలు అవుతుంటే అందుకు వ్యతిరేకంగాకూడా నవ్య సంప్రదాయ భావన సాహిత్యకళారూపం ధరించి ముందుకు వచ్చింది మన మంటున్న ఈ నవ్యసంప్రదాయ సాహిత్యం 1932 అక్టోబరునుండి 1934 అక్టోబరు లోపల రచింపబడిన వేయిపడగలు నవలతో ప్రారంభమవుతున్నది

## III

నవ్య సంప్రదాయ సాహిత్య రచయిత లెవ్వరూ తమది నవ్య సంప్రదాయమని చెప్పలేదు చెప్పిన విశ్వనాథ సత్యనారాయణ తనను సంప్రదాయమునకే అంటిపెట్టి చెప్పుకొన్నాడు "వేయిపడగలతో నేల దాల్చినవాడు, నాల్గు పడగలతో పురుషార్థములు సాగించెడువాడు, రెండుపడగలతో దంపతుల పాలించువాడు, ఒక్కపడగవిప్పి పైరుపచ్చకు గొడుగుపట్టెడువాడు త్రిమూర్త్యాకృతి శూలము నాలుకయందు శంఖచక్రములు ఫణాగ్రములయందు తాల్చిన దేవుడు, ధర్మమయ తనువు కరుణాంతరంగితాంతరంగుడై నన్నుగూడ నా పితరులను వలెనే సంప్రదాయమునకు దూరముకాకుండ కాపాడువాడు నాకు ప్రసన్నుడగుగాక! నన్ను సర్వదా రక్షించుగాక!" (పుట 117) సుబ్రహ్మణేశ్వరస్వామిని ధర్మారావు మనసార ధ్యానించినవైనముగా విశ్వనాథ వ్రాసిన వాక్యములివి "సర్వధర్మమూల బీజంబుగ అవిచ్ఛిన్న సంప్రదాయార్థినై మునిఋణము దీర్ప నీ కావ్యమును రచింతు"నని స్వయంగా చెప్పి రామాయణ కల్పవృక్షాన్ని రచించాడు విశ్వనాథ అందువల్ల ఆయనవరకు ఆయన సంప్రదాయ పునరుద్ధరణభావ-పునర్నిర్మాణభావ పరవశుడే కాల్పనిక అభ్యుదయ భావనలకు వ్యతిరేకంగా సంప్రదాయ భావనను పునరుద్ధరించటానికి పూనుకొన్నాడు గనుక ఆయన పూనికను నవ్య సంప్రదాయ భావనగా అంటున్నాం

"అతి మని బుద్ధ్యహంకృతులు ఔపనిషదులు
ఆత్తగండు క్షత్రత్రయులు ఔర్వవహ్ని
గర్వితాంత స్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వడు విరోధి తద్వధకెత్తినయది"

ఇది పైని చెయ్యెత్తి పిడికిలిబిగించి చూపిస్తాడు గౌతముడు వేనరాజు నాటకంలో గౌతముడు అర్షధర్మ ప్రతిష్ఠాపనకు కంకణం కట్టుకొన్న పాత్ర సనాతన వైదిక మత ధర్మాభినివేశం ఆలోచనగా వున్నంత ఆచరణగా లేదు గౌతమునిలో ఈ పాత్రలో ఈ విధంగా ప్రవేశించి విశ్వనాథ సత్యనారాయణ "మానసికముగా ఏర్పడ్డ ఒకానొక 'అవసరము'వల్ల ఈ నాటకాన్ని వ్రాసివుండవచ్చు నని కొంపల్లె జనార్దనరావు అభిప్రాయపడ్డాడు 1935 లోనే "ఇది వేనుడనే ఒకానొక వ్యక్తి చరిత్రము చెప్పుటకాదు వేనుడనే పాత్రమును కల్పించి రుచికి సానబెట్టిన నిర్మితి వేనునికంటె భిన్నభావుడై అతనిని తన భావాలతో విమర్శకగ్గము చేసినదెల్ల ఆ పాత్రకు దారిద్ర్యమే గౌతముడు, అంగరాజు పృథువు అనువారేకాక కవికూడా వేనునికి విరుద్ధముగా నిలిచి వారితో కుట్ర చేయడము గోచగిస్తూ వస్తుంది 1" సనాతనధర్మ సంప్రదాయ వ్యతిరేకత వేనుని పతనానికి కారణంగా విశ్వనాథ చూపిస్తే త్రిపురనేని రామస్వామి చౌదరిగారు అది వేనుని పతనం కాదు, ఆ పేరు మీద అతన్ని సంప్రదాయవాదులు ఖూనీ చేశారని నాటకం వ్రాశారు ఇదంతా ఏమి బోధిస్తున్నది? విశ్వనాథ సంప్రదాయాభినివేశాన్నే బోధిస్తున్నది ఆయనకు సంప్రదాయమంటే ఋషులు, మునులు ప్రవర్తింపజేసిన ఆలోచనావిధానమే అది ప్రవర్తించటానికి అనుకూలంగావున్న అప్పటి దేశకాలపరిస్థితులు మారి కొత్త పరిస్థితులు ఏర్పడినసందర్భంలో ఈ పరిస్థితులకు వ్యతిరేకంగా దానిని ప్రబోధించ టానికి అవసరం ఏర్పడినట్లు భావించి సాహిత్య రూపాలను ఆ విధంగా తెలిసి తెలిసి తీర్చిదిద్దే సృజనకళాభినివేశమే నవ్యసంప్రదాయ భావన క్లాసిజానికున్న పునాదిబలం నియోక్లాసిజానికి వుండదుగనుకనే కొందరు దీన్ని Pseudo-Classicism అనికూడా అంటారు ఇంగ్లిష నియో క్లాసిజానికి పూర్వాంగ్ల కవుల కవితారీతుల మీద ప్రమాణబుద్ధి లేదు గౌరవాభిమానాలు కూడా లేవు

---

1 కొంపల్లె జనార్దనరావు జీవితం - సాహిత్యం (సంపాదకుడు ఏటుకూరి ప్రసాద్) పుటలు 194, 202

మనదగ్గర అట్లాకాదు మన నవ్యసంప్రదాయ కవులకు మన ప్రాచీనాంధ్ర కవుల కవితారీతులమీద ఆదరాభిమానము లధికంగా వున్నాయి అనుకరిస్తారు కూడా ఇంగ్లీషు నియోక్లాసికలు కవులకు గ్రీకు లాటిను భాషాకవుల మీద దృష్టి వున్న దానికి సమాంతరంగా మన నవ్య సంప్రదాయ కవులకు సంస్కృతభాషా కవుల మీదా, సంస్కృత అలంకారశాస్త్ర రచయితల మీదా గురుభావన వుంది దాంతో పాటు ప్రాచీనాంధ్రకవులమీద అంతకంటె ఎక్కువ వుంది ఇందుకు కారణం రొమాంటిక్ భావన కాల్పనిక భావకవితోద్యమ ప్రభావంవల్ల నవ్య సంప్రదాయ కవులు పూర్వాంధ్రకవుల మహాకవిత్వ పటుత్వ తత్వాన్ని పునరుజ్జీవింప చేశారు వీళ్ళను సంస్కృతమహాకవులప్రక్కన - అంతకంటె కాస్తసమున్నతంగా కూడా నిలబెట్టారు ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి - అని విశ్వనాథ చెప్పినదాని తాత్పర్యాన్ని ఆ విధంగానే భావించాలి సంప్రదాయమని అంటున్నప్పటికి విశ్వనాథదికానీ ఆయన వంటి ఆలోచనపరులదిగానీ పూర్తిగా నిజమైన సంప్రదాయం కాదు నన్నయ్య ఋషివంటివాడేగాని ఋషికాడు వాల్మీకివంటి వాడేగాని వాల్మీకి కాడు శ్రీశ్రీ కొంపల్లె జనార్ధనరావును క్లాసిస్టు అయిపోతున్నా డన్నదాన్నీ, విశ్వనాథను రెండవ నన్నయభట్టనటాన్నీ కూడా మనం పైవిధంగానే అర్థంచేసుకోవాలి అలాగని జనార్ధనరావూ విశ్వనాథ ఇద్దరూ ఒకేరకమైన క్లాసిస్టులని అనుకోటంకూడా కుదరదు రొమాంటిక్ రివైవలిజం పేరుతో వచ్చిన నవ్యత లోనూ, నియోక్లాసిజం పేరుతో వచ్చిన నవ్యతలోనూ ఇంగ్లీషు సాహిత్య కళాకారుల దృష్టి సుముఖంగా లేదు అటువంటి బహుముఖత్వం మన నవ్య సంప్రదాయ భావనలోనూ వుంది అందువల్ల నవ్య సంప్రదాయ మనబడే దంతా ఒకరకంగా లేదు అందులో అవాంతర భేదాలు చాలా వున్నాయి అయితే విశ్వనాథ సత్యనారాయణగారు అటు ఋషి సంప్రదాయంనుండి మొదలు పెట్టి ఇటు దేశీయమైన కూచిపూడిభాగవతాలతో కలుపుకొని సాముగరిడీల గ్రామీణవిద్యా కళావైశారద్య ప్రదర్శనలవరకు సమస్త సాంస్కృతిక సంప్రదాయాల పునరుద్ధరణకు తెలిసినంతలో అనువుగా అనిపించిన పాశ్చాత్య సాహిత్య రచనాశిల్ప విధానాలను కూడా తన ప్రాగ్విప్రశ్చిన్నతానికి లోబరుస్తూ జోడించి ఆధునికంగాని అనాధునికం అనిపించని ఒక విలక్షణమైన తార్కిక ప్రాతిపదిక మీద సంప్రదాయిక మతతాత్వికభావప్రచారం సాధనంగా భావించి చెయ్యగలిగినంతా చేసిన సాహిత్య సమ్రాట్టు అంటే నవ్యసంప్రదాయ సాహిత్య

స్రమాట్టన్నమాట ఆ రంగంలో ఇతరులు చాలామంది వున్నారు అనుభూతి వాదులమనీ మానవతావాదులమనీ ఆధ్యాత్మికవాదులమనీ ఆదర్శ సమాజవాదుల మనీ ఆత్మనః కళావాదులమనీ- ఈ రకంగా చెప్పుకొంటున్న వాళ్ళంతా ఆయన సామంతాన్ని కొనసాగించే వాళ్ళే ఇటువంటి వాళ్ళవల్లనే నవ్యసంప్రదాయానికి బహుముఖత్వం ఏర్పడింది ఇంత మందిని ఒక కొలిక్కి తెచ్చి గుర్తించి అధ్యయనం చెయ్యటానికి నవ్యసంప్రదాయమనే మాట సూచికగానేకాక అర్థ వంతంగా కూడా కనిపిస్తున్నది

మరొక విషయం కూడా వుంది సాంప్రదాయిక భాషాసాహిత్య మర్యాదల పునరుద్ధరణకూ, సంరక్షణకూ ఆంధ్రత్వ సముద్దీపనానికి 1911 లోనే ఆంధ్ర సాహిత్యపరిషత్తు ఏర్పడి పనిచేస్తున్నది 1919 లో శ్రీ శివశంకరశాస్త్రిగారి సభా పతిత్వంలో సాహితీ సమితి ఏర్పడి పనిచేస్తున్నది సాహితీసమితి కాల్పనిక భావ కవితా ఉద్యమ స్ఫూర్తిని ప్రతిబింబించేది సాహిత్య పరిషత్తు కాల్పనికోద్యమ స్ఫూర్తిని ఆమోదించింది కాదుగనుక సాహితీసమితి ఏర్పాటు ఒక అవసరమే అయితే 1933 లో నవ్య సాహిత్య పరిషత్తనేది అభినవాంధ్ర కవి పండిత సభగా ప్రారంభం కావలసిన అవసరం ఏమై వుంటుంద? అభినవాంధ్ర కవిపండితుల దృష్టి కాల్పనికోద్యమ భావకవితారీతినుండి తప్పుకొని కవిత్వంమీద పాండిత్యం మీద కేంద్రీకరించింది భావకవులకు కవిత్వంమీద దృష్టిలేదా? వాళ్ళకు కవిత్వం మీదమాత్రమే దృష్టి వుంది అది మాత్రమే చాలదనుకొన్న కాల్పనికులంతా సాహితీ సమితినుండి బయటపడి అభినవాంధ్ర కవిపండితులుగా బరంపురంలో సమావేశమై,కవితాశక్తిని పాండిత్యానికి పూర్తిగా లోబరచి వుంచకపోయినా ప్రతిభా వ్యుత్పత్తులను సమఉజ్జీలుగా చేసి చేసే సాహిత్యసృజన తమ లక్ష్యం గనుక అందుకనువుగా నవ్యసాహిత్యపరిషత్తును ఏర్పాటు చేసుకొన్నారు నవ్యసాహిత్య పరిషత్తుయొక్క ముదురు లేతపాకముల సమష్టి సంప్రదాయమే నవ్య సంప్ర దాయం నవ్య సాహిత్యపరిషత్తు లేదు పోయింది దాని ఆధ్యాత్మిక భావరూపంగా నవ్యసంప్రదాయం వుంది నవ్యసంప్రదాయ ప్రవర్తకులలో ఒకరైన జమ్మలమడక మాధవరామశర్మగారు వామనాచార్యుని వైదర్భీ గౌడీపాంచాలీరీతుల ననుసరించి ఆ పద్ధతిలో ఆంధ్రరీతి అనే దొకటి విశ్వనాథసత్యనారాయణోపజ్ఞమయిన దున్న దని ప్రకటించాడు "ఆంధ్రరీతి కథారమ్యరసభావ మహోదధిః సత్యనారాయణః శ్రీమాన్ విశ్వనాథ మహాకవిః విశ్వగో విశ్వతీర్ణశ్చ సోయంజయతి భావుకః"

(విశ్వశ్రీ జనవరి 1954 పుట, 76) ఆ విధంగా నవ్యసంప్రదాయానికి ఒకరీతిని సమకూర్చిన కవీ, దానిని ఆంధ్రీరీతిగా పేర్కొనగలిగిన ఒక ఆలంకారికుడూ నవ్యసాహిత్యపరిషత్తు వేదికమీదుగా రావటంకూడ వారివారి రచనలను నవ్యసంప్రదాయ సాహిత్యంగా మనం పేర్కొనటానికి దోహదం చేస్తున్నాయి

1933 లో అచ్చై బయటకువచ్చిన రాణా ప్రతాపసింహ చరిత్ర పూర్వపీఠికలో రాజశేఖర శతావధానిగారు అప్పటి "సారస్వత స్థితి"గతుల గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలు చూస్తే అవి మనమనుకొంటున్న నవ్య సంప్రదాయ భావనకు మూలభూతాలుగా కనిపిస్తాయి గడియారం వేంకటశేషశాస్త్రిగారు తన వద్దకువచ్చి మాట్లాడిన సందర్భంలో 'నేటి సారస్వతస్థితి" గురించి ఆయన చెప్పినట్లుగా రాజశేఖర శతావధానిగారు వ్రాశారు

1 నన్నయాది పూర్వకవుల పురాణ రచనలు "సరసపదార్థ భావరస సంభృతమై తగు మంచిశైలిలో విశ్వజగన్నుతం"గా వున్నాయి ఆ తరువాతి పెద్దనాదుల కావ్య (ప్రబంధ) యుగం మన సాహిత్యచరిత్రలో "మేటి" ఆ పిమ్మటికాలంలో వచ్చిన కావ్యాలు చాలావరకు వికాసగుణమంతయు కోల్పోయినాయి

2 సముద్రంలో అక్కడక్కడ దీవుల్లాగా ఈ నేటికాలంలో కూడా చక్కని కావ్యాలు వ్రాయగలవాళ్ళు ఒకరిద్దరున్నారు వాళ్ళను మినహాయించి ఇతర కవుల కావ్యాలనుచూస్తే వాళ్ళ వ్రాతలు కావ్యాలనిపించవు సరస్వతీదేవికి పెట్టిన వాతలనిపిస్తాయి యతిప్రాసలు సరిగా లేక, శయ్యాపాకాలకు దూరమై, ఒక రీతిగాని ఒక అలంకారంగానీ లేకుండా, రసహీనమై అతుకులబొంతలుగా కనిపించే (ఖండ) కావ్యాలను చూస్తే ఒళ్ళు మండుతుంది ఇప్పటికింకా ఈ కావ్యలక్షణాలన్నీ సరిగ్గా వుండటంలేదనీ అనుకొనే స్థితిఅయినా వుంది ముందున్నది ముసళ్ళపండుగ అంతా గ్రామ్యమయమైపోతున్నది రోజురోజుకు ముందుముందు అనుకోటానికి కూడా వీలుండనిరోజులు వస్తాయి ఇంగ్లీషు చదువులు వచ్చి మనవాళ్ళకు 30 35 మార్కుల పాండిత్యం చాలునంటున్నాయి గదా!

3 "భావకవిత్వ వైఖరి" బయలుదేరింది గదా! భావంలేని కవిత్వం వుంటుందా ఎక్కడైనా భావహీనమైన రచననే కవిత్వమనరు అలాంటప్పుడు "భావమభావమౌ కవిత ప్రాణము పీడిన బొందిగాదా?"

4 భావకవిత్వ మనటమే తెలివితక్కువ మాట రసంవుంటే అది కవిత్వం అదే ఉత్తమకవిత్వం దాని కేపేరూ అక్కరలేదు రససిద్ధి లేకుండా తదితరా లెన్నివున్నా అది కవిత్వం కాదు ఆ శబ్దంచేత చెప్పబడటానికి అది యోగ్యంకాదు

"అలరుఁదేనెల మఱపించు పలుకుఁబొందు,
పలుకుఁబొందున కుచితమౌ భావపుష్టి
భావపుష్టికిఁదగు రసవైభవంబుఁ
గూర్చు ధన్యుండెపో కవి కుంజరుండు " (28)

5 "పరువడి పద్యకావ్యములు వ్రాయుట మోటుదనంబటంట, నా
గరకతకెంతొ లోపమట, గద్యమొ గేయమొ సద్రసోత్తర
స్ఫురణము జూపునంట, మఱి పొత్తము పెద్దదిగాగ నుండినన్
బరువట, చిన్నిపొత్తములు నాడెము గూర్చునవంట - వింటిరే!

వెంకటశేషశాస్త్రిగారి అభిప్రాయాలను చెప్పి, వాటినిగురించి తానుగూడా అట్లే అనుకొంటున్నట్లుగానూ ఆయన ఆవేదనను తాను అర్థంచెసుకొన్నట్లుగానూ ఒక పద్యం వ్రాశారు శతావధానిగారు—

"పూర్వకాలపు పాండిత్యపుం బ్రశస్తి
కావ్యముల భావగాంభీర్య గౌరవములు,
కొఱతపడ నిష్టపడనట్టి గొప్పవాడ
వగుట నింతటి పరితాపమందెదీవు (32)

సమకాలీన సారస్వత స్థితిని దిగజారిపోతున్న దానిని సముద్ధరించడానికి అనువుగా—

"దేశభక్తియుంతటు నీతిప్రబోధ
కంబు లోకోత్తరము పద్యకావ్య మొకడు
సరసజనములు మెచ్చ రసంబుహెచ్చ
సృష్టిసేయంగ నిపుడు యోజించుచుంటి" (42)

నని శతవధానిగారు ప్రకటించి—

"ఆ కర్ణద్వయ పావనంబగు చరిత్రాంశంబులం దెల్లక
న్నాకై దివ్యరసాలవాలమయి విశ్వాతిత తేజోయుతం
బై కన్పట్టెడి సీప్రతాపుచరితం బద్దానినే గోస్తపీ!
పాకంబొప్పగ నొక్క దొడ్డకృతిగా వ్రాయన్ ప్రయత్నించెదవ్" (49)

అని, రాణా ప్రతాపసింహ చరిత్ర వ్రాశారు

రాజశేఖ శతావధానిగారి పూర్వ పీఠికా రచన కాల్పనికోద్యమ భావ కవిత్వం గురించి వ్యావహారిక భాషా ఉద్యమం గురించి, ఇంగ్లీషు విద్యావిధానం గురించీ ఆధునికులయిన పూర్వకావ్యరచనా సంప్రదాయాభిమానుల వ్యతిరేకత ఎంత బలంగా వున్నదో రికార్డు చేసి పెట్టింది మన తెలుగు సాహిత్యంలో విశ్వనాథ సత్యనారాయణ గారి ద్వారా 1934 నుండి నవ్యసంప్రదాయ భావన దుబ్బుగట్టి ఏపుగా పెరటానికి మూలమైన కుదురును మనం శతావధానిగారి పూర్వ పీఠికలో చూడగలం

## IV

రొమాంటిసిజానికీ, అభ్యుదయానికీ వ్యతిరేకంగానూ, క్లాసిజానికి పునరుద్ధరణగానూ రూపొందిన సంప్రదాయ భావజాలాభివ్యక్తితో కూడిన కావ్యాలను నవ్యసంప్రదాయ కావ్యాలంటున్నాం పద్యరచనారూపమైన భావాభివ్యక్తిరీతి సాంప్రదాయికమైనదే అయినా సంప్రదాయ భావజాలాన్ని వ్యతిరేకించే దాన్ని నవ్యసంప్రదాయమని అనం అందువల్లనే త్రిపురనేని రామస్వామి చౌదరి గారిని నవ్యసంప్రదాయ కవుల్లో చేర్చం విశ్వనాథ సత్యనారాయణను చేరుస్తాం చేరుస్తాం కాదు - ఆయనవల్లనే అంటే ఆయన సాహిత్యంవల్లనే ఆ మాటను మనం అర్థవంతం చేస్తున్నాం విశ్వనాథ తనది నవ్యసంప్రదాయమని చెప్పుకో లేదు-నిజమే అభ్యుదయ రచయితల సంఘం వచ్చినతరువాత శ్రీశ్రీ అభ్యుదయ కవి అయినాడుగానీ, అంతకుముందునుండి అభ్యుదయ కవిత్వం వ్రాస్తున్నా ఆయన తన నెప్పుడూ అభ్యుదయ కవి అని చెప్పుకోలేదు కదా! శ్రీశ్రీ తనది నవ్యకవిత్వమని చెప్పుకొంటే మనమా మాటను కాదని ఆయనది అభ్యుదయ కవిత్వమన్నామా లేదా? అలాగే విశ్వనాథ తనది సంప్రదాయమార్గమంటే మనమా మాటను పూర్తిగా కాదనకుండా అది నవ్యసంప్రదాయమంటాం

విశ్వనాథనూ శ్రీశ్రీని గురించి ఎందుకు మాట్లాడుతున్నామంటే - ఇద్దరూ రొమాంటిసిజంనుండి 1928 - 39 సంవత్సరాల్లో ఒకసారే ద నిమీది వ్యతిరేకతతో బయటపడ్డారు విశ్వనాథ సంప్రదాయాన్ని అవలంబించాడు శ్రీశ్రీ అభ్యుదయాన్ని అవలంబించాడు శ్రీశ్రీ అభ్యుదయ భావన తెలుగు సాహిత్యానికి ఎంత కొత్తదో విశ్వనాద సంప్రదాయ భావస అంత కొత్తది కాకపోవటమేగాక అంతకంటే పాతది కొత్తవస్తువును కొత్తదృక్పథంనులడి చెప్పటానికి అనుకూలపడినంత మేరకు సాంప్రదాయిక రచనావిధానంలోని మెలకువలను శ్రీశ్రీ ఉపయోగించుకొన్నాడు అది మన సంప్రదాయ సంపదకి మనం వారసులం అనటానికి నిదర్శనం విశ్వనాథ సనాతన సాంప్రదాయిక భావనల పరివ్యాప్తికి కొత్త రచనారీతిని అంటే కాల్పనిక కావ్య భాషాభివ్యక్తిని వీలయినంతవరకు వినియోగించి, పాత పిషయాన్ని కొత్తదిగా కనిపించేటట్లు చేసి చూపించాడు సామాజిక చైతన్య ప్రబోధ లక్ష్యానికి అననుకూలమైన సాంప్రదాయిక సాంస్కృతిక భావజాల ప్రతిష్ఠకు అవసరమైనంత మేరకు ఆధునిక చైతన్యాన్ని విశ్వనాథ తిరస్కరించాడు ఆధునికతను వ్యతిరేకించినా కాల్పనిక కవితాశక్తిని జీర్ణించుకొన్నవాడు కావటంచేత ప్రాచీనాంధ్ర గీర్వాణ కావ్యనిర్మాణ శిల్ప మర్యాదలను నవీకరించి, వస్తురచనల సమష్టిరూపమైన నవ్యసంప్రదాయ భావనకు ఆధునికాంధ్ర సాహిత్యంలో ఒక ప్రతిష్ఠను సంపాదించాడు విశ్వనాథ

నవ్యసంప్రదాయ మన్న మాటను నవ్యసంప్రదాయ రచయితలు సృష్టించలేదు ఇరవయ్యో శతాబ్దం మొదటి మూడు దశకాల తరువాతనుండి వస్తున్న సాంప్రదాయిక వస్తురచనారీతులతోడి కావ్యసముదాయాన్ని చూచి అది పూర్తిగా సాంప్రదాయిక వస్తుతత్వాన్ని మాత్రమేగాక ఆధునిక వాసనావాసితంగా కూడా వుండటాన్ని గమనించిన సహృదయులు వాటిని ప్రాచీన కావ్యాలుగా అనుకోవాలా? లేక ఆధునిక కావ్యాలుగా అనుకోవాలా? అన్న మీమాంసలో పడ్డారు వాటిని ఆధునికాలనటానికి వీలుకాదని ఒక ఆలోచన, ప్రాచీన కావ్యాలకింద జమకట్టటం మరీ అన్యాయం అవుతుందని ఒక ఆలోచన, గొప్పగా సంఘర్షించపోయినా ఒరుసుకోటంగా కాలక్షేపం జరుగుతున్న కాలంలో ఆ పద్ధతికొక పేరు పెట్టి వ్యవహరించటం గురించిన ఆలోచన వచ్చినప్పుడు ఆంగ్ల సాహిత్య చరిత్రలోని నియోక్లాసిసిజం అన్న మాటను దృష్టిలోపెట్టుకొని దాన్ని నవ్యసంప్రదాయమనటం మొదలయింది కొంత జాతీయోద్యమ కాల్పనిక కవితా ప్రభావవాసనా

వాసితత్వమూ, సాంప్రదాయిక మతతత్వ ఆలోచనా లక్షణమూ స్వరూపస్వభా వాలుగా వున్న కావ్యరచనా పద్ధతిని నవ్యసంప్రదాయ మనటం బాగానే వుంటుం దనిపించి అనటం జరిగింది దానివల్ల ఆధునిక సాహిత్యాన్ని-ముఖ్యంగా ఆధునిక కవిత్వాన్ని భావకవిత్వమనీ, నవ్య సంప్రదాయ కవిత్వమనీ, అభ్యుదయ కవిత్వ మనీ, విప్లవ కవిత్వమనీ నాలుగు రకాలుగా గుర్తించి అధ్యయన అధ్యాపనాల్లో పెట్టటానికి వీలయింది అది ప్రయోజనవంతంగానే వుంది

నియోక్లాసిజాన్ని నవ్య సంప్రదాయమని వ్యవహరించటానికి ఎవరు నాంది పలికిందీ చెప్పటం కష్టంగానీ, 1970-75 సంవత్సరాల మధ్య ఆలోచనలు చేసీ చేసీ, చివరకు మా కాకతీయ యూనివర్సిటీ తెలుగు విభాగమే ఆ వ్యవహా రాన్ని తన అధ్యయన అధ్యాపనాల్లో నడిపించటం మొదలుపెట్టింది ఆ విధంగా ఆధునిక కావ్య సాహిత్యంలో భాగంగా నవ్యసంప్రదాయ కావ్యాలుగా రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం, సౌందరనందం, ఆంధ్రపురాణం, శ్రీమద్రా మాయణ కల్పవృక్షం, పోతన చరిత్ర మొదలయిన ఆధునిక మహాకావ్యాలను అధ్యయనానికి పెట్టడం జరిగింది

అయితే, నియోక్లాసిసిజం అనేదానికి నవ్యసంప్రదాయమనేది సమానార్థకంగా వుంటుందా అన్న ప్రశ్నవుంది ఇంగ్లీషులోని Tradition అనే మాటకు మన సమానార్థకశబ్దం సంప్రదాయం - నిజమే అయితే, ఇంగ్లీషులోని Classic Classical - Classicism - Classicist- Classicalness Classically- Classicality-వీటన్నింటికీ మూలమైన Class-ఈ మొదలయిన శబ్దాలకు మన భాషలో సమానార్థకాలను వెతికిపట్టుకోవడంగానీ కొత్తగా సృష్టించటంగానీ అంత సులభమైన వ్యవహారంకాదు [1] అందువల్ల అనువాదంమీద దృష్టిపెట్టకుండా

1 పూర్వ సంప్రదాయ పునర్గమనమార్గము-అభాసైతిహాసికత అని నియో క్లాసిసిజానికి తెలుగులో రెండుమాటలను డా॥బొడ్డపాటి వెంకట కుటుంబ రావుగారు కల్పించారు - ఆంధ్ర నవలాపరిణామము (1962, 1971) పుట 255 మరియు చూడు శ్రీసర్దేశాయి తిరుమలరావు-కృష్ణశాస్త్రి రొమాంటిసిజం-కన్యాశుల్కం క్లాసిసిజం - 1980, ఫిబ్రవరి, భారతి, పుట 28

క్లాసిజానికి సంబంధించిన వస్తురచనా సంప్రదయాలను కొనసాగించటమే నియో క్లాసిజంయొక్క ప్రధానలక్ష్యంగనుక తెలుగులోకివచ్చిన ఆ పద్ధతి రచనలను నవ్యసంప్రదాయ రచనల టం బాగుంటుందనుకొన్నాం ప్రధాన కారణం కాక పోయినా మరొక కారణం వుంది అటు విశ్వనాథ, ఇటు శ్రీశ్రీ ఇద్దరూకూడా సంప్రదాయముయొక్క అవిచ్ఛిన్నతను అభిలషిస్తూ ఒకరూ, సంప్రదాయం నిలిని వుంటుంది హమేషా అంటూ ఒకరూ ఎవరిమార్గాన వాళ్ళు తమెంత వారు మరి లేరన్నట్లుగా మహాకవులై చలామణి అవుతుండడాన్నిబట్టి - సంప్రదాయమనే మాటను గ్రహించి నవ్యపదపూర్వకంగా వ్యవహరించటం అది ఉభయతారకంగా కూడా వుంటుందని అనుకోటం "ఒక జాతి జాతీయతకు సంప్రదాయమ్మె పునాది" అని విశ్వనాథ, "సంప్రదాయం తాతముత్తాతలనాటి ధనం" అని శ్రీ శ్రీ అనటంయొక్క లోతుపాతుఌ అర్థం చెసుకొన్నదాన్నిబట్టి సంప్రదాయ సాహిత్య శాస్త్ర మర్యాదల ననుసరించి పూర్వాంధ్రకవుల కవితారీతులను జీర్ణించుకొని పురాతన చారిత్రక మత తాత్త్వక సాంస్కృతిక వైభవాన్ని వస్తువుగా చేసి రసానుభూతి లక్ష్యంగా చేసి చేయబడుతున్న నవ్య కావ్యరచనా సంప్రదాయాన్ని నవ్య సంప్రదాయంగా - అంటే నియోక్లాసిజంగా[1] ప్రతిపాదించటం జరుగుతున్నది 1938 లో విష్ణుధనువుసమీక్షలో విశ్వనాథ "అచ్ఛమైన భాష అయితే ఆ భాషలో అర్థము ప్రసన్నమయ్యేట్లు చెప్పగలిగితే కావ్యం అందమిస్తుంది

---

1 Neo - classicism emphasized the imitation of ancient writers, who symobilzed 'nature methodised', the necessity of observing rules and decorum and of controlling fancy by judgement, the heart by the head and concentrating all efforts on the lucidity, elegance, point and precision of expression to add novelty to old truths and vividnes to the pictures of nature and of humane behaviour in general which it was the business of the poet to treat of, for the amusement and edification of his readers V RAI - Landmarks in the History of English Literature (Vol I, Page 137)

ఆ భాష వాడుకభాష అయినా కావచ్చు గ్రాంథికమైనా కావచ్చు కాని, తెల్గుభాష కావాలి కావ్యానికి పూర్వులు చెప్పిన కావ్యత్వం సిద్ధించ'టం ముఖ్యం "వ్యక్తి గతమైన ఇష్టానిష్టాలతో సారసత్వం మీదికి దండెత్తరాదు" అన్న మాటల తాత్పర్యమే నవ్య సంప్రదాయం

## అనుబంధం

**చర్చవిషయం**

[పై ప్రసంగంమీద శ్రీ త్రిపురనేని మధుసూదనరావు చర్చను ప్రారంభించగా ఇంగ్లీషు ప్రొఫెసరు శ్రీ నాగేశ్వరరావు ప్రభృతులు చర్చను కొనసాగించారు అందుకు సమాధానరూపంగా వున్న ఈ క్రింది విషయాలను బట్టి చర్చలోపాల్గొన్న వారి అభిప్రాయాలను కూడా గ్రహించవచ్చు దీని తరువాత ప్రొ జి వి సుబ్రహ్మణ్యంగారి ప్రసంగం మీద చర్చ మరింత తీవ్రంగా జరిగింది నవ్యసంప్రదాయ భావవ ప్రతిపాదన మీద చాలామంది రియాక్టు అయ్యారు ]

1 విశ్వనాథ సత్యనారాయణ మొదలయిన కొందరు అధునిక కవుల కవితారీతులను, కావ్యాలను వాటి వైలక్షణ్యాన్నిబట్టి నవ్యసంప్రదాయ సాహిత్యమన్న పేరుతో గుర్తిస్తే ఆ సంప్రదాయం యొక్క మంచిచెడ్డలను అధ్యయనం చెయ్యటానికి ఎక్కువ వసతిగా వుంటుందనే గానీ - ఈ పేరుమీద విశ్వనాథకు గానీ, మరొకరికిగానీ మనమేదో ఒక కోట నిర్మించి వారిని సురక్షితంగా కాపాడాలన్న ఉద్దేశ్యమేమీ లేదు విశ్వనాథను మనం రక్షించవలసిన పనిలేదు ఆ మాటకువస్తే ఏ కవినీ ఏ రచయితనూ మనం రక్షించనక్కరలేదు ఆ ఫలానా కవి కావ్యం మననేమైనా రక్షిస్తుందా అన్న విషయాన్ని తేల్చుకోటానికే దాన్ని అధ్యయనానికి స్వీకరిస్తాం అలాంటప్పుడు ఆ సాహిత్యం యొక్క సాధారణ లక్షణాన్ని గుర్తించి, దాన్ని ఫలానా అని పదిమందికీ చెప్పి అధ్యయనానికి ప్రారంభిస్తే దానివల్ల అధ్యయన ప్రయోజనాన్ని సలక్షణంగా పొందటానికి వీలవుతుంది ఆ ఫలితం ప్రయోజనవంతంగా కనిపిస్తే నవ్య సంప్రదాయ సాహిత్య ప్రగతిశీలం కలదేనంటాం లేకపోతే అది ప్రగతినిరోధకశీలం కలది - దాని స్వరూపస్వభావాలు ఫలానా ఫలానా ప్రకటిస్తాం

2 అవును, నవ్య సంప్రదాయమనే బదులు 'సంప్రదాయవాద'మని కూడా అనవచ్చు నియోక్లాసికల్ ఏజిని క్లాసికల్ ఏజి అనటం వుంది అయితే మనదగ్గర ఒక ఇబ్బంది వుంది తిరుపతి వెంకటకవుల బుద్ధచరిత్రం దగ్గర నుండి మొదలుపెట్టి కల్పవృక్షాన్ని కలుపుకొంటూ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి కీర్తితోరణం దాటి నల్లదీగ శ్రీనివాసాచార్యులవారి శ్రీరాధికామనోహరీయం దాకాగల కావ్యాల నన్నింటినీ సంప్రదాయకావ్యాలనే అన్నామనుకోండి—అప్పుడు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, వావిలికొలను సుబ్బారావు, జనమంచి శేషాద్రిశర్మ మొదలయిన వాళ్ళ రచనలను ఏమనాలి? ఈ రెండు గ్రూపుల రచనలు ఒక పద్ధతివిగావు గనుక ఒక పేరుతో చెప్పటానికి కుదరదు శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారి లాంటివాళ్ళూకాక, కృష్ణశాస్త్రి వంటి భావకవులూగాక, శ్రీ శ్రీ వంటి అభ్యుదయ కవులూకాక శివసాగర్ లాంటి విప్లవకవులూ కాక భిన్నంగా వుండి విశ్వనాథ సత్యనారాయణ లాగా వెంకటశాస్త్రి గారన్నట్లు "నా మార్గంబును గాదు శిష్యుడయినన్ నా తాత ముత్తాతలం/దే మార్గంబును గాదు వానిదె దియో?—" అన్నట్లుగా ఒక విలక్షణమైన మార్గంలో వున్న కవులనూ కావ్యాలనూ గూర్చిన లక్షణ విచారణకు వీలుగా నవ్యసంప్రదాయ కవులనీ కావ్యాలనీ అంటున్నాం అదొక సంజ్ఞావాచకం - అంతకంటె ఏమికాదన్నా ఫరవాలేదు

3 నవ్యసంప్రదాయ కవులకూ రచయితలకూ రాజకీయాలు లేవా అంటే ఉన్నవని చెప్పటానికి వీలుకానట్లుగా వుంటాయి ప్రయోజనం లేకుండా ఎవరు మాత్రం ఏపనైనా ఎందుకు చేస్తారు? కొంతమంది బ్రిటీషువలస పాలనకు వ్యతిరేకంగా జాతీయోద్యమ వీరభావజాలం ప్రజల్లో ప్రచారం కావటానికి వీలుగా రచనలు చేస్తే, మరికొందరు ప్రాచీన భారతీయ మతధర్మాలూ, వేదాంత రహస్యాలూ ఆధునికులకు ఆహ్లాదకరంగా బోధించి ప్రజలను సనాతన ధర్మాసక్తులుగా చేయాలని రచనలు చేశారు వీళ్ళందరి ఉద్దేశ్యమూ కూడా, విదేశీ ఆర్థిక రాజకీయ ప్రభావాల నుండి దేశీయులను కాపాడాలన్నదొక్కటే హిందూ మత వేదాంత తత్త్వమహనీయతను కీర్తించటం ద్వారా దాన్నే దేశభక్తిగా చూపించటం కూడా జరిగింది—ఇదంతా ప్రచారమంటే ప్రచారమే రాజకీయం ప్రచార లక్షణం కలిగేవుంటుంది

4 నవ్యసంప్రదాయవాదులు కులమతాలకు వ్యతిరేకులుగారు కులమత ధర్మాలను యథావకాశంగా పాటించటాన్ని కూడా వారు ప్రబోధిస్తారు నవ్య సంప్రదాయవాదం క్లాసువాదం - మాసువాదం కాదు

5 నవ్యసంప్రదాయవాదులు కళకళకోసమే అనే వాళ్ళుకాదు ఆత్మాశ్రయ దృష్టికాక వస్త్వాశ్రయదృష్టి కలవాళ్ళు క్లాసికల్ - సంప్రదాయ - భావజాలం సాహిత్య వస్తువుగా వుండి ప్రజం హృదయాల కెక్కాలన్నది వారి దృష్టి సాహిత్యం ద్వారా ఒక నిర్దిష్టమైన భావజాలాన్ని అందించి ప్రజలను తదభిముఖంగా చైతన్యవంతులను చెయ్యాలన్న లక్ష్యం అటు నవ్య సంప్రదాయ వాదులకు ఇటు అభ్యుదయ విప్లవవాదులకూ ఉన్నందువల్లనే ఆ ఉభయ వర్గాలకూ మధ్యగల వైరుధ్య లక్షణం శత్రుస్థాయి నందుకొంటున్నట్లుగా వుంటుంది

6 అభ్యుదయ దృక్పథం లేనంత మాత్రం చేత ఒక సాహిత్య పద్ధతి అధ్యయనానికే స్వీకరించరాదనటం సమంజసం కాదనిపిస్తుంది ఎందులో ఎంత అభ్యుదయాంశ ఉన్నదీ తెలియటానికైనా అధ్యయనం అవసరమే వర్గ సమాజంలో నవ్య సంప్రదాయ సాహిత్యాభిమానులు కూడా వుంటారు నవ్య సంప్రదాయ సాహిత్యంలోని అభ్యుదయాంశము విశదీకరించి చూపించటం ద్వారా తదభిమానులను అభ్యుదయ మార్గంవైపు తిప్పుకోగలిగి వుండాలి అందుకు లోతైన అధ్యయనం అవసరం

7 నియోక్లాసిజం 19వ శతాబ్దం ఉత్తరార్ధంలోనూ 20వ శతాబ్దం లోనూ ఇటాలియన్ చిత్రకళారంగంలో ప్రవేశించింది ఇక్కడ కూడా గత కాలంలోకి చూచి చేసే అనుకరణలు ఎక్కువ క్లాసికల్ ఏజికి సంబంధించిన భావబింబాలతో సమకాలీన పెట్టుబడిదారీ నాగరికతను ఆకర్షణీయంగా ఆదర్శీకరించి చిత్రించటం కనిపిస్తుంది అవిధంగానే మన నవ్య సంప్రదాయ సాహిత్య కళారూపాలు సమాజంలోని అసమానతల అనివార్యతను ఏదో ఒక రూపంగా ఎక్కడో ఒకచోట సమర్థించటాన్ని మనం గమనించవచ్చు

8 రొమాంటిక్ రివైవలిజంవచ్చిన తరువాత నియోక్లాసికల్ పొయట్సును పక్కకునెట్టి ఛాసరు, స్పెన్సరు మొదలయిన పూర్వాంగ్ల కవులను ముందుకు తెచ్చినట్లే, మనదగ్గర కూడా అభ్యుదయ విప్లవ సాహిత్యోద్యమాలు విజయ వంతమైన తరువాత ఇప్పటి నవ్య సంప్రదాయ కవులను పక్కకునెట్టే కాలం రాదా అంటే రావటం అనివార్యమైతే రాకతప్పదు కాని మన నవ్య సంప్రదాయం ఆంగ్లంలోని నియోక్లాసిజానికి తుల్యార్థకంకాదు రొమాంటిసిజం తరువాత

వచ్చింది గనుక మన నవ్య సంప్రదాయం రొమాంటిసిజాన్ని గర్భీకరించు కొన్నది చాలవరకు రొమాంటిసిజం సువాసనలను గుబాళించే క్లాసిజం మన నవ్య సంప్రదాయం మన నవ్య సంప్రదాయ కావ్యాల వైశిష్ట్యం అదే అని నేను అనుకొంటున్నాను ముఖ్యంగా విశ్వనాథ రామాయణ కల్పవృక్షానికి ఆ రకమైన వైశిష్ట్యాన్ని కల్పించి, దాన్నొక గొప్ప నియోక్లాసికల్ ఎపిక్‌గా రూపొందించాడు దాన్ని ఆ దృక్పథంనుండి అధ్యయనం చెయ్యాలి

9 రామాయణ కల్పవృక్షం అనువాదమేగాని ఒరిజినల్ రచన కాదుకదా అంటే- అవును ఆ లెక్కన మన భారత భాగవతాలు కూడా అంతే ఒక విధంగా కవిత్రయంవారి భారతం ఆకాలానికి అది నియోక్లాసికల్ ఎపిక్కనే చెప్పాలి ఈ కాలంలో విశ్వనాథ రామాయణం విషయంలో ఆ పనే ఈ కాలానికి తగ్గట్టుగా చేశాడు దేని పరిమితులు దానికుంటాయి హోమర్నూ వర్జిల్నూ ఇంగ్లీషువాళ్ళకు అర్థం చెయ్యటానికి పోపు డ్రైడను మొదలయినవాళ్ళు ఎంత చేశారో వ్యాస వాల్మీకులను తెలుగువాళ్ళకు అర్థంచెయ్యటానికి పూర్వకాలంలో కవిత్రయమూ, ఈ కాలంలో విశ్వనాథా అంతకంటె తక్కువ ఏమీ చేయలేదు 1 మనుషులు చేస్తున్న అన్ని పనుల విషయంలోనూ అభిప్రాయభేదాలుంటాయి ఉండటమే కదా అభ్యుదయ లక్షణం 2

1 "Hang Homer and VIRGIL, Their meaning to seek A man must have pok d in the Latin and Greek, Those who Love Their own Tongue, we have Reason to hope Have read them translated by DRYDEN and POPE "

(Quoted by Tulasi Ram in the Neo-Classical Epic- page 344)

2 "POPE, however, has succeeded at many places in recapturing the dignity of the Homeric manner and by so doing has made the translation a museum of all the devices of the poetic diction which Wordsworth was to condemn in his famous preface But it made Pope's fortune and pushed him to the crest of Popularity ' V RAI - Landmarks in the History of English Literature (Vol I, P 170 )

ఇంగ్లీషు వియోక్లాసిజం అభివృద్ధి కావటానికి అక్కడవున్న పరిస్థితులు ఇక్కడ వున్నాయా? నవ్యసంప్రదాయ భావనను పెంచటానికి అవి ఆలోచించటం కూడా అవసరమే మన దేశంలో జరుగుతున్న జాతీయోద్యమభావజాల ప్రభావంలోనూ, మత సాంఘిక సంస్కరణోద్యమ ప్రభావంలోనూ, యూరపు పండితులు కీర్తిస్తున్న ప్రాచీనార్య సంస్కృతివైభవ ప్రభావంలోనూ, జాతీయ వాద చరిత్రకారుల రచనల ప్రభావంలోనూ మన నవ్యసంప్రదాయ భావనకు దోహదకారి అంశాన్ని మనం చూడగలం పందొమ్మిదవ శతాబ్ది యూరపులో - ఉదార సంస్కరణ భావంనుండి విప్లవాత్మకతను సంతరించుకొన్న ప్రగతిశీల భావజాలానికీ, పూర్వాచార పరాయణతనుండి సంప్రదాయ సంరక్షణ వ్యూహాత్మకతను సంతరించుకొన్న ప్రగతి నిరోధక భావజాలానికి - బలపడిన సంఘర్షణ ప్రభావం బహుముఖంగా ఈ శతాబ్దంలో ప్రపంచ దేశాలను అల్లకల్లోలంలో ముంచింది మనం మన నవ్యసంప్రదాయ భావనకు మూలాన్ని ఆ అంతర్జాతీయ ప్రభావంలో కూడా చూడవచ్చు పునాదిబలం మన దేశంలోది బయటివన్నీ దోహదకారులు

# నవ్య సంప్రదాయ భావన – II

విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు సాహిత్యంలో నవ్య సంప్రదాయ వాద ప్రతినిధి రచయిత నవ్య సంప్రదాయ కావ్యేతిహాసంగా రామాయణాన్ని తన అనేక విధ రచనా శిల్పకళా కుశలత్వంచేత పునర్నిర్మాణం చేసిన కారణంగా ఆయనకా ప్రతినిధి రచయిత హోదా వచ్చింది మన ఆధునికాంధ్ర సాహిత్యం నవ్య సంప్రదాయవాదంగానే మొదలయింది ఆ విధంగానే అభివృద్ధి అయింది నవ్య సంప్రదాయ ధోరణి ననుసరించిన మన కవులూ రచయితలూ అందరిలోనూ అసలు నవ్య సంప్రదాయమంటే ఏమిటో, దాన్నెందు కనుసరించాలో, ఆ వాదాన్ని ఎందుకు ప్రచారంలో పెట్టాలో - ఇవన్నీ తెలిసీ తెలిసీ సాహిత్యాన్ని విచిత్రంగా రచించి పెట్టింది ఒక్క విశ్వనాథ సత్యనారాయణగారే

నవ్య సంప్రదాయమంటే - మన మిప్పుడు సంప్రదాయం అనుకొంటున్న సాంస్కృతిక ఆలోచన ఆచరణ విధానాలు - రెండూ ఏ సమాజికాభివృద్ధి దశలో రూపొందాయో, ఆ దశ దాటి చాలా ముందుకు వచ్చిన తరువాత - ఒక విధంగా కొత్త ఆర్థిక రాజకీయ సామాజిక సంబంధాల ఒత్తిడిలో - కొత్త భావాలు పొటమరిస్తున్న కాలంలో- వాటిని సాంస్కృతిక కళారూపాలుగా మలిచి ప్రజలను కొత్త చైతన్యంతో నింపటానికి తగిన స్వతంత్రమైన నిర్మాణ శక్తి లేనప్పుడు కళాకారులు అనివార్యంగా సంప్రదాయ కళారూప నిర్మాణ లక్షణం వైపు మళ్ళుతారు ఆ విధంగా పుట్టిన ఆలోచన - ఆచరణ విధానాల మొత్తానికి నవ్య సంప్రదాయమని పేరు కాస్త సూక్ష్మంగా మరొక మాటలో చెప్పాలంటే - నవ్య సమాజం యొక్క సాంస్కృతిక అవసరాలను పాత సమాజం యొక్క సాంస్కృతిక కళావిషయాల ప్రాతిపదిక మీద తీర్చటానికి సిద్ధం కావటమే నవ్యసంప్రదాయం నవ్య సమాజానికి - పురాణ సమాజానికీ తేడా వున్నప్పుడు ఆయా సామాజిక చింతనా విధానాల ప్రతిఫలనాలయిన కళారూపాలు - వాటి తత్వాలు భిన్నంగా వుంటాయి కదా! అందువల్ల కొత్త అవసరానికి పాత పని

ముట్టు తగిపుండకపోవటాన్ని కప్పిపుచ్చుతూ వచ్చిన నవ్య సంప్రదాయ సిద్ధాంతం సాంస్కృతిక కళాతత్వం సార్వజనీకము, సార్వకాలికము అనే సిద్ధాంతాన్ని తోడు చేసుకొని వ్యాప్తిలోకి వచ్చింది

నియోక్లాసిజమ్ అనే మాటను మనస్సులో పెట్టుకొని నవ్య సంప్రదాయ వాదమని మన మంటున్నాం మన సాహిత్యశాస్త్రంలో ఆ మాట అంత రూఢంగా లేదు మనమిప్పుడు నవ్య సంప్రదాయవాద కవులుగా రచయితలుగా ఎవరిని చెప్పబోతున్నామో వారందరినీ సంప్రదాయ కవులనీ వారి రచనలను సంప్రదాయ రచనలనీ రూఢంగా లోకం అనుకొంటూ వున్నది దేశ కాలాలచేతనూ ఆర్థిక రాజకీయ సాంఘిక ప్రభావాలకు లోనవుతూ వున్న మత తత్వ భావాలచేతనూ ఆధునికులయిన రచయితలను వాళ్ళు సంప్రదాయ సాహిత్య కళా తత్వ ప్రమాణాలను అవలంబించి రచనలు చేస్తూవుంటే అటు పూర్తిగా సంప్రదాయ రచయితలనిగానీ ఇటు పూర్తిగా ఆధునిక రచయితలనిగానీ చెప్పటానికి కుదరక ఇంగ్లీషులో ప్రసిద్ధంగా వున్న నియో క్లాసిసిజమ్ అనే మాటను పట్టుకొని దాన్ని బట్టి అలాంటి వాళ్ళను నవ్య సంప్రదాయవాదులనటం కొందరు మొదలుపెట్టారు ఎవరు మొట్టమొదట ఆ మాట ఎవరిని గురించి ఎక్కడ అన్నారో సరిగ్గా ఆచూకీ చెప్పటం కష్టంగా వుంది

నియోక్లాసిజమ్ అంటే పరిణామక్రమంలో వచ్చిన కొత్త పరిస్థితులను లెక్కలోకి తీసుకోకుండా పాత ప్రమాణాలను మన్నిస్తూ తదనుగుణంగా అన్ని జీవిత రంగాల్లోనూ ప్రవర్తించటమే గొప్ప అన్న భావ తీవ్రత అన్నమాట నియో అంటే కొత్త అంతవరకూ నిజమే క్లాసిజమ్ అంటే సంప్రదాయం అంటున్నాం ట్రెడిషన్ అన్నా సంప్రదాయమనే అంటున్నాం ఇదే మనకు వచ్చిన చిక్కు రెండూ ఒకటి కాదు అయినా ప్రస్తుతానికి నియో క్లాసిసిజమ్ అంటే నవ్య సంప్రదాయం అనుకొందాం

ఇంగ్లీషు సాహిత్యంలో ఈ నియోక్లాసిజమ్ అనే ధోరణి రూపొందటానికి రెండు కారణాలు కనిపిస్తున్నాయి ఒకటి బాహ్యము రెండవది ఆభ్యంతరము ఆభ్యంతరమే బలమైంది మొదటిదీ కూడా రెండవది ఎంత బలవంతమైనదైనా అది రెండవది మాత్రమే ఇంగ్లీషు సాహిత్యంలో 17 వ శతాబ్దం ఉత్తరార్ధానికి

మెటాఫిజికల్ పోయట్సు అగబడే వాళ్ళ అన్యాయపు యొక్క అతిశయోక్తుల తోనూ, అనూహ్యములయిన, అసంబద్ధములయిన ఉపమానోపమేయ కల్పనల తోనూ, ఉత్ప్రేక్షలతోనూ ఒక గందరగోళం ఏర్పడింది సాహిత్య పాఠకుల లోనూ సృజన కళాకారులలోనూ ఆ గందరగోళం భరించలేని స్థితి ఏర్పడింది కవిత్వాన్ని ఆ దుస్థితి నుండి తప్పించటానికి దాన్ని సలక్షణమైన మార్గంలో పునర్నిర్మాణం చెయ్యవలసిన అవసరం ఏర్పడి ఎలా చెయ్యటమా అని ఆలోచి స్తున్న సమయంలో రెండవ చార్లెసు ఫ్రాన్సు నుండి తిరిగి వచ్చాడు ఆయనా, ఆయనతోపాటు తిరిగి వచ్చిన ఆయన అంతరంగికులు ఇంగ్లాండులో ఫ్రెంచి సంస్కృతి పట్లా, ఫ్రెంచి భాషా సాహిత్య కళారంగాల్లో అవలంబింపబడు తున్న ఉన్నత ప్రమాణాల పట్లా గౌరవాభిమానాలను పెంపొందించసాగారు ఈ ఫ్రెంచి భాషా సాహిత్య కళా సూత్రాల సమున్నత స్థాయి గురించిన విజ్ఞాన ప్రభావం ఇంగ్లీషు భాషా సాహిత్య కళారంగాల్లో మంచి కదలికను కలిగించింది మెటాఫిజికల్సు ప్రభావాన్ని తిప్పికొట్టటానికి చూస్తున్న ఇంగ్లీషు సాహిత్య వేత్తలకు ఫ్రెంచి సాహిత్య స్థాయి యొక్క సమున్నతి మంచి ప్రేరణనిచ్చింది ఆ విధంగా బాహ్యాంతర కారణాలు రెండూ కలియటం చేత నియో క్లాసిజమ్ అనే సాహిత్య ధోరణి రూపొందింది ఇందుకు తోడ్పడిన మరొక కారణం కూడా వుంది అది అప్పటి శాస్త్రీయ పరిశోధనలవల్ల ప్రాప్తించిన కొత్త విజ్ఞానం కార ణంగా ఏర్పడ్డ హేతువాద ప్రాపంచిక దృక్పథము ఒక పద్ధతినీ - ప్రమా ణాన్నీ - స్పష్టతనూ ఉచితానుచిత వివేకాన్నీ ప్రతి విషయంలోనూ అవలం బించి పనిచేయమన్న హేతువాద ఆలోచనా విధానం (రేషనలిజం) ప్రభావం కూడా నియో క్లాసిజమ్ ఆ సమయంలో రూపొందటానికి దోహదం చేసింది

నియో క్లాసిజమ్ యొక్క సాధారణ లక్షణాల్లో ప్రధానమైంది ప్రకృతిని అనుసరించటం ఏ విషయంలోనూ అతిగా పోకుండా వుండటం కొన్ని పద్ధతు లకు లోబడి పనులు చేస్తూ వుండటం- అయితే, ఆ పద్ధతులు ఏమిటి? అవి ఎక్కడ వున్నాయి? అంటే అవి ప్రాచీనమైనవి ప్రాచీన ప్రామాణిక శాస్త్ర గ్రంథాలలోనూ, పురాణేతిహాసాలలోనూ, మహాకావ్యాలలోనూ ఉన్నవి ఆ విధ మైన ప్రాచీన సాహిత్య సాంస్కృతిక వారసత్వ సంపదే మన ప్రకృతి ఆ ప్రకృతినే అనుసరించాలి మనం దేశకాలాలు మారిపోయినవి కదా అని ప్రాచీన సాంస్కృతిక కళా మర్యాదలు మారిపోవు ఏ విషయంలో నైనా సంప్ర

దాయాన్ని అంటే పురాతనత్వాన్ని శిరసావహించి పోరాటాన్ని ప్రబోధించటాన్నే నియో క్లాసిజమ్ అంటారు

క్లాసిక్సు అవి ఎందుకు క్లాసిక్సు అయినాయి? ఒక పద్ధతినీ - ఒక సంప్రదాయాన్నీ - ఒక తాత్విక దృక్పథాన్నీ అనుస్యూతంగా ముందు తరాలకు అందించటానికి వ్రాయబడ్డాయి గనుక మనం కూడా మహాకావ్యాలను అలాగే వ్రాయాలి ఆ సాహిత్య శాస్త్ర మర్యాదలను పాటిస్తూ సమున్నతంగా భాషా పాటవాన్ని చూపిస్తూ వ్రాయాలి కావ్య ప్రయోజనాల గురించి - నిర్మాణం గురించి - కావ్యతత్వం గురించి ప్రాచీనాలంకారికుల విచారణ మార్గాలను సమన్వయించుకుంటూ అవలంబించాలి ఈ విధానం సాహిత్య సృజనకూ విమర్శనకూ కూడా ప్రమాణంగా వుంటుంది

ఈ విధంగా ప్రారంభించటం చేత నియో క్లాసిజమ్ కాలంలో అరిస్టాటిలు బాగా ముందుకు వచ్చాడు ఎంత బాగా ముందుకు వచ్చాడంటే- దేశ కాల క్రియా శీల రూపమైన ఐక్యత్రయాన్ని పాటించనందుకు షేక్స్పియరును, అతని నాటకాలతో సహా విసిరి అవతల పారేయటానికి సంకల్పించిన వాళ్ళను ముందుండి ఆయన నడిపించాడు షేక్స్పియరును ఛాసరుతో సహా కట్టకట్టి నెట్టి అవతల పారేయగలంతవాళ్ళమయ్యాం గదా అని నియో క్లాసిజం వాదులు బాగా తల యెత్తుకొని తిరిగారు అందువల్లనే వాళ్ళకు ఎంతో దూరాన వున్న గతకాలం కరతలామలకంగా కనిపించింది సార్వకాలికమూ సార్వజనీనము అయిన విషయాలను మాత్రమే మన పూర్వీకులు చెప్పారు, మనమూ అలాగే చెప్పాలి అన్నది ఒక సిద్ధాంతం అయితే, మనకలాంటి విషయాలు కొత్తగా ఎక్కడ దొరుకుతాయి అంటే- దొరక్కపోతే పాతవాటినే మళ్ళీ చెప్పండి అంతకంటే బాగా చెప్పండి నీవు ఎలా చెప్పగలిగావన్నదే సాహిత్యానికి ముఖ్యం నీవేమి చెప్పావన్నది కాదు - ఇదొక నియో సూత్రం FORMALISM అంటే ఇదే నిర్మాణ శిల్పమన్నా ఇదే రాముని వలె ఆచరింపుము - రావణునివలె ఆచరింపకుము అన్న ప్రాచీన సాహిత్య ప్రబోధ ప్రయోజన సిద్ధాంతం కూడా నియో క్లాసిజమ్‌లో ఒక ప్రధాన సూత్రంగా ముందుకు తేబడింది

ప్రక్రియాపర విమర్శ అని మనమిప్పుడంటున్నామే అది నియో క్లాసిజం సాహిత్య దర్శనంలో బయటపడిందే సాహిత్య భాషాశైలిని గురించిన ఆలోచనల్లో

గద్య శైలికీ, పద్య శైలికీ సామ్యం వుండకపోవటమే కాకుండా రకరకాల సాహిత్య ప్రక్రియా రూపాల విషయంలో కుడా ఎక్కడికక్కడ శైలి భేదిస్తూ వుంటుందని వాళ్ళభిప్రాయపడ్డారు కవిత్వం - కావ్యం అంటే అది తప్పని సరిగా ప్రాచీన ఛందోమర్యాదలకు ఒదిగి వుండాలన్నది వాళ్ళ చూపు

ఈ నియో క్లాసిజమ్ అనే సాహిత్య కళాధోరణిని అవలంబించి దాని పక్షం వహించి దాని సార్థకతను నిరూపించటమే సాహిత్య జీవిత లక్ష్యంగా బ్రతికిన ఆంగ్ల సాహిత్య విమర్శక పరిశోధన పండిత కవీశ్వరుడు - ఒక్క మాటలో చెప్పాలంటే సాహిత్య నియంత - శామ్యూల్ జాన్సను (1709 1784) ఆయన భాషా సాహిత్య ఆలోచనా ధోరణి నియో క్లాసిజమ్‌ను కూడా మించి పోయినదన్న ఉద్దేశంతో చరిత్ర కారులు Doetinal Classicism పరమ సంప్రదాయ వాదం అంటారు ఆయన ప్రాచీన సంప్రదాయాసక్తి అభిమానం ఎంతటిదంటే కొత్తగా వచ్చే మార్పులన్నింటి మీదా ఆయనకు అసహ్యమే అయితే,సంప్రదాయ విజ్ఞానం లోతుపాతుల విషయంలో ఆయనకున్న పాండిత్యం, విషయాన్ని ప్రతిపాదించటంలో ఆయనకున్న నేర్పు, భాషమీద ఆయనకున్న అధికారం ఆయన మహనీయ వ్యక్తిత్వానికి దోహదం చేశాయి మార్పును సహించి కొత్తను ఆహ్వానించక పోవటమన్నది చాలా అల్ప విషయంగా తేలి పోయింది అందువల్ల ఆది పద్దెనిమిదవ శతాబ్దం కావటం వల్ల ఆంగ్ల భాషా సాహిత్య సామ్రాజ్య భాగంలో ఆయన నియంతృత్వం సాగింది

నియో క్లాసిజమ్ గురించి ఇంత చెప్పి, దాన్నే మనం నవ్య సంప్రదాయం అంటున్నామంటే - ఇక తెలుగులో నవ్య సంప్రదాయవాద సాహిత్య స్థాపనాచార్యుడు ఫలానా అని చెప్పకుండానే మీకు తెలుస్తున్నది

కవి ప్రతిభలోనను౦డును కావ్యగతశ
తాంశములలోన తొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతమున రసము వేయి
రెట్లు గొప్పది నవకథా దృతినిమించి

ఇది మన తెలుగు నవ్య సంప్రదాయ వాద సాహిత్య తత్వ సిద్ధాంతం ఇంగ్లీషులో జాన్సను ఎంత ఈ సిద్ధాంతానికి చేసి పోయినాడో, తెలుగులో ఈ సిద్ధాంతానికి అంతకంటే వేయిరెట్లు ఎక్కువ చేసి పోయినాడు విశ్వనాథ సత్యనారాయణ

## II

నవ్య సంప్రదాయం - నియో క్లాసిజమ్ - అనేది సాహిత్య కళారంగాల్లో 19 వ శతాబ్దం ఉత్తరార్ధంలో బయలుదేరిన ఒక ఆలోచనాధోరణి ముఖ్యంగా పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను బలపరచటానికీ దాన్నొక ఆదర్శ వ్యవస్థగా చూపించటానికి అందులోని వైరుధ్యాలను యుక్తియుక్తంగా కప్పిపుచ్చటానికి తోడ్పడుతూ ప్రవర్తించిన ప్రాచీన సంప్రదాయ వస్తు రచనా విధానం అది ఇటలీ, జర్మనీ మొదలయిన దేశాల్లో నియో క్లాసికల్ రచనాధోరణి అలా వుంటే మనకు ముఖ్యంగా మన తెలుగు సాహిత్యంలో ఇరవయ్యో శతాబ్దం ద్వితీయ పాదంనుండి నవ్య సంప్రదాయ ధోరణి బలమైన రూపాన్ని తీసుకొంది

నియో క్లాసిజం సమకాలీన సమాజాన్ని, జీవితాన్ని పట్టించుకోదు పట్టించుకొన్న దాన్ని వాస్తవంగా చూపించదు అస్తవ్యస్తంగా చూపించటంద్వారా గతకాల వైభవాన్ని స్థాపించాలని చూస్తుంది వర్తమాన పరిణామాలను సుముఖంగా స్వీకరించకపోవడం నియో క్లాసిజమ్ లక్షణం మన నియో క్లాసిజమ్ మన జాతీయోద్యమ స్ఫూర్తిని పురాణ వైభవంగా చేసిపెట్టటానికి ఉపయోగపడింది జాతీయోద్యమాన్ని మతతత్త్వ స్ఫూర్తితో నింపటానికి ఉపయోగపడింది జర్మనీలో ఈ నవ్య సంప్రదాయవాదం ఫాసిస్టు నియంతృత్వ ధోరణులను ఆదర్శవంతంగా చూపించే ప్రభుత్వ కళాధోరణిగా చెలామణి అయింది

నవ్యసంప్రదాయ భావన - మన ఆధునిక సాహిత్యానికి సంబంధించిందే ఆధునిక యుగమంటే మనందరికీ అర్థమవుతూనే వుంటుంది దాన్ని అలాగే వుంచుదాం విదేశీ సామ్రాజ్యవాదుల పాలనవల్ల తమ ఆర్థిక రాజకీయ రూపమైన ఉమ్మడి ప్రయోజనాలు ఈడేరకపోవటాన్ని గమనించిన దేశీయులు తామొక సంఘటిత శక్తిగా పాలకులను ఎదుర్కోవలసి వచ్చిన క్రమంలో ఉమ్మడి ప్రయోజనాల పునాదికి ఉపరితల సాంస్కృతిక భావనగా జాతీయత ముందుకు వచ్చింది ఆ విధంగా మన భారత జాతీయ భావన ఆధునికమైంది అందువల్లనే మనం ఆధునిక యుగంలోకి రాగలిగాం ఏ పునాది మీద జాతీయ భావన ఏర్పడిందో - దానిని, ఆ పునాదిని బలపరచటానికి - ఆ చైతన్యాన్ని ఆ విధంగా ప్రజానీకంలో ప్రేరేపించటానికి సాంస్కృతిక రంగం నుండి పని చేసే మన సాహిత్య కళాకారులు నూతన ఆర్థిక రాజకీయ సామాజిక లౌకిక తాత్త్విక

జాతీయదృక్పథాన్ని అవలంబించటానికి బదులుగా సంప్రదాయంగా పరిచయమై వస్తున్న ప్రాచీన మతతత్వ జాతీయ దృక్పథాన్ని అవలంబించారు సాహిత్య కళారంగంలో ఈ దృక్పథం పెంపొందటానికి మన తొలి జాతీయోద్యమ నాయకత్వం చాలా దోహదం చేసింది

మతతత్వ జాతీయ దృక్పథమే మన సాంస్కృతిక సాహిత్యరంగాల్లో నవ్యసంప్రదాయం రూపొందటానికి కారణం మన తెలుగు సాహిత్యంలో ఈ నవ్య సంప్రదాయాన్ని ప్రారంభించింది రాయప్రోలు సుబ్బారావు పెంచి పెద్ద చేసింది విశ్వనాథ సత్యనారాయణ సత్యనారాయణగారు చేసిన దాని వల్ల నవ్య సంప్రదాయమనే మాటలో నవ్యత్వం పూర్తిగా ఎగిరిపోయి, ఒట్టి సంప్రదాయం మిగిలింది సత్యనారాయణగారొక మాట చెప్పారు- "ఒక జాతి జాతీయతకు సంప్రదాయమ్ము పునాది" - అని అది చాలా కీలకమైన మాట జాతి అంటే ఏమిటి? మనుషులు గుంపులు గుంపులుగా, తెగలు తెగలుగా, సొంత ఆస్తిపాస్తులతో ఒక కొంత ప్రాంతాన్ని ఆక్రమించుకొని బ్రతుకుతూ, క్రమంగా తమలో తమకు ఆర్థిక మానసిక సంబంధాలు పటిష్టం కావడంతో గుంపులూ తెగలుగా ప్రాంతీయ సమాజంగా వున్న తరువాత ఒక జాతిగా రూపుకట్టుకొంటారు ఈ రూపుగట్టుకొనే దశలో ఆయా తెగల భాషా వ్యావహారమంతా కలిసి ఒక జాతీయభాషగా అభివృద్ధి అవుతుంది ఆ విధంగా ఒక జాతికి ముందొక భాష ఒక రకమైన మానవ సంబంధాలూ అభివృద్ధి అవుతాయి ఇవి అభివృద్ధి అవుతున్నకొద్దీ జాతి జాతీయత అభివృద్ధి అవుతుంది ఒక జాతి జాతీయతలోని అంశాలుగా దాని జీవితవిధానం - ఉత్పత్తివిధానాలూ, సంబంధాలూ, ఆచార వ్యవహారాలూ - పండుగలూ పబ్బాలూ మతతాత్విక విషయాలూ విశ్వాసాలూ ఈ మొదలయిన సంప్రదాయ రూపమైన లక్షణాలు కొన్ని వుంటాయి ప్రతి జాతికీ ఈ లక్షణాలు వాటి వాటి ప్రత్యేకతలతో వుంటాయి

సత్యనారాయణగారి జాతీయ దృకథమన్నప్పుడు ఈ పైన చెప్పిన అంశాలన్నీ దృష్టిలో వుంచుకోవలసినదే ఇక అసలు కల్పవృక్షంలో పూర్వమే కృతి మొదలు పెట్టబోతూ—

"ఈవృశంబుగ మహాకావ్యరచనా ప్రసూన నవబంభ
రాయమాణ చిత్తుండనై సర్వధర్మమూల బీజంబుగా
అవిచ్ఛిన్న సంప్రదాయార్థినై —" అని రచన ప్రారంభించిన విశ్వనాథ జాతి జాతీయతకు పునాది అయిన సంప్రదాయాన్నే సర్వధర్మమూల బీజంగా సంభావించినాడన్నది స్పష్టమే కదా!

సంప్రదాయం నిలబడాలన్నది విశ్వనాథ సత్యనారాయణగారికున్న గట్టి ఆకాంక్ష. సంప్రదాయం పోవటం వలన దేశమంతా కలుషితమయిపోతున్నదని ఆయన బాధ. ఆ కాలుష్యాన్ని తొలగద్రోయటానికి ఆయన రామాయణ కల్ప వృక్షం రచించాడు.

"కలిలో దైవము లేఁడు భూసురులనంగా ద్వేషమైపోయె నీ
తెలుఁగున్నాట పఱీ విచిత్రమయి పొందెన్ బూని ముక్త్యాలతే
డులు బద్ధాదరులైరి నాఁడు మఱి నేఁడున్ సంప్రదాయంపుఁబో
కలకున్ వారికి విన్చి రామకథ యీ కాలుష్యముం ద్రోఁచెదన్"
—(అవతారిక)

## 1. కలిలో దైవము లేదు :

పందొమ్మిదో శతాబ్దం చివరకు భగవంతుడు చచ్చిపోయినాడన్న ఒక పెద్దకేక ప్రపంచమంతా ప్రతిధ్వనించింది. అసలు నిజంగా భగవంతుడు చచ్చి పోవటమంటే ఏమిటో, అది ఎట్లా జరుగుతుందో ఆ అనుక్రమాన్ని భారతీయు లయిన తెలుగు ప్రజల జాతీయ జీవనాధారమైన భూమి మీద వేయిపడగలుగా విశ్వనాథ సత్యనారాయణ ప్రదర్శించాడు. ఆ ప్రదర్శనలో "దేవుడే చనిపోయి నాడు" (పుట 1025) కానీ సృష్టి ఆగలేదు. స్త్రీ పురుష మిథునం వుండనే వున్నది. అంటే భావవాద ధోరణికి అభావ స్థితి ఏర్పడింది. దాన్ని తన ప్రాగ భావంగా చేసుకొని జాతీయ భౌతిక శక్తిగా స్త్రీ పురుష మిథునం ఉనికిలోనికి వచ్చింది. ప్రకృతి శక్తుల మీద తన అధిపత్యాన్ని స్థాపించుకోలేని ప్రాథమిక దశలోని మనిషి తన అనుభవానికి పురుష రూపాన్ని కల్పించాడు. ఈ పురుష భావమే సాంఖ్యాన్ని ఈశ్వర సాంఖ్యంగా తరువాతి కాలంలో చేయకలిగింది

ఆ క్రమంలోనే సృష్టికి కారణంగా దైవ భావం నెలకొన్నది భారతీయ మత తాత్విక విచారణా ధోరణులకది అనుకూలంగానే వుందని చెప్పాలి

అయినా, కొందరు తాత్వికులు భౌతిక సత్యమైన ప్రకృతికి అతీతంగా పురుషుని ఉనికిని అంగీకరించని వారున్నారు భావనా మాత్ర సత్త కలిగిన పురుషుడే ప్రకృతికంటె శక్తిమంతుడై సృష్టికారకుడవుతున్నాడన్న వైషయిక భావ వాదాన్ని అనుభవంలో నిరూపించటానికిగాను శంకరులాత్మా శ్రయంచేసి అద్వైతంగా ప్రతిపాదించారు సిద్ధాంతం ఆత్మభావవాదమే అయినా అద్వైతులది ఆచరణలో వైషయిక భావవాదమే అందువల్ల దైవాన్ని అవునని ఆర్భాటం చెయ్యకపోయినా కాదని గందరగోళం చెయ్యరు అద్వైతం విశ్వనాథ సత్యనారాయణ అద్వైతి అందువల్ల ఆయనకు దైవమున్నాడు ఉన్న దైవం లేకుండా పోతూ వుండటం ఆయన తన చుట్టు పక్కల ప్రపంచంలో చూచాడు ముఖ్యంగా తన జాతిలో చూచాడు ఆధునిక శాస్త్రీయ పరిశోధనల వల్ల రహస్యాలను ఛేదించి ప్రకృతిని స్వాధీనంలోనికి తెచ్చుకొంటున్నకొద్దీ మనిషికి ప్రకృతికీ తనకూ అతీతంగా ఒక దైవముయొక్క ఉనికిని అనవసరంగా ఎందుకు భావించుకొంటూ ఉండాలనిపించటం మొదలయింది ఇందువల్ల ప్రపంచ వాతావరణం ఇంతకు మునుపటి కంటె భిన్నంగా తయారయింది దైవభావాన్ని చుట్టుకొని వున్న మత తాత్విక సంస్థలతో తమ భౌతిక జీవితం ముడిపడివున్న వర్గాలకు ఆ విధంగా వాతావరణంలో వచ్చిన మార్పు అనుకూలంగా వుండదు గనుక లేదు ఫ్యూడల్ రాచరిక వ్యవస్థ తన ఉనికి యొక్క భద్రతకు దైవ భావాన్నీ మత తాత్విక సంస్థలనూ పోషించింది ఆ సంస్థలవల్ల బ్రతికేవాళ్లు వాటిని పోషించే ఫ్యూడల్ వ్యవస్థను సమర్థిస్తారు

ఫ్యూడల్ వ్యవస్థ పోవాలంటే దాన్ని సమర్థించేవాళ్లు లేకుండా వుండేటట్లు చూచుకోవాలి ఆలా వాళ్ళను లేకుండా చెయ్యాలంటే వాళ్ళ సుఖ జీవనానికి మూలమైన సంస్థలను శిథిలం చెయ్యాలి అలాంటి శైథిల్యానికి దోహదం చేస్తూ శాస్త్రీయ విజ్ఞానం అభివృద్ధి కావటాన్ని ఫ్యూడల్ వ్యవస్థను నిర్మూలించటానికి నడుంకట్టిన బూర్జువాలవయోగించుకొన్నారు ప్రపంచంలో జరుగుతున్న ఈ క్రొత్త పరిణామ ఫలితాలు అంతగా కాకపోయినా కొంతగానైనా భారతదేశంలోనూ తమ ప్రభావాన్ని ప్రసరింప జేశాయి దైవం లేకుండా పోవడ

మంటే ఫ్యూడల్ వ్యవస్థ నశించి పోవడం దానికి కారణం దేశాన్ని విదేశీయులు పరిపాలించటం విజాతీయమైన సంస్కృతి ముంచుకొని రావటం వల్ల జాతీయ సంస్కృతి నాశనమై పోవటమే దేవుడే చనిపోవటం లాంటిదైంది దేవుడు - ఫ్యూడల్ వ్యవస్థ - సంస్కృతి - ఈ మూడింటిని ఒకటిగా భావించిన విశ్వనాథ వాటి అభావాన్ని సలక్షణంగా ప్రదర్శించాడు వేయిపడగల్లో. రాముడిని దైవమని చెప్పి నిలపటానికి రామాయణ కల్పవృక్షం వ్రాసినాడు

## 2. బ్రాహ్మణులనంగా ద్వేషమైపోయె .

బ్రిటిషు పాలన వల్లా - పారిశ్రామికీకరణం వల్లా - ఆంగ్లవిద్యా ప్రచారం వల్లా దేశీయమైన ఉత్పత్తి సంబధాలలో మార్పులు రాకుండానే, సంస్కరణోద్యమాలు కొనసాగుతూ ప్రతిచోటా కులతత్వాన్ని, వీలయిన చోట మత తత్వాన్ని సామాజిక చైతన్యంగా ప్రదర్శించాయి ముఖ్యంగా భారత జాతీయోద్యమంలో హిందూ మహమ్మదీయ మత తత్వాలు ఎలా పని చేశాయో హిందువులలో అంతర్గతంగా కులతత్వం అంతకంటే ఎక్కువగానే పనిచేసింది అసలీతత్వాలు అభివృద్ధి కావటానికి కారణం జాతీయోద్యమం భారతీయుల్లో జాతీయ చైతన్యాన్ని కలిగించవలసినంతగా కలిగించలేక పోయింది జాతీయ దృక్పథంలేని నాయకత్వం కుల మతాల పేరు మీద ప్రజానీకాన్ని కూడగట్టుకోటానికి ప్రయత్నించింది ఆ విధంగా ప్రజల్లో రాజకీయ ప్రయోజనాలకై కుల మత చైతన్యం ముందుకు వచ్చింది ఇతర ప్రాంతాలలో లాగానే తెలుగు దేశంలో కూడా కుల తత్వం రాజకీయాలు బ్రాహ్మణ కుల వ్యతిరేకతను ప్రదర్శించాయి ఇక్కడ బ్రాహ్మణ కుల వ్యతిరేకత అంటే దాని అధిక్యాన్ని అధికారాన్నీ త్రోసిరాజనటం అది "ఈ తెలుగున్నాట మరీ విచిత్రమయి పొందెన్ "

## 3. ముక్త్యాల రేడులు బద్ధాదరులైరి నాడు మరినేడున్:

ముక్త్యాల రేడు- భూస్వామి ఫ్యూడల్ రాచరికాలే కదా దైవ భావాన్నీ మత తాత్విక సంస్థలనూ కాపాడింది వెనుకటి ఫ్యూడల్ రాచరికాల కొన మెరుపు ముక్త్యాల జమీందారు అయన ఇప్పుడూ ఆ సంస్థలను యథాశక్తి కాపాడాలని ఈ కవిని పోషిస్తున్నాడు తన బ్రతుకు తెరువు తాను చూచుకొంటున్నా, తన పుస్తకం ముద్రణ వ్యయాన్ని ఇస్తానసటం చేత తన నాయన

పోషిస్తున్నట్లు భావించి రచయితగా విశ్వనాథ తృప్తిపడుతున్నాడు తానా విధంగా వృప్తిపడటం ఆ ప్రభువుకు రామకథ వినిపించటం- ఇదంతా జాతీయ సంప్రదాయాన్ని నిలబెట్టటంగా భావిస్తున్నాడు

## 4. ఈ కాలుష్యముం ద్రోచెదన్ :

దైవభావం ఉనికిని కోల్పోవటం- మతతాత్త్విక సంస్థల మూలస్తంభాలయిన బ్రాహ్మణుల విషయంలో వ్యతిరేకత ప్రబలటం - ఈ విధంగా దేశంలోని సాంస్కృతిక వాతావరణం కలుషితమైంది అయితే, ఈ కాలుష్యాన్ని యథా శక్తిగా భూస్వామ్య వ్యవస్థకు గుర్తుగా మిగిలివున్న ముక్త్యాల జమీందారుకు రామకథను వినిపించటంగా ఆయన అండకు చేరి వైదిక ధర్మాన్ని కీర్తించటం ద్వారా పోగొట్టటానికి రచయిత తన నిశ్చయాన్ని ప్రకటించాడు

# వాల్మీకి రామాయణము

రామాయణమంతా సీతాయాశ్చరితం మహత్తని వాల్మీకే చెప్పినాడు ఆ సత్యాన్నే ప్రపంచించి తాను స్థాపించటానికి విశ్వనాథ కల్పవృక్షం వ్రాశాడు. తన రామాయణ రచనకు లక్ష్యం అదేనని విశ్వనాథ స్వయంగా చెప్పకొన్నాడు కూడా మన మాలోచించవలసింది తాను వ్రాస్తున్న రామాయణం సీతాయశ్చరితం మహత్తని వాల్మీకి అనుకొన్నవాడు రామాయణమనటానికి బదులు సీతాచరిత్ర అని అంటే సరిపొయ్యేది కదా - ఎందుకనలేదూ అని ఎందుకనలేదంటే రామకథతో పాటు సీతకథ వుందని చెప్పటమే ఆయన ఉద్దేశ్యం సీతకథతో రామకథ వుందని చెప్పటం వాల్మీకి ఉద్దేశ్యం కాదు అంటే - కథలో పురుష స్వామ్యమేగానీ, స్త్రీ స్వామ్యం లేదన్నమాట స్త్రీ సామ్యవాదులు సమాజంలో అసలు లేకపోలేదు మాతృస్వామ్యం పోయి పితృస్వామ్యం ఏర్పడిన సమాజంలో మాతృస్వామ్యవాద దృక్పథం కలిగినవాళ్ళ సంతృప్తికి పునాది వ్యవస్థకు వ్యతిరేకంగా ఉపరితల సాంస్కృతిక మత తాత్వికరంగంలో స్త్రీ స్వామాన్ని ప్రతిష్ఠించడం జరిగింది శాక్తేయం యొక్క ఆవిర్భావం అలా అయింది, అయివుంటుంది దాని ఆ ఆవిర్భావాన్ని మార్కండేయ పురాణం వర్ణించింది యోగనిద్రగా శ్రీమహావిష్ణువు నాశ్రయించియున్న తేజశ్శక్తి మహిషాసుర భయంవల్ల శరణుగోరిన దేవతల సమక్షంలో ఆయన ముఖంనుండి వెలువడిందనీ, ఆ వెంటనే బ్రహ్మ శంకర శక్రాది దేవతలందరి శరీరాలనుండి గూడా తేజస్సులు బయల్వెడలి ఆ వైష్ణవ తేజస్సుతో ఏకమై, దానికొక స్త్రీమూర్తిని సంతరించినవనీ, ఆమెయే వైష్ణవి, నారాయణి, సింహవాహన, మహాదేవి మొదలయిన పేర్లతో చెప్పబడుతున్నదనీ, ఆమెముందు సమస్త పురుష దేవతలూ విన్రములనీ, వాళ్ళందరికంటే ఆమె ఒక్కతే సర్వశక్తి సంపన్నురాలనీ - అ పురాణం - సప్తశతి - వర్ణిస్తుంది పురుషస్వామ్యం బలపడ్డ సమాజంలో స్త్రీ స్వామ్యవాదులు శాక్తేయులుగా నిలబడ్డారు శాక్తేయం యొక్క చరిత్రలో దాని గౌరవ మర్యాదల స్థితి ఆటుపోట్లకు గురి కావటానికి కారణం పునాదిలో పాతుకొనివున్న పురుష స్వామ్యం కౌటిల్యంగానే కనిపిసుంది.

జగత్తంతా వైష్ణవీ తేజస్సుగా విశ్వనాథ దర్శించాడంటే మనమేమని అర్థం చేసుకోవాలి? విశ్వనాథ శాక్తేయవాద దృక్పథం కలిగినవాడనుకోవాలి అయితే, ఆయన కూడా పురుష స్వామ్య సమాజంలో ఉన్నవాడే గనుక స్త్రీ స్వామ్యాన్ని ఉపరితల సాంస్కృతిక భావంగానే భావించాడు భావమాత్రంగా అవలంబించిన స్త్రీస్వామ్య దృక్పథాన్ని విశ్వనాథ రామాయణంలో వున్నట్లు చూపి దాన్ని ప్రపంచించి స్థాపిస్తానని చేసిన ప్రయత్నం వల్ల కల్పవృక్షం తయారైంది ఇంతకూ జగత్తును ఎవరికిష్టమైనట్లు వాళ్ళు చూడవచ్చునా? అయితే జగత్తు యొక్క అసలు రూపం తెలుసుకోవటం ఎలాగా? దానికసలొక స్వరూప స్వభావలక్షణం వుందా? వుంటే వున్నదాన్ని వున్నట్లు చూడాలి లేనిదాన్నైతే మన ఇష్టం వైష్ణవీ తేజస్సుగా చూడవచ్చు శాంభవీ తేజస్సుగా చూడవచ్చు ఇందులో ఏదీ నిజంకాదు అయితే, నేను చూస్తున్నాను కదా అంటాడు అందుకనే జగత్తును మిధ్య అంటున్నాం రాజీ మాటగా విశ్వనాథ జగన్మిధ్యావాది గనుక ఆయన జగత్తును జగత్తుగా కాక మరి దేనిలాగైనా చూడగలుగుతాడు అందువల్ల జగత్తును వైష్ణవీ తేజస్సుగా దర్శించాడు జగత్తును జగత్తుగా చూడదల్చుకోలేకపోయిన తరువాత దేనిని దేనినిగానైనా దర్శించవచ్చు అందువల్ల సీతను వైష్ణవీ దేవిగా మహాదేవిగా సర్వశక్తి సంపన్నురాలిగా దర్శించవచ్చు అప్పుడామె ఒక్క రాముడి కంటేనే కాదు - రామాయణంలో వచ్చే అందరు స్త్రీ పురుషుల శక్తిసామర్థ్యాల కంటేకూడా గొప్పది ఈ దృక్పథంతో కల్పవృక్షాన్ని విశ్వనాథ రచించాడు ఈ మాత్రపుదృష్టి వాల్మీకి తనకు కూడా వున్నట్లు చెప్పుకొన్నాడు

అందువల్ల విశ్వనాథ రామకథకు చెబుతున్న అర్థం - చేస్తున్న భాష్యం వాల్మీకి చెప్పుకొన్న దాన్ని అనుసరించి బలపరచటానికి చేస్తున్న ప్రయత్నం తప్ప రామకథను చదివినందు వల్ల తాను స్వయంగా దర్శించిన దాన్ని చెప్పటం కాదు అంటే-రాముడే దైవమన్న వాదం వాదం కాదనీ సీతే దైవమన్న వాదమే వాదమనీ నిరూపించటానికి విశ్వనాథ కల్పవృక్షం వ్రాసినట్లా? సీతారాములలో ఎవరు దైవమన్న విషయాన్ని నిరూపించడానికా రామాయణం? సీతయే దైవమని కల్పవృక్షం నిరూపించింది మరి రాముడు దైవము కాదని లోకం త్రోసి పుచ్చిందా? లోకం మీద ఏమి ప్రభావం పడాలని విశ్వనాథ అనుకొన్నట్లు? ఎటువంటి ప్రభావం గురించీ ఆయన అనుకొన్నట్లు లేదు ఎందువల్లనంటే, రాముడు

దైవం గనుక, రామాయణం ఆయన కథ గనుక, ఆ కథ వ్రాస్తుంటే ఆయన్ను తలచుకొన్నట్లయి చివరకు తనకు మోక్షం వస్తుందని మాత్రమే ఆలోచించాడు

తలచిన రాములనే తలచెద నేను అని అంటూ, రామునికంటే శక్తి సంపన్నురాలిగా సీతను కీర్తించటానికి కల్పవృక్ష రచన చేశాననట మెట్లా కుదురుతుంది? అప్పుడు రాముణ్ణి సీతగానూ, సీతను రాముణ్ణిగానూ దర్శిస్తున్నాడు విశ్వనాథ అని చెప్పాలి వాళ్లిద్దరూ ఒకటే అయితే, వాళ్ళల్లో ఎవరు దైవమన్న నిరూపణకు ప్రయత్నమెందుకు? అదొక చమత్కారమందామా? అయితే చమత్కారమంటే నిష్ప్రయోజనమేనా? కల్పవృక్ష రచన వట్టి చమత్కారంగా తీసి పక్కకు పెట్టటానికి వీలులేదు ఎందుకంటే, మరొకటి కూడా వుంది నా భక్తి రచనలు నావి అని చెబుతూ రసము వేయిరెట్లు గొప్పది నవ కథా ధృతిని మించి అని అంటున్నాడు రసప్రసక్తి వచ్చిందంటే కావ్యం కవి నుండి పాఠకులనూ, శ్రోతలనూ, ప్రేక్షకులనూ ఆశ్రయిస్తుంది అయితే, రామాయణ కల్పవృక్షంలో రసము ఏది? భక్తి రచన అన్నాడు గనుక భక్తి రసమునే కల్పవృక్షంలో రసమని సూచన చేస్తున్నట్లా? భక్తి రసవాదం భారతీయాలంకారిక మతాల్లో చాలా అల్ప విషయం అయినా, విశ్వనాథ దాన్నే పట్టుకొని పెద్దది చేయదలచుకొన్నాడా? తలచుకొన్నాడనటానికి నిదర్శన లేమీ లేవు అయితే, కల్పవృక్షంలో రసమేమిటి? నవరసాల్లో ఏదో ఒకటిగా నిరూపణ జరగాలి కదా? కల్పవృక్షంలో రసం కరుణమేనంటే అది వాల్మీకి రామాయణ విషయమే అవుతుంది అందువల్ల రసవిషయంలోనూ కొత్తదనం లేదు అయితే, వాల్మీకి రామాయణాన్ని తెలుగు పాఠకులకు రసవంతంగా వుండేటట్లు విశ్వనాథ కల్పవృక్షంగా రచించాడు

మరి తెలుగు పాఠకులంటే ఈ కాలంలో ఎవరో కూడా చెప్పుకోవాలి. తెలుగు భాషా భాషీయులంతా తెలుగు పాఠకులేనంటే తెలుగు పాఠకులందరూ కల్పవృక్షాన్ని ఎటూ ఆస్వాదించలేరు ఎందుకంటే తెలుగు పాఠకులందరికీ ఏ ఒక్క సాహిత్య రచనా ఆస్వాదన యోగ్యంగా వుండదు తెలుగు పాఠకుల్లో ఎన్ని రకాల అభిరుచులుగల వాళ్లున్నారు? రామాయణ కల్పవృక్షాన్ని రుచిమంతంగా తెలుసుకోగల పాఠకులే దాని తెలుగు పాఠకులు

# నన్నయ తిక్కనల మార్గము

తెలుగు సాహిత్య సంప్రదాయం నన్నయ్యగారి భారతంతో మొదలయింది మహాభారత రచనకు నన్నయ్యను ప్రేరేపించిన రాజరాజు హృదయం ఈశ్వరాగమములందు భక్తిభావంతో లగ్నమైవుంది అయినా తమ వంశమూల పురుషుల కథ గనుక మహాభారతం వినాలనివుంది గాబట్టే తెలుగులో వ్రాయమన్నాడు నన్నయభట్టు కూడా తనకు దేవతల యందును వ్యాసవాల్మీకుల యందును భక్తి వున్నట్లు చెప్పుకొన్నాడు "భక్తి యుక్తులయిన భాగవతులకు శ్రీవల్లభుండు భక్తవత్సలుండు భవభయంబు లెల్లబాపి యిష్టార్థ సంసిద్ధి కరుణతో చేయునట్లు" (ఆది 1 33) గా మహాభారతం కూడా తనను "భావించి వినుచుండు" వారలకు యిష్టార్థ సంసిద్ధి చేస్తుందని నన్నయ్యగారు హామీయిస్తున్నాడు మహాభారత శ్రవణఫలాన్ని గూడా నన్నయ్య వివరించాడు- "ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు, అర్థార్థులకు విపులార్థములును, ధర్మార్థులకు నిత్యధర్మ సంప్రాప్తియు, వినయార్థులకు మహా వినయమతియు, పుత్రార్థులకు బహుపుత్ర సమృద్ధియు, సంపదర్థులకు ఇష్టసంపదలును గావించునెప్పుడు భావించుచుండు వారల కిమ్మహాభారతంబు" (ఆది 1 - 33)

నన్నయగారి సంప్రదాయాన్నే తిక్కన్నగారు కొనసాగించారు- మార్పులతో చేర్పులతో తిక్కన్నగారిని మహాభారతం వ్రాయవలసిందిగా ఎవరూ అడగలేదు ఆయనే వ్రాద్దామనుకొన్నాడు కృతిపతి ఎవరైతే బాగుంటుందని ఆశిస్తున్నప్పుడు వాళ్ళనాన్నను వెంటబెట్టుకొని హరిహరనాథుడు వచ్చాడు హరిహరనాథుడు ఆ పుస్తకాన్ని తనకు అంకితమిమ్మని అడిగాడు అయితే తనకు జన్మాంతర దుఃఖముల్ తొలగునట్లుగా చేసి సుఖాత్మునిగా చేయ్యాలని తిక్కన్న ఒక షరతు పెట్టి అందుకు అంగీకరించాడు హరిహరనాథుడు సరేనన్నాడు అంటే తిక్కన తన మహాభారత రచనవల్ల అంటే దాన్ని హరిహరనాథున కంకితంగా వ్రాయటం వల్ల తనకు మోక్షం ఎస్తుందని విశ్వసించాడు దాన్నే బ్రహ్మానంద స్థితి అన్నాడు మరి మహాభారతం తెలుగులో వ్రాయుట,

తన ఒక్క మోక్షం కొరకేనా? కాదు - చదివే వాళ్ళూ వినేవాళ్ళు వున్నారు వాళ్ళ కొరకు కూడా వ్రాశాడు భారతామృతము కర్ణ పుటంబుల నారగ్రోలి ఆంధ్రావళి మోదముంబొరయున్ట్లుగ వ్రాయాలని వ్రాశాడు

నన్నయ్యగారు మోక్షాన్ని గురించి బయటపడలేదు ఇష్టార్థ సంసిద్ధి అన్నప్పుడు మోక్షమే ఇష్టార్థం కావచ్చు కాదనలేము అయితే జన్మాంతర దుఃఖములున్నట్లు అవి తొలగాలన్నట్లు నన్నయ్యగారు మాట్లాడలేదు అయన ఇష్టార్థములుగా పేర్కొన్నవన్నీ ఇహలోక సుఖస్పర్శ కలవే మహాభారతం వినేవాళ్ళ విషయంలో తిక్కన్న గారాశించిన మోదముంబొరయుటలో నన్నయ్య గారు పేర్కొన్న ఇష్టార్థములుండవచ్చు ఇదీ కాదనములేము కావ్యరచనా ప్రయోజనంగా మోక్షాన్ని తిక్కన్నగారే స్పష్టంగా ప్రతిపాదించారు

పురుషార్థములలో మోక్షము చేరినప్పటినుంచి అది పరమపురుషార్థమై కూర్చున్నది సంసార మూలకారణముయొక్క సర్వనాశనమువలననే మోక్ష ప్రాప్తి అని బయలుదేరిన బుద్ధిమంతులు సంసార మూలకారణముల గురించి వాటి వినాశవిధానములను గురించి రకరకాలుగా ఆలోచించారు వాళ్ళ ఆలోచనా విధానాలకే దర్శనాలని పేరు వీళ్ళలో హేతుబుద్ధిని ప్రమాణంగా చేసుకొని ఆలోచించినవాళ్ళు కొందరు వేదమును ప్రమాణంగా చేసికొని తమ ఆలోచనలను సర్దుకొన్నవారు మరికొందరు వాళ్ళు నాస్తికులు వీళ్ళు ఆస్తికులు ఆస్తిక దార్శనికుల సంప్రదాయమునే సంప్రదాయముగా మన పూర్వీకులు మన దాకా కొనసాగించుకొనివచ్చి మనకందించిపోయినారు మనమూ దాన్నే కొనసాగి స్తున్నాం నాస్తిక సంప్రదాయం కూడా సన్నగా కొనసాగించబడుతూనే వుంది అయితే దాన్ని మనం సంప్రదాయంగా గుర్తించటం లేదు అన్నిరకాలా మనం బలవంతులం కావటంచేత మనం సంప్రదాయమన్నదే సంప్రదాయంగా చెలామణి అవుతున్నది

ఆస్తికదర్శన సంప్రదాయం నిశ్రేయసిద్ధిని మోక్షాన్ని పరమార్థభూతంగా ప్రతిపాదిస్తుంది ఆస్తికదర్శనాల్లో ఉత్తరమీమాంసా వేదాంత దర్శనానికి ఒక గొప్ప ప్రత్యేకత వుంది అదే అద్వైత దర్శనమని శంకరుడు అదే విశిష్టాద్వైత దర్శనమని రామానుజుడు అదే ద్వైతదర్శనమని పూర్ణప్రజ్ఞుడు ఈ మతత్రయ

ప్రభావ స్పర్శ నన్నయ నాటినుండి కంటె తిక్కన్న నాటినుండి తెలుగు సాహిత్యానికి బాగా సోకటం మొదలుపెట్టింది తిక్కన్నగారు బ్రహ్మానంద స్థితిని అభిలషించినప్పుడు అద్వైత సిద్ధాంత ఫలమైన బ్రహ్మ భావ రూప మోక్షము నందాయనకు బుద్ధి నిశ్చయమై ఉన్నదన్నమాట కావ్య సాహిత్యానికి దర్శనస్థాయిని సంపాదించి పెట్టటానికి తెలిసీ తెలిసీ ప్రయత్నం మొదలుపెట్టిన వాడు తిక్కన

తిక్కన్నగారి హరిహరనాథ భావనకు ఆయన తరువాత తెలుగు కవులు ఎంత మద్దత్తు ఇచ్చారో మనకు తెలుసు కావ్య సాహిత్యానికి దర్శనస్థాయిని కల్పించే ప్రయత్నాన్ని కూడా ఆయన తరువాత వచ్చిన తెలుగు కవులు అంతంత మాత్రంగానే చేశారు ఆ విధంగా తిక్కన్నగారి సాహిత్య ప్రయోగ సంప్రదాయం ఆయన తరువాత విశేషంగా కొనసాగలేదు విచ్ఛిన్నమైంది దాన్ని అవిచ్ఛిన్నంగా కొనసాగించటానికే శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని విశ్వనాథ సత్యనారాయణగారు ఈ శతాబ్దిలో రచించారు

"నన్నయ్యయు తిక్కన్నయు
నన్నావేశించిరి పరిణాహ మనస్సం
ఛన్నత వారలు పోయిన
తెన్నున మెఱుగులను తీర్చిదిద్దుచు పోదున్ "

నన్నయ్యగారి ననుసరించి రామాయణాన్ని భక్తి రచనగా చేశాడు విశ్వనాథ "తలచిన రామునే తలచెద నేను నా భక్తి రచనలు నావిగాన" కాకుత్థ్సుడౌస్వామి గాథాసంపన్నము భక్తి దీర్చినను" "నాదు కావ్యమునకు నవ బాలచంద్రమశ్చూడ భక్తి భావసుభగమునకు" "వృత్రదళ ముక్తితరు విస్ఫుటిత భక్తిఫల విద్యుతిత మోదరసరూపా" తిక్కనగారి ననుసరించి రామధూర్జటుల విషయంలో భేదములేని భక్తిని ప్రకటిస్తూ అంమకు జన్మాద్యపాయమునుండి తనను రక్షించమంటాడు విశ్వనాథ

తిక్కనాదులకు తాము చెయ్యదలచుకొన్న పనిని చెయ్యటమేగానీ దాని ఫలితాల విషయంలో వాళ్ళకు ఎప్పుడూ సందేహం రాలేదు జగద్ధితంగా వుంటుందో వుండదో అని నన్నయ్యగానీ, ఆంధ్రావళి మోదమును పొందు

తుందో పొందదో అని తిక్కనగారి తను రచన అనే కర్మ ఫలాన్ని గురించి సందేహించలేదు విశ్వనాథకు సందేహాలున్నాయి.

ఇది మెచ్చెదరో మెచ్చరో
ఇదియును చదివెదరు చదువరు ఏలానా క
య్యది? నా యెద మీతో రా
చెద నద్ధానికి ఫలంబు చెందించు శివా?

తన కావ్యారచనవల్ల ప్రజలకు ఆయన ఆశించిన ఫలం ఏమిటి - తన కావ్యాన్ని చదివిన తెలుగు ప్రజలకు ఏ ప్రయోజనం కలగాలని విశ్వనాథ ఆశించాడు? తనకు మోక్షం కావాలనుకొన్నాడు అందుకు కల్పవృక్షం వ్రాశాడు రాముణ్ణి గురించి వ్రాయడంవల్ల, రాముడూ శివుడు ఒకటేకావటంవల్ల - శివ రామ తత్వమునందు తనకు భక్తి వున్నది గనుక - అందుకు ప్రతిఫలంగా తనకు మోక్షం రావాలి కావ్యాన్ని అచ్చువేయుటకు డబ్బిచ్చాడు గనుక ముక్త్యాలరాజా చంద్రమౌళికి స్వర్గం, తనకు అక్కరలేనిది వృధాగా పోవటమెందుకని దాన్ని ఆయన కిమ్మన్నాడు

విశ్వనాథ - తన మోక్షం గురించి - తన కావ్యం ప్రచారం కావటానికి డబ్బిచ్చాడు గనుకను చంద్రమౌళి స్వర్గం గురించి మాత్రమే పట్టించుకొన్నాడు పదేపదే చెప్పాడు

కావ్యరచనలో తన ప్రతిభ చూపించటం ఒక లక్ష్యం ప్రతిభా ప్రదర్శనకు కొత్త విషయం అక్కర్లేదు గనుక వున్న రామకథనే మళ్ళీ రాస్తానన్నాడు అందులో రసానుభూతి కలిగేటట్లు చెయ్యడమే ఆయన ప్రతిభ కట్టుకథలవల్ల ఇహమూ పరమూ రెండూ లేవనుకొన్నాడు

మోక్షమే కదా - విశ్వనాథ కోరింది - ఆ మోక్షం - రామాయణం వ్రాస్తుండగ మధ్యలో రాకూడదు - రామ కథా ప్రవృత్తి వేళాయుతిగాగ దేహ మవలంబన చేయుము - చాలునో ప్రభూ! అని కోరాడు - (అయోధ్యాకాండ)

విశ్వనాథ సత్యనారాయణగారికి దైవమూ - స్వర్గమూ - మోక్షమూ మూడూ ఉన్నాయి దైవమునందు భక్తి - మోక్షము నందిచ్చా ఉన్నాయి.

దైవము రాముడూ శివుడూ అయిన అభేదతత్వం దైవమునందు భక్తి - మోక్షం కొరకు

మోక్షం అంటే పునర్జన్మ లేకుండా పోవటం విశ్వనాథకు జన్మలున్నాయి జన్మ లేకపోవడం కావాలి

రామాయణం ఎందుకు రాయాలి?

జన్మాద్యపాయమును తప్పించుకోటానికి - ఇది పోతనగారి పద్ధతి - నా జననంబున్ సఫలంబు చేసెద పునర్జన్మంబు లేకుండగన్

నన్నయగారు సొంతానికి ఏం కావాలో చెప్పుకోలేదు జగద్ధితం కొరకు భారత సంహితా రచన బంధురుడ నవుతున్నా నన్నాడు

తిక్కనగారు ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగా భారత రచన చెయ్యాలని సంకల్పించాడు అంతేకాకుండా అయన తనకు హరిహరనాథుడు కనిపించి కృతిపతిత్వ మర్థించి వచ్చితి తిక్కశర్మ అన్నాడు సరే, కృతి ఇస్తాను - మరి నాకు ఇంక జన్మాంతర దుఃఖముల్ తొలగునట్టుగ జేసి సుఖాత్మజేయ అడిగాడు జన్మాంతర దుఃఖము తొలగటం అంటే మోక్షమే దాన్ని బ్రహ్మానంద స్థితి అని కూడా చెప్పాడు అప్పుడు హరిహరనాదుడు ఏమన్నాడంటే -

'జనన మరణాదులైన సంసారదురిత
ములకు నగపడకుండంగ తొలగుతెరువు
గను వెలుంగు నీకిచ్చితిని - అన్నాడు

అ వెలుగు యొక్క స్వరూపమేమిటి? వైదిక మార్గ నిష్ఠమగు ధ్యానము భేదములేని భక్తితో తత్పాద నిరంతర స్మరణతత్పరభావము కల్మి - ఇట్లా వుంటూ ఆత్మ సమ్మోదంకొరకు కావ్య రసాన్ని అనుభవ పూర్వకంగా సృజిస్తున్నాడు ఇవన్నీ హరిహరనాథుడు కనిపించక ముప్పు నుంచి తిక్కనగారు చేస్తున్నదే ఆయన కనిపించి అదనంగా ఇచ్చిన వెలుగు ఏమిటి? ఆత్మానంద స్థితికి హేతువైన కావ్యరచన ద్వారా బ్రహ్మానంద స్థితిని పొందగలిగిన ఆలోచనా విధానాన్ని ఇచ్చాడు.

కల్పవృక్షకావ్యమునకు - అంతరమైన రసమును ఆహ్వానించుకోవాలి మనం ఆహ్వాన స్వరూపం ఏమిటి, అంటే శివుడు కల్పవృక్షకావ్య అంతర రసాన్ని అందుకోటానికి శివుణ్ణి ఆశ్రయించాలన్నమాట శివభక్తి వుండాలి శివ భక్తులకు రామాయణ కల్పవృక్ష రసాస్వాదనము జరిగినంత పరిపూర్ణంగా శివ భక్తులు కాని వారికి జరుగదు - (కిష్కింధ)

విశ్వనాథ సంశయ స్వభావానికి మరొకటి—
మనసును నీకై వెచ్చించినవారికి
ముక్తిచెందు చెందదు పోనీ
ధనమును కీర్తికి వెచ్చించిన
తప్పక స్వర్గసుఖము చెందించు శివా - (సుందర)

మోక్షం వస్తుందో! రాదో?- రామధూర్జటులతో తానింతగా గుండెలతో రాచుకొన్నా లాభం వుంటుందన్న విశ్వాసం కుదరటం లేదు ఈ అనుమాన స్వభావం తిక్కనగారికి లేదు పోతన్నగారికి లేదు

ఈ అభిప్రాయాన్ని పునరుక్తంగా కూడా చెప్పాడు గీత పద్యములో
దీని విన నెంచినట్టి ముక్త్యాల తేడు
చంద్రమౌళికి సమకూర్చు స్వర్గ సుఖము
ఇంక నా ముక్తి మాట పోనీ శివా? ల
యాంతమున కేని నేను నీవగుట కలదు

విశ్వనాథ తన సందేహ స్వభావాభివ్యక్తిని భక్తులు మిక్కిలి నమ్మ తారంటాడు అభక్తులకు ఈలాంటి అభిప్రాయాలు సహేతుకాలుగావు గనుక నమ్మరు భక్తులకు విశ్వాసము తప్ప విచారణలేదు గనుక నమ్ముతారు

కావ్యం విచారిత రమణీయంగా వుండాలా? అవిచారిత రమణీయంగా వుండాలా? జాతీయవాద దృక్పథానికి అవిచారిత రమణీయకం అంటే ఇష్టం *

# సంప్రదాయ కవిత

ఈ ఇరవయ్యో శతాబ్దంలో ప్రపంచ దేశాల నన్నింటినీ కలగలుపుచూ వ్యాపించిన ఒకానొక నూతన చైతన్యశక్తి సోషలిజము రాజకీయ ఆర్థిక సామాజిక వ్యవస్థలలో ప్రత్యక్షముగా కానీ, పరోక్షముగాగానీ దాని ప్రభావమునకు లోనుగాని దేశమిప్పటి ప్రపంచంలో లేదు

మనం స్వతంత్రులమైన తరువాత మన ప్రజాస్వామ్య వ్యవస్థ సోషలిస్టు భావ విప్లవమును లక్ష్యము చేసికొని ప్రవర్తించునదియైనది రాజకీయమైన ఈ సామ్యవాద ప్రభావం మన జీవితంమీద మిక్కిలిగా పడ్డది ఈ దశలో మన సాహిత్యం రెండు పాయలుగా ప్రవహించటం స్పష్టంగా కనిపించసాగింది ఒకటి దేశీయమైన ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలమీది అభిమానం నుండి పుట్టి బయలుదేరింది రెండోది సోషలిస్టు విప్లవోద్యమాల తాత్పర్య శక్తినుండి పుట్టి బయలుదేరింది ఇక్కడ గమనించవలసిన ఒక ముఖ్య విషయం ఏమిటీ అంటే - మొదటిపాయమీద రెండోపాయ ప్రభావం ఉన్నంతగా రెండోదానిమీద మొదటిదాని ప్రభావం కానరాదు మొదటిది సంప్రదాయమార్గం రెండోది అభ్యుదయమార్గం కావ్యభాషలో ప్రసిద్ధమైన ఛందోమార్గాన పురాణేతిహాసాలనుండి, చరిత్రనుండి వస్తువును గ్రహించి, పరంపరగా వస్తున్న రచనా విధానాన్ని అవలంబించి చేసే రచనలన్నీ సంప్రదాయమార్గంలోవి దీనికి అభ్యుదయ కవిత్వానికి నడుమగా వచ్చిన భావకవిత్వం స్వాతంత్ర్యానంతరం బాగా వెనుకబడిపోయింది అందువల్ల సంప్రదాయమార్గమూ, అభ్యుదయమార్గమూ రెండే ప్రక్క ప్రక్కగా సాగుతున్నాయి ఒకదానికి విశ్వనాథ సత్యనారాయణ, మరొకదానికి శ్రీరంగం శ్రీనివాసరావు నాయకులు ఈ ఇద్దరూ ఒక జాతీయ సంప్రదాయంలోనుండి వచ్చినవాళ్ళే విశ్వనాథ అవిచ్ఛిన్న సంప్రదాయార్థి శ్రీశ్రీ జగదభ్యుదయాభిలాషి సంప్రదాయము, అభ్యుదయము పరస్పరం విరుద్ధ

---

మహతి, భారత స్వాతంత్ర్య రజతోత్సవ ప్రచురణ, 1972, యువభారతి,

లక్షణలక్షితాలు కావు అవునన్న ప్రచారం మాత్రం గట్టిగా జరిగింది ఇబ్బంది అంతా అక్కడినుండే వచ్చింది అభ్యుదయానికి బలం సంప్రదాయం సంప్రదాయానికి గతి అభ్యుదయం అభ్యుదయానికి గతి విప్లవం అది సాయుధ విప్లవమే కానక్కరలేదు

## 2

అవిచ్ఛిన్నంగా వస్తూవున్న ఈ మన సంప్రదాయం ఏమి ప్రబోధంచేస్తూ వున్నది? 'దైవీ స్వస్తిరస్తునః- స్వస్తి ర్మానుషేభ్యః-' ఈ దేవతలు, ఈ మనుష్యులూ భిన్నజాతులవారు కారు పీరే కాదు-రాక్షసులున్నారు కదా? వారూ కారు ఎవ రీరాక్షసులు? మానవాభ్యుదయ మార్గములకు ముళ్ళకంపలు కొట్టేవాళ్ళు వాళ్ల భూమికి భారం 'విఘ్నకర్తార స్తే నశ్యంతు శివాజ్ఞయా ' వాళ్ళను నశింపు చేయక తప్పదు శివాజ్ఞ అట్లున్నది అలా నశింపు చేసే శక్తి కల మానవులకు దేవతలని పేరు మనిషి తనలోని దైవీశక్తిచేత తనలోని రాక్షసత్వమును నశింపు చేసికొనే ప్రయాత్నానికే జీవిత పోరాటం అని పేరు రాక్షసత్వం మీద మానవుడు సాధించిన తొలి విజయాన్ని కీర్తించిన గ్రంథం రామాయణం ఆ విజయం వల్లనే ఆ మానవుడు దేవుడైనాడు అనగా వానిలో దైవీ ప్రకృతి వెలికి వచ్చినదని యర్థము మనిషి మంచికి పోతే దేవుడు, చెడుకు పోతే రాక్షసుడు మంచి ఎవరికి? చెడు ఎవరికి? మానవ మనుగడకు అనగా సమాజమునకు అది సరే గాని- ఈ రాక్షసత్వమునకు నశింపు నిజముగా లేదా? లేదు దైవము విజృంభించినపుడు ఆ ధాటికి అణగిపోవుటయే గాని నశించిపోవుట లేదు ఉన్నచో రాక్షసశక్తిబారినుండి మానవులను రక్షించుటకిన్నిసార్లేల దైవ మవతరించవలెను? దైవ మనగా భావనిష్ఠుడు రాక్షసు డనగా దేహనిష్ఠుడు దేహనిష్ఠ క్రూరతను పెంచును భావనిష్ఠ బుద్ధివైభవమును పెంచును క్రూరత ప్రవృత్తి లక్షణము బుద్ధి నియతి లక్షణము రాక్షసులంతా దైవము చేతులోనే పోవుట కదియే హేతువు ఈదైవరాక్షసభావముల సంఘర్షణానికి రంగభూమి మానవుడు రాక్షసభావలక్షణము మీద దైవభావలక్షణముతో ఎదురుతిరిగి మానవుడు విజయాన్ని పొంది మానవ ధర్మాన్ని నెలకొల్పి సమాజాన్ని నడిపించటానికి ప్రేరణ యిచ్చేటట్లుగా కవులు కావ్యాలు వ్రాయాలి ఈ పరమ తాత్పర్యం విషయంలో విశ్వనాథ శ్రీశ్రీ లది అంతర్యం ఒకటే భేదం ఎక్కడున్నదంటే-

ఈనాడు మనకు కావలసింది ఏనాడో చెప్పబడ్డది దాన్ని మనం ఈనాడు మనకు కావలసినసట్లుగా వ్యాఖ్యానం చేసుకుందాం భాష్యాలు వ్రాసుకుందాం భాస కాళిదాస భవభూతులు, దిఙ్నాగుడు, మురారిభట్టు వీళ్ళంతా ఆయాకాలాల్లో రామకథా భాష్యకారులు వాళ్ళలాగే మనం - అని విశ్వనాథ అంటే శ్రీ శ్రీ అంటాడుగదా - ఆ ప్రాచీన కథను స్వీకరించి దాని అంతర్యాన్ని మన ఇప్పటి అవసరానికి అనుకూలంగా భాష్యం రచించి భారంచేయటంకంటే ఇప్పటి అవసరాలకు అనుగుణంగా ఆ న లుగుముక్కలూ సూటిగా మనం చెప్పలేమా ఏమిటి? ఈలా చెబితే ప్రజలభాషలో చెప్పవచ్చు భాష్యాలకు ప్రౌఢభాష కావాలి ప్రజాస్వామ్యంలో ప్రజాభాషలకున్న గిరాకీ ప్రౌఢభాషలకుండదు మీ రిక్కడ ఉండండి మీ భాష్యార్థాలను ఏలాగో ఒకలాగు ప్రజ లందుకొనేటట్లు మా కృషి మేం చేస్తాం మనసంప్రదాయం ఇల్లా అవిచ్ఛిన్నంగా కొనసాగడం మాకూ ఇష్టమే కానీ మీ మాటలు వేరు మా మాటలు వేరు అందువల్ల మీరు వేరు మేము వేరు-అని అయితే కావచ్చు

## 3

స్వాతంత్ర్యోత్తరకాలాన వచ్చిన సంప్రదాయకావ్యం శ్రీమద్రామాయణ కల్పవృక్షం! అంటే ఇదొక్కటే అని అర్థంకాదు దీన్ని చెప్పినచో దాదాపు సంప్రదాయకావ్యాల నన్నింటినీ చెప్పినట్లే అవుతుంది ఇంకా చెప్పవలసివస్తే విశ్వనాథవారిదే మరొక కావ్యం శ్రీకుమారాభ్యుదయాన్ని గురించి చెప్పాలి స్వల్పమైన పౌరాణికగాథను ఆధారంగా తీసుకొని సమసామాజికదృక్ప్రధాన దాన్ని తీర్చి దిద్దడం జరిగింది ఆధునిక చైతన్యాన్ని పుక్కిలించిన సంప్రదాయ కావ్యమార్గన వెలసిన కృతి అది అందలి ఆరు ఆసనాలకు విశ్వనాథ పెట్టిన పేర్లు చూచి ఆలోచిస్తే దానిమహనీయత గోచరిస్తుంది సేనా సమీకరణము, సేనా గ్రహణము, శత్రుపరాజయము, శత్రుసంపద్గ్రహణము, నిరంతరాభ్యుదయము, ఐహికాముష్మికసంపాదనము- ఇవీ ఆరు పేర్లు విశ్వశ్రేయస్సు నభిలషించిన కవి వ్రాసినది శ్రీకుమారాభ్యుదయము మనపురాణకథలను నూత్న సందేశములకూ, ప్రబోధములకూ వాహకాలుగా చేసి దేశకాలాలను గుర్తించి రచించటమే రచించటం స్వాతంత్ర్యమునందిచ్చ జాతీయతాభావము, దేశభక్తి, వీరయువతీజన కీర్తనమునందు తాత్పర్యము ఈ మొదలైన సల్లక్షణాలతో ప్రజాస్వామ్యదేశాల్లో

కవిత రావలసిఉన్నది తెలుగుభాషాకవిత్వం అలాగేవచ్చింది సంప్రదాయబలం ఉంటేగాని అభ్యుదయసౌధం అని నిలవదుపూర్వ మెప్పుడో శ్రీ శ్రీ అన్నారు వెనుకటిగ్రంథాలను చదవని వాడెవ్వడూ ఈ నాడు సరసమైన సాహిత్య రచన చెయ్యలేడు గతచరిత్రను ప్రస్తుత ప్రయోజనం కోసమూ, భావి అభివృద్ధి నిమిత్తమూ ఏ విధంగా పరించక తప్పదో అదేవిధంగా పూర్వసాహిత్యాన్ని సవిమర్శగా సాకల్యంగా చదవకపోతే సారస్వత సృష్టికి అవకాశమే ఉండదు ఇదివరకు వెయ్యబడిన గట్టి పునాదులమీదనే ఈనాటి సాహిత్య సౌధం నిర్మించ బడుతున్నది సారస్వతపరిణామాన్ని శ్రద్ధగా గమనిస్తున్నవా రెవ్వరూ దీనిని కాదనలేరు " (తెలుగుతల్లి, మార్చి 1946 పుట 14) ఆధునిక అభ్యుదయాంధ్ర సాహిత్యానికి వెన్నుబలంగా సంప్రదాయ సాహిత్యం కొనసాగివస్తూనే ఉన్నది మన సంప్రదాయంలోని కావ్యవైచిత్రిని మన కళ్లముందు తెచ్చి ప్రదర్శించింది కల్పవృక్షము

కవిత్వం సంప్రదాయ కవిత్వంగా వ్రాసేవాళ్ళసంఖ్య అసంఖ్యాకంగానే వుంది కాని, వాళ్ళ అందరి కృతుల్లో ప్రస్తుతసామాజికావసరాలకు అనువైన సందేశాలు అంతగా కానరావటంలేదు నూత్నచైతన్యమును అని వెలువరించటం లేదు అందువల్ల సాహిత్య ప్రయోజనాలన్నీ - ప్రజలను విజ్ఞానఘనులుగా చెయటం, సమాజముయొక్క నడకను గురించి ఆలోచించేటట్లు చేయటం, మనిషికి మనిషి సంపూర్ణంగా అవగతం అయ్యేటట్లు చేయటం - ఈ మొదలైన చాకచక్య లక్షణాలు సంపూర్ణంగా కలిగి జాతీయతాముద్ర అడుగడుగునా కనిపించే కమనీయకృతి - కల్పవృక్షం, విశ్వనాథశారద అంతా ఇల్లాగానే ఉంటుంది "ఒక జాతి జాతీయతకు దాని సంప్రదాయము పునాది"- ఈ వివేకముతోనే విశ్వనాథశారద విశ్వరూపమును ప్రదర్శించింది ఇంతేకాదు-"కవి ప్రతిభలోన నుండును కావ్యగతశతాంశములయందు తొంబదియైనపాళ్ళు" అంతటి సంప్రదాయమును ఇంతటి ప్రతిభ లోగొని కల్పవృక్షమును తయారు చేసింది

మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత ఇంతవరకూ అగ్రగామిగా నడుస్తూనే వస్తున్న సంప్రదాయ కవితలో ప్రథమంగా పేర్కొనదగింది రామాయణకల్పవృక్షమే దివ్యాదివ్యాభావసంఘర్షణమే యిందు చిత్రింపబడింది విశ్వశ్రేయోదాయకమైన దివ్యభావదీప్తిని దర్శనీయముగా చేయుటయే ఇది చేసిన పని వెనుకటితరాలు ముందుతరాలవాళ్ళకు తమతమ జవసత్వాలను పనికివచ్చేట్లు ఎలా అందిస్తవో ఒకచోట చూడాలంటే కల్పవృక్షాన్నే చూడాలి సంప్రదాయ కవితలో ఇది ప్రభువు ప్రభువును చెప్పినచో ప్రజను చెప్పినట్లే! *

# ఋష్యశృంగర్షి
# నన్నయ : విశ్వనాథ

ఋశ్యశృంగర్షి కథ రామాయణముననున్నది భారతముననున్నది రామాయణమునకు ఋశ్యశృంగునితో గల దగ్గరతనము భారతమునకు లేదు భారతమున ఋశ్యశృంగుని వృత్తాంతము ప్రాసంగికముగ చెప్పబడినది రామాయణమున ప్రధాన కథా సంబంధిగా చెప్పబడినది ఋశ్యశృంగుడు లేనిచో రామాయణము లేదు అతడు లేకపోయినను భారతముండును రాముడు లేనిచో రామాయణము లేదు దశరథుడు పుత్రికామేష్టి చేయనిచో రామావతారముండదు ఋశ్యశృంగుడు లేనిచో పుత్రికామేష్టియే యుండదు మరొకరు ఋత్విజులుగా నుండిన ఇష్టికాణాయినిన అగును ఇష్టియగుట గాదు ముఖ్యము దశరథుడందు వలన సంతానవంతుడగుట ముఖ్యము ఇదియే ముఖ్యమైనచో ఆ యజ్ఞమును ఋశ్యశృంగుడే నిర్వహించవలయును ఇది దేవ రహస్యము కనుకనే ఇతడు లేనిచో రామాయణమే లేదని చెప్పుట భారత కథా విధానము వేరు కాలకర్మ ప్రభావములకులోనైన ధర్మరాజు వనములందుండి, కాలము వెళ్ళబుచ్చుకొనుటకు తనకు కనుపించిన బృహదశ్వ, నారద, రోమశ, మార్కండేయాదుల నేవేని కథలు చెప్పవలసినదిగా కోరును ఉత్తమ పురుషుల కథలు, ధర్మ సూక్ష్మములు వినుట ఉభయ తారకమని వానిని వినిపింపవలసినదిగా కోరును ఆ ఋషులు చెప్పుదురు రోమశుడీ ఋశ్యశృంగుని కథను ధర్మరాజునకు చెప్పినాడు అగస్త్యోదంతము, గంగావతరణము, హేమకూట మాహాత్మ్యము చెప్పుచు నడచుచు నల్లదె ఋశ్యశృంగుడను ముని ప్రహదమని చెప్పినాడు ధర్మరాజా కథ చెప్పవలసినదిగా కోరినాడు రోమశుడు చెప్పినాడు ధర్మరాజు ఊకొట్టినాడు అంతవరకే ఆ కథకు భారతమున గల ప్రాధాన్యము భారతమున ప్రధానేతి వృత్తము దీనివలన మారుటగాని - సాగుటగాని ఏమియులేదు కనుకనే ఋశ్య శృంగుడు లేకపోయినను భారతముండునని చెప్పుట

---

భారతి, జనవరి 1956, సమీక్షణ (వ్యాస సంపుటి) జనవరి 1963

వ్యాస వాల్మీకులతో నీ వ్యాసమునకు సంబంధము లేదు భారతమును నన్నయ వ్రాసినాడు రామాయణమును చాలమంది వ్రాసిరి రంగనాథ, భాస్కర, రఘునాథులు ముఖ్యులు నవ్వులలో నొకరు భారతమును, ఒకరు రామాయణమును వ్రాసిరి భారత కర్తయైన నవ్వునితో మనకు నిమిత్తములేదు రామాయణ కర్తయైన నవ్వుడు విశ్వనాథ ఈయనచే వ్రాయబడిన ఋశ్యశృంగుని కథను వెనుకటి వారి కథలతో పోల్చి చూచి గుణ నిర్ణయము చేయుటకీ వ్యాస ముద్దిష్టము నన్నయ విశ్వనాథులను పోల్చుటయనగా రంగనాథాదులను సందర్భానుసారముగ పేర్కొనుచు పోల్చుటయని గ్రహింపవలయును నన్నయతో విశ్వనాథకు తాదాత్మ్యమున్నది పురా మహాకవులందరితోడను నున్నది ఇది మహాకవి లక్షణము నన్నయ విద్యాదయితుడు విశ్వనాథ కవితా రూప తపస్సమాధి గత చేతస్కుడు అతడు గాఢ ప్రతిభుడు ఇతడు ప్రౌఢ సర్వ కవిత్వ మర్మవిదుడు అతడు నానారుచిరార్థ సూక్తినిధి ఇతడు బ్రాహ్మీమయమూర్తి ప్రసన్న కథా కలితార్థయుక్తి నన్నయది కథా కథన శిల్పానేకమార్గాభిరామ నేతృత్వము విశ్వనాథది కనుకనే నన్నయతో విశ్వనాథను పోల్చిచూడవలసియున్నది రంగనాథాదులు విశ్వనాథ వ్రాసిన ఒక్క కథను మాత్రమేగాక, ఆ గ్రంథమును సర్వమును వ్రాసిరి పూర్వ రామాయణ కర్తలలో వారు శ్రేష్ఠులు పూర్వ కవీంద్రుల కావ్య ప్రపంచమును క్రాంతి దర్శిత్వమున దర్శించుట - పరిశీలించుట చేయగలవాడు కవియగుచో అతడు మహాకవి యగును విశ్వనాథ అట్టివాడు కనుకనే వారితో పోల్చదగినవాడు ఆ పోల్చుటకే ఋశ్యశృంగుని కథను గ్రహించుట

నన్నయ ఈ కథను 29 గద్య పద్యములలో వ్రాసెను రంగనాథుడు 86 ద్విపదలలో వ్రాసెను భాస్కరుడు (మల్లికార్జున భట్టు) 32 గద్య పద్యములలో వ్రాసెను రఘునాథుడు 110 గద్య పద్యములలో వ్రాసెను విశ్వనాథ 54 గద్య పద్యములలో వ్రాసెను అందరికంటెను తక్కువ మాటలలో ఋశ్యశృంగుని ఉదంతమును చెప్పినది నన్నయ ఋషులు ఎక్కువ యర్థమును తక్కువ మాటలలో చెప్పుదురు నన్నయ ఋషివంటివాడు అదియునుగాక భారతమున నా కథ నంతకంటె యెక్కువమాటలలో చెప్పరాదు ప్రాసంగికముగ వచ్చిన కథ యది నాలుగైదు విషయముల నూహించుట కవకాశము కల్పించుచు నొక విషయమును చెప్పుట నన్నయ్య కథాకథనములోని యొక

శిల్పము కనుక, నన్నయ తక్కువగనే వ్రాయును రఘునాథు డందరికంటెను ఎక్కువ మాటలలో వ్రాసెను అతడు దక్షిణాంధ్ర యుగకవి ఆ యుగమున వర్ణన లెక్కువ వాచ్య మెక్కువ వ్యంగ్య విభవ శిల్పము తక్కువ కనుక రఘునాథుడట్లు వ్రాసెను. రంగనాథునికంటె మల్లికార్జున భట్టు ఉత్తమ కవి కథను స్వయంసంపూర్ణముచేసి కథన శిల్పమును ప్రదర్శించుటలో మల్లికార్జున భట్టుకంటె విశ్వనాథ గొప్పవాడు ఈ విషయమున విశ్వనాథ నన్నయ వంటివాడు కనుకనే నన్నయ విశ్వనాథలను పోల్చవలసి వచ్చినది

రామాయణమునకు ఋశ్యశృంగునకు త్రెంచరాని విడదీయరాని సంబంధ మున్నది వనములబడి యున్న ఋశ్యశృంగుని దేశములోనికి తెచ్చిన వాడు రోమ పాదుడు ఒక హేతువును పురస్కరించుకొని తెచ్చినాడు అనగా తెప్పించి నాడనుట ఆ హేతువును ముందు సుస్పష్టము చేయుట కథను స్వయం సంపూర్ణము చేయుట ఆ పని చేయుట రామాయణమున కొక క్రొత్త బిగువు దెచ్చుట భారతమునట్లు చేయనక్కరలేమి సూచించిన చాలును నన్నయ అట్లే చేసెను విశ్వనాథ అవసరమును గ్రహించి బిగువు కూర్చెను పూర్వరామాయణ కర్తలలో ఒక్క రఘునాథుడు మాత్రము స్పష్టముగా నా హేతువును చిత్రించి నాడు అనావృష్టి హేతువు తత్ఫలితమును వర్ణించుటవలన రఘునాథుని చిత్రణము రక్తికట్టినది విశ్వనాథయు వర్ణించినాడు రఘునాథుడా వర్ణనమునకు గీతి మొకటి, కంద మొకటి, సీస మొకటి వాడినాడు విశ్వనాథ ఒక ఉత్పలము-ఒక సీసము వాడినాడు ఇరువుర భావమును దాదాపు నొకటిగనే యున్నది భావన యొకటియైనను కథన శిల్పము భిన్నమగుటవలన విశ్వనాథది పైచేయి యైనది అనావృష్టియు, తత్ఫలితమును రోమపాదుడే పురోహిత బ్రాహ్మణులతో చెప్పినట్లుగా వర్ణించినాడు రఘునాథుడు సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించినాడు విశ్వనాథ ఇందొక విశేషమున్నది పురోహిత బ్రాహ్మణులకు అనావృష్టియు, తత్ఫలితమును తెలియును తెలిసినవారికి తిరిగి విషయమును వివరించుటలో వాస్తవికత యుండిన నుండవచ్చునుగాని శిల్పము లేదు అనావృష్టి వలని ఫలితములు దశరథునకు మాత్రము తెలియ ? అట్టిచో సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించుటలో మాత్రము విశేషమేమి? అని అడుగ వచ్చును నిజమే కనులముందు జరుగుచున్న విషయమును వివరించుటలో కంటె, తెలిసినదయినను ఎన్నడో జరిగిన విషయమును చెప్పుటలో నొక విశేష మున్నది గదా? దానినే విశ్వనాథ సాధించినాడు

ఇది మాత్రమేగాక మరొక రమణీయమైన కల్పన చేయుటవలన విశ్వనాథ దైన పైచేయి సవిశేషమైనది ధర్మము రాజానుమతము ధర్మహానివలన అనావృష్టియైనది తత్ఫలిత మెంతవరకు పోయినదనగా 'పాడియావుల చన్నులుపట నెత్తుధారలోడు' వరకు పోయినది అధర్మవిజయమును సూచించుటకు భారతీయుల కింతకంటె కొలమానము లేదు నాలుగైదు దినము లన్నము లేకపోయినను భారతీయాత్మ నిమ్మళముగనే యుండును గోవులేమాత్ర మస్వస్థములైనను అది కలగుండు గొనును హాహారవము చేయును అంగదేశ ప్రజాహృదయ మట్లు చేసింది రాజు మొగసాల నిలచి చేసినది అపుడు రాజేమి చేయును? చేయవలయును? అనావృష్టి అంతకు పూర్వము చాలకాలమునుండియు నున్నది తన్నివారణోపాయము రోమపాదు డాలోచించుచునే యున్నాడు అనావృష్టి వలన ఫలితములను ప్రజలనుభవించుచునే యున్నారు వహించుచునే యున్నారు ఆవులు నెత్తు లోడుటతో, కలతపడి ప్రజా హృదయము హాహారవము చేసినది దానిని రాజు చూచినాడు మాటాడలేకపోయినాడు దైన్యము వేయి మానవాకృతులతో ప్రత్యక్షమైనట్లున్న ఆ ప్రజాసమూహమును చూచి రాజును దైన్యపడినాడు ఏడ్చుచు వారిని చేవిసరి పంపినాడు పురోహితులను, మంత్రులను కనుగొని 'పాప ముర్వీపలిది, ఎకృతపు జాములు ప్రజలవి ఈ యనావృష్టి కేప్రాయశ్చిత్తమో చెప్పుడు అదియు శీఘ్రమేను గావించెదను'అని ప్రలాపించుచు నడిగినాడు అతఃపూర్వమట్లు వారి నడుగలేదు అడుగకపోయినను చెప్పవచ్చునుగదా యనిన ఆ మార్గము దుర్ఘటమనియు, చేయ నసాధ్యమనియు వారు చెప్పలేదు ప్రస్తుతము రాజు ఆ ప్రాయశ్చిత్తమెట్టి దుర్ఘటమును, అసాధ్యమును నైనను చేయుటకు నిశ్చయించుకొనినాడు నిశ్చయము వ్యక్తమైనది ద్విజులు మార్గము నుపదేశించినారు.

రోమపాదునిగూర్చి యింత వ్రాయుట కథను స్వయం సంపూర్ణము చేయుట నన్నయ భారతమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు విశ్వనాథ రామాయణమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు భారతమున ఋశ్యశృంగునకే ప్రవేశమున్నది గాని రొమపాదునకు లేదు కనుక నన్నయ ఒక గీతము, మూడు పాదముల వచనముతో రోమపాదుని స్థితిని

యెరుకపరచి వదలినాడు భాస్కర రంగనాథులకంటె రామాయణ కథా హృదయమును రఘునాథుడు కొంచ మధికముగా నర్థము చేసికొనినాడు కాని, తరచు అనౌచిత్యమునకు పాలుపడుట హేతువుగా వారిముందు నిలువజాలక పోయినాడు అనౌచిత్యములను సాధ్యమైనంతవరకు పరిహరించుచు, గాఢమైన ప్రతిభ కలిగి, రామాయణ కావ్యాత్మతో పూర్వులకంటె అధికముగా తాదాత్మ్యము ను చెందుటకు శక్తుడైన విశ్వనాథ ఇంతవరకు వచ్చిన రామాయణకర్తలలో శ్రేష్ఠుడు రంగనాథుడు భాస్కరునకు చాలడు రఘునాథ రామాయణమంతయు లభింపకపోవుట, లభించినదానిలో అనౌచిత్యపు పాలధికముగా నుండుట కారణ ములుగా రఘునాథుడు పైవారికి తీసికట్టు పూర్వ రామాయణములలో ఒక్క భాస్కర రామాయణమే విశ్వనాథ రామాయణముతో పోల్పించుకొనుటకు శక్త మైనది కథా కథనమునను, పాత్రచిత్రణమునను, మనస్తత్వ నిరూపణమును విశ్వనాథ కుశలుడగుటవలన తరచు భాస్కరునికంటె పైచేయిగా కనుపించును

అనావృష్టి దోషము నపనయించు మార్గమును ద్విజులు రోమపాదులకు చెప్పిరి ఋశ్యశృంగర్షి అంగదేశమున అడుగిడినచో వర్షము కురియునని చెప్పిరి ఆ మాట విని రాజు 'మీరు వేగనని యా మునిపుంగవుఁ దెండు' అనినా డనియు, 'ఏము చాల మవ్వరమ తపోధనోత్తముని పాలికిఁ గాంతలఁ బంపు' మని వారు ప్రత్యుత్తరమిచ్చిరనియు, అంత జనపతి వారస్త్రీలను రావించి 'మీరు చతురతతోడం జని ఋశ్యశృంగుఁ గొనిరండు' అనినాడనియు భాస్కరుడు వ్రాసినాడు 'మునినాథు నగరి కేరీతి రావింతునని విచారము చేసి మంత్రులఁ బిలచి మునులను రప్పించి యడుగ 'వారకాంతలఁ బంపు' దని వారు చెప్పి నట్లును తరువాత రాజు వారస్త్రీలను పిలచి చెప్పి పంపినాడనియు రంగనాథుడు వ్రాసినాడు రఘునాథుడు భాస్కరునివలెనె వ్రాసినాడు బ్రాహ్మణుల వలన నెరిగి బుద్ధిమంతులతో విచారించి విదగ్ధ వేశ్యాంగనలను బిలువనంపి, చెప్పి పంపినట్లు నన్నయ వ్రాసినాడు అందరును వేశ్యలనే పంపించిరి విశ్వనాథయు వేశ్యలనే పంపెను ఉచితమును, చమత్కారమునునైన నొక కల్పన చేసి పంపెను మంత్రులతో విచారించి యదికాదని, యిదికాదని పెక్కు ఆలోచనలు త్రోసిపుచ్చి దారితోఁచకయున్న సమయమున వింజామరలు వీచు వారయువతులు నలువురు తమలోతాము కన్గిలుపుకొని ప్రభువులు తాంబూలంబు దయసేయించి నచో పోయి ఆ ఋశ్యశృంగుని దెత్తుమనిరి రాజు వారిని పంపెను ఇట్లు సన్ని

వేశమును కల్పించుటలో విశేషమున్నది ఋశ్యశృంగుని వృత్తాంతమును పురోహితులు రాజునకు చెప్పుచుండగా వారస్త్రీలు వినినారు అతడు స్త్రీ పురుష భేదము నెరుగనివాడని వారి మాటలవలన వ్యక్తమైనది అట్టివానిని చూడవలయునన్న ఒక ఉబలాటము కలుగుట తగును వారకాంతల కది కలిగినది అతనిని చూచివచ్చుట రాజుగారి ప్రయోజనమును చేయుటగాదు అతనిని గొని తేరవలయుచు స్త్రీ స్పర్శ నెరుగక ముక్కుమూసుకొని యున్నవారి నెందరను తమ జాతి వెంటబడి తిరుగునట్లు చేసికొనలేదు? అట్టివారిని వశము చేసికొనుట యను నది వారస్త్రీ జాతికి గౌరవాపాదకమే యగును అది వారి జాణతనమునకు, రాసిక్యమునకును నిదర్శనము

అట్టిచో స్త్రీ, పురుష భేదమెరుగనివానిని వశము చేసికొని వెంట పడవేసికొనుట తమ జాతిలో తమ్ముతాము న్నతస్థితిలో నుంచుకొనుట అందులకు వారుత్సాహించిరి "అతనికి లోకమే తెలియదు స్త్రీ పురుష భేదముకూడ నెరుంగ"దని పురోహితులు రాజుతో చెప్పినప్పుడే వారి కాయుత్సాహము కలిగింది తరువాత మంత్రులతో నాలోచించి ఆలోచించి 'అనావృష్టిచేఁజెడియున్ మృత్యువు వద్ద నుండియు మునింజేరన్ భయంబంట' అని రాజు ఒక దీర్ఘ నిశ్వాసము విడుచు వరకు, వారస్త్రీల యుత్సాహము ద్విగుణమై త్రిగుణమై లోపలనిముడక హృదయమును భేదించుకొనివచ్చు నంతయైనది అట్లే వచ్చినది ఇంత యుత్సాహము, పట్టుదల పూర్వ రామాయణములలోని వేశ్యలకు లేదు ఉండుటకవకాశము లేదు కనుక లేదు రాజు వేశ్యలను పిలిపించి చెప్పి పంపుటకంటె వారే ముందుకు వచ్చి తాముపోయి తెచ్చెదమనుటలో గుణమున్నది క్రొత్తగా రాజుచేత పిలిపింపబడి వచ్చినవారికి ఋశ్యశృంగుని యుదంతము తెలియదు రాజుగాని, తదితరులుగాని వారి కాతని విషయము చెప్పినట్లు పూర్వరామాయణ కర్తలు వ్రాయలేదు అందువలన పూర్వరామాయణములలోని వేశ్యలు ఋశ్యశృంగుని యాశ్రమ ప్రాంతాలకు వెళ్ళుట ఋశ్యశృంగుని గుర్తించుట-ఇత్యాదులెట్లు పొసగినవను ప్రశ్నములకు సమాధానములంత తృప్తికరముగా నిచ్చుటకు వీలుపడదు భాస్కరుడు మాత్రము చమత్కరించి ఒక సమాధానమునుచెప్పినాడు ఋశ్యశృంగుడు మెలగెడు వృక్షవాటి చెంతల వారస్త్రీలు నిలిచియున్న సమయమున నొక ఋషి ఆట వచ్చిన 'ఓ మునిపుత్ర, యేల యొక్కరుఁడవుఁ జొచ్చి యీ విజన కాననభూమిఁ జరించెద'వని వారడిగినట్లును దానికి సమాధానముగా

నతడు ఋశ్యశృంగుడనువాడనని తన యుదంతము చెప్పినాడట అందువలన వేశ్యలు తమ కౌశలమును జూపుట కుపక్రమించినారట ఇది భాస్కరుని కల్పన రంగనాథునకీ సందేహము కలుగలేదు సమాధానము వ్రాయలేదు రఘునాథుని వేశ్యలు సుపరిచితమైన స్థలమును ప్రవేశించునట్లు ఋశ్యశృంగుని యాశ్రమమును ప్రవేశించిరి తప్పటడుగులు వేయుటలో రంగనాథ, రఘునాథు లొకరినొకరు మించిరి నన్నయ తానొక చమత్కారము చేసెను తాను పంపిన విదగ్ధ వేశ్యాంగనలలో నొక జరద్వేశ్యను గూడ నుంచెను అది ఆరితేరిన గడు సరి విభాండకుడు వన్యఫలాహరణార్థము వనమున కరిగిన యవసరము గుర్తించి అభినవయౌవన విలాస విభాసినియైన తన కూతు నాముని పుత్రునిపాలికి పంపిన దట ఇది నన్నయ పద్ధతి విశ్వనాథుని వేశ్యలు ఋశ్యశృంగుని కథను వినిరి విశ్వనాథ వినుపింప లేదు అట్లు కలిసి వచ్చినది "ఆ జనకుండు పుత్త్రి విరహంబు సహింపఁడు విభాండకున్ మొఱఁగిరావలె తేవలెఁ గుఱ్ఱమౌని" నను మాటలను గూడ వారు వినిరి కనుక జాగరూకులరై తాము మెలగవలసియున్న దను విషయము విశ్వనాథ రామాయణములోని వేశ్యలకు తెలియును కనుకనే, వారు 'విభాండకుని యాశ్రమంబున బండ్లు దిగి యందు విడిసి' ఋశ్యశృంగుని రాకకై ఎదురుతెన్నులు చూచుచుండిరి ఒకనాడు ఋశ్యశృంగుడు వచ్చినాడు

రంగనాథ, రఘునాథుల వేశ్యలకు విభాండకుని గూర్చిన జ్ఞానమున్నట్లే లేదు విభాండకుని యాలోచన లేక యాశ్రమమును ప్రవేశించుటవలన సమయమున కత డచటనే యున్నచో శపింపకపోడు అపుడు వారు వచ్చిన కార్యము సాధ్యము గాదు స్త్రీలను స్త్రీలుగా గుర్తించగల జ్ఞానము విభాండకున కున్నది కనుక అతడున్నచో కుపితుడై శపించుట యనివార్యము ఋశ్య శృంగుడని తెలిసికొనిన తరువాతనే భాస్కరుని వేశ్యలు ప్రసంగమునకు దిగిరి కనుక ఇట విభాండకుని శాపప్రసక్తిలేదు నన్నయ గారి జరద్వేశ్య, విభాండకుడు లేని సమయము మాచి, తనకూతు నా ఋష్యశృంగుని పాలికి పంపినది విశ్వ నాథుని వేశ్యల నుల్లయగు ప్రదేశమున నుంచినాడు అటునిటు తిరుగాడుచు ఋశ్యశృంగుడటకు రావచ్చును విభాండకుడు గూడ గావచ్చును గదా? అట్టిచో నాతడు వారిని శపింపక పోవునా యనిన, దూరముగా నున్నవారిని, పాంథులను, స్త్రీలను, అతడూరక యేల శపించును? అతడు వచ్చినపుడు వీరు హావభావ విలాసము లేల ప్రదర్శింతురు? ఋష్యశృంగుడు వచ్చినపుడు తామవన్నియు

ప్రదర్శింప వలయును గదా, అతనిని గుర్తు పట్టుట ఎట్లా? అతని కథ వారికి తెలియును గదా? అతనికి స్త్రీ పురుష భేదజ్ఞానము లేదు తనకంటె భిన్నమైన యాకృతి ప్రవృత్తి కలిగి తనవలెని యున్నవారు కనిపించినచో మానిసి ఎంత వింతగా! చూచును ఆ వింతదనము, ఋష్యశృంగుడటకు వచ్చినపుడు కప్పిపుచ్చ కొనలేదు దానిని బట్టియే గ్రహింపవచ్చును విభాండుకున కట్టి ప్రవృత్తి యుండదు కనుకనే వేశ్య లుల్లయగు ప్రదేశమున దిగినారని విశ్వనాథ వ్రాయుట

యదృచ్ఛాగమనంబున నాలినాడు ఋష్య శృంగుడు వేశ్యలు విడిసి యున్న కాంతారాభిముఖుడై వచ్చినాడు వారు చూచిరి వీణయు, మృదంగ మును, తాళములను మ్రోయించిరి నాయకురాలు గొంతెత్తి కృతులు, వర్ణములు పాడినది వేశ్యలు గానము చేసినట్లు రంగనాథుడు, భాస్కరుడు వ్రాసిరి రఘు నాథుడట్లు వ్రాయలేదు నన్నయ, ఋశ్యశృంగుని చేరిన వేశ్యముని ముందటఁ గందుక నర్తన మృదు గీతములయందుఁ దన కౌశలమెల్లను జూపి, విరచితా లింగనయై, మునిపతికి ముదము గావించెమది'నని వ్రాసినాడు విశ్వనాథ, భరత శాస్త్ర సరణిని బాడిన యా పాటలు వినిన ఋశ్యశృంగునిలో కలిగిన అంతరము లయిన మార్పులను వర్ణించెను ఇది పూర్వకవు లెవ్వరును చేయని పని మానవ జీవితముపై గానకళా ప్రభావమెంత యుండునో ఈ ఘట్టమున విశ్వనాథ నిరూ పించినాడు సంగీతము మానవుని ఎంత చైతన్యవంతునిగా చేయగలదో అంత చేసినదా వేశ్యల సంగీత మా ఋశ్యశృంగుని గానము చేసినారని చెప్పుటలో లేదు గొప్పతనము దాని ప్రభావమును, తత్ఫలితమును చెప్పగలుగుటలో నున్నది అదియే విశ్వనాథ చెప్పినాడు

ఆ గానము వినుచున్న ఋష్యశృంగునకు "తన యాత్మఁ దానెరుంగని యొక్క యానందపరిధి రేఖాస్వాయం వ్యక్తి కలిగి మైగగుర్పొడిచి వెనుకటి బిగుపు చెడి క్రొత్త బిగువులను దెచ్చుకొని''నదట కనులు విచ్చి చూచుచు నిలువబడి పోయినాడు ఋశ్యశృంగుడు అంత వారు నృత్యము చేసిరి నాలుగం బుధులవోలె చేసిరి నర్తన కళా ప్రదర్శనమును గూడ చేసినారని మాత్రము రంగనాథుడు వ్రాసినాడు కేవలము నర్తనము చేసినారని గాక ఎట్లు చేసిన దియు విశ్వనాథ వ్రాసినాడు నాట్య శాస్త్రముతో వానికిగల పరిచయమున కిది

నిదర్శనము ఉచిత స్థలమున శాస్త్ర పాండిత్యమును ప్రదర్శించుటకు మహా కవులు చేయుదురు విశ్వనాథ ఆ కోవలోనివాడు సంగీతము, నృత్యమును, 'విని విని, చూచి చూచి కనువేదుఱు తీరఁగ వారిఁజేరి' నాడు ఋశ్యశృంగుడు కనులు చెవులు సుతరితముగా నొనరించినారని వారల పొగడి, ఆనందాతిశయ మున వారిని అలనల్లన స్పృశించి కౌగిలించుకొనినాడు ఒక తెలియగరాని సుఖానుభూతికి లోనయినాడు పూర్వ రామాయణములలో కౌగిలి ప్రసక్తి లేదు 'ఒదలెంతయుఁ బులకింపఁగ పుడికి'నారని మాత్రము వేశ్యలను గూర్చి భాస్కరుడు వ్రాసెను ఆలింగన ప్రస్తావన భారతమున నున్నది భాస్కరుడు - మఱు నాడు వచ్చినపుడు వేశ్యలు వానిని పలుమాఱు కౌగిలించుకొనినా రనినాడు నన్నయ, విశ్వనాథ లిరువురును మొదటినాడే కౌగిలింతలు జరిపించిరి నన్నయ ఋశ్యశృంగుని వేశ్యయే కౌగిలించుకొన్నది విశ్వనాథ ఋశ్యశృంగుడు తానే వేశ్యలను కౌగిలించుకొనెను ఈ విషయమున నన్నయ విశ్వనాథలకు భేద మున్నది నన్నయ సంయమనమున కిచ్చిన ప్రాధాన్యము కళా ప్రభావమున కీయ లేదు విశ్వనాథ కళాప్రభావము సంయమనమును లోగొనగలదని నిరూపించినాడు

నన్నయ వ్రాసినది కావ్యముగాదు కావ్యత్వము నిముడ్చుకొనిన ఇతి హాసము విశ్వనాథ వ్రాసినది ఇతిహాసముగాదు ఇతిహాసరేఖల నిముడ్చుకొనిన కావ్యము ఇది సర్వమును రసపర్యవసితము కావలయును అందుకే నర్తన కళా సంగీత తతులను, వానియాథార్థ్య స్వరూపమును చిత్రించినాడు విశ్వనాథ భారత మున సంయమనమునకు ప్రాధాన్యమున్నది కనుకనే, తరువాత విభాండకునితో ఋశ్యశృంగుడు జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినట్లు తూచా తప్పకుండ చెప్పినట్లు నన్నయ వ్రాసినాడు రామాయణ కర్త లెవరును ఈ పని చేయలేదు చేయగూడదు గనుక చేయలేదు చేయవలయును గనుక నన్నయ చేసినాడు భారతములోని ఋశ్యశృంగునకు వేశ్య చూపిన కంచుక నర్తన మృదుగీతముల యందలి కౌశలమువలన ముదము గలిగింది రామాయణమునందలి ఋశ్యశృం గునకు తన యాత్మఁదానెఱుగని ఒక అనందము కలిగినది

ముదమునకంటె అనందము గొప్పది అనందము కలిగినది గనుకనే విశ్వనాథ ఋశ్యశృంగుడు వారిని తానుగా కౌగిలించుకొనినాడు భారతమున నన్నయ్య ఋశ్య శృంగర్షియందు నిగ్రహమును పరాకాష్ఠలో చూపినాడు తన

కౌశలము చూపి విరచితాలింగనయైగాని భారతమున వేశ్య మునిపతికి ముదము గావించలేకపోయినది అధిక నిష్ఠాశీలుడైన ఋశ్యశృంగుని స్థితి భారతమున నన్నయ అట్లు చూపినాడు వేశ్యలను ఋషి కుమారులనియే రెండు గ్రంథముల లోని ఋశ్య శృంగుడును తలచినాడు కనుక రెండింటియందును కామవాంఛ రేఖా మాత్రముగానైనను వాని హృదయమున పొడగట్టలేదు స్త్రీ కళా ప్రభావము నకు లొంగిన వానిగా చిత్రించుట మూలముగా, కొందరు ఋశ్యశృంగునకు వేశ్యలయందు కామిక మేర్పడినదని తలతురేమోనని విశ్వనాథ, అంతగా వ్రాసియు చివరకు 'అసమశరుడు తొంగిచూడడు ముని ఋశ్య శృంగువంక' అని స్పష్టము చేసినాడు అంత యానందమును గూర్చిన వారి యాశ్రమ భూము లొకమాఱు చూడవలయునన్న సాత్వికపు కోరిక మాత్రము కలిగినది ఋశ్య శృంగునకని విశ్వనాథ వ్రాసినాడు చనుదెంచిన 'తరుణి మునినందను చిత్తం బునకు వైకృతముఁజేసె'నని మాత్రము నన్నయ వ్రాసెను మఱునాడు ఋశ్య శృంగుడు వారివద్ద కేగెను పోదమాయనిన పోదము పోదమనుచు కదలి అందరును అంగదేశము చేరిరి అంతట వర్షము కురిసెను అదివర కేమియు తెలియని ముని కుమారుడు అంగదేశ ప్రవేశ మాత్రమున సర్వమును గ్రహించెను

సహజబోద్ధలు నిశ్చలతత్త్వమానసులని విశ్వనాథ సమర్థన నన్నయ కూడా తన భారతమున నొక విషయమును సమర్థించినాడు అది విశ్వనాథ సమర్థించిన దానికంటె భిన్నము వేశ్యను మఱునాడు ఋష్యశృంగు డనుసరించు టను 'విలాసినుల సహాలాప సహాసన సహయానములు బంధసమములు' అను సిద్ధాంతమును చూపి సమర్థించినాడు ఇనుప కచ్చడాలు కట్టుకొనిన మునులను కూడ స్త్రీల మెయితావు గగుర్పొడించును ఇక సామాన్యుల విషయము చెప్ప వలసిన దేమి? అను విషయమును నిరూపించుటయే నన్నయ యుద్దేశము తపస్సమాధిగతిచేతస్కృత మానవుని అత్యున్నత స్థానమున నిలుపగలదని వైదిక మైన యభిప్రాయము వేదతుల్యమైన భారతమును వ్రాయు నన్నయ కున్న దియు నదియే 'సచ్చరిత్రంబైన తన యాశ్రమంబు విడిచి మనుష్యయోగంబునం దగిలి యక్కోమలి పిఱుందన చని' యొనని ఋశ్య శృంగుని గూర్చి నన్నయ వ్రాయుటలో సమర్థమదియే వాస్తవమును చెప్పి అవసరమును నన్నయ సూచిం చినాడు ఆ సూచనకే ఋశ్యశృంగుని కథను వ్రాసినాడు ఋశ్య శృంగర్షిపట్ల

పొడసూపిన వాస్తవిక విషయమే రామాయణమునకుముఖ్యము సాంసారిక విషయ పరిజ్ఞానము ఋశ్యశృంగునకు కలిగినట్లు వ్రాయవలసిన యవసరము భారతకర్తకు లేదు ఆత్మసంయమనమును నిరంతరమును ఈషణత్రయము భేదించుటకే చూచుచుండును కనీస మాజ్ఞానము లేని వానినిగూడ అవి లోగొనునని వ్రాయుట భారతకర్త చేయదగిన పని దానినే నన్నయ చేసినాడు సాంసిద్ధికమైన సాంసారిక విషయ పరిజ్ఞానము కలుగుటయే రామాయణమునకు కావలయును ఋశ్యశృంగున కది కలిగినది దానిని విశ్వనాథ సమర్థించినాడు

ఉచిత స్థలమున దేనిని సమర్థించుట యవసరమో దానిని సమర్థించుట మేధావంతులు చేయగలరు నన్నయ విశ్వనాథ లట్టివారు ఋశ్యశృంగుని ప్రవేశ పెట్టినప్పటి నుండియు నన్నయ నిగ్రహము వైపునకు ములు చూపించుచు నడిపించి నడిపించి చివరకు 'విలాసినుల బంధ సమములు గావె' అను సూత్రమును వ్రాసి ఋశ్యశృంగుని వేశ్యవెంట పంపినాడు విశ్వనాథ ఋశ్యశృంగుడు గానమును వినుటకు ప్రారంభించినప్పటి నుండియు ఆ మహర్షిలో ఎక్కడనో, అందని లోతులందు, అంకురింపకయే చివికిపోయిన భావ సముదాయము, ప్రాణము పోసికొని నెమ్మదిగా పైకివచ్చి, చివరికొక క్రొత్త బిగువు కూర్చుకుని పూర్వమననుభూతమైన ఒక ఆనందానుభూతిని అతనికి కలిగించినట్లుగా వ్రాసి, తరువాత నతడు వారిని కౌగలించుకొని మాటాడి, వారిచ్చిన భక్ష్యముల నారగించి, తదుపరి తన యాశ్రమమునకు పోయి 'దిన దినము నాదేయును వారలఁ గూర్చి యూహ లూహించుచు ప్రొద్దున లేచి' వేశ్యలున్న చోటకు వచ్చి, వారితో కలసి అంగదేశమునకు వచ్చినట్లు వ్రాసినాడు నన్నయ ఋశ్యశృంగుని నొక మార్గమున నడిపించినాడు విశ్వనాథ మఱొకట నడిపించినాడు నన్నయ దృష్టి సంయమనము మీద విశ్వనాథ దృష్టి సంసారము మీద భారతమునకు నన్నయ యవసరము రామాయణమునకు విశ్వనాథ యవసరము ఋశ్యశృంగుని సంసారము వైపు త్రిప్పుటకు విశ్వనాథ సంగీతమును సాధనముగా వాడినాడు సంగీత శ్రవణ మాత్రమున మహర్షియట్లు బిగువు చెడి లోబడునాయని ప్రశ్న అట్లయినచో నాతని మహర్షిత్వము కుంటువడిన యట్లెగదా? కొంచము కుంటు పడవలయును అట్లు పడినపుడే భారత రామాయణ కర్తల నిరూపణము రక్తి గట్టును సంగీత మట్టి ప్రభావమును చూపగలదని తులసీదాసు కూడ వ్రాసినాడు సీతారాముల కళ్యాణ సమయము నందలి గాన కళా ప్రదర్శనమునకు

మహర్షులు, ధ్యానముద్ర విడి ఒక ఆనందము ననుభవించిరని తులసీదాసు వ్రాసి నాడు మహర్షుల తపోభంగము చేయుటకు వచ్చిన స్త్రీ జనము గానకళా నర్తన ప్రదర్శనము మునుముందు చేసినట్లుగనే మన పూర్వ గ్రంథములు చెప్పుచు న్నవి కనుక గానకళకు సంయమి లోబడుట వింతగాదు

విశ్వనాథ ప్రదర్శించిన కథాకథన శిల్పమును పూర్వులతో పోల్చి స్థూల ముగ పైన నిరూపించితిని ఋశ్య శృంగ పాత్ర విషయమున నన్నయ, విశ్వ నాథలకున్న దృష్టిభేదమును గూడ కొంత వ్రాసితిని నన్నయ, విశ్వనాథలలో నున్న ఈ రెండు విశేషములు భాస్కరాదులలో లేవు నన్నయకు లేని యవ సరము విశ్వనాథ కున్నందున కథను స్వయంసంపూర్ణము చేసినాడీతడు. ఆ చేయుటలో రోమపాదుని పూర్తి మూర్తిని చిత్రించుట యొకటిగా వెనుక నిరూ పించితిని ఇక వేశ్యల పాత్రములున్నవి వారి విషయము వ్రాసినగాని ఈ వ్యాసము సంపూర్ణము గాదు

విశ్వనాథ, రాజునకు వింజామరలు వీచుచున్న వేశ్యలతో రంగము ప్రారంభించెను వారునలువురు కుసుమశరకోదండలస్తకమధ్యలు, తత్కార్ముక భ్రూయుగలు, తజ్జ్యాతనూలతలు— అగు వారయువతులు నలువురని వ్రాసి నాడు నలువురకునూ మూడు విశేషణములు వాడినాడు నలువురకును నాలుగు వాడవచ్చును గదా— వాడలేదు అందరి మధ్యములు, అందరి భ్రూవల్లులు, అందరి తనూలతలు కూడ కుసుమశరకోదండుని లస్తకమును వలెను, కార్ముక మును వలెను, జ్యా వలెను నున్నవట ఇందొక విశేషమున్నది అందరును, అన్నిటివలె నున్నను, ఒక్కొక్కరియందు ఒక్కొక్క గుణము త్రిగుణమై యున్నది మరి నాల్గవదాని మాట— చెప్పబడలేదు మిగిలినవారి యందువలె గాక ఈమె యందన్ని గుణములును మూర్తిగట్టుకొని యున్నవి ఈమెయే నాయకురాలు వీణయును, మృదంగమును, తాళములును మ్రోయించుటయే పై ముగ్వుర పని గొంతెత్తునది నాయకురాలు ఈమెను, ఈమె పాటను చూచుటనే, వినుటనే మునుముందాముని బిగువు చెడినాడు ఆ ముగ్వురయందు కంటె నాయకురాలియందొక విశేషముండవలెననే, విశ్వనాథ ఆమెకు ప్రత్యేక ముగా నొక విశేషణము వాడలేదు సూచించినాడు రాజుతో మాటాడినది నాయకు రాలు ఆమె గడుసరియట కనుకనే 'మౌనీంద్రున్ గొని మమతం దెత్తుణా,

తేనుంజాలక ధృతిరానే, రానీపట్టణరమ నిగిల్లిఁక" అని 'పణవము' కొట్టి చెప్పినది ఆ గడుసరినకుతనమునకు రోమపాదు డచ్చెరువడి "ముని శాపభీతి మీకు లేదో భీతహరిణ నేత్రలార! యన లవిత్రముల్ వోవిచూవులు నిగుడ్చి మందముగా హసించినా"రట వారస్త్రీలు భీతహరిణ నేత్రలార యని రాజనగానే లవిత్రముల్ వోని చూపులనిగుడ్చి పై పెచ్చు మందముగా హసించినా రనుటలో నున్నది కవిత్వము వ్యంగ్యవైభవవాసన యనగా నది

హరిణనేత్రము లందముగా నుండును హరిణమునకు బిత్తరపోవు గుణ మొకటి సహజము ఆ గుణము దాని నేత్రాపాంగములలో వ్యక్తమగుచుండును అదియే ఆ నేత్రముల కందము స్త్రీల కన్ను లట్లుండునని వర్ణించుట కవిలోక సామాన్యము ఊరకే హరిణము భీతిగొనును నిజముగా భయమే సంభవించి నపుడు దాని కన్నులు చూడవలసినదేగాని చెప్పనలవిగాదు రోమపాదుడా వేశ్యలను భీతహరిణ నేత్రలార యని సంబోధించినాడు వారు రాజునకు పరి చారికలు హరిణ నేత్రలైనవారు రాజుగారిని చూడగనే భీతహరిణ నేత్రలగుట వారి కలవాటు అది మర్యాద అతఃపూర్వము రాజు వారి భీతహరిణ నేత్రములనే చూచినాడు నేడు వారు తాముగా ముందుకు వచ్చి ఋశ్యశృంగర్షిని గొనితెత్తు మనినారు హితులు, పురోహితులు, మంత్రులు మునిని చేరుటకు భయపడు చుండగా వారు తెత్తుమని ముందుకు వచ్చినారు రాజును నచ్చెరువడినాడు తాను ప్రతిదినమును చూచు భీతహరిణ నేత్రలేనా వీరు? అను సందేహము కలిగి నది భీతహరిణ నేత్రములుగా కనిపించు మీకు మునిశాపభీతిలేదేమి యనినాడు అపుడు వారు భీతహరిణ నేత్రలు కారుగదా, హరిణ నేత్రలు కూడ కాకుండ లవిత్రముల్వోనిచూపులు నిగుడ్చిరి ఈ హరాత్సంభవమునకు రాజచ్చెరువడి గ్రహించుకొనినాడు మా అసలు విషయము ప్రభువులకు దెలియదేమియని మందముగా హసించిరి లవిత్రములువోనిచూపులు నిగుడ్చుట వారు నేర్చుకొనిరి ఆ నేర్పునంతకుపూర్వము ప్రదర్శించవలసిన యువసర మేర్పడలేదు భరతు నాగమమెల్లను ప్రయోగవైఖరి దెచ్చినవారు వారు ఆ చూపులు నిగుడ్చుట వారి కొక లెక్కయా? అలవోకగా వారట్లు చూచిరి ఆ చూపులు రాజునకు వారి గుండెనిబ్బరమును చూపినవి రాజు వారి నంపినాడు విశ్వనాథ వ్రాసిన ఆ యాటవెలది పద్యములోని ఆ రెండు వాక్యములలో నింత అర్థమున్నది ఈ పద్ధతిని నన్నయ వ్రాయగలడు లవిత్రములు వోని చూపులు వారుచూడగా

వారి గుండెనిబ్బరమును తెలిసికొనుటయే గాదు రోమపాదుడు చేసినది, ఋశ్య శృంగుని తప్పక ఆ చూపులను మెడకు తగిలించి తీసికొని వత్తురు - అతడు వచ్చును - అని తాను ముందు గుండెనిబ్బరము చేసికొనినాడు క్షణములో నింత వ్యవహారమును రెండు వాక్యములలో చెప్పి భాస్కరాది పూర్వ రామాయణ కర్తలను మించినాడు విశ్వనాథ

వేశ్యలు బయలుదేరినారు 'జాతిని గూడ మాదు మెయిజాపు గగుర్పొడి పించు నీట్టదే చేతము గల్గువారి నిఁకఁజెప్పుమటంచును గువ్వకోలుగా నవ్వుచుఁ ద్రుళ్ళుచు - మధ్యమధ్య - 'ఓసి నవ్వెక్కువ నీకు' అని పరస్పర మనుకొనుచు బయలుదేరినారు విభాండకుని, ఋశ్యశృంగుని తలంచుకొనుచు వెళ్ళినారు 'విభాండకున్ మొఱఁగిరావలె'నను వాక్యము వారు మరచిపోలేదు కనుకనే మార్గమధ్యమున 'మౌని కోపంబున నోసి మిమ్మ నెవరిందు పంపినారన్న భూవరుని చెప్పకుడు, ఏమె వచ్చితి మన పాడౌనా బీడౌనా' అని యనుకొని నారు ఇది వారి స్వామిభక్తికి నిదర్శనము ఇట్టి సమయములందు తప్ప వారు రాజానకు చేయు సాహాయ్యము మరి యొకటి లేదు ఇట్టి యవకాశములు మాత్రము తరుచు వచ్చునా -? ఋశ్యశృంగుని గొని తెచ్చుట కుపక్రమించు టలో వేశ్యల కుత్సాహముతో పాటు ప్రభు భక్తియు నిరూపించి విశ్వనాథ వారి కొక యున్నతి కలిగించినాడు ఇంత ప్రభుభక్తి పరాయణలు గనుకనే, ఋశ్యశృంగుడు తమ్ము సమీపించి ఉరములు తాకుచు, పిరుదులు ముట్టుచున్న సమయమున 'భూపశ్రేష్ఠుని కూఁతు పెన్మిటనుచున్ బూజింతు రమ్మౌని' నని విశ్వనాథ వ్రాయుట సంగీత నర్తన కళా కౌశలము నెరపిన తరువాత ఋశ్య శృంగుడు వారిని సమీపించి యెన్నియో ప్రశ్నలడిగి వారలను కౌగిలించుకొని ఉరములు - ఆననములు - పిరుదులు స్పృశించుచున్నంతసేపును వారేమియు మాట్లాడలేదు సాద్భుతమగు నా సన్నివేశమున వారు మాట్లాడలేదు తాము మాట్లాడక ఋశ్యశృంగుని యౌత్సుక్యమును పెంచిది 'ననున్ మీవెంటఁ గొంపోదురో? మీ పుణ్యాశ్రమ హోమకర్మలుగనన్ మేలౌను నా గుండె' కని యాతడనిన తరువాత 'మా యాశ్రమమున నన్నియుఁగనక సౌధములు గల' వనిరి ఇది యాతడడిగిన ప్రశ్నకు సమాధానము గాదు ఇంకను నతని కొక అస్తిత్వమున్నదా? లేక తమ చేతిలోని వాడైనాడా? అను విషయమును స్పష్టము చేసికొనుటకు వారా వాక్యము పలికిరి. వానికి అస్తిత్వము లేదు ఉన్నచో తన

ప్రశ్నకు సమాధానమును ముందిమ్మని కోర యుండెడివాడు లేదు కనుక నేకనక మన నేమని వారి మాట నందుకొని యడిగినాడు వారేది పలికిన నదియే అతని చెవి కింపుగా నున్నది కనుక మననేమో వారు చూపి చెప్పిరి అట్లయిన తప్పక వత్తుననినాడు ఈ రెండింటికిని సంబంధము లేదు తెలియకుండనే వారియందొక గౌరవము, వ్యామోహ మేర్పడినది ఋశ్యశృంగునకు వారి ననుసరించవలయు నన్నంత ఉత్సాహ మాతనిలో వారు రెకెత్తించిరి వారిచ్చిన భక్ష్యములు సేవించుచు మరల 'నన్నాహ్వానించుట కేదియైనఁ గలదా యభ్యంతర?' మని యడిగినాడు వారికి నమ్మక మేర్పడినది మూడుమారు లతనిచేత నడిగింపించి 'తమరున్ జనుదెంతురా? యాతిథేయమందిచ్చెద మింతకన్న వలెనే చరితార్థుల మమ్ముఁజేయగ' ననినారు అతడు తృప్తిపడినాడు తన యాశ్రమమునకు వారి నాహ్వానించినాడు వారంతట 'మిమ్ములబట్టి నిల్పితిమి మేమును బోవలె మాకు ప్రత్యవాయమ్ములు పుట్టు తక్షణమయార్చవలెన్‌జని మీదు నాతిథేయమ్ములు మాకు వచ్చె భవదాగమనార్థమ యుండు మందురా మమ్ముల నిందెయెల్లి' అని బ్రాహ్మణ సంప్రదాయముననుసరించి మాట్లాడినారు మంచిదట్లే యుండుడని చెప్పి తన తండ్రి యుటజము చేరువేళ యైనదని చనినాడు ఋశ్యశృంగుడు

తాము నిర్వహించవలసినదంతయు జాగరూకమై నిర్వహించిరి అతడు పోయిన తరువాత వారికొక భయముపట్టుకొన్నది ఈ యమాయిక వ్యక్తి జరిగినదంతయు తండ్రియైన విభాండకునకు చెప్పునేమోనని వారి భయము చెప్పినచో క్రుద్ధుడై వృద్ధమౌని వచ్చినచో నిక తమ పాట్లు పెరుమాళ్ళకే ఎరుక మరునాడు ఋశ్యశృంగుడు వారిని చేరవచ్చువరకు వారికా భయమున్నది అంత వరకు వారు ముండ్లపై కూరుచున్నటుల బాధపడినారు ఎంత గడుసువారలైనను వృద్ధమౌనివలని భయ మిప్పుడు వారికి కలిగినది ఇది సహజము ఇపుడు వారు భీతహరిణి నేత్రలు తండ్రికి చెప్పినాడో లేదో తెలియదు గాని విభాండకుడు మాత్రము రాలేదు మరునాడు ఋశ్యశృంగుడే వచ్చినాడు వారియత్నము సఫలమైనది అందరును అంగ దేశమునను వచ్చినారు వర్షము కురిసింది దేశ ప్రజలకు హర్షము కలిగినది అంగదేశము ప్రవేశించుటతోడనే లౌకిక వ్యవహార రహస్యములన్నియు నా ఋషి కుమారునకు తెలిసిపోయినవి అంత రోమపాదుడెదురు వచ్చి శీర్షక మాతని పదాబ్జముల చేర్చి, ఆత్మజ నిచ్చి వివాహము చేయుదునని శాంతను పిల్చి చూపగా ఋశ్యశృంగర్షి లజ్జయొత్తిడిబడి మొగము

వాల్చగా "మజ్జారే! పురికిన్ వనంబునకు నీ మాత్రంబు ఖేదంబటంచజ్జల్ ప్రోవులు వారముఖ్యలు సురంటంటించి గెంటించుచు పరిహాసములు" చేసిరట అంత శాంతకును, ఋశ్య శృంగునకును వివాహము చేసినాడు రోమపాదుడు

ఋశ్యశృంగోపాఖ్యానమున వేశ్యల నింత కట్టు దిట్టముగా పూర్వ రామాయణ కర్తలు దిద్దలేదు ఈ విషయమున మాత్రము భాస్కరాదులకంటె రఘునాథుడు కొంత నయము అతడు కూడ ఋశ్యశృంగునకును, వేశ్యలకును జరిగిన సంభాషణముగాక, వారి వారి చేష్టల నభివర్ణించినాడు వేశ్యలను గూర్చి ఋశ్యశృంగుడును, ఋశ్యశృంగుని గూర్చి వేశ్యలును మనస్సులలో ఏమేమను కొనిరో కొంత విపులముగా రఘునాథుడు వర్ణించినాడు వేశ్య లనుకొనిన విషయము లన్నియు అతి సామాన్యములు అందు కొన్ని పేలవములు కొన్ని అనౌచితీదోష దూషితములు వారు దక్షిణాంధ్ర యుగమునకు సంబంధించిన వారేగాని, రామాయణ కాలమునకు, అంగదేశమునకు సంబంధించినవారు గారు వారిని చూచిన ఋశ్యశృంగునకు కలిగిన ఆంతర భావములను వ్యక్తీకరించుచు వ్రాసిన మూడు సీస పద్యములలో నొకటి అత్యుత్తమము ఒకటి ఉత్తమము ఒకటి అధమము

అబ్బురంబుగ నెద గుబ్బకొమ్మలు మొల్చె
    ఘనులు వీరౌర నాకన్న ననుచుఁ
బదములఁ బొడమెడుఁ బద్మము ల్వీరల
    మహిమ యెంతటి వింత మహినటంచు
ఘనములు వెనువెంటఁ గదియుచున్నవి జల
    దాకర్షణము వీరి కబ్బెననుచుఁ
బలుకుల నమృతంబు దొలఁకెడు బళివీర,
    లమృతాంధసులకన్న నధికులనుచుఁ
గాన మెన్నఁడు నీ సామగాన గరిమఁ
గరిన పాషాణముల నీరుగాఁ గరంచె
నంచు మదినెంచి పలుమఱు నరుదు పడుచుఁ
గొమ్మకొన యూగఁ దలయూచికొనుచుఁ జేరె!"

(రఘునాథ రామాయణము ఆ 2, ప 157 )

ఈ పద్యము తరువాత నున్న రెండు సీసపద్యములును నతని చేష్టలను వర్ణించునవి చేష్టలకంటె భావములను సృష్టించుటలో గొప్పతనమున్నది పై పద్యములో రఘునాథు డదియే చేసినాడు అతని రామాయణమున సర్వత్ర ఇట్టి భావకల్పన కనుపించదు అనౌచిత్యము లెక్కువ ఋశ్యశృంగునకు వేశ్యలను చూచినపుడే పై భావము కలిగినట్లు పూర్వ రామాయణ కర్త లెవ్వరును వ్రాయ లేదు విశ్వనాథ సర్వమును నానందములో లీనము చేసినాడు రఘునాథుని వేశ్యలకు సంభాషణచాతుర్యమే లేదు భాస్కరాదులంత చాతుర్యమును చూపక పోయినను వేశ్యలచేత అధిక ప్రసంగము చేయింపలేదు రఘునాథుడు చేయించిన దంతయు నదియే ఏమి దిద్దినను విశ్వనాథ దిద్ది తీర్చినాడు వేశ్యలను

రోమపాదుని దీనస్వరూపమును, పురోహితుల యుచితజ్ఞతను, వేశ్యల నెరజాణతనము - ఉచిత ప్రవర్తనమును, ఋశ్యశృంగుని అమాయక ప్రవృత్తిని కమ్మచ్చున తీసినట్లు చిత్రించినాడు విశ్వనాథ ఋశ్యశృంగుని పాత్రచిత్రణమున విశేషమైన వైదుష్యమును ప్రదర్శించి నన్నయతో తౌల్యము తెచ్చికొనినాడు వేశ్యల విషయమున నొక యుదాత్తతను కల్పించి, పూర్వరామాయణములను మించి ఋశ్యశృంగోపాఖ్యానమును తేజోవంతము చేసినాడు పాత్రల మనస్తత్వ వ్యక్తీకరణముననను, అర్థ గాంభీర్య ప్రతిపాదక రచనాకౌశల్యముననను విశ్వనాథ తిక్కనను తలపించుచున్నాడు మహా కవుల గ్రంథములనువలె విశ్వనాథ రామాయణమును మననము చేసి చేసి ఒక మాట మాటాడవలయును

# ఒక భక్తి రచన

ఈ యొక రెండు కావ్యముల నీ తెనుగుంబ్ర
ఱ జన్మజన్మముల్ ధ్యేయ మొనర్చియున్ ఋణము
తీర్చగ శక్తముగాదు, భారతా మ్నాయము పూర్వకావ్యముల
నవ్యకవీంద్ర కృతమ్ములందు రామాయణ
కల్పవృక్షమ ధరాధరి తాంధ్రమహా మహీస్థలిన్

—విద్వాన్ వనమా వేంకటరమణ గుప్త

వాల్మీకీయములు శ్లోకములు ఈ మన మహాభారతముయొక్క జీవనాడుల లోని కదలికలను గర్భమున ఇముడ్చుకొనినవి వైశ్వనాథములు, రామాయణ పద్యములు భారతాంతర్భాగ మహాంధ్ర జనతా హృదయ స్పందనకు ప్రతి ధ్వనులు అసలు రామాయణ మైహికముగా మానవ జీవన విధానమున కొక ఆదర్శము ఊర్ధ్వగతికైన ఒక సోపానపంక్తి అట్టి రామాయణము దేశకాలము లకు సంబంధించిన ముద్రలతో ఇంతకుపూర్వము భారతదేశమునందలి కొన్ని ప్రాంతీయ భాషలలో అవతరించినది ఈ శతాబ్దమున మన సమకాలమున మన తెనుగున అట్టి రామాయణ మావిర్భవించుచున్నది ఈ ఇరువదియవ శతాబ్దము మన వాఙ్మయ చరిత్రమున నొక విశిష్టమైన స్థానమును సృష్టించుకొన్నది కవి త్రయముతో పోలికకు సిద్ధమై నిలచిన శ్రీ కృష్ణ భారత మీ శతాబ్దముది పోతనగారి భాగవతముతో కలిసి నిలచుట కుద్భవించిన శ్రీ రామనృసింహ మూర్తి కవుల భాగవతమీ మన సమకాలముది భాస్కర రంగనాథాదులతో పోలికకై కల్పవృక్ష స్వరూపమున ప్రాదుర్భవించుచున్న రామాయణము మన ముందున్నది వైదేశికములగు బహువిధములగు వాఙ్మయ ప్రక్రియ లీ శతాబ్ది మున స్వస్వరూపములను దిక్కదిద్దుకొన్నవి ఇంత వైవిధ్యమును వైశిష్ట్యమును కూర్చుకొనిన వాఙ్మయరంగమును సృష్టించిన ఈ శతాబ్దమున నున్న మనము ధన్యులము ఆ వైవిధ్యములోని ఆంతర్యమును, తత్సంబంధి సౌందర్యమును అవగాహన చేసికొని అనుభవమునకు తెచ్చుకొనినవాడే మనధన్యతకు సార్థకత యేర్పడును ప్రస్తుతము మనము కల్పవృక్షచ్ఛాయలలో నున్నాము మనమందర

---

ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం, ఆగస్టు 25 1957

ముసు సహృదయులము ఈ మహావృక్షముయొక్క ఈ స్థితికి హేతుభూతు డైన మహాకవికర్షకుడును మనలో నున్నాడు ఆయనకు నమోవాకములు ఆయన యనుమతింబడి కొన్ని విషయములు తమకు మనవి చేయుదును

ఇది రామాయణమా? సీతా చరిత్రమా? పౌలస్త్యవధయా? రఘుకుల కథయా? ఏది? ఇది రాముడు మూలముగా గల సర్వమును రామమూలమైన ఒక మహావృక్షము శ్రీమద్రామాయణము మహావృక్షములు చాల యున్నవి ఇది అన్నింటివంటిది గాదు ఈ మహావృక్షము పేరు కల్పవృక్షము ఈ కల్పవృక్ష సృష్టి వాల్మీకి మహర్షిదేగాని సత్యనారాయణగారిది కాదుగదా? కాదు అట్టిచో వాల్మీకి పెట్టని పేరు నీయన పెట్టుట యేల? వాల్మీకి కృత రామాయణము నందలి కల్పవృక్షత్వమును దర్శించి దానిని ప్రపంచింపదలచినవా డగుటచేత నీయన తన రామాయణమున కీ పేరు పెట్టెను అట్లయినచో ఇతఃపూర్వము తెనుగున రామాయణము లున్నవిగదా? తత్కర్త లామూలమునందలి కల్ప వృక్షత్వమే నర్థము చేసికొనలేదా? చేసికొన్నచో వారేల తమ రామాయణముల కీ పేరు పెట్టుకొనలేదు? అర్థము చేసికొనలేదని పూజ్యులైన పూర్వ రామాయణ కర్తలను గురించి నేను చెప్పలేనుగాని, నాటివారికి రామాయణాంతర్గత మహార్థ మిప్పటి మనకంటె కొన్నిరెట్లధికముగా బోధనపడినదని మాత్రము చెప్పగలను నాటివారికి అక్కరపడిన పరమ విషయము మోక్షము మోక్షము పరమునకు సంబంధించినది ఇహములేక పరము లేదు రామాయణము భారతీయమైన ఒక మహా సంసారమును చిత్రించినది భూవివములను తాకుచు నిలిచిన ఒక మహా వ్యక్తి రాముడు ఆతనిది దివ్యాదివ్య ప్రకృతి తత్ప్రకృతియందు లగ్నమైన మనస్కత యున్నచో ఇహ పరములను సాధించుకొనవచ్చునన్న ప్రగాఢమైన విశ్వాసము నాటివారి కున్నది ఇహపరములు రెండింటిని రామాయణము సమ కూర్చుచున్నప్పుడు - సమకూర్చునన్న నమ్మకముతో నాటి ప్రజలున్నప్పుడు రామాయణమునందలి కల్పవృక్షత్వమును వాచ్యము చేయవలసిన యవసరము నాడు లేకపోయినది నన్నయభట్టు భారతము వ్రాసెను తిక్కనయు వ్రాసెను "నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద"నని నన్నయ వ్రాయగా తిక్కన "మహా కవిత్వ దీక్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్" అని భారతరచన కుపక్రమించెను నన్నయయు మహాకవిత్వదీక్షావిధి నొందియే చేసినంతవరకు మహాభారత రచన చేసెను కాని, ఆయన ఈ మాట చెప్పలేదు చెప్పనంతమాత్రమున నాయనకు మహాకవిత్వ దీక్ష లేదనిగాదు

లేనిచో నాయన ఆంధ్రకవిత్వ విశారదుడు, విద్యాదయితుడు ఎట్లు కాగలడు? ఆ చెప్పుట కాలమునుబట్టి ఏర్పడినవి నన్నయ కాలమునకు కావ్యమే క్రొత్త తెనుగున నాడు కావ్యమనగా మహాకావ్యమనియే యర్థము తిక్కన కాలమున దేశముయొక్క స్థితి యట్లు లేదు మహాకావ్యములుగాని కావ్యములు - మహా కవిత్వ దీక్షాపరులుగాని కవులు నాడున్నారు తిక్కన ముందు వ్రాసిన నిర్వచ నోత్తర రామాయణమే మహా కావ్యము గాదు నాడు తిక్కన మహా కవిత్వ దీక్షాపరుడు గాదు తన రామాయణమువంటిది గాదు మహాభారతము తన యిప్పటి యుత్త మనీష మాత్రమే చాలదు మహాభారత రచనకు కనుకనే తిక్కన మహాకవిత్వ దీక్షావిధి నొంది మహాభారత రచన కుపక్రమించుచున్నా నని చెప్పుట ఈ విషయమేల ప్రస్తావించుచున్నాననగా - దేశ కాల స్వభావముల ననుసరించి విషయ వివరణ ముండునని చెప్పుటకే నేటి మనకు ఇహపరములకు సంబంధించిన స్తిమితాభిప్రాయములు లేవు లేక కొట్టుమిట్టాడుచున్నాము. ఐహికముగా మనము సుఖజీవులము గాము కాని, ఈ జీవులకు, పరమునకు సంబంధించిన చింతనము లేదు ఇట్టి స్థితిలోనున్న మన కైహికాముష్మికములకు సంబంధించిన ఒక మార్గమును ప్రసాదించుటకు సమర్థమైన రామాయణము మనముం దవతరించినది కల్పవృక్ష స్వరూపమున నవతరించినది సత్య నారాయణగారు తమ రామాయణమునకు కల్పవృక్షమని పేరు పెట్టుటలో నీ యభిప్రాయ మున్నదని నా యుద్దేశము మరొకటి కూడ కావచ్చును లక్ష్మణా చార్యుడను వానిపేర మంత్రరామాయణ మను నొక గ్రంథమున్నది అందు రామాయణమును వృక్షముగా పేర్కొనినాడు

రామాయణ ద్రుమం నౌమి
రామరక్షా నవాంకురమ్
గాయత్రీ బీజ మామ్నాయ
మూలం మోక్ష మహాఫలమ్

ద్రుమ మన్న శబ్దమున కర్థము మేదినీ కోశమున "ద్రుమోమహీరుహా పారిజాతే కింపురుషేశ్వరే" అని యున్నది రఘువంశమున కాళిదాసు కల్ప ద్రుమాణా మివ పారిజాతః" అనినాడు సూర్యరాయాంధ్ర నిఘంటువు కల్ప

వృక్షమును దేవ వృక్షములై మందార పారిజాత సంతాన కల్పక హరిచందనాది వృక్షముల నన్నింటిని సూచించునదిగా పేర్కొనినది కనుక లక్ష్మణాచార్యుని "రామాయణ ద్రుమం నౌమి" అనుదాని ఆంతర్యమును గ్రహించి సత్యనారాయణ గారు తమ రామాయణమును కల్పవృక్షముగా పేర్కొని యుండవచ్చును

మరల నిదేల రామాయణ మన్నది ప్రశ్నము ఈ ప్రశ్న పదునారవ శతాబ్దమున నుత్తర రామాయణ రచన కుపక్రమించిన కంకంటి పాపరాజును వేసికొనినాడు వేసికొని—

వరుసం దిక్కనయజ్వ నిర్వచన కావ్యంబె తగం జేసె ను
త్తరరామాయణ మందునన్ మఱి ప్రబంధం బూని నిర్మించు టే
పరసత్వంబని ప్రాజ్ఞులార నిరసించం బోకుఁడీ రాఘవే
శ్వరు చారిత్రము నెందఱెన్ని గతులన్ వర్ణించినం గ్రాలదే

అని ప్రార్థనాత్మకమైన సమాధానము చెప్పినాడు ఈ శతాబ్దమువాడైన వావిలికొలను సుబ్బారావు గారును "బరు సుకృతంబోమునే యితరుల ? ? కావున రామాయణము రచింతు" ననినాడు మరల నిదేల రామాయణమన్న ప్రశ్న వేసికొని సత్యనారాయణగారును ఒక సమాధానము నిచ్చిరి ఆ సమాధానము స్థూలదృష్టికి సామాన్యముగను, తిరిగి ప్రశ్నమువలెను కనిపించును

మరల నిదేల రామాయణం బన్నచో నీ ప్రపంచక మెల్లవేళఁ
దినుచున్న యన్నమే తినుచున్నదిన్నాళ్ళు తనరుచిబ్రదుకులు తనవి గాఁ
చేసిన సంసారమే సేయుచున్నది తనదైన యనుభూతి తనది గాన
తలచిన రామునే తలచెద నేనును నా భక్తిరచనలు నావి గాన

రుచిబ్రదుకుల నాశించి ఈ ప్రపంచక మన్నము తినుచున్నదట అనగా, రుచి ననుసరించియు బ్రదుకు వర్ధించియు అన్నము తినబడుచున్నది ''అన్నాద్భూతాని జాయంతే జాతా న్యన్నేన వర్ధంతే' అని తైత్తిరీయము సర్వ భూతముల పుట్టుకయు వృద్ధియు అన్నము వలనే జరుగుచున్నదని తాత్పర్యము రుచియన్నది వ్యష్టినిష్ఠము బ్రదుకు సమష్టి నిష్ఠము అనగా, రుచి నాశ్రయించుకొని వ్యక్తి యున్నాడు బ్రదుకు నాశ్రయించుకొని సర్వప్రాణిలోకమును న్నది లోక తంత్రము సాగుటకు బ్రదు కవసరము లోకతంత్రము చైతన్య

గర్భము అది అన్నిన ప్రతిష్ఠితము అట్టి యన్నమును తమ తమ రుచుల కనుగుణముగా చేసికొని ఈ సర్వ ప్రపంచమును తినుచున్నది ఈ విషయమును సత్యనారాయణగారు తమ రామాయణ రచనకు దృష్టాంతముగా జూపినాడు అన్న మమృత స్వరూపము రామాయణము అన్నము రుచి బ్రదుకుల ననుసరించి అన్నము గ్రహింపబడినట్లే రామాయణమును గ్రహింపబడవలయు నన్నమాట ఇతఃపూర్వము రామాయణము లున్నవి వాని రుచి వానిది రామాయణ విషయమున రుచి యనగా తదంతర్గత మహార్థదర్శన మన్నమాట విశ్వనాథయు రామాయణమును దర్శించెను జ్ఞానానందాది విశుద్ధధర్మ యోగపరికల్పిత విషయోపభోగ రహితాత్ముని రాముని దర్శించెను కనుకనే తద్దర్శన ప్రపంచనార్థమైన ఈ రామాయణ కల్పవృక్షము శాంతమున కున్ముఖమై సాగుచున్నది హరిపాలుని మాటలలో చెప్పవలయునన్నచో విశ్వనాథ రామాయణము బ్రహ్మరసగర్భము ఈ దృశ్య గుణ గణ గరిష్ఠములైన రామాయణములు పూర్వమున్నవా యన్నచో లేవు కనుక దీని స్థానము దీనికున్నది మరొక దృష్టాంతమును గూడ చెప్పినాడు విశ్వనాథ ఈ ప్రపంచకము చేసిన సంసారమునే చేయుచున్నదట అందుకు హేతువు దానిపైన యనుభూతియట సంసారమున కామన యున్నది ఈ కామన బహుముఖమైనది ప్రతి ముఖమునకు అనుభూతి యున్నది ఆ యనుభూతియే లేనిచో సంసారము లేదు సంసారము లోకస్థితికి మూలము లోకస్థితి మూలమైన సంసారమును వలెనే విశ్వశ్రేయమయమైన కావ్య సంసారమును ఈ ప్రపంచకము చేయును వ్యక్తిగతమైన అనుభూతి ననుసరించి సంసారమున్నట్లు కవిదైన దర్శనానుభూతి ననుసరించి కావ్యముండును దర్శనానుభూతి యొక్క పరిమితి ప్రజ్ఞామూలము తత్ప్రజ్ఞార్జితమైన విషయ వివరణములోని నిర్వహణకుశలత ప్రతిభమీద ఆధారపడి యుండును కనుకనే కవి ప్రతిభలోన నుండును కావ్యగత శతాంశముల యందు తొంబదియైన పాళ్ళు అని విశ్వనాథ చెప్పుట మరల నిదేల రామాయణ మన్న ప్రశ్నమునకు పై విధముగా సమాధానములను చెప్పి "నా భక్తి రచనలు నావి గాన" నేను రామాయణం వ్రాయుచున్నాననెను అనగా విశ్వనాథ దృష్టిలో తన రామాయణమొక భక్తి రచన యన్నమాట విశ్వనాథ తనను గురించి చెప్పుకొనుచు "పరమ భక్తాగ్రగణ్యుడ"నని చెప్పుకొనెను పరమ భక్తుడనగా సాధనావస్థను దాటి సిద్ధావస్థయందున్న వాడన్నమాట. సాధనావస్థ

యందున్న భక్తికి "అపర భక్తి 'యని పేరు ఈ పరాభక్తి యనునది సర్వ యోగములకును సాధనకులను పరమావధి నిరహంకార పూర్వక నిర్వ్యాజక ప్రేమరూపము పరాభక్తునకు భగవంతుడు సర్వభూతాంతర్యామిత్వుడై దర్శన మిచ్చుచుండును విశ్వనాథ కట్టి దర్శనమున్న దన్నమాట అట్టి పరమభక్తుని రచన భక్తిరచన యగును అనగా, భక్తియుతమైన రచన యన్నమాట ఈ భక్తి శబ్దము చాలా విచిత్రమైనది స్థూలదృష్టికి అందలి వైచిత్రి గోచరింపదు

ఇష్టే స్వారసికే రాగః పరమావిష్టతా భవేత్
తన్మయీ యాభవేత్ భక్తి పాత్రరాగాత్మికాస్మృతా

ఇష్టవస్తు గతమైన యనురంజనము క్రమక్రమముగా రాగ గాఢమై మనస్సున కొక తన్మయతను కలిగించును మనస్సునకైన ఆ తన్మయవృత్తి విశేషమే భక్తి ఇదొక్కటే నిర్వచనముగాదు భక్తికి, భగవంతుడు నావాడనెడి మమకారమే భక్తియని భీష్ముడు, ప్రహ్లాదుడు, ఉద్ధవుడు, నారదుడు ఏకకంఠ ముగా పలికినట్లు నారద పాంచరాత్రమున గలదు భక్తిసారామృతసింధువు "అన్యాభిలషితా శూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్, అనుకూల్యేన కృష్ణానుశీలనా భక్తిరుత్తమా" అనినది జ్ఞాన పూర్వమును - సుదృఢమును - సర్వతోఽధిక మునునైన స్నేహమే భక్తియని మహాభారత తాత్పర్య నిర్ణయమున శ్రీ మధ్వా చార్యులవారు చెప్పిరి ఇట్లు భక్తి నిర్వచనముల నుదాహరించుచు బోయినచో నొక గ్రంథమగును భక్తి యన్నది కేవలము భావమా? రసమా? యను ప్రశ్న మున్నది దానికి సమాధానమిచ్చుటకు నేనుగాదు భక్తిరసమువలెనైన యోగ భావమని నా యభిప్రాయము దాని అంతర్యము తదాత్మ సంయుక్తమైన ఆత్మ కలిమి ఈ కలిమి బహుముఖము. మొదట చెప్పిన తన్మయవృత్తియు - స్నేహ మును - ఈ యోగ భావమును భక్తి స్వరూపములే భక్తి రచన యనగా పైన చెప్పిన గుణములతోడి రచన ఆ గుణము లెవరికి? కవికా? కావ్యగతములైన పాత్రములకా? కవి తన్మయుడై భగవంతునిగూర్చి కీర్తించును అదియు భక్తి రచనమే యగును భగవంతునియందు భక్తుల తన్మయతను - స్నేహమును - యోగభావమును కవి వర్ణించును ఇదియును భక్తి రచనయే యగును రామాయణ కల్పవృక్షము భక్తిరచన యన్నది సిద్ధాంతము భక్తి రచన యని తత్కర్త చెప్పనే చెప్పెను అయిన ఈ భక్తి కవిపరమైనదా? లేక రామాయణస

పాత్రముల యాత్మవృత్తికి సంబంధించినదా? కవికి రామాయణమునందు ప్రేమ యున్నది రామాయణములోని పాత్రములకు రామునియందు ప్రేమ యున్నది భక్తి విషయమును ప్రస్తావించుచు ప్రేమ యనుచున్నావేమని యనవచ్చును. "సాత్వస్మిఞ్ పరమ ప్రేమ రూపా" అని నారద మహర్షి తన భక్తి సూత్రము లలో భక్తిని ప్రేమరూపముగా నిరూపించెను అసలు భగవంతుడే ప్రేమయని ప్రేమస్వరూపునిగా వాని నుపాసింపవలయునని బృహదారణ్యకము చెప్పుచున్నది- ప్రియమిత్యేన దుపాసీత - అందువలన ప్రేమ యనినను భక్తి యనియే అర్థము చేసికొనవలయును ఇంతకును చెప్పవచ్చినదేమనగా- రామాయణకల్పవృక్షమున పాత్రములన్నియు రామునియందు లగ్న మనస్కములుగా నిరూపింపబడి నిర్వ హింపబడినవని ఆ నిరూపణము రామాయణమునన్నను నిర్వహణముననున్నది కల్పవృక్షము కుంకటివేరు ఈ దృశ నిర్వహణము పూర్వ రామాయణములం దింత నిశితముగా లేదు ఈ నిర్వహణనున్నది శిల్ప విశేషము బహుధారూపిత సూక్ష్మతర కథా కథనకుశలురైన అంతర్దృష్టలచేతిలో అది రసముగా పరిణ మించును ఈ పరమ రహస్య మెరిగినవాడు గనుకనే —

ప్రాగ్వివశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవ కథాదృతిని మించి

అని విశ్వనాథ చెప్పుట నిర్వహణ శిల్పములోని అంతరాంతరము లెంతగా తెలిసిన శ్రీమద్రామాయణ కల్పవృక్ష మంతగా అర్థమగును, అంతగా అనుభూతికి వచ్చును

ఇచట మరొక విషయము రామాయణ కల్పవృక్షము భక్తిరచన యని నారు గదా? భాగవతము గూడ భక్తి రచనయే గదా! అట్టిచో నీ రెండింటికిని భేదమేమి? భాగవతమువలె నీ రామాయణము మన కర్థము కాదేమి? అని యన వచ్చును నిజమే భాగవతమువలె రామాయణ కల్పవృక్షము మనకర్థము కాదు అసలు భాగవతమెంత యర్థమైనదన్న ప్రశ్నము వేరు ప్రసన్నతవలె కనిపించు ఒక ధారాప్రవాహము భాగవత రచనలో నున్నది ఇట భాగవతమనగా పోతన కృతమని యర్థము రామాయణ కల్పవృక్షమున నిర్వహణ శిల్పమున్నది, ఉజ్వ లముగా నున్నది మహా కావ్య శిల్ప పారంగతులయిన కవుల రచనలకు "ధార"

ప్రధానము గాదు, ఔచితి ప్రధానము భాగవత గర్తయయిన పోతనకు భగవం తుని మీదనున్న ప్రేమ భాగవతము మొత్తము మీద లేదు మొత్తము మీద నున్నవుడే నిర్వహణ శిల్ప ప్రసక్తి అది భాగవతమున లేదు పైగా, నది పురా ణము భాగవతమున కథకుడైన పోతన ఉజ్జ్వలముగా గనిపించును కల్పవృక్ష మున కథన శిల్పముజ్జ్వలముగా గనిపించును ఇది కావ్యేతిహాసము ఇట్లనుటవలన భక్తిరచనలయిన భాగవత కల్పవృక్షముల తత్వమును నాయోపినంత చెప్పు చున్నట్లుగానే భావింపవలయును గాని వాని హెచ్చుతగ్గులను నిర్ణయించు చున్నానని యనుకొనరాదు తిక్కనయు భక్తుడే హరిహరనాథ భక్తుడు వరణీ యుడ నయ్యెద భక్తకోటికని భారతము నాయన వ్రాసెను కాని, తిక్కన పోతన వంటి భక్తుడు గాడు విశ్వనాథ తిక్కనవంటి భక్తుడు తిక్కన భారతము పోతన భాగవతమువలె అర్థమగుచున్నట్లుండదు విశ్వనాథ రామాయణమును భాగవతమువలెనుండదు తిక్కన మహా కావ్యశిల్ప వాచస్పతి ఆ వాచస్పత్య మును జీర్ణించుకొనినవాడు విశ్వనాథ కనుకనే తిక్కన విశ్వనాథల భారత రామాయణములు పోతన భాగవతమువలె మన కర్థముగావు శిల్పమార్గ మెరిగి యర్థము చేసికొనవలయును ఎరుగుట యన్నది యోగ్యత మీద ఆధారపడి యుండును యోగ్యత ఎరుగుటలోని హెరుగుదల ననుసరించి తరతమ స్వరూప మున నుండును

విశ్వనాథ తన కల్పవృక్షమును భక్తి రచన యనుటలో మరొక అలం కారిక రహస్యమును ఇమిడియున్నదని శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మ గారు చెప్పినారు భక్తి రచన యనగా లాక్షణిక రచనయని గ్రహింపవలయు నట వాచ్యార్థ లక్ష్యార్థ, వ్యంగ్యార్థములలో లక్ష్యార్థ రచనావిధానము రామాయణ కల్పవృక్షమున విరివిగా నున్నదట వ్యంజక ప్రతిపాద్యము వ్యంగ్యము వ్యంజనము లక్షణామూలము ముఖ్యార్థబాధకమున్న రూఢివలన, ముఖ్యార్థ సంబంధమున్న ప్రయోజనమువలన, పరమోత్కృష్టమైన అన్యార్థమును ధ్వనింప జేయు మహా శిల్ప రహస్యమును ఆధారముగా చేసికొని రామాయణ కల్పవృక్ష మును సత్యనారాయణగారు వ్రాయుచున్నారనియు శ్రీ శర్మగా రభిప్రాయ పడు చున్నారు అభిధ శక్తియని - లక్షణ భక్తియని - వ్యంజన వ్యక్తియని ఆయన చెప్పెను ఆయన యభిప్రాయము నా కర్థమైనంతవరకు నిపుడు చెప్పినాను, సమన్వయము చేయుటకు నేను చాలను నిర్వహణ శిల్పమని వెనుక నేను చెప్పిన

దానిని వ్యాఖ్యానము చేయుటలో ఈ సర్వ విషయాలును ప్రస్తావింపబడ వలయును

రామాయణ కల్పవృక్షమున పాత్రములు రామునియందు లగ్న మనస్కములుగా నిర్వహింపబడినవని చెప్పినాను భక్తికి లగ్నమనస్కత యవసరమే అది తీవ్రమైగూడ నుండవలయును రాముడు భగవంతుడు కాడు, దివ్యాదివ్య పురుషుడు వానియందు లగ్నమైన మనస్సులుగల పాత్రముల ఆత్మ ధర్మములు భిన్నములు భిన్న ధర్మములైన ఈ యాత్మలుగల పాత్రముల ప్రవృత్తులు భిన్నములు ఈ భిన్న ప్రవృత్తులన్నియు ప్రధానమైన భక్తికంగములు అనగా, ఈ పాత్రముల ప్రవృత్తియేదైనను భగవంతునియందు భక్తిగా పరిణమించును భక్త్యంగములు ప్రధానముగా—

శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం
సఖ్య మాత్మనివేదనమ్

అని భాగవతము పేర్కొనినది నారద మహర్షి తన భక్తి సూత్రములలో "గుణ మహాత్మ్యాసక్తి, రూపాసక్తి పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, రూపా ఏకథా అపి ఏకాదశధా భవతి" అని ఏక రూపమైన భక్తి వ్యవహారమున పదునొకండు రూపముల నున్నదని నిరూపించెను వ్యవహారమునందలి ఈ రూపభేదము రామాయణమునందలి ఒక్కొక్క పాత్రమున ఒక్కొక్క విధముగానున్నది దశరథునియందు స్మరణమును, లక్ష్మణునియందు పాదసేవనమును, మహర్షులయందు అర్చన వందనాదులును- హనుమంతునియందు దాస్యమును - సుగ్రీవునియందు సఖ్యమును - విభీషణుని యందు ఆత్మనివేదనమును ప్రస్ఫుటముగా కనిపించును ఇట్లనుటవలన వారి యందు తదితర రూపమైన భక్తి కవకాశము లేదనిగాదు ప్రధానమైన విషయ మని మాత్రమే సూచించుచున్నాను సీతయందన్నియు గూడుకట్టుకొన్నవి ఆ భేదమును దర్శించిన దామె అనుష్ఠించిన దామె ఆమె చరిత్రమున నీ విషయ మాదర్శితము రామాయణ పాత్రములు కేవలము భక్తి భావ సమన్వితములే

గాదు పరస్పరము బాంధవము గలవి గూడ బాంధవము ప్రధానమైనది దశరథునకు రాముడు కొడుకు, లక్ష్మణున కన్నగారు, సీతకు భర్త ఈ బంధు భావము గర్భమున భక్తియున్నది అది బాంధవమువలెనే కనిపించును ఆ భావమునే ప్రపంచించుచు అంతస్సూత్రముగా భక్తిని నిలుపుటయే రామాయణ కల్పవృక్షమునందలి ప్రత్యేకత ఈ ప్రత్యేకతను సోదాహరణముగా నిరూపించుట కిట నేను పూనుకొనను అవకాశము లేదు బంధుభావము నాశ్రయించుకొనిన మనస్తత్వము - వ్యక్తి నాశ్రయించుకొనిన ప్రవృత్తి - అంతర్వాహినిగానున్న భక్తి - ఇవి మనము రామాయణ కల్పవృక్షమున పరిశీలింపవలసిన ముఖ్యాంశము లని నా యభిప్రాయము రామునకు బంధువులు కానివారు కొందరు రామాయణ మున నున్నారు వారి విషయ మేమందురు? రాముడు వారిలో కొందరకు హితుడు కొందర కహితుడు రావణున కహితుడు రావణునకు రామునియందు ద్వేషము, భయము ద్వేషము తీవ్రమైన మనస్సును సృష్టించును రావణునియట్టి మనస్సు రామునియందు లగ్నము ఈ రామాయణ కల్పవృక్షమున దశరథుని వాత్సల్యములోని స్మరణము - లక్ష్మణుని సోదరభావములోని పాదసేవనము - మహర్షుల ఆశీర్వచనములలోని అర్చనవందనాదులు- సుగ్రీవుని దైన్యస్వభావము లోని సఖ్యాసక్తి - హనుమంతుని కార్యత్వరాయమాణ చిత్తములోని దాస్యాసక్తి - రావణుని ద్వేషములోని తీవ్రమును నిశితమునునైన మనస్థైర్యము - విభీషణుని ఆత్మ తత్వజ్ఞతలో లేనిదనము - సీత యొక్క భార్యాత్వములోని విరహాసక్తి - ఇత్యాదులు పరస్పర ముపకర్షహేతువులుగా లోకములోని సుఖదుఃఖములు వెలికి వచ్చునట్లు రసగర్భములుగా మలచబడినవి రసము వేయి రేట్లు గొప్పది నవ కథాదృతిని మించి యనువాక్యార్థమును నా భక్తి రచనలు నావి గాన యను దాని అంతర్యమును గ్రహించి శ్రీమద్రామాయణ కల్పవృక్షమును విమర్శింప వలయునని నా యుద్దేశము ఆ రెండింటిని నేనెట్లర్థము చేసికొంటినో స్థూలముగా నిపుడు మనవిచేసితిని ఇది కవి హృదయానుగుణముగా నున్న సరే లేనిచో సహేతుకమైన కవి హృదయమును కవిగారినుండిగాని - ఉచితానుచిత విచారణ దక్షులైన విద్వద్విమర్శకులనుండిగాని గ్రహించుటకు నేను సిద్ధముగా నున్నాను.

మరల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్లవేళ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళ
తన రుచి బ్రతుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైన యనుభూతి తనది గాన
తలచిన రామునే తలచెద నేనును
నా భక్తి రచనలు నావి గాన
కవి ప్రతిభలోన నుండును కావ్యగత శ
తాంశములయందు తొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లుగొప్పది నవకథాదృతినిమించి

# విరాధ వధ

శ్రీమద్రామాయణమున ప్రసక్తములైన చిన్న కథలలో విరాధుని దొకటి రాముడు వీనిని చంపినాడు చంపలేదు చచ్చునట్లుగా చేసినాడు ఆ చేయుటయు విరాధునిమాట చొప్పున ఇది చిత్రముగా నున్నది అనగా విరాధుడు తనను చంపుమార్గమిది యని రామునితో చెప్పినాడన్నమాట ఇట్లనుటవలన విరాధుడు చావును కోరి దానికే నిరీక్షించుచున్నాడన్నమాట ఈ విరాధుని జీవలక్షణమే చమత్కారముగా నున్నది వాల్మీకి వ్రాసినాడు "స్వయం విరాధేనహి మృత్యు రాత్మనః ప్రసహ్యరామేణ యదార్థ మీప్సితః నివేదితః కావనచారిణా స్వయం నమే వధశ్శస్త్రకృతో భవేదితి " రామాయణమును తెనుగున చాలమంది వ్రాసిరి ఊరకకథ వ్రాయుటకేమి? ఎవడైనను వ్రాయవచ్చును కథాగత జీవలక్షణమును గుర్తించి వ్రాయుట నిశిత పరిశీలనాదక్షము, దీవిశేషముగలవాడు చేయగలిగినది విరాధ వధ నిర్వహణమున కేవలయొక్క విరాధుని జీవలక్షణము ప్రస్ఫుటమైన తత్సన్నివేశము పూర్ణాకృతినందినట్లుగాదు రాముడు, లక్ష్మణుడు, సీత - వీరు ముప్వురును ఏతద్విరాధవధముతో సంబంధము కలవారు వారివారి జీవలక్షణ ములును అచట సముచితముగా చూపబడవలయును భాస్కర రామాయణమున నీ ఘట్టము ఇరువదినాల్గు గద్య పద్యములలో ముగిసినది భాస్కరునకు కథా గతములైవచ్చు పాత్రముల జీవలక్షణములను స్పష్టముగా దర్శించు శక్తిలేదు వాల్మీకి రాముడు విరాధుని చంపినట్లుగా వ్రాసినాడు గనుక భాస్కరుడును వ్రాసెను అసలు రామాయణము నాత్మను స్వయము దర్శించి అది ఫలానా అన్న నిష్కర్షతో వ్రాసినవాడు కాదు భాస్కరుడు

వాల్మీకి రామాయణమునకు భాష్యముగా వచ్చిన శ్రీమద్రామాయణ కల్పవృక్షమున పూర్వ రామాయణములలో లేని వైశిష్ట్య మొకడు ఎడతెగక స్ఫుటముగా నున్నది ఈ విరాధ వధ ఈ కల్పవృక్షమున యాభైఆరు గద్య

పద్యములతో నిర్వహింపబడినది దీనికి ముందు ఎనిమిది గద్య పద్యములతో పూర్వరంగము నిర్మింపబడినది ఈ పూర్వరంగ కల్పన కేవలము విశ్వనాథో పజ్ఞము ఏ తద్రంగమట్లుగా నగుటకు హేతువు రాముని జీవ లక్షణములోని వైచిత్రి రాముని జీవలక్షణము స్వరూపమేమిటి? ఏతత్స్వరూపము సర్వమును ఇట సమీక్షింపక ప్రధానాంశాములను చెప్పెదను అందు హాస్యశీలత మొదటిది ఋషులన్న మెత్తని తలపు రెండవది అన్నింటికిని మూలమైనది ధర్మాధర్మ వివేకముతోడి ఆత్మజ్ఞత్వము ఈ యీ గుణములు రామునియందీ కల్పవృక్షమున తత్రతత్ర నిక్షిప్తములు బాలకాండమున శ్రీరామసోదరుల విద్యా వ్యాసంగములతో పూర్తియగు అవతార ఖండాంతరమునకు రాముడు హాస్యా ద్భుత శీలియని కవి తానుగా నిష్కర్ష చేసెను అయోధ్యాకాండ ప్రస్థాన ఖండమున యమునానదిని దాటిన తరువాతి శ్రీరాముని విరగబడి నవ్వుటను చూచి సీతాలక్ష్మణులు "ప్రకృతితో నొకడై పసివానివోలె కన్పడు, కుహనా మనుష్యకృత నాగరబంధము లూడ్చినట్లుగ" అని అనుకొనినట్లుగా చెప్పి రాముని హాస్యశీలత అరణ్యమునకు వచ్చిన తరువాత మరియు నధికమైనట్లుగా చూపించినాడు కల్పవృక్ష కర్త తరువాత అరణ్యకాండమున మారీచునిచే రామునిలోనున్న లోప మా హాస్యశీలతయే అనిపించును— ఈ రాముని హాస్య శీలమును విశ్వనాథ ఇంతగా అచ్చటచ్చట స్పష్టము చేసినాడని చెప్పుట యేల యనగా, రాముని జీవలక్షణ సంబంధి హాస్యమే ఈ విరాధ వధకు పూర్వంగమును సముచితముగా నిర్మించినదని చెప్పుటకు అనగా విశ్వనాథ రాముని ఆ జీవ లక్షణము నచట పైకి తెచ్చినాడన్న మాట

అసలు విరాధ వధకు మొదటిది వాడు సీతను పట్టుకొనుట అడవిలో సాధారణముగా లక్ష్మణుడు ముందు నడచును వెనుకగా రాముడు, సీత మధ్యలోనుండి నడచును ముగ్గురును దాదాపు వెంటవెంటగా నడతురు రామ లక్ష్మణులంత దగ్గరగా నున్నపుడు విరాధుడు సీతను పట్టుకొనుటకు వీలులేదు వీలు లేదనగా వీలులేదనికాదు గాని, వాడు సీతమీదికి వచ్చునపుడు వారేమి చేయుచుండిరను ప్రశ్నవచ్చును రంగనాథుడు వ్రాసినాడు గరుడుడు బాల నాగమును బలిమి నొడిపి మింటి కెగసినట్లుగా విరాధుడు సీత నెత్తికొని మింటి కెగసినాడని - అది వేరు విషయము భాస్కరుడీ మాత్రపు టూహయును చేయలేదు "గదిసి జానకిఁబట్టి శీఘ్రముగ జంకదాల్చి"నా డనినాడు ఈ కల్ప

వృక్షమున సీతను విరాధుడు పట్టుకొను సమయమునకు రామలక్ష్మణు లిరువురును సీతకు కొంత దూరముగా పోయిరి ఊరక సీతను దూరముగా వదలి వారు పోరు ఆ దారి పోవుట చమత్కారముగా కల్పింపబడింది రాముని జీవ లక్షణ మాధారముగా కల్పింపబడినది దండ కారణ్యమున వారు ముగ్గురును పోవు చున్నారు దూరముగా సమీపమున చెఱువేదో ఉన్నట్లు తోచినది సీత నడువ లేక కొంత సేపు సేద తీర్చుకొనవలయు ననుకొన్నది అనుకొన్న తరువాత——

"చెఱువు నొడ్డున విశ్రమించెదను కాదె
యనిన జానకి శ్రీరాముడనె అయోధ్య
వదలి విశ్రాంతికొరకయి వచ్చినావె
అనిన జానకి యటఁగలదా యటంచు"

"అవున అయోధ్యలోఁ దెలిపి
యంతని యింతని చెప్పనా? ధరా
ధవుడు సుష్ఠైక జీవిచనె
దైవతలోకము బిడ్డయైన రా
ఘవుని వనంబుపోక కథకట్టి
నిరంతము స్రుక్కుతల్లి అ
న్న వదలినట్టి చెప్పులయినన్
బినతమ్ముడు కొల్వ దప్పరిన్ "

ఇది సీతా రాముల సంభాషణము 'చెరువు నొడ్డున విశ్రమించెను కాదె' యనిన జానకి మాటలోని యర్థమచట కొంచెముసేపు సేద తీర్చుకొనవలయును నేనలసిపోయినాను అని, అయోధ్యవదలి విశ్రాంతి కొరకయి వచ్చినావె యని రాముడనుట చమత్కార గర్భము, చిన్న దెప్పిపొడుపు అది యట్టిదని ఎప్పుడు తెలియుననగా ఆయోధ్యాకాండమున రాముడు సీతను నీ వరణ్యము రావద్దనుట - ఆమె వచ్చెదననుటగా సాగిన అచటి సంభాషణము స్మృతిలో నున్నపుడు "వైదేహియున్ నీ వెంటంబడిరాక నీకు బరువా?" "ఏ వనంబులకు నేను నీ వెంటనే వచ్చెదన్" అన్నది సీత "నీ వరుదేగు మార్గమున నీవు పడు బాధకు (నాకు) బాధ తప్పదు" అనినాడు రాముడు "నిన్ను వెన్నాడిచను నాకు నెవ్వగ

యని కలిగినంగద, బాధయుఁ గలుగు నీకు" అన్నది సీత అప్పుడా అనుట నిజమే సీతతో నున్నచో నాకు బాధేమి, అదే సుఖము అని అప్పుడన్న సీతమాట లోని పరమార్థము వేరు తీరా అడవిలో నడచుట ప్రారంభము కాగా సీతకు కొంచెము శ్రమ యనిపించినది అందు కన్నది చెఱువు నొద్దున విశ్రమించెదను కాదె అని హాస్యశీలుడు రాముడు దానిని సాగదీసి చమత్కరించినాడు ఆ చమత్కారమును సీత మరొక వైపుగా త్రిప్పినది "అవును అయోధ్యలో తెలపి యంతని యింతని చెప్పనా అన్న వదలినట్టి చెప్పులయినన్ పిన్న తమ్ముడు కొల్వఁడప్పురిన్" - సీత ఇట్లుగా త్రిప్పుట నిజమునకు భరతునిపై తనకట్టి యభిప్రాయముండికాదు ఊరక రాముడు మాటకుమాటగా నేదో మాటాడవలయునని మాత్రమే సీత ఆంతర్యము రామునకు తెలియదా? బాగుగా తెలుయును కాని, తదాంతర్యమును గుర్తించనివానివలె పై యర్థమునకు కోపమువచ్చిన వాడువలె నయ్యెను అందువలన రాముడు మాటడలేదు నడచుచుండెను సీతకు రాముడు మాట్లాడుట కావలయును రామునకు కోపము వచ్చినట్లుగా నున్నది తానే కల్పించుకొని మాటాడవలయును

"మనము మరులు తీగను త్రొ
క్కిన జాడగఁగానిపించుఁ గేవలమిది త్రో
వన పీలులేదు చేఱువను
కొనినది కన్పించ దడవికోనయెకాకన్"

"నా రాముండనె నెంతయున్ మరులు కొన్నంగాదటే ఘోరకాం
తారంబుఁ బతితోడ వచ్చు టనినన్ దాత్రీజ ధర్మంపుబు
ద్ధ్యా రానైనది భర్తపై మరులు లేదన్నఁ రఘూత్తంసకుం
డారంభించు శిరః ప్రకంపముగ ముందై యేగె మార్గంబునన్''

ఎంత సేపటికి చెఱువు రాదేమి? మనము మార్గము తప్పలేదుగదా? ఈ యడవిలో నెంతసేపని యిట్లు నడచుట?—ఇది సీత తాత్పర్యము దానికేదో రాముడు సమాధానము చెప్పవలయును చెప్పుననియే - చెప్ప వలయుననియే సీత అట్లనినది రాముడు బదులు మాటాడినాడు ఆ మాటలలో నున్నది చమత్కారము సీత మామూలుగా నన్నది మనము మరులు తీగను త్రొక్కిన

జాడగా గనిపించుచున్నదని హాస్యాద్భుతశీలి రాముడు ఆ సీతయన్న దానిలోని మరులు శబ్దమును విడిగా గ్రహించి, తదర్థమును పైకిలాగి దానిని జానకి మీదకి విసరినాడు ఆమె అంతకుముందు అయోధ్యలో మాత్రము విశ్రాంతి యున్నదా అన్నట్లుగా ధర్మంపు బుద్ధ్యా రానైనది భర్తపై మరులు లేదన్నది ఆమె ఈ మాటను చమత్కారగర్భముగా గడుసరిమాటగా అన్నది రాముడా చమత్కారమును గ్రహింపనివాడువలె బోమముడి విస్ఫుట కోపాభిమాన హృదయుడట్లుగా ఆరంభించు శిరః ప్రకంపముగా సీతను వెనుకగా చేసి ముందుగా నడచినాడు శ్రమమున కించిద్దుఃఖాభిమాన హృదయ జానకి వెనుకై సాగినడిచినది-వారు తటాకము తీరము చేరుకొన్నారు లక్ష్మణుడు కంటకావృతమైన తత్తటమును యోగ్యాసనాస్థానము చేసినాడు కాని, రాముడు ఇంకొంచెము దూరముగా పోయి నిలవబడినాడు సీత అట్లె వెనుకగా నిలుబడినది లక్ష్మణునకేమియు తోచక తను తటాకములోనికి దిగినాడు రాముడు సీతవైపు చూచుచు నిలువబడలేదు విముఖుడై నిలువబడెను వెనుతిరిగి తనను పిలుచునేమోనని సీత అట్లే నిలువబడినది విముఖుడైన రాముడు నెమ్మదిగా అడుగులు ముందుకు వేయుచుండెను ఈ సమయమున విరాధుడు సీతను పట్టుకొనెను రాముడు సీతవైపు చూచుట లేదని ముందుకడుగులు వేయుచున్నాడని, ఎట్లు తెలియవచ్చినదనగా-విరాధుని వికటాట్టహాసమునకు 'విముఖుండైనను స్వామి జానకిదెసన్ వీక్షించె'నన్న పద్యము వలన-విరాధుడు సీతను పట్టుకొనుటకైన పూర్వరంగమును రాముని హాస్యశీలము నాధారము చేసి సీత నుండి రాముని దూరము చేయుటలో ఈ వ్యాసమున మొదట వేయబడిన ప్రశ్నకు నావకాశము లేకపోవుటతోబాటు మరొక రహస్యమున్నది రాముడు చెంత లేనప్పుడు సీతకు కష్టము వచ్చునుగాని దగ్గరగా నున్నప్పుడు రాదు రావణుడు సీత నపహరించినది రాముడు లేడివెంటబడి దూరముగా పోయిన తరువాత కాకాసురుడు సీతను వేధించినదియు రాముడు సమీపమున నున్నను నిద్రించునపుడు జాగృతుడు దూరమున నున్నను నిద్రితుడు ప్రక్కననున్నను ఫలిత మొకటియే మరియును ఈ మూడింటియందు నొక విశేషమున్నది లేడి వెంటంబడి రాముడు దూరముగా పోవుటకు సీతయే హేతువు కాకముచేనంతగా పీడింపబడుటకును 'తానట్టిట్టుల దూగినన్ బతికి నిద్రాభంగమౌ'నని ఓర్చుకొన్న సీతయే హేతువు ఇపుడు విరాధుడు పట్టుకొనుటకు వీలుగా రాముడు దూరము పోవుటకును మాటకు మాటగా చమత్కరించిన

సీతయే హేతువు కల్పవృక్షమునందలి విరాధ వధకైన పూర్వరంగమింతగా భావ గంభీరము సన్నివేశ మత్యంతము సహజముగా దానంతట అది అట్లుగా బనట్లుం డుట రాముని జీవ లక్షణసంబంధి హాస్యశీలక సీతాహెయరహస్యము పరస్పర ముత్కర్షాపాదకములుగా పూర్వరంగము నిర్వహింపబడినది వ్యంగ్యసర్వస్వ భారతియైన మహాకవి కావ్య నిర్మాణ శిల్పమటుండును

ఇచట నింకొక విషయము చెప్పవలయును రాముడు దగ్గరగా నున్న పుడు విరాధుడు సీతను పట్టుకున్నచో రాముడూరకుండునా అన్నప్రశ్న వచ్చు నని రాముడు దూరముగా నున్నట్లు కల్పింపబడినట్లు చెప్పినావు గదా?-వెనుదిరిగి సీతను పట్టుకొన్న విరాధుని చూచి గూడ రాముని వెంటనే వానిమీదకు రాక లక్ష్మణునితో ఏమేమో అనుచూ బాష్పపర్యాకులేక్షిణుడైనట్లు వ్రాయుట బాగు న్నదా? అను సందేహము కొందరకు రావచ్చును 'తరణికులులు నిలిచి చూచుచుండి నివ్వెరపొందిరి సీత పొందుచున్న చేటుపరస' అని వ్రాయబడినది అనగా దానిఅర్థమిది వారరణ్యము ప్రవేశించిన తరువాత కనిపించిన మొదటి రాక్షసుడు విరాధుడు వాని యాకారము-వాని వేషము-వాని హుంకారము రామ లక్ష్మణులకు భయము గొల్పునట్లుగా నున్నవి తాటకాదులను చిన్నతనమున చూడలేదా? సంహరింప లేదా? అని యనవచ్చును ఇపుడు సీత చేటు పొందు చున్నది అయినవాడేటిలోపడగా రక్షించుటకు వెంట దూకుటయు, ఒడ్డున కాలు నిలువద్రొక్కు కొనలేక గావుకేకలు పెట్టుచు ఏడ్చుటయు రెండును లోకమున నున్నవి పైగా విరాధుని సీతను పట్టుకొనుట హఠాత్సంభవము దానివలన నిశ్చేష్టత ఇంకను విరాధుని మీద పడవలసియున్న ఊహరాని య నిశ్చేష్టత ఇంకను విరాధు డంటనుండిపోక ఆమెనట్లే పట్టుకొని వారితోమాటలకు దిగినాడు ఆ మాటలలో వాడు కొంచము సరళ స్వభావుడుగా నున్నాడు సామమీద వాని నుండి సీతను విడిపించుకొనుట ఒక ఊహ. ఆ కష్టసమయములో రామునకు తన యీ రాకకు హేతువైన కైకస్మృతికి వచ్చుటయు తాను వద్దన్నప్పుడు మాటవిని సీత అరణ్యమునకు రాకుండినచో బాగుండెడిదన్న భావము వచ్చుటయు అసహజము కావు?

ఇక విరాధుడు, వాని యుందంతము చిత్రమైనది బ్రతికియుండగనే పాతిపెట్టబడిగాని వాడు మరణింపడు అదియును రామునిచేత ఇదంతయు

వానిని శపియించిన కుబేరుడు తుదకు ప్రార్థనా మృదువై ప్రసాదించిన శాపా వసాన విషయము దీని యెరుక విరాధునకున్నది ఉన్నదని యెట్లు తెలియును? వాల్మీకి రామాయణము చదివిన తెలియును "తపసాపురుష వ్యాఘ్ర! రాక్షసోఽయం నశక్యతే, శోస్త్రేణయుధి నిరేతుం రాక్షసం విఖనావహే" అని రాముడనగానే "హతోఽస్మి పురుషవ్యాఘ్ర! శక్రతుల్య బలేనవై మయాతు పూర్వంత్వం మోహాన్న జ్ఞాతః త్వం విదితోమయా వైదేహీచ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః అపి శాపాదహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్, తుంబురున్నామ గంధర్వ శ్శప్తోవై శ్రవణేన హ ప్రసాద్యమానశ్చ మయా సోఽబ్రవీన్మాం మహాయశాః యదా దాశరథీ రామస్త్వాం వధిష్యతి సంయుగే తదా ప్రకృతి మాపన్నోభవాంత్స్వరం గమిష్యతి" ఇత్యాదిగా తన పూర్వ జన్మవిషయమును విరాధుడు చెప్పినాడు విరాధుని ఆయెరుక వాల్మీకిరామాయణ మును విశితముగా పరిశీలించినచో బోధపడును ఆ యెరుక విరాధునకుండనిచో రాముడిక వీడు చావడుగాని గోయిత్రవ్వము దొర్లింత మనగానే వాడంత తెలివిగా మాట్లాడినట్లుగా వాల్మీకి వ్రాయుట పొసగదు అంతకుపూర్వము వానితో పోరా డిన వారెవ్వరును గోయిత్రవ్వి పాతిపెట్టునూహ చేయలేదు ఆ యూహ రామునకు వచ్చినది విరాధునకు శాపావసానమాసన్న మైనదిగదా యని ప్రాణములు లేచి వచ్చినవి విరాధుని జీవసంపుటిలోని ఆ వైశిష్ట్యమును విశ్వనాథ పట్టుకొనెను ఆ పట్టుతో విరాధుని పాత్రను కల్పవృక్షమున చిత్రించెను శాపావసాన విషయ మెరుకలో గలవాడు, దానికై నిరీక్షించువాడు ఐన వాని ప్రవృత్తి యెట్లుండును? దానిని ఊహించుటకు మహాప్రతిభ కావలయును ఆ యూహ చేసినపుడు వాని పైశాచిక దేహధర్మమున కది భిన్నముగా నుండరాదు ఉన్నచో ఆత్మ పట్టుకొని దేహమును వదలినట్లగును అనగా, విరాధునికథ వ్రాయు వానికి వాని ఆత్మ పట్టుకొని దేహమును వదలినటగును అనగా విరాధుని కథ వ్రాయువానికి వాని ఆత్మధర్మము, దేహధర్మము రెండును ముఖ్యములౌ నన్న మాట విరాధుని సర్వప్రవృత్తియు రాక్షస నైజముగా కనిపించుచు గంధర్వత్వ భావము స్మృతి పథము నుండి జారిపోలేదన్నట్లుగా నుండవలయును అట్లుగా నిర్వహింపబడి నదే కావ్యము రమణీయమగును

"మీదే దేశము? మీరలున్ ద్విజులె
కా? మీ నామధేయంబు లె
ట్లైదీపించును? శూద్రమాంసమును
వాడన్ నేను మీరటిరం

చాదింజెప్ప డెరుంగరానిదగు
ఏ అన్నంబు నేముట్ట క్షు
ద్వాదుల్ క్షుద్రజనుల్ భుజింతు
రటవీ పర్యంత మేదైననున్ "

విరాధుడు రామలక్ష్మణులతో తన బలపరాక్రమములు చెప్పి వారిని బెదిరించి చివరకన్నమాటలవ్వి ఈ అనట చాలా చిత్రముగా నున్నది వాడు శూద్రమాంసమును వాడడు క్షుద్రజనుడుకాడు తాను రాక్షసాకృతి నున్న వాడట్లుగా మాట్లాడుట హాస్యస్ఫోరకమై వాని వికటత్వమును స్థాపించుచున్నది మరియు నది వాని గంధర్వత్వభావమున కనుగుణముగా కూడనున్నది - శాపా వసాన మెరుకలో నున్నవాడు దానికొరకై వేచియుండును అందువలన వాడెవరి మీదకు పోయినను వాంయానుపూర్విని ముందుగా విచారించును తన శాప మోక్షమును ప్రసాదించు రాముడెపుడైనను రావచ్చును రాముడు క్షత్రియుడు అనగా ద్విజుడు ఆ కులమువాడై ఆపేరుతో నున్నవాడు తనకు శాపమోక్షము నను గ్రహించువాడు కావచ్చును అందుకై విరాధుడు ముందుగా విచారించును శూద్రమాంసమును తాను వాడకపోవుటను చెప్పుట ఎదురయిన వ్యక్తి ఫలానా అని తెలియుటకు వాడు నిరంతరము ద్విజమాంసమునే తినుచుండు వాడేల కారాదు? కావచ్చును ముందట్లుగా విచారించి తనకు శాపమోక్షప్రదాయికాని వానిని తినుచుండవచ్చును రాముడు విరాధుని ప్రశ్నలకు సమాధానముగా తమ యుదంతము చెప్పిన తరువాత "ఈమెను వదలి మీ దారిని మీరుపొందు తండ్రి మాట్లబడి యడవికి వచ్చితిమని చెప్పచున్నావు మిమ్ము చంపితినుట యెందు లకు?" అనినాడు విరాధుడు విరాధుడు శాపావసాన మెరిగి దానికై వేచియున్న వాడు వలెనే ఆ మాటయు ననివాడు, రామలక్ష్మణులను చంపితినవలయునని వానికిలేదు తాను వారిచేత చంపబడవలయుననియే యున్నది ఇది ఆత్మధర్మము

పైకి వికటముగా రాక్షసుడువలె కామతురుడైన వాడువలె ఈమెను వదలి మీరు పొందు—మిమ్ము చంపితినను, అది నా క్షేమూలకగుననినాడు విరాధుడ సలైన గంధర్వత్వ భావము కలిమి పైశాచిక దేహముతోడి ప్రవృత్తి నెరపుట విశ్వనాథ బహు చమత్కారముగా నిరూపించినాడు లక్ష్మణుడు క్రుద్ధుడయి

రాముడు స్వవిషయము చెప్పక మునుపు విరాధుని నీ వెవ్వడవురా? అని గద్దించి నపుడు "విరాధుడు అంత వికటాట్టముగా నగి, మీరలెవ్వ రెందునకును బోవుచుం టిరని తొల్తను నేనడుగగంగ మీరు చెప్పిన యడలేదు నన్నడుగ నేర్చితి" అనుట కూడ విరాధుడు తన శాపావసానమెరిగి విచారించుచుండుటను స్థాపించుచున్నది రామలక్ష్మణులమని రాముడు చెప్పినప్పటినుండియు వాడు సంతోషించుచునే యున్నాడాత్మలో సీతను వదలి మీ దారిన మీరు పొందనుటలో విరాధుని ఆంతర్య మదియే వారెట్లును సీతను వదలిపోరు సీతకొరకై తనను చంపుదురు తనకు కావలసినదే అది అందువల్లనే రాముడు క్రోధములో "వదలురా సీతవదలి నీవలను పొమ్మ" అనినపుడు - రాముని క్రోధము విరాధుని ఆత్మలో సంతోషము కలిగించుచున్నది ఆ యాత్మలోని సంతోషము దేహధర్మమున వికటముగా వ్యక్తీకరింపబడుచున్నది "అనిన విరాధుడు నవ్వి మీరు నన్ను జంపెదమంటిరి గదా? సీత వదలిన యేటికి జంపెదరు?' ఇవి విరాధుని మాటలు సీతను వదలినచో నిజమునకు వారు విరాధుని చంపరు కాని, చంపుట వానికి కావలయును అది ఆ వచనములోని యాంతర్యము కావలసిన దానిని కావలసి నట్లుగా స్పష్టముగా చెప్పుటకు రాక్షస దేహాభిమానము అడ్డువచ్చును వచ్చినది అందువలననే ఆ విరాధుని వాక్యము మూర్ఖునిమాటగా నున్నది రాముడనినాడు "మౌర్ఖ్యంబు మీ స్పష్ట్యద్భుతగుణం"బని పాత్ర జీవలక్షణమును పట్టుకొనిపుడే అట్లుగా వ్రాయుట సంభవించును పూర్వజన్మ సహజమైన గంధర్వత్వమును స్మృతిలో నుంచుకొని, తాత్కాలికమైన పైశాచిక దేహముతోడి మనుగడతో, తద్దేహమును వదలించుకొను యత్నమున జాగృతుడైన జీవి విరాధుడైన తుంబు రుడు తజ్జీవ లక్షణము గుర్తింపబడి తదుత్కర్షాపాదకముగా సర్వ రచనయు చేయబడిన దీకల్పవృక్షమున అసలు శ్రీమద్రామాయణమునందలి సర్వ విషయ ముల జీవలక్షణము భాష్యము చేయబడి శ్రీమద్రామాయణ కల్పవృక్షమైనది

విరాధుని జీవలక్షణ మిదియని రామాయణ కల్పవృక్షమున చెప్పబడిలేదు లేదనగా లేదనిగాదు చమత్కారముగ నున్నది ధ్వన్యర్థమున నున్నది ఏత ద్రచనలో నున్నది విరాధునకు తా నస్త్ర శస్త్రములతో చావనని తెలయును తాను బ్రతికియుండగానే పూడ్చిపెట్టవలయును ఐనచో రాముడని తెలిసికొనగనే విరాధు డాయనకీ విషయము చెప్పవచ్చున గదా? చెప్పలేదేమి? శ్రీరాముడు

"పిడికెడు బావడు గోయి త్రవ్వ' మని లక్ష్మణునితో ననిన తరువాత "శ్రీరామా! మంచియూహ చేసితివయ్యా" అనినాడేమి? ఆత్మజ్ఞత్వమునకును దేహాభిమాన కలితమైన మలిన వాసనలకును భేద మచటనే యున్నది విరాధునకా తెలివి రాముడీమాట అన్న తరువాత కలిగినదా? లేక రామలక్ష్మణులమని అయన చెప్పగనే కలిగినదా? అప్పుడే కలిగినదిగాని రాముని మాటలతో అది పైకి వచ్చి నది అనగా వాక్ స్థితికి వచ్చినది దేహ ధర్మమును త్రోసి ఆత్మ ధర్మము వాక్ స్థితికి వచ్చుట కంతసేపు పట్టినదన్నమాట విరాధుని పూడ్చి పోవుచు దారిలో రాముడనినాడు —

"తన పూర్వంబగు జన్మలో గలుగు
వృత్తాంతంబు తా నేయెఱుం
గును, దుష్టాచరణంబు నేపగిదిఁ
గైకొన్నాడు? నన్గాంచినం
తన పూర్వ స్మృతిగల్గె నా వెదకు
చుందావచ్చె నన్నాడుగా
నను? పైశాచిక దేహమే! బలమొ
గంధర్వత్వ భావనకుఁ?'

రాముడన్నటుగా వ్రాయబడిన ఈ పద్యమువలన సాధింపబడిన ప్రయోజనములు రెండున్నవి విరాధుని జీవ సంపుటిలోని వైలక్షణ్యమును తర్కించి నిష్కర్షిం చుట ఒకటి రామునియొక్క జీవసంధి విచారణైకశీలమును నిరూపించుట రెండవది తాటక వధనాటినుండి రాముని ఈ విచారణైకశీలము తుదిదాక సము చితముగా నిరూపింపబడినది రామాయణ కల్పవృక్షమున

విరాధుని పైశాచిక దేహమునకు తగిన యుద్ధతి యనిపించు మౌర్ఖ్యము తద్గతమై వాని గంధర్వత్వ భావస్మృతితోడి జీవలక్షణము - వాడు సీతను పట్టు కొనుట కనుకూలముగా కల్పింపబడిన పూర్వరంగ నిర్వహణము, నాచ్యతో దర్శనీయమై పరమ రమణీయముగా ఈ రామాయణ కల్పవృక్షమున ఉన్నవి అనంతకోటి కావ్యశిల్పములు ఒకానొకసహస్రముఖముల ప్రదర్శించబడిన మహా కావ్యేతి హాసములోని ఒక చిన్న విషయమును స్థూలముగా వ్రాసినాను

# శ్రీరాముని హాస్యశీలత

తా హాస్యాద్భుతశీలి రాముడు (బాల పుట 147) సీతతో చను వెను వెంట నవ్వుకొనుచున్ రఘువీరుడు (350) అనినను నవ్వి రాముడు (అయోధ్య పుట 74) పరాచిక మాడినాడనంతియే క్షమియింపుమయ్యా (91) వరుస మను మఱి తాతలు పడుచువాండ్రు ముసలులును నవ్వులాటలు మసలవెట్లు (92) వన మేగెడు రాచబిడ్డ బహు హాస్య రసమ్మున కింతగ వశుడే (92) గుహుని పరమ స్నేహ శ్రీ వైదగ్ధ్యము నేమని బావింతు నటించు విఱుగబడి నవ్వంగా (154) ఆయన నవ్వంగాంచి సీతాలక్ష్మణులిట్లనుకొనిరి (154) తన తమ్మునిగని యిట్లనియె హాస్యముగ ప్రేమముగన్ (155) అనిన శ్రీరాముడు నవ్వి గ్రుచ్చి ముసి ముసి నవ్వులు నవ్వుకొనియె (207) దరహాసాంకురమేపార (అరణ్య పుట 24) స్వామి చిఱునవ్వు నవ్వుచు (24) ఉల్లసమాడె స్వామి (37) స్వామి అనంత కల్యాణ గుణగణములలో ఈ హాస్యశీలత ఒకటి దీనిని ముఖ్యంగా ప్రకటించిన వాక్యాలింకా కలవు

మందహాస రేఖాననుడై పతి సీతం ముందునడచెం గడంకన్ (అరణ్య) అన రఘురామమూర్తి పరిహాసము చేయుచు నింత భక్తులై చను మన మేగుదెంతుమని సంబరమేటికి పొందరాదె? (55) అంత శ్రీరామచంద్రుడు చిఱునవ్వున నమ్మునితో నిట్లనియె (64) ప్రశాంతహాస మధు ధారా మూర్తియై తమ్మునితో (84) ఆహా మొనగాడు వచ్చెనని హాసముచేయుచు (188) కైకేయీ దేవి విద్యావిష్కారము నీవెఱుంగవు సుమీయంచుమరిన్ నవ్వుచున్ (142) అనిన రామమూర్తి అల్లంతగా నవ్వి (198) అనిన శ్రీరామచంద్రుడు ముసి ముసి నవ్వుల నిట్లనియె (340) శ్రీరామచంద్రుడు నిబిడమంద మృదు మహానుడు చూచె సౌమిత్రివంక (340) చిత్రముగ ప్రసంగించుచు (341)

---

జాగృతి, 5-3-1973

నన్నుం జూచిన నాకె చిత్రమగునన్నా ఆమెతో హాస్యముల్ (348) రాముండు చంద్రకళాహాసుడు (సుందర పుట 326) నిత్యపరిహాస మనోజ్ఞవచో ప్రబంధ (328) లవలీ సుకుమార మనోజ్ఞహాసుడు (329) శ్రీరామ చంద్రుని ముఖ మండలంబు నందలి సహజ మందహాసరేఖ (330) అన్నగారి పారిహాస్యంబు సహజత్వంబు నొందినందుఁకు తాను సేదదీరి లక్ష్మణుండు (330) చిందిన మందహాసరేఖారుచిరచ్ఛవుల్ మఱియు కన్నులగాంచుట యొండె గొప్పయై (331) అంత నవ్వుచు శ్రీరామచంద్రుండిట్లనియె (యుద్ధ 210) ఈ విధముగా నున్న కల్పవృక్షమునందలి వాక్యములను పరిశీలించినచో కొన్ని కవి శ్రీరాముని గూర్చి అన్నవి, కొన్ని మిగిలిన రామాయణ పాత్రలు శ్రీరాముని గురించి అను కొన్నవి కొన్ని శ్రీరాముడే అన్నవి అవన్నియును ఆయన హాస్యమయ లక్షణ మును ఎత్తిచూపునవియె దీని నింతగా ప్రకటించుచు కవి ఏమి సాధించినాడ నగా కథాకథనమును శిల్పరమణీయము చేసినాడు

శ్రీరాముడు బహు హాస్య రసప్రియుడు సహజ మందహాస సుందర వదనారవిందుడు పరిహాస మనోజ్ఞవచో విలాసుడు సీతారాము లిద్దరును వాక్య ప్రతివాక్య సమ్యక్ప్రశ్నా చాతురీ మహా ప్రతిభులుగా ఈ కల్పవృక్షచ్ఛాయల గన్పింతురు వీరి యందీ లక్షణమును సుష్ఠుగా వెలార్చుటచేతనే ఈ రామాయణ మున కొక క్రొత్త యాకర్షణ పుట్టకొని వచ్చినది ఆ విధముగా నీ మహా కావ్యము నందొక చిత్రమైన వ్యంగ్య వక్రత గుబాళింపు సహృదయ సమాజమున కాస్వాద్యమగుచున్నది మర్యాదల నతిక్రమించుటలో హాస్యము పాదరసము పోకడ కలది ఆ ప్రమాదము కవికి తెలియును శ్రీరామునకు తెలియును శ్రీరాముని యట్టి మాట తీరునకు ఎదుటి పక్షమాధిని పొందుట యున్నది అది తెలిసియు ఆయన అట్లే మాటాడును ఆయనకా పరియాచకమాడుట యందలి బద్ధానురాగ మట్టిది ఎదుటివాని మాటలనుండి చేతలనుండి ఏదో ఇంత హృద యాహ్లాదమైన యర్థమును ప్రక్క ప్రక్కగా లాగి ఆనందించుటలో శ్రీరామునకు శ్రీరాముడే సాటి ఈ లక్షణమును కావ్యార్థగతి కుపబలకముగా నిష్కర్షించు కొనుచు పోవుట ఇందలి రచనా శిల్పమునందున్న జిలుగు పనితనము

సీత తానును వనవాసమునకు వత్తునన్నది రామడు వద్దన్నాడు ఆమె మరియు అనుచున్నది

తన వేదంబులు పండియున్న మతి చేతన్ తొల్లి సావిత్రి భ
ర్తను వెన్నాడి పరేత రాజును బుగర్థ స్తోమ సంప్రీతుం జే
సిన యాపాలిత భర్తృ సంవ్రతము నా చిత్తంబునన్ హత్తి యుం
డెను శ్రీరాఘవ! నే వనంబులకు నేన్ నీ వెంటనే వచ్చెదన్
—అయోధ్య పుట 74

ఈ మాటలలో నవ్వు వచ్చుట కేమున్నది? ఆ సన్నివేశమెట్టిది? అది విపరీతార్థములు లాగి సంతోషింపదగ్గ సమయమా?

అనినను నవ్వి రాముడు మహావనవీధి పరేతరాజు న
న్నును గొనిపోవ రావలయున్ జనకాత్మజకూడ నన్ను ప్రో
వను వలె నన్న సీత రఘుబంధుని జూచిన చూపు వాడిమిన్
జనకతనూజఁ గౌఁగలికిఁ జాచి రఘూద్వహు డోర్చుపుచ్చుచున్
—పుట 74

ఇది రాముడు ఓరగా జేసి లాగిన యర్థము భర్తలకు చమత్కారములు గానే ఇట్టివి భాసింపవచ్చును. కాని, భార్యల కివి అర్థములు కావు వారిట్టి అమంగళములను విననొల్లరు భర్తల విపరీతార్థములకు వారు నొచ్చుకొందురు భర్తలను మ్రింగవలయునన్నంత కోపముకూడ వచ్చును ఏమి అనుటకును నోరాడక తమదే తప్పని సర్దుకో జూచుటలోని చూపు వాడిమిని పరమ సుకుమారులు భర్తలు హాస్యము చేసి ఆస్వాదింతురు అప్పుడు భార్యలింకను కోపములు పోయెదరు సీత విషయమున ఇంత పని జరిగినది అప్పుడు రాము డనుచున్నాడు

ఈమాత్రంబునకింత కోపపడ నీవేలాగు లీకాంతార
థీ మార్గంబుల నాదుమాటలకు అధింబొందెదో యన - నో

స్వామీ దండధరుండు నిన్నుఁగొనిపోవన్ రానె? వద్దు సా
మీ! మాయామతి యేఁడౌ నన్నె కొనిపోనీ, వాడా! యింకెవ్వఁడో!
—పుట 75

ఇట్టి రాతో అడవులకువచ్చి ఇటువంటి మాటలింకా పడుట యెందుకు? నీవు రాకుము ఇందే యుండుము తన యీ యభిప్రాయమును రాముడు పునరుద్ఘాటించినాడు పద్యము పూర్వార్ధమైపోయినది సీతకు ఉడుకుబోతుతనము హెచ్చినది పద్యము ఉత్తరార్ధమామె పలికినది స్వాత్మ నిందాత్మకముగా నున్న యీ యర్థము సన్నివేశమునకు సముచితముగా నున్నది అంత మాత్రము గానే అది అగినచో ఏమియులేదు మహాకవి రచనా శిల్పముచేత పూర్వాపర ములకు బారలు సాచుకొని భూత భవిష్యదర్థములను అది చూపించుచున్నది ఇక ముందున్న రామాయణార్థ మంతయు దానిచేత సమాకర్షింపబడుచున్నది ఈ యర్థము వక్తబుద్ధియందు తెలిసి యుండనక్కరలేదు కవి బుద్ధి యందుండ వలయును ఉన్నప్పుడే ఇట్లు రచించుట కుదురును సహృదయుల రమణ మంతయు కవి యందే కదా! పాత్రములయందే రమించుచున్నారు - నిజమే కవి బుద్ధి శక్తినుండియే కదా అవి పుట్టినది! అందువల్ల పారమార్థికముగా రమణ మంతయు కవి బుద్ధి శక్తియందే సీత పలికిన పలుకులయందు రామాయణార్థమంతయు గతార్థముకాలేదు మాటకుమాట వద్దింపెడివాడైనను శ్రీరామునకు తా నాత్మనింద చేసికొని చమత్కారము చేయవచ్చునుగాని సీత చేయరాదు ఆమె విషయమున అట్టి అమంగళము అనరాదు- వినరాదు ఆమె అన్నది కదా! అనిన శ్రీరామచంద్రుడు-

కోపంబేచు తుషార రుఙ్మృదుకలా కోటీరుచే కాలుడే
యాపత్తిం గనెనో మృకండు సుతుప్రాణాకర్షణ ప్రక్రియన్
నా ప్రాణంబగునట్టి నీ దెస నెలంతా ఆతడౌ నెవ్వడే
నో పద్మాసన! అంతకంటె పది రెట్లౌందున్ మహాపత్తతుల్ —పుట 75,

ఈ అంతటి యర్థము రావణ వధ పర్యంతములోనున్న సర్వరామాయణ కథార్థ దీప్తికిని తాను వ్యంజకమై సొగసులు పోవుచున్నది ఈ సీతారాముల వాక్యము లెట్లున్నవి? అసలు వారెట్లున్నారు? పైకి లౌకికులైన సాధు జనులవలె నున్నారు అప్పుడు వారి యర్థములు వాగనువర్తనములు లోతుగా నిదానించి విచారించినచో వారు పరమ సనాతనులు అప్పుడు వారి యర్థములు వారి వాక్కుల వెంటబడి పరుగులెత్తుకొనుచు రావలయును వ్యంగ్యార్థములన్నియు నట్లు వచ్చునవియే అట్లు వ్యంగ్యార్థములను పరమరమణీయములుగా సమర్పింపగల రచనా విశేషమే శిల్పవంతము శిల్ప సంక్లిష్టముకాని రచన కల్పవృక్షమునందుండదు ఇంత శిల్పమును ఇట్లు ప్రతి అక్షరమునను తెలిసి చేసెడు కవి ఎంతవాడు కావలయును? సీతారాములాద్యులయిన పురాణపురుషులని యేదో మనము చెప్పినాముకదా! అదియు అయన చెప్పినదియే దశరథుడు మరణించినాడు అయోధ్యకు వచ్చి జరిగిన దానికై భరతుడు విలపించుచున్నాడు

ఒకనాడా రఘురామమూర్తి నన్ను ప్రేమోద్గారి నేత్రాంచసే
చకుడై యిట్లనె తమ్ముడా ధరణిరాజ్యంబెల్ల నీవేలుమా
రక నేనుందును నామ మాత్రముగ నౌరా నీవు సాకేత కౌ
తుకమై పోతివి తాతగారి గృహమందున్ నిత్యవాసంబుగన్
తమ్ముల మీద నా దొరకుఁ దార్కొన నచ్చపు ప్రేమతోడి వా
క్యమ్ముల నిట్లు పట్టునని యర్థమెరుంగగ లేనయైతి నన్
గ్రమ్మిన యట్టి మందమతిగాని యధార్థ వచస్కు వాని వా
క్యమ్ముల కాభిముఖ్యముగనై చనుదెంచు మహార్థ సంతతుల్
—పుట 240

భరతుని విలాపము విలాపముగా వాని హృదయ నైర్మల్యమును బహుధా ఆవిష్కారమును సుష్టుగా చేయుచున్నది అందులో శ్రీరాముని యందున్న శబ్దార్థముల యొద్దిక లక్షణమును సూచించి, దాని ద్వారా శ్రీరాముని పురాణ పురుష వైభవమును గుబాళింప చేయుటలో కవి పనితనమున్నది అ విధముగా

ఈ కల్పవృక్షంబున కవి తన రచనను అధ్యయనము చేయుటకు కావలసిన విజ్ఞానమును కూడ అందించుచుండును అందుకే ప్రయోజన రహితముగా ఇందొక్క పలుకుండదనుట అందరు కవులకును తమ కృతులపట్ల చక్కని శ్రద్ధయే యుండును ఈ కల్పవృక్ష కవి ఆ విషయమున అనన్య సామాన్యుడు ప్రాచీనులలో ఇట్టి వాడొకడీ దేశమున భవభూతియనువాడుండెను

శరభంగ మహర్షి అగ్నిని ప్రవేశించి బ్రహ్మలోకమును గూర్చి పయనించుటను చూచుటతోపాటు శ్రీరామచంద్ర దర్శనాభిలాష నరుగుదెంచిన మునులు మర్యాద మాటగా శ్రీరాముని ప్రస్తుతించుటలో అన్నారు కదా—

మమ్ముం బరాక్రమ రేఖను
నిమ్మగు ధర్మాభిరతిని నిప్పటిదాకన్
నమ్మించి తసుర దంష్ట్రలం
గ్రుమ్మింపకుమిపుడు నమ్మికొన చెరుపకువే —అరణ్యా పుట 24

ఇది వారి శరణాగతి స్వామి సరే అని అభయ మియ్యవలె ఆయన నుండి వారు కోరుకొనుచున్నదదియే రాక్షసులు వారి పంపినట్లు ఒలుచుచున్నారు శ్రీరాము డెక్కడేమి దొరుకునాయని అందరి మాటలను తూర్పారబట్టి చూచువాడు తాను చమత్కారము చేసి పైచేయిగా పోవలయును పాపము ఛాందసులు మునులు సంప్రార్థన పరత్వమున ధాతువునకించుక్క తగిలించి ప్రేరణార్థ ప్రతీతికి అవకాశము కల్పించిరి ఆవిధముగా తమ్ముతాము మునులు 'శ్రీరాముని చేతిలో సమర్పించుకొనిరి అవకాశమును జారవిడిచి అయ్యో అనుకొను బుద్ధి లక్షణము కాదతనిది

అనినన్ స్వామి దయార్ద్రమూర్తి దరహాసాంకూర మేపారని
ట్లని నమ్మించితినా మిమున్? దొసంగు నాయందయ్యో మన్నింపుడే
మన నమ్మించిన దానికిన్ ఫలము దైత్యశ్రేణి మీకోసమై
ధనురంతమ్మున మ్రగ్గఁజేసెదను మీ తాత్పర్య మిట్లే కదా? —పుట 24

కలిగిన తండ్రియాజ్ఞఁబడి కానకు వచ్చితి మీరు దానితో
పల బహుళార్థ సంగ్రహణ బంధురదీక్షలు మీకు నంతగా
తెలిసిన వేల కాదనుట? తీర్థము స్వార్థము కూడివచ్చినన్
వలదననేల? మీకు వశవర్తినిగా నడతున్ ప్రియంబునన్

ఇట్లనుచున్నంత సేపు స్వామి చిఱునవ్వు నవ్వుచునే యుండెను అంతలో ఆప్రధృష్యుడు "ఇది వాగ్దానము మీ తపః పరమసాహిత్యంబు నిత్యత్వ సంపద వర్ధిల్లగ దైత్యయూథముల వ్యాపాదింతు" శ్రీరాముని ఈ వాగ్దానము నందలి ప్రవృత్తియే తరువాత రామాయణ మంతంతయును రాక్షస సంహారమునకు శ్రీరాముడు ప్రతిజ్ఞ చేయుట అదియొక యదృచ్ఛాలాపముగా అది అట్లు వెలికిరాక తప్పనట్లుగా సన్నివేశము నంతటిని శ్రీరాముని ఒకానొక అంతఃకరణ ప్రవృత్తి విశేషము మీద తిరిగినట్లుగా త్రిప్పి రచించుట మహాకవి తెలిసిచేసిన శిల్పము యొక్క రామణీయకమును పుక్కిలించుచున్నది ఈ విధముగా నీ కల్పవృక్ష ఛ్ఛాయలలో ఎటు తిరిగినను కావ్యతత్వజ్ఞులైన సహృదయులకు ఆనందామృత సంతర్పణమే సంతర్పణము

# రసము వేయిరెట్లు గొప్పది

"రసము వేయిరెట్లు గొప్పది నవకథా కృతిని మించి" - ఈ సిద్ధాంతము మీద కల్పవృక్షము రచింపబడినది కావ్యము రసవంతముగా నుండవలయును కథావంతముగా కూడ ఉండవలయును కావ్యము మొత్తము కవి ప్రతిభ మీదనే ఆధారపడి యుండును అది రసవంతము చేయబడుటయే కవి ప్రతిభకు నిదర్శనము కావ్యమునయందు నూటికి తొంబది పాళ్లు కవి ప్రతిభలో నుండును అనగా కావ్యమున రసము తొంబదిపాళ్లు కథ పదిపాళ్ళు ఆ కథ లేనిచో ఆ రసము పుట్టదు అందువల్ల కావ్యము కథావంతముగా కూడ ఉండవలయును దానిని కవి తన ప్రతిభచేతనే పుట్టించి తీరవలయునన్నది లేదు అదియును గాక అది అంత సులభ సూత్రమైన పనియు కాదు వ్యాస వాల్మీకుల తరవాత ఈ దేశమున కావ్య కథను సృష్టించిన కవి ప్రతిభ పుట్టలేదు

కవి ప్రతిభ యంతయును కావ్యకథను రసవంతము చేయుటయందే యున్నది రసము అనుభవ విషయము అనుభవ మనగా సుఖ దుఃఖాది ద్వంద ములను జీవుడు పొందుట సుఖ దుఃఖములకు వాక్కలాపము, క్రియాకలాపము సాధనములు ఒక కథ వినుచున్నావు నీవు సుఖ దుఃఖములను అనుభవించు చున్నావు ఇది ఎట్లు సంభవించుచున్నదనగా ఆ కథా పురుషుల యొక్క వాక్కలాపము, క్రియాలాపము నీ జీవుని తమ కభిముఖముగా కదలించుకొను చున్నవి అందరు కవులును కథలతోనే కావ్యములు వ్రాయుదురు కొందరు వ్రాసిన కొన్ని కావ్యములే రసవంతములని ఎందుకనుకొను చున్నామనగా ఆ కొందరు కవుల ఆ కొన్ని కావ్యములలోని ఆ కొన్ని ఘట్టములలోని ఆయా పాత్రముల ఆ కొన్ని వాక్యములును, ఆ కొన్ని క్రియలును మన మనసులను ఆత్మాభిముఖములుగా స్పందింప చేసికొనగలుగుచున్నవి గనుక లౌకికములయిన అనుభవములు సుఖ దుఃఖరూపములు కావ్యానుభవములు సుఖదుఃఖ రూపములే అయినను తనివి తీరని వగుటచేతను క్షణికముల గూడ చేతను రసములన బడును అనగా కావ్యరసము సుఖమును దుఃఖమును అయి, సుఖమును దుఃఖ

మును కానిదగునున్నది తాదృశమైన రసమును అభివ్యక్తము చేయునదిగా కావ్యమును రచించుటయే కవియొక్క ప్రతిభ

దృశ్య కావ్యమున పాత్రముల వక్కలాపమును క్రియాకలాపమును మాత్రమే యుండును కనుక అక్కడ అంతయు రసప్రతీతి కనుకూలముగా నుండును శ్రవ్య కావ్యమునందు కథ చెప్పుచున్నట్లును, వర్ణము చేయుచున్నట్లును, వ్యాఖ్యానించుచున్నట్లును కవి ప్రత్యక్షముగా ప్రవర్తించుటకు వీలున్నది పాత్రముల వాచికమువలె అభినయమువలె కథన వర్ణన వ్యాఖ్యానాదికములు సాక్షాత్తు రసవిషయములు కావు దోహద విషయములు రసప్రతీతికి దోహదములను కల్పించుటకు శ్రవ్యకావ్యమున నున్నంత వీలు దృశ్య కావ్యమున లేదు అందుకనియే ఉభయ కావ్య ప్రౌఢిపాటించు శిల్పమున పారగులయిన ఆంధ్ర భాషా మహాకవులు శ్రవ్యముల నాదరించినట్లు దృశ్యముల నాదరింప లేదు తిక్కన్నగారి తరువాత ఏడువందల సంవత్సరములకు ఆ మహా శిల్పము పారము తుదిదాకునట్లుగా విశ్వనాథ శ్రీమద్రామాయణకల్పవృక్షమును రచించెను

తనకు ముందునుండి రామకథను రకరకాలుగా సాహిత్య కళారూపాలుగా తీర్చిదిద్దిన వారిని రామకథాభాష్యకారులుగా పేర్కొన్నాడు విశ్వనాథ అందువల్ల ఆయన రామాయణ కల్పవృక్షం కూడా రామాయణానికి భాష్యం వంటిదే కానీ, వాల్మీకి రామాయణాన్ని తెలుగులో వ్రాయటం కాదు అని అంటున్నాం భాష్యసంప్రదాయం దర్శన మార్గానుయాయులది కానీ,కావ్యమార్గానుయాయులది కాదు కావ్యమార్గంలో వస్తున్నది వ్యాఖ్యాన సంప్రదాయం మల్లినాథుడు కాళిదాసాది కవుల కృతులకు వ్యాఖ్యానాలు వ్రాశాడు కానీ, భాష్యాలు వ్రాయలేదు పురాణవాఙ్మయ ప్రవచనకర్త అయిన సూతుడు వ్యాఖ్యాన వైఖరీ సమేతడుగా ప్రసిద్ధుడు కానీ, భాష్యకారుడుగా కాదు విశ్వనాథ వచ్చేటంత వరకు కావ్య రచనా దృక్పథంలో భాష్యపక్కిక ప్రవేశించలేదు అంటే- అయన కావ్యరచనా ప్రవృత్తికి దర్శన స్థాయిని సంభావించాడన్నమాట

సంసారులు మీరలు ని
స్సంసారుడ నేను ఏమిసంబంధము ప్ర
ధ్వంసము పొందిన బోగరి
రంసామతితోడ మీకు రామునితోడఞా

ఈ మాటలు శ్రీరాముడు తన తల్లిదండ్రులతో కౌసల్యా దశరథులతో ననుచున్నాడు వారు సంసారులా? తాను నిస్సంసారుడా? సంసారమనగా నేమి? జీవత్వమువల్లనేకదా సంసారిత్వము ప్రాప్తించుచున్నది సుఖ దుఃఖానుభవమే సంసారిత్వము అయినచో శ్రీరాముడు జీవుడు కాడా? కాదనుచున్నాడు కదా? ఉపాధిగతుడైనవాడు జీవుడు కాక తప్పదు కదా! అవును అక్కడ జీవునకు మేల్కొనుటయు, మేల్కొనకపోవుటయు అన్న రెండుదశలున్నవి మేల్కొన్నవాడు సుఖదుఃఖములకు ద్రష్ట మేల్కొననివాడు సుఖదుఃఖములకు విషయము శ్రీరాముడు తన తల్లిదండ్రులకువలె తానును శరీరముతోనే యున్నాడు గనుక జీవుడు మేల్కొనియున్నాడు గనుక పరమాత్మ దశరథుడు మేల్కొనిలేడు కౌసల్య మేల్కొనిలేదు అందువల్ల వారు తత్కాలమునందు దుఃఖితులమనుకొనుచున్నారు రామాయణమున శ్రీరాముడు దు ఖించుటలేదా? ఉన్నది అనగా తత్తత్కాలములయందు సుఖ దుఃఖములకు తానును విషయమై జీవత్వమును భజించినాడన్నమాట ఈ కల్పవృక్షములో కొన్ని పాత్రలు మేల్కొనుట తెలిసిన జీవలక్షణము కలవి కొన్ని మేల్కొనుట తెలియని జీవలక్షణము కలవి

# సమసామయికత

## 1

రామకథ అన్ని భాషలలోవలెనే ఆంధ్ర భాషయందును బహుజనములచేత బహువిధములుగా చెప్పబడినది చెప్పబడుచున్నది మనము భారతీయులము మన జాతీయత మన భారతీయత యందున్నది ఒక జాతి జీవనమునందు దాని సంస్కృతీ సంప్రదాయములకు నిలయ భూమియైన జాతీయభాష ప్రధమతః గణింపదగినది ఇన్ని వందల సంవత్సరములుగా నిత్య నైమిత్తికములకు ఆ భాష నుపయోగించుచున్న ఆ జాతి జనులు దాని కెన్ని సొగసులను సమకూర్పవలయునో అన్ని సొగసులను సమకూర్చిరి భారతజాతి స్వతంత్రమై ఇన్ని సంవత్సరములయినది దీనికొక జాతీయ భాష నిర్వివాదాత్మకముగా లేదు ప్రాచీన భారతమున జాతీయ భాషయైన సంస్కృతము తన ప్రవృత్తిని తగ్గించుకొనుటయు ప్రాంతీయభాషలు తమ ప్రవృత్తిని పెంచుకొనుటయు ప్రక్క ప్రక్కగానే మొదలయినది అప్పటి నుండియు మన జాతీయత జాతీయభాష ద్వారా కాక జాతీయ సాహిత్యముద్వారా పరిరక్షింపబడుట మొదలైనది తాము భారతీయులమన్న వివేకరూపమైన జాగృతి తన భాషాభాషీయులయిన మహాజనముల చిత్తములయందు మేల్కొనియుండుట నభిలషించియే రాజరాజనరేంద్రుడు నన్నయ్యగారిని తెనుగున మహాభారత రచనకు ప్రేరేపించినది అది అంతటి మహనియకార్యము గనుకనే నన్నయగారు పూనుకొనుటయు జరిగినది రాజకీయముగా కలిసియుండుటకు నోచుకొనని భారతీయులను కొన్ని వందల సంవత్సరములపాటు తామంతయు నొకజాతి జనులమన్న విజ్ఞానమును కల్గించుచు రక్షించుకొని వచ్చినది భారతీయ సాహిత్యము జాతీయ ప్రభుత్వము లేక జాతీయభాషకు దూరమైన ఇన్ని కోట్ల ప్రజల నింతకాలము మన మన ప్రాంతీయ భాషలలో వెలసిన సాహిత్యము సంరక్షించినది "వటవృక్షములకు వలె ఈ యన్ని భాషా సాహిత్యములను వ్యాపించి పాతుకొనిపోయిన మహేతిహాసములు భారత రామాయణములు సంస్కృతమున నివి ముందు వెనుకలుగా వ్రాయబడినను తెనుగున మాత్ర మవి అట్లే వ్రాయబడినవి"

---

జనధర్మ, నవంబర్ - 1971

## 2

ఇతివృత్తమైన కథ ఏ కావ్యమునకా కావ్యమునకుగా నది క్రొత్తదై యుండవలయునా? ఉండుట మంచిది కాని, కావ్యమునకు కథలోని క్రొత్తదనము ముఖ్యము కాదు మనకీ ఆధునికకాలము వచ్చి, కథానికలు - నవలలు మొదలైన నూత్న గద్యకావ్య ప్రక్రియలు విరివియైన మీదట అందు దేనికథ దానికిగా నుండుటచేత ఈ క్రొత్తదనమునందలి వింత మన ప్రాచీనకావ్యములపట్ల కొంత విముఖత్వమును పాఠకులయందు కల్గించినది క్రొత్తగా కథ కావలసినవాడు ఈనాడు మహాకావ్యముల పొంతకు పోడు వీనిని చదివెడివానికి వట్టి కథను మించి జాతీయ చైతన్యమును స్పందింపజేసెడి అర్థబోధ కావలయును అందరు పాఠకులును బుద్ధిమంతులు కారు వారు రమింపగలిగినది అక్షర రమ్యత కథా కలితార్థయుక్తి వారికి పట్టదు అర్థయుక్తి పట్టనివారి స్థూలదృష్టి కది క్రొత్తదిగా కన్పించవలయును మన ప్రాచీన విద్వాంసుల వట్టి పాఠకులు కారు అర్థబోధ పుష్కలముగా కలవారు అర్థమునుండి భావము భావమునుండి రసము రసమే కావ్య పరమార్థము అందువలన కావ్యమునకు రసపర్యవసానమునే వారు చూచెడివారు వ్యాస వాల్మీకులు తప్ప కథను క్రొత్తదానిని కల్పించి రచించిన మహాకవులు లేరు కాళిదాసాదులే కల్పించలేదు ప్రపంచ మహాకవుల వరుసలోని కాళిదాసాదులకే నూత్న కథల అవసరము లేకపోయినది రసము వేయిరెట్లు గొప్పది నవకథాధృతిని మించి ఈ రహస్యము తెలిసినచో వరల నిదేల రామాయణంబన్నది కొంత యర్థమగును

కావ్యమును రసవంతము చేయుట యెట్లు? అందుకు వర్ణమునుండి పనిని ప్రారంభింపవలయును ప్రారంభించినచో వర్ణ పంక్తి విస్తరములై పదములు, పదవితానములచేత వాక్యములు, వాక్యభేదరచనావిశేషమువలన సుందరతరము లైన అర్థములు సృష్టించబడి, అమీదట అర్థతత్త్వ వివేచనము ద్వారా విబుద్ధ మయ్యెడు భావమును బట్టుకొని దానిని స్వాత్మకు సుప్రసన్నమగునట్లు భావించు కొనగల సహృదయులకు అనుభవమునకయ్యెడునట్లుగా రచింపబడినచో అది రసవంతముగా రచింపబడినట్లు సుందరతరములయిన అర్థములద్వారా భావ ములు ప్రబుద్ధమగుట యనగా సహృదయులు విజ్ఞానఘనులగుట అనగా సహృదయ హృదయానురంజనమైన కావ్యాత్మ విజ్ఞానాత్మకము అట్లు చేసినచో

కావ్యము రసాన్వితమగును రసమయమగును కావ్యమును విజ్ఞానాత్మకము చేసి రసమయము చేయుటకు కావ్యకథను క్రొత్త సృష్టింపవలసిన అక్కర లేదు ఇదే ప్రాగ్వైపశ్చిన్మతము ఈ ప్రయోజనము నాశించియే మన సాహిత్యము ప్రవర్తించుటచేత మన కవులకు క్రొత్త కథలను సృష్టించుకొనవలసిన అక్కర లేకపోయినది విజ్ఞానఘనమును ఆనందమయమునుగా చేసి శ్రీరామకథ శ్రీమద్రామాయణ కల్పవృక్షముగా వ్రాయబడినది ఒక కావ్యము యదభిముఖముగా వ్రాయబడినచో దానిని మనము తదభిముఖముగానే చదువవలయును

అద్వైతవాదము వ్యక్తి చైతన్యమును పరాంకోటి కెక్కించు శక్తితత్త్వము కలది శ్రీరామచంద్రుడు వ్యక్తి సీతా మహాదేవి శక్తి ఏతాదృశమైన అద్వైతముయొక్క మహావిజృంభణ వైభవము శ్రీమద్రామాయణము పరపీడనపరాయణమైన దానవత నణగార్చుటకు మానవు డెంత చేయవలయునో రామాయణమునందున్నది దానవత కింతవరకు నొక లక్షణమున్నది అది ఎప్పటి కప్పుడు అణిగిపోయినట్లు పోవుటయేకాని దానికి నశింపు లేదు ఆ విషయమున మానవుడు నిరంతరము జాగ్రత్త కలిగియే యుండవలయును శ్రీరామునకు కోతులే ఏల సహాయము చేయవలయును? ఈ మహా జగత్పరిణామక్రమంబునం దప్పటినుండియు దానవుల లక్షణానుభవము మనకుండనేయున్నది ధర్మమును పట్టుకొనియుండుటయే మానవ లక్షణము మానవ ధర్మమును మానవజాతి మనుగడ కనుకూలముగా హెచ్చరిక చేయు తాత్పర్యము కలది రామాయణము అందువలన రామాయణము తిరిగి తిరిగి మరల మరల వ్రాయబడనే వలయును అన్ని భాషలయందును శ్రీమద్రామాయణ మహాభారతములు అప్పుడప్పుడు రెండు మూడు వందల సంవత్సరముల కొకసారియైనను మహాకవులచేత వ్రాయబడు చుండవలయును ఇప్పుడు మన సమకాలమున శ్రీమద్రామాయణ కల్పవృక్షము రచింపబడినది మరల రెండు మూడు వందల యేండ్ల తరువాత కాలమెట్లుండునో ఏమి చెప్పగలము?

## 3

ఇప్పుడు మన సమాజము ఒక పురోగామి చైతన్యమును వంటబట్టించు కొనుచున్నది అందువల్ల క్రమముగా దీని రూపు రేఖలు మారిపోవుచున్నవి

మార్చుట కనేకు లనేక విధములుగా ప్రయత్నించుచున్నారు ఈ కాలమున శ్రీమద్రామాయణ కల్పవృక్ష రచన మట్టి మహా ప్రయత్నములలో నుత్కృష్ట మైనది పది వందల సంవత్సరముంమీద వచ్చిన తెనుగు కవిత్వమును చదువుటకు కొన్ని జీవితములు కావలయును ఇన్ని వందల సంవత్సరముల తెనుగు కవిత్వమునందలి విశేష లక్షణ లక్షితముగా కల్పవృక్షము వ్రాయ బడినది ప్రాచీన కావ్య మర్యాదలను మనకేమి కావలయునన్న దానిని కల్పవృక్ష మందించగలదు ఆధునిక నాగరికతలో అన్ని విషయములలోను అతి శీఘ్రముగా మార్పులు ప్రవేశించుటను గమనించుటచేతనే కల్పవృక్ష మట్లు వ్రాయబడినది ఈ మన జాతి తన పురోగమన లక్ష్యమున జేసి పురాతనమును ప్రయోజన కారియైనదానిని నష్టపోకుండ ఉండవలయునని సర్వలక్షణలక్షితముగా కల్ప వృక్షము సమకూర్చబడినది ఇంకా రామాయణ మెందుకు? అని మనమంటు న్నాము కొడుకు పొలముపనిలోపడి ఇల్లు మరచి పనిచేయు చున్నాడు తండ్రి అన్నము మూటగట్టుకొని తెచ్చినాడు కొడుకా పనిమీది తత్పరతతో అనినాడు - ఇప్పుడు అన్నమ గిన్నము నాకేమివద్దు - అసలు నిన్నెవడు తెమ్మన్నాడు - కూడు - కూడు తండ్రి హృదయము పరవశించింది పైకి అన్నాడు నోరుమూసుకొని అన్నము తినరా ముందు అని యువతరము యొక్క పురోగామి లక్షణమున కావిధముగా కల్పవృక్షము దోహదము చేయుచున్నది అన్నము నుండియే సర్వభూతములను పుట్టుచున్నవి సర్వభారతీయ సాహిత్య ములను శ్రీ మద్రామాయణము నుండి రూపుగట్టుకొన్నవే ఇప్పుడు రామా యణము వచ్చినదనగా సర్వభారతీయ సంస్కృతి సంప్రదాయములను ఇప్పటి వారికిని, మునుముందు వచ్చెడివారికిని ప్రదర్శించుచున్నదన్న మాట ఇందువల్ల ఏమిజరిగినది? The worth of a tradition is gauged by its historical necessity, its strength and its ability to make a basis, or a support, for the creation of new cultural values (Georgy Lomidze-problems of modern aesthetics-80 P )

4

శ్రీమద్రామాయణ కల్పవక్షము నింత అనంత కల్యాణగుణ గరిష్ఠముగా రచించిన కవి ఎట్టివాడు కావలయును? రామాయణమును రచించుటకు కవి

ఎట్టివాడు కావలయునో తానట్టివాడన్న ఆత్మవిశ్వాసము పుష్కలముగా కలవాడు కావలయును ఇదియును మఱియు నీమహాసుకృతి నిర్మాణ లక్షణమును ఖండాంతములందును, కాండాంతములందును, కృత్యాదియందును చూచినచో కనిపించును

ఇదియొక మహాద్భుత కృతి పరమసుందర పవిత్రభావ భాసురముగా వాగర్థాఖిల చాతురీ రీతిగా పరికల్పితము మఱియు ముఖ్యముగా కథా కథనదక్ష రచనా శిల్పానేక మార్గాభిరామ మహనీయముగా అనుపమాన రస ప్రవాహోల్బణముగా తన సకలోహవైభవ సనాథముగా విరచితము అందువలన నిది కోమల చమత్కృత్యధ్వనిర్మాణ సంపద నూనోజ్జ్వల రమ్యభావ రససామగ్రీ సమగ్రము

ఈ కవి "అలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభారదోహల బ్రాహ్మీమయమూర్తి" ఈయన చేతము నిత్యవేగి భావత్రివత శబ్ద మెన్నుకొనుటకు కూడ ఇంత విలంబన మోర్వనిది నన్నయ తిక్కనలు తన నావేశించిరని ఆయనయే చెప్పుకొనెను వారలు పోయిన తెన్నున మెఱుగులు తీర్చిదిద్దుచు పోదుననియు ప్రకటించుకొనెను ఈయన అవిచ్ఛిన్న సంప్రదాయార్థి అదే సర్వధర్మ మూల బీజముగా ఎరిగినవాడు మహా కావ్యరచనా ప్రసూనవన బంభరాయమాణ చిత్తమునుండి కల్పవృక్ష మావిష్కరించుకొన్నది ముని ఋణము దీర్పగా నీ కవి దీనిని రచించినాడు ఇది ఈ కవి కల్పనావధిగానైనది మరియు నిది అమరీకైశిక పారిజాత కుసుమోహస్వాదువు మహాకవి సర్వకవిత్వమర్మవిదుడు ఈయనకు కవిత్వమే తపస్సు ఈయన తాత్వికుడు జగన్నిత్యత్వ భావనా నిరంతరుడు నిరంతర దైవచింతన పరుడు అభక్తులైన జనము లివి నమ్మరని గట్టిగా తెలిసినవాడు పన్నెండు వేల మించిన గద్య పద్యములలో రామాయణ కల్పవృక్షమును అధిక దీయుక్తిమయి రచించి అద్యతనాంధ్ర కవితా ప్రపంచమున మహాకవి శబ్దమున కర్థమై నిలచినవాడు

ఇంత విచారణా శీలమున విశేషించి రచించెడు కవి ఈ నేటి కాలమున ఈయనయే అని చెప్పవలయును దేశకాల పరిస్థితుల విధానముల ప్రభావము నింతగా గుర్తించిన కవియు ఈనాడు లేదు మానవత్వము మంటగలసి పోవుటను హెచ్చరించుట ఈయన సంకల్పము చేసిన కావ్య ప్రయోజనములలో

నొకటి "మరి తాను జంతువై యుండుటకు మనుజత్వమేల?" తమోగుణము జంతు లక్షణము అది యెక్కువైన కొలదియు ధర్మము తక్కువ యగును ధర్మమనగా మనుజత్వము మానవతాగాథ పరమార్థ మీవిధముగా విస్తరింపబడియున్నది దానవత్వము యొక్క సర్వప్రగల్భ స్వరూప స్వభావములును రామాయణమున వివరింపబడియున్నవి ఊళ్ళమీదపడి అందిన స్త్రీజనము నపహరించుకొని పోవుచున్న, ఆబాల వృద్ధముగా చిత్రవధలు చేసి వినోదించుచున్న, విధవ రాక్షసత్వము నెదుర్కొని హతమార్చిన మహామానవుని కథా విషయమును మహనీయముగా రచించి, తన జాతి జాతీయతకు అవిచ్ఛిన్న సంప్రదాయమును పునాదిగా చేసి భవిష్యదభ్యుదయ మహాసౌధ నిర్మాణమున కింత అవకాశమును కల్పించిన ఆంధ్ర వాగ్దేవతాపరావతారమును శ్రీ విశ్వనాథ నెంతేనియు ప్రసన్నమగుటను కోరి కల్పవృక్షచ్ఛాయలలో సేవించినచో అది సిద్ధిప్రదము మానవశక్తియైన మహాదేవికి రావణాసురు డెదురు తిరిగినాడు వాని కామెయు ఎదురు తిరిగినది రావణునిది దేహనిష్ఠ మహాదేవిది భావనిష్ఠ ఆమె దేవత వాడు రాక్షసుడు సుర దైత్య లక్షణ సితాంత మహావధి భూతులయిన వారిరువురును పరస్పరము తిరుగబడిరి

జనకజాత శరీరనిష్ఠంబొ, ర్ప
కడక వ్యవసాయి యగు పంక్తి కంధరుండు
రావణుని బోధ దేవ భావావృతునిగ
చేతకు కడంగు పూత ధాత్రీతనూజ
దైత్యధాత్రికి వచ్చిన ధరణిజాత
దైత్యభావము కనునని దైత్యరాజు
దైత్యధారుణి పెకలించి దైవగుణము
తా సముద్భిన్నమగునని ధరణిజాత
ఆమె ఖండించి తినియైన నసురగుణము
కాల్నిలువద్రొక్కగా పంక్తికంధరుండు-
అఖిలమును నాశనము చేసియైనగాని
సౌరగుణము ప్రతిష్ఠింప జనకజాత

మానవుల యందున్నవి సుర దైత్య వర్గములు రెండే రెండు సమాజమునకు సుముఖమైనది సురవర్గము విముఖమైనది దైత్యవర్గము సురవర్గమును కబళించుటయే దైత్యవర్గము లక్ష్యము దానిని ఎదుర్కొనుటకు సురలక్షణము సర్వశక్తి సంపన్నమై నిత్య జాగృతిగా నుండవలయును ఏతాదృశమైన జాగృతిని ప్రదర్శించుటకు రచింపబడిన రామాయణ కల్పవృక్ష రచయిత యొక్క దేశభావాత్మకమైన మానవాభ్యుదయ కాంక్షను జాతిజనులము మనము పంచుకొనవలయును కల్పవృక్షము కరుణరసప్రధానము కాదు శాంతరస ప్రధానము. - మహాభారతమునకువలె భారతీయ సాహిత్య సంప్రదాయమది నిత్య జాగృతి గల చైతన్యవంతులు పరమశాంతులంట భారతీయతకు లక్షణము భారతీయు లెప్పుడును శాంతశూరులు ఆ విధముగా ఆంధ్రమున భారతము రచింపబడినది ఇప్పుడు రామాయణము రచింపబడినది ఈ సంప్రదాయాంధ్ర కవిత్వమునకు భారతము మొదలుకాగా ఈ రామాయణ కల్పవృక్షము తుది కాదుకదా? ఆంధ్రమహాభారతము తత్పూర్వము కొన్నివందల సంవత్సరములుగా కవిత్వమున నెంకొన్న విశిష్ట లక్షణములను ప్రోదిచేసికొని తాను వెలసినది ఆంధ్ర కవిత్వమునందలి విశిష్టలక్షణములను ప్రోది చేసికొని, సంస్కృతాంగ్ల భాషా కవిత్వముల నుండి సొగసుల నేరుకొని సృష్టిలోని సమస్త భాసుర గుణములతో విశ్వనాథ వైయక్తిక ముద్రలో కల్పనావధిగా రామాయణ కల్పవృక్షము తాను వెలసినది నన్నయ్యగారి యందావిర్భవించిన ఆంధ్ర కవిత్వ వైశారద్యము వచ్చి వచ్చి తన సర్వ సౌందర్యముతో కల్పవృక్షమునందు తిష్టవేసికొన్నది ఆ విధముగా పద్య విద్యామయమైన కావ్య గంగను, గంగను భగీరథుడు శివజటాజూటికా మహాసీమకు గుభిల్లున దూకించినట్లు, సర్వతోముఖప్రగాఢ ప్రతిభుడు శ్రీ విశ్వనాథ పాకించి కల్పవృక్షమును పెంచినాడు

శ్రీ మద్రామాయణ కల్పవృక్ష మిట్టిది దానిని నిర్మించిన మహాకవి ఇట్టివాడు ఆయన సమకాలముననున్న మన మదృష్టవంతులమని బుద్ధిమంతులైన మన వనుమలును, ముది మనుమలును మొదలుగాగల రానున్న తరములవారనుకొందురు ఈ భాషాసాహిత్యములకింత పుష్టిని కలిగించిన మహాకవి ఇక ముందు ముందు కాలప్రవాహము మీద పడివచ్చి తనను తన దేశకాల పరిస్థితులను దర్శించగోరెడు సహృదయుల మనఃప్రీతికొరకొక పని చేయవలయును

స్వీయచరిత్ర వ్రాయవలయును శ్రీ సత్యనారాయణగారు చేపట్టని ఆధునిక సాహిత్య ప్రక్రియ ఇప్పటి కదొక్కటియే ఆయన చేయి తగిలి అది కూడ చకచ్చకలు పోవలసి యున్నది ఆయన స్వీయ చరిత్రమును వ్రాయనిచో ఆయన సాహిత్య జీవిత చరిత్రయైనను వ్రాయబడవలయును దానివల్ల ఆ మహాకవి నిత్య జీవితములోని వ్యక్తిత్వము సమాజముతో ఆయన పట్టిన కుస్తీలు - ఆయన చిత్తైన, చిత్తు చేసిన సన్నివేశముల పరస్పర ప్రభావములు మొదలైన మహా విషయములు మనము మన జాతీయ మహా సంపదభివృద్ధి నభిలషించి నిలబెట్టినవారము కావలయును

శ్రీ విశ్వనాథ తెనుగు జాతి కాధునిక కాలమున మార్గదర్శకుడైన మహర్షి ప్రబోధకుడైన ప్రవక్త భూత భవిష్యద్వర్తమానాత్మకమైన కాల స్వరూపమును స్పష్టముగా దర్శించి ప్రకటించిన బ్రహ్మ నైష్ఠికు డాయన కాల ప్రవాహమును ఆద్యంతములుగా నందరును దర్శించలేరు వారి కాయన ప్రకటించిన దర్శన మవగతముకాదు అంత దర్శనము, అంత కవితా శక్తిగల మహాకవి మరొక మంచి జాతకము గల భాషాభాషీయుల యందు జన్మించి యున్నచో ఆయన నిజముగా విశ్వకవినాథుడై యుండెడివాడు అంత ప్రక్రియా వైవిధ్యముగల సాహిత్యమును సృష్టించిన కవి ఈనాటి ప్రపంచ భాషలయందెందును లేడు మన ఒక్క తెలుగులో కలడు ఆయన విశ్వ రూపమును విశ్వమునకు ప్రకటించుటకీ భాషకు తగిన అవకాశము లేకపోవుట ఈ ఆంధ్రభాషా శాపగ్రస్త లక్షణములలో నొకటి

# తపస్వియైన రచయిత

రచనలన్నియును మానవ జీవిత సత్యములను ఏదో ఒక కోణమునుండి విశ్లేషించి వ్యాఖ్యానించి చూపునవియే రచయిత తపస్వియైన కొలదియు మానవ జీవితమును మలుపులు త్రిప్పు క్లిష్టమయిన పరిస్థితులలోని కీలకములను పట్టుకొని ముందు వెనుకల మీద విచారణకు పెట్టి పాఠకులకు జీవితమునెంత ధైర్యసాహసములతో జీవింపవలయునో సలక్షణముగా ప్రబోధించును మానవ జీవితమనగా అది పైకి కనిపించు దైనందిన జీవితము మాత్రమే కాదు మానవునకు మనస్సున్నది దానిలో పొరలున్నవి బయటి జీవితమునకు లోపొరల కదలికలకు సన్నిహిత సంబంధమున్నది తత్సంబంధమును సూక్ష్మముగా పరిశీలించుటకు రచయిత జీవిత సముద్రమునందు గజ ఈతగాడు కావలయును అప్పుడుకాని లోతుపాతులు తెలియవు జీవిత సముద్రమనగా మానవజాతి చరిత్ర నరజాతి యొక్క చారిత్రక సంప్రదాయ లక్షణ వివేకములేని రచయితను గురించి మనమాలోచింప నక్కరలేదు అసలట్టివాడు మనదాక రాడు

రచయిత సంప్రదాయమునకు బద్ధుడు కారాదు దానిని వివేచన చేయగలవాడు కావలయును దాని అంతర్యమును వ్యాఖ్యానింపగలవాడు కావలయును దానివలన మన భవిష్యత్తు బాగుపడుటకు వీలున్నచో బాగుపరచువాడు కావలయును మన జాతి సంప్రదాయమును మనకు కాకుండా చేయు రచయిత మనవాడు కాడు ఒక జాతి సంప్రదాయమును నీవు కాదనుచున్నావనగా ఆ జాతి చరిత్రను త్రోసిరాజనుచున్నావన్న మాట చారిత్రకమైన అవగాహనను అభిలషించు ఆధునికమైన సోషలిస్టు సామాజిక దృక్పథము సంప్రదాయమును గుడ్డిగా ఎట్లనుసరించదో గ్రుడ్డిగా అట్లు త్రోసిరాజనదు అనరాదు సగము మానవచరిత్ర మన సంప్రదాయమువల్ల అయినది అందువల్ల రచయితలకు సంప్రదాయము యొక్క పదవగాహన చాల ముఖ్యము.

ఒక రచయిత ఆవేశముగా ఇన్నివేల పేజీలు బ్రతికినంతకాలమూ రచించునే పోయినాడనగా ఆయనందుకట్లు నిరంతరము ప్రేరేపించుచుండిన మహాశక్తి యొక్క లక్షణ మేమని విచారింపవలెను మనిషి యన్న తరువాత ద్వంద్వాతీతుడుకాడు ద్వంద్వాత్మకమయిన ఈ సర్వప్రపంచమునకు ఎటుచూచినను రాగ ద్వేషములే పొలిమేరలు ద్వేషము మనిషిని ఎక్కువ దూరముకాని ఎక్కువ కాలముకాని నడిపించలేదు దానిది క్షణిక స్వభావము అట్లుగానిచో అది తనకాశ్రయ మిచ్చిన వారనే మ్రింగివేయును అందువలన రాగము దిక్కు గానే మూడువంతులకు పైగా జనము మ్రొగ్గి బ్రతుకుతెరువు చూచుకొనును ప్రజల యొక్క బ్రతుకుతెరువులను సుగమము చేయుటకు సాధనముగా అందీయ బడవలసిన సాహిత్యమును సృష్టించు రచయితలకు ఈ జగత్తుమీద రాగము తప్ప ద్వేషముండుటకు వీలులేదు మక్కువ గలిగినందువల్లనే సృష్టికర్త ప్రవర్తించినాడు కవులు రచయితలు సృష్టికర్తలు రాగభవమును అనుభవించు చున్న కొలదియు వారు సృష్టి చేయుచుందురు విశ్వనాథ సత్యనారాయణ అంత వ్రాసినాడనగా అన్ని రచనలు చేసినాడనగా ఆయన తనకి జగత్తుపైయున్న అంత మక్కువను అన్నిరకాలుగా ప్రదర్శించినాడని యర్థము రచించుచున్నా డనగా ఆలోచించుచున్నాడని యర్థము ఆయనవలె ఈ జగత్తును గురించి కాలము యొక్క నిడివి మీద అంతగా ఆలోచించినవాడు లేడు తన ఇరుగు పొరుగులతో తన సమకాలీన సమాజముతో దాని రాజకీయాది సమస్త విషయ ములతో నిరంతరము క్రింద మీదగుచు తనయాలోచనల చేత తనవారికి తన భాషాభాషీయులకు తానేమైన మేలు చేయగలిగిన చాలునన్న ఆత్మసంతృప్తి లక్షణము చేత ప్రేరేపింపబడక రచయిత అన్నవాడు రచన చేయడు ఒక రచయితయందు తత్ప్రేరణశక్తి ఎంత బలవంతముగా ఎంతకాలమున్న అంత కాలము ఆ రచయిత అంత బలమైన రచనలు చేయుచుండును అరువది సంవత్సరములు మొక్కవోని రచనా శక్తి రూపమైన ఆత్మప్రత్యయము విశ్వనాథ సత్యనారాయణ గారి ఉపాధి నాశ్రయించుకొనియుండి తెలుగు భాషా సాహిత్య ములకు చేతనైనంత చేసిపోయినది స్వస్థాన వేషభాషాభిమానమే రాగము ఆయన సృష్టించిన వాఙ్మయ ప్రపంచము యొక్క నాలుగు మూలలు చూచిన వారికి ఆయన మానవతా దృక్పథము ఎంత రాగరంజితమో తెలియగలదు· రాగము దైవతము ద్వేషము రాక్షసము రాక్షసులు సృష్టికర్తలు కారు

రాగమే సర్వానుభవమునకును మూలము ద్వేషముతో దేనిని కూడా అనుభవించలేము తా ననుభవించిన దానిని ఇతరులకు వారి బాగుపడుట నుద్దేశించి చెప్పినది రచన ఊరక చెప్పినది ఉబుసుపోక రచయితలు తమ యనుభవములనుండి ఎన్నికచేసి ప్రయోజనకరములయిన వాటినే రచనలుగా చేసి వెలయింతురు ఇంత వాఙ్మయము వెలువడినదనగా సామాజిక ప్రయోజనము దృష్ట్యా తద్రచయిత అనుభవముమీద ఆలోచించిన విషయ మంతగా నున్నదని యర్థము అనుభవముమీద ఆలోచించనివాడు దేనిని అవగాహన చేసికొనలేడు అవగాహన లేని రచయితలు నిజాయితీ లేనివారు జీవిత సత్యలక్షణము తెలియనప్పుడు నిజాయితీ ఉండదు రచయితలు నిజాయితీ పరులు కావలయుననగా అర్థము వారు వసుధైక కుటుంబము దృష్టి కలిగి సృష్టి స్థితి లయములకు సంబంధించిన సత్య లక్షణమును దర్శింపవలయునని దార్శనికు లయిన రచయితలే మార్గదర్శకులు సత్యమనగా భౌతికమైన ఉనికి కలిగి చర్మచక్షువులకు దర్శన యోగ్యమైనదని భావించుటలోనే దోషమున్నది కన్నులు మూసికొని భావించుటచేత సత్యమును దర్శించుట కలదు దానినే తపస్సందురు తపస్సులు చేసిన రచయితలకు విశ్వ సత్యములు అనుభవము నకు వచ్చును రచయిత తపస్వియగుటవల్ల వాని రచనలు దీప్తివంతములగును

విశ్వనాథ తపస్వియైన రచయిత!

# గవేషితార్థము

మాతృదేవీ సమాజ్ఞాతీర్థ సుస్నాత
వినతా తనూజుండు వేల్పు బువ్వ
కనుగొన్నయట్లుగా కనుగొంటి జానకి
దేవి గవేషణాతీర్థఫలము

పరమయాజ్ఞికులు నిర్భరమహాచ్ఛందోఽవ
తారంబు గాయత్రి తత్త్వమూర్తి
కనుగొన్నయట్లుగా కనుగొంటి జానకి
దేవి శ్రీరఘురాము దీపదంబు

కవి మహర్షి తపోఽగ్నిచే క్రాగి క్రాగి
సర్వతేజ ఫలంబు రసంబు తుదకు
చూచినట్లుగ జూచితి క్షోణిజాత
చారితార్థ్యంబు జన్మకు సంఘటింప

ఈ మాటలు శింశుపావృక్ష శాఖాంతర్గత వాయువీధీ సంచారముగా వచ్చి వినబడి తలయెత్తి అంజనీసూనుని చూచునట్లుగా జానకిదేవిని ప్రేరేపించినవి ఆమె తలయెత్తి తననింతగా ఇక్కడ తెలిసిన వాడెవడురా అని చూడవలసిన సాంకేతికార్థములకు అవి వాచకములుగా నున్నవి

జానకిదేవి గవేషణాతీర్థఫలము జానకిదేవి శ్రీరఘురాము దీపదము జానకిదేవిని అమృతమూర్తిగా గాయత్రీ మహాదేవిగా రస స్వరూపిణిగా చూచిన వారి జన్మలు చరితార్థములగును అట్టివెవరు చూడగలరనగా కవులు చూడ గలరు మహర్షులు చూడగలరు వారిరువును తపోఽగ్నిచే క్రాగినవారు తేజో రసమును అనుభవించినవారు అమ్మవారి కొరకు గవేషణ మొదలు పెట్టవల యును ఆ వెదకుట చాల విలక్షణమైన వెదకుట నీవు దేనిని పొందవలయు

నని వెదకుచున్నావో దనియందుబంచదగినేమైన భక్తి రక్తులతో తుది విజయము నందలి లక్ష్యమును చెదరనీయక సాధు మార్గముల యందు వెంటబడుట పొందదలచిన ఆ పరమార్థ వస్తువుయొక్క అంతస్స్వత్వమును గురించిన పరిపూర్ణ విజ్ఞానముతో అనుభవాభిముఖమైన మనస్సుచేత తహతహలాడుట నిరాశా నిస్పృహల నంటనీయని ఆచ్ఛమైన మనస్సుచేత లక్ష్యమును తొలగిపోనీయ కుండుట ఇట్లు చేయుట గవేషణము చేయుట జానకీదేవి గవేషణరూపమైన యజ్ఞము చేసినవారికి యజ్ఞ ఫలముగా ప్రాప్తించెడు లక్షణము కలది తీర్థ మనగా నిక్కడ యజ్ఞమనియే చెప్పవలయును జనకుడొక విధముగా గవేష ణము చేసినాడు ఆయనకు జానకి కనిపించినది శ్రీరామచంద్రుడొక విధముగా గవేషణము చేసినాడు శ్రీరామచంద్రుడు శివధనుర్భంగము చేయుటకు వేచి ధను వును తాక జూచుచుండగా వినవచ్చిన ప్రాగ్దిశాసౌధము పై యంతస్తున నంతః పుర స్త్రీల కదలికను గుర్తుబట్టి తలయెత్తినపుడు ఆయనకు కనిపించిన శృంగార మొడినిపట్టిన ముఖచంద్రుడు జానకీదేవి

పునరుద్భవద్దంత ముగ్ధమోహన రుచి
ప్రకటరేఖాహాస భావపరిధి
బాల్య యౌవన దశా పరిణాహ సంధిత
పాముగ్ధనేత్ర శోభా పయోధి
పుష్కలాభివ్యక్త ముగ్ధ చిక్కణకపో
లక్షీరకాంతి వేలా సుధాబ్ధి
శతసహస్ర మనోజ చాపలస్తక మహా
భావపుంజీభూత ఫాలవీధి
యై దృగింద్రియగత పరమార్థ మగుచు
హృదయదఘ్నమై రక్తఝరీనిలీన
వేగ మాధుర్య పరసీమయై గవేషి
తార్థ సంప్రాప్తియై దర్శనాఢ్య మొదిగె

శ్రీరామచంద్రుడు జానకీదేవిని వెదకికొనుచు పోయెనా? పోయి నాడన్న మాటయే కదా! శ్రీరామచంద్రునకు ఆమె తననుండి బయటికివచ్చి ఈ రూపమును ధరించిన, తన సంకల్పమునుగా, తనతో తనతనముకున్న అవినా

భావ సంబంధముగా, తన ప్రాణశక్తులు స్త్రీత్వమును భజించినట్లుగా, తన సృష్టిలో ఇంతకంటె మించిన ఉత్తమ భావమిక లేదనిపించిన ఆనంద మొక ముఖ బింబమై నిలచినట్లుగా కన్పించినది శ్రీరామచంద్రునితో ఆమెకభేదమే అయినను నామ రూపములకు దిగినప్పుడు ఆయనకు కూడా అమ్మ వారిని గురించిన గవేషణము చేయక తప్పదు గవేషణాతీర్థ ఫలమైన జానకీదేవిని హనుమంతుడు చూచినాడనగా తన గవేషణా తీర్థమునకు ఫలమన్నమాట అదియెట్లును ఉండును అంతేగాక, ఆమె అందరచేతను వెదుకబడవలసినదేగాని ఆమె ఎవరిని వెదుకునది కాదు ఆమె శ్రీరామచంద్రునకు గవేషితార్థముగానే సంప్రార్థించినది కదా! ఆమెను పొందుటకది యొక్కటే మార్గమా? అట్లే యున్నది

ఈ గవేషణా యజ్ఞము యొక్క స్వరూపమేమి? దానిని నిర్వహించు టెట్లు? ఇది జప యజ్ఞము మంత్ర రూపమున ఇష్ట దైవమును ధ్యానించు చుండుటయే జప యజ్ఞము మంత్రమే దైవము గాయత్రి మంత్రము గాయత్రి దైవము జానకీదేవి గాయత్రీ తత్త్వమూర్తి ఆమె శ్రీరామునియందు బుద్ధి స్థానీయురాలు ఆమె శ్రీరామచంద్రునితో అభిన్న యంగా అర్థమది శ్రీరామ చంద్రుడు మనిషి సీత వాని బుద్ధి రావణాసురుడు రాక్షసుడు కదా! ఏది రాక్షసకృత్యమనగా మనిషికి బుద్ధిలేకుండా చేయుట అంతకంటె రాక్షసకృత్యము లేదు మనిషి బుద్ధిశక్తిని పొందుటకు గవేషణాతీర్థ సేవనమొక్కటే మార్గము ఈ సుందరకాండ అంతయును తాదృశమైన ఉత్తమ మార్గమును కథాగర్భ మార్గమున విశదీకరించినది

# కవితాసంభారము

నీలగళా! రఘూత్తముడును నీవును ఇద్దరు కాని యట్లుగా
నోలి భజించితిన్ - మరియు నున్న దినంబులు నట్లచేసెదన్-
వ్రాలెడు మేనుదాక అభవా! బ్రదుకైన వికార భావనా
జాలము తప్పకున్న తుది జన్మగ జేయుము దీని ధూర్జటీ!

శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని విశ్వనాథ సత్యనారాయణగారు కొన్ని విశ్వాసాలు కలిగి వాటి పునాది మీద నిర్మించాడు శివ కేశవు లిద్దరూ వున్నారు. ఇద్దరూ ఒకటే అందువల్ల ఇద్దరినీ ఒకటిగానే భావరూపంగా చూస్తాడాయన ఆ భావరూపానికే దైవమని పేరు ఆ విధంగా విశ్వనాథ దైవభక్తుడు దైవమైన శ్రీరామచంద్రుని భక్తుడుగా ధ్యానించాడు ఆయనను మించిన దైవము, తనను మించిన భక్తుడు ఉండరని ఆయన నమ్మకం తాదృశమైన నిరంతర దైవ చింతనా పరతంత్రతవల్ల ఏర్పడ్డ వైదగ్ధ్యమునుండి సద్యోనిర్గతమైన సర్వ కవితా సంభారమే శ్రీమద్రామాయణ కల్పవృక్షం

శ్రీమద్రామాయణాన్ని కల్పవృక్షమని ప్రధాన సంవిధానాంక నామంతో వ్యవహరించటం నుండి విశ్వనాథ తన వక్రతా వైదగ్ధ్యాన్ని ప్రదర్శించటం మొదలుపెట్టాడు విశ్వనాథ కల్పవృక్ష రచన అంతా దైవాన్ని ధ్యానించటం గానూ ప్రదర్శించటంగానూ జరిగింది అటు ధ్యానించటాన్నీ, ఇటు ప్రదర్శించ టాన్నీ రెండింటినీ రెండు విద్యలుగా ఆయన అభ్యాసం చేశాడు అక్కడి ఐకాగ్ర్యమును, ఇక్కడి బహుముఖత్వమునూ పడుగుపేకలుగా వేసి నేసిన ఎట్టించు నల్లచీర రామాయణం కల్పవృక్షమనటానికి వెనుక ఊర్ధ్వమూలమూ, అధశ్శాఖమూ అయిన అశ్వత్థ వృక్షం కనిపిస్తున్నది అదే సంసారవృక్షం సంసారం సాగరమంటారు వృక్షమని కూడా అంటారు వృక్షమనటానికి

---

శంకరమఠం (హైదరాబాదు) ఉపన్యాసం - 29-8-90

సాంప్రదాయికపు పునాది బలం ఎక్కువగా వుంది ఈ సంసారవృక్షం ఏనాటికీ నశించదు అది అవ్యయం కొమ్మలు కిందికి, వేళ్లు పైకిగా వున్న చెట్టును చెట్టుగా తెలుసుకోటమంటే వేళ్ళను కిందికి, కొమ్మలను పైకి వుండేటట్లుగా చేసుకోటమే ఆ విధంగా చేసుకోటమే తెలుసుకోటం తెలుసుకొంటూ చేసుకోటం, చేసుకొంటూ తెలుసుకోటం అది అసలు విధానం దాన్నే విద్య అంటారు ఈ తాత్పర్యంలోనే విశ్వనాథ తన ధ్యాన్యప్రదర్శన వేత్పత్వాన్ని కల్పవృక్షంగా సంవిధానపరచాడు

సంసారవృక్షాన్ని తలక్రిందులుగా వున్నదాన్ని తలపైకి - వేళ్ళు కిందిగా వుండేటట్లుగా చేయుటవల్ల అది కల్పవృక్షంగా అవుతుంది సంసారవృక్షాన్ని కల్పవృక్షంగా మార్చటానికే సాధనభూతంగా నలుడు సేతువును నిర్మించినట్లుగా విశ్వనాథ తన అనితరమైన రచనాశిల్ప పటుపాటవంతో రామాయణాన్ని ఒక భక్తి రచనగా నిర్మించాడు ఇంత పని చేయటానికి సామాన్యమైన కవనశక్తి చాలదు అందువల్ల విశ్వనాథది అసామాన్యపు కవనశక్తి తన కవనశక్తి ఇటువంటిది అని విశ్వనాథ కుంతకాచార్యుని మాటల వల్ల గ్రహించాడు

కవి ప్రతిభలోన నుండును కావ్యగతశ
తాంశముల యందు తొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసమువేయి
రెట్లు గొప్పది నవకథాదృతినిమించి

మన ప్రాచీనాలంకారికులు కవివాక్యాన కవిత 'నిరంతర రసోద్గార గర్భ సందర్భ నిర్భర'త్వం వల్లనే కావ్యంగా నిలబడుతున్నది కానీ ఏదో కథ నాశ్రయించినందువల్ల మాత్రం కాదు అన్న అభిప్రాయం కలిగివున్నారు ఆ విధమైన కావ్యరస సంప్రదాయానికి చెందినవాడు విశ్వనాథ తెలుగులో తిక్కన్నగారు ప్రారంభించిన సంప్రదాయమే అది రామాయణ మహాభారత కథలు ప్రసిద్ధాలే, కథా కథనం కథకుని ప్రతిభనుబట్టి వుంటుంది కథా వస్తువు నందలి ఆయా ప్రకరణ విషయాలను చెప్పేటప్పుడు ప్రధాన కథా తాత్పర్యమైన కావ్యపరమార్థాన్ని స్ఫురింపజేస్తూ పరస్పరం సముద్దీపకంగా ఆసాంతం నిర్వహించగల కవితాశక్తిని అసామాన్యపు కవనశక్తి అంటారు అటువంటి

అసామాన్య సముల్లేఖ ప్రతిభా ప్రతిభానినులయిన కవుల రచనలు నిత్యనూతన వక్రభార సుందరంగా హృదయాహ్లాదులుగా వుంటాయని అనుభవంవల్ల తెలిసే విషయాన్ని కుంతకుడు ప్రకటించాడు విశ్వనాథ వైదగ్ధ్యమంతా రామకథా వస్తు ప్రపంచ తత్త్వమును-అంటే తాను దర్శించిన అతిశయాన్ని "భోగివచోఽతి శాయి వాగ్రచనము" వల్ల అతిదివ్యంగా ప్రదర్శించిన బహుముఖత్వంలో వుంది

ఇదమిత్థమని వచియింపరాని మహాభ
యంబుఁ వానరు లావటిల్లి
మిగిలి లాంగూలంబు లెగదట్టికొని శ్లాఘా
ధర పక్ష్మలౌచును పరువులెత్తి
రఘువంశపతి పాదరాజీవములయందు
నిర్వాక్కులగుచును నిశ్వసింప
కోదండమును బూని గుల్మంబు వెలువడి
రామచంద్రుండు గాంచె రాక్షసాళి
రాక్షసాళి చూచె రామచంద్రుని వాడె
వాడె యంచు సైన్యపతులు పలుక-
వాడెవండొ చూడబడువాడు ఎవ్వండొ
చూచువాడెవండొ తోచకుండ

రామరావణ యుద్ధం నిజంగా మొదలు గాబోతున్నది అప్పటికి రాక్షస సైన్యానికి చూచేవాడెవడో చూడబడేవాడెవడో తెలియకుండా పోయింది చంపే వాడెవడో చంపబడే వాడెవడో తెలియని స్థితి యేర్పడింది లౌకికంగా యుద్ధ ప్రవృత్తి దృష్ట్యా ఇది రాక్షస పక్షానికి మంచిదికాదు పారమార్థికమైన తాత్త్విక ప్రవృత్తి దృష్ట్యా రాక్షస పక్షంలోని వీరులకు వ్యక్తిగతంగా ఇది ఒక సమున్నత మైన సమాధిగత దర్శన స్థితి రాక్షస సైన్యానికి శ్రీరామచంద్రుణ్ణిచూస్తే చూచే వాడు చూడబడేవాడు అనే భేదబుద్ధి నశిస్తున్న స్పృహ ఏర్పడింది సర్వసైన్యాధి పతియైన రాక్షసరాజుకు రావణాసురునకు మాత్రం రాముని విషయంలో దుర్జ నత్వం, క్రూరత్వం రెండింటితోకూడిన సాహస బుద్ధి మాత్రమే పనిచేస్తున్నది ఎన్ని నిదర్శనాలు కనిపిస్తున్నా, ఎన్ని ఎదురు దెబ్బలు తగిలినా రాముడు వట్టి మనిషే కదా! అందువల్ల వాణ్ణి జయించటం అసాధ్యం ఎందు కవుతుంది? అని

తనను తాను నమ్మించుకుంటూ రాముని విషయంలో అటువంటి నమ్మకం దిగజారిన సైన్యాన్ని పట్టుకొని యుద్ధం చేస్తున్నాడు రావణుడు వట్టి మనిషే కదా అన్న రావణుని సంభావనలో మనిషి అయితే ఇన్ని అద్భుతాలు ఎలా చేయ గలుగుతాడు? అన్న ప్రశ్న వుంది

ఈ ప్రశ్నకు సమాధానం రేదు గనుక రాదు గనుక - రావణుడు రాసీయడు కూడా గనుక- అది వానిని ఆందోళిత చిత్తునిగాను, అందువల్ల ఇద మిత్థమని ఏ విషయమూ నిర్ణయింపలేనివానిగనూ చేసింది బహుశాఖాహి అనంతాశ్చ బుద్ధయో అవ్యవసాయినామ్ సంశయాత్మా వినశ్యతి యుద్ధం మొదలు అయ్యాకకాక ముందునుండి రావణాసురునకు రాముని విషయంలో వ్యవసాయాత్మికంగా కూడ పోయింది బుద్ధి శ్రీరాముని కపిసైన్యాన్ని చూచి వచ్చిన శుక సారణులు వార్తలు వినిపించి "అచట యోగ్యవేళా తీవ్రు లిద్దరే హనుమయు శ్రీరాముండును తక్కినయందరు నిత్య ప్రళయమూర్తులు'' అని అనగానే రావణుడు ''పతత్ప్రత్ముద్రై''డు అంతవరకూ వాళ్ళను చూస్తూ వార్తలు వింటున్న రావణుని కనురెప్పలు ఆ మాటలు వినబడటంతో మూతలు పడ్డాయి అదే వాని పతనానికి ప్రారంభ సూచన యుద్ధకాండలోని మొదటి ఖండం ఆ విధంగా రావణుని సంశయాత్మకతను చుట్టుకొని అతని వినాశనానికి శ్రీకారం చుట్టింది

సంశయ ఖండంలో విశ్వనాథ కల్పించిన హంస శివుడని రావణాసురునకు తెలిసింది రాముని సందేశాన్ని హంస జానకికి అందించింది అదికూడా తెలుసు దానికి శివుడుదైవమని, తానాయనకు భక్తుడనని తెలిసిన రావణునకు సీతారాముల మధ్య శివుడు దూతగా పనిచేస్తే రాముడు తనకంటే మించిన భక్తుడా అని ఆలోచిస్తాడు కానీ, శివునివలెనే రాముడు కూడా దైవమేనేమో అన్న ఆలోచన జేయడు

> "పరమ శివుండు వీనికయి భామకు మాటను చేర్చు చేలోకో
> అరయ నితండు మానిసియె అంతకుమించి యెవండొ?___"

ఈ రావణుని సంశయం తెగదు రావణుడు తెగనివ్వడు రాముడు భగవంతుడా? భగవంతుడు రాముడుగా పుట్టాడా? అసలు భగవంతుడు పుడతాడా? ఈ ప్రశ్నలను తిప్పికొట్టాడు రావణుడు

"పరగ నెవండొనేర భగవంతుడ పుట్టితినంచు చెప్పు అ
బ్బురముగ నెందరో చెదలుపుట్ట సదాభజనల్ పొనర్చు చుం
దురు - దురుపాధి వానికిని తోచును తా భగవంతుడైనటుల్
హర హర! లోకమెంత తనయంతటతా కికురించుకోనగున్ ''

ఈ విధంగా రాముడు భగవంతుడేమో అని అనిపించిన కాస్త ఊహను కూడా తన తర్కంచేత కొట్టి పారేశాడు రావణుడు ఆ బలం మీదనే యుద్ధానికి సన్నద్ధుడైనాడు తన కొడుకును ఇంద్రజిత్తును పంపించాడు వాడు పోయి రామలక్ష్మణులను నాగపాశాలతో కట్టి పడవేశాడు తెల్లవారేవరకు రామలక్ష్మణులుందరు అని తాను నమ్మిన విషయాన్ని తండ్రికి చెప్పాడు రావణుడూ అదే అనుకొన్నాడు "అవునోయి నాయనా" నేనిట్లేయనుకొంటిని నీవిట్లే చెసితివి! అని రాముని విషయంలో ఇంక సంశయమే లేదు అందువల్ల "నిస్సంశయాత్ముడై"నాడు రాక్షస్సమ్రాట్టు తెల్లవారింది నాగబంధాలను తెంచుకొని రామలక్ష్మణులు బయటపడ్డారు రావణునకు రాముని విషయంలో మళ్ళీ సంశయాత్మకత ఏర్పడింది

'ఆతడధీతగారుడ మహామనుపైనను నాగబంధన
వ్రాతము విచ్చికోనయిన వచ్చును వచ్చిన తక్కువే శరా
ఘాతజముల్ వ్రణంబులవి కాయము నింతట తేలికిచ్చునా?
చేతమునందు సంశయము చీలదు—

సంశయఖండం చివరకు రావణుని పక్షం వీరులు ప్రహస్తుడు ధూమ్రాక్షుడు వజ్రదంష్ట్రుడు అకంపనుడు మొదలయినవాళ్ళంతా యుద్ధంలో మరణించారు ఇక్కడనుండి కుంభకర్ణ ఖండం

రావణుడు స్వయంగా యుద్ధానికి బయలుదేరాడు హనుమంతు డెదురుపడ్డాడు ఒక గుద్దు గుద్దితే చస్తావన్నాడు అంటే—

అనినన్ - రావణుడు ఏది గ్రుద్దుము త్వదీయంబైనదోశ్శక్తి చూ
తుననన్ - మారుతి క్రొత్త చూచెదవు నాదోశ్శక్తి నీ బిడ్డయ
క్షుని శీర్షంబది రెండుగా పగిలె నా గ్రుద్దుంబడిన్నాగ రా
వణు దుఃఖస్మృతివాయుతాడితము కోపజ్వాలమిన్నంటగా

అమరిచి ఆంజనేయుని మహాచలసాన్నతంబువాని వ
వక్షము పఱచాచి గ్రుద్దెను నిశాచరనాథుడసంత వేగుడై
భ్రమయుచు డిల్లవోయి నిలువంగనజాలక ఆంజనేయుడున్
తెమలిచికొంచు వేగపరిధీకృత ఘోరమహాశనిం ఎలెన్

గ్రుద్దెను వక్షమందసురకోటి దిగాలుపడెన్ దశాస్యు డా
పద్దశనందివట్లుకనుపట్టగ, రావణుడంత ప్రాణముల్
దద్దరిలంగ ధాత్రిబడు దానికి సిద్ధముగాగనై యసుల్
తద్దయు చిక్కబట్టుకొని తాననియెన్ పవమానసూనుతో

అగునటి విక్రమంబు కలవు - అన్నను మారుతి ఏమి విక్రమంబు
ఒగిమరియింకనుం బ్రతికి యుంటివి నీవు అను-రావణుండు పె
ద్దగనొక యూర్పుతీసికొని తాబలమంతయు తెచ్చికొంచు హె
చ్చగ దృఢముష్టితో పవనసూనుని త్రొమ్మన యందు పొడ్చెనన్

తట్టుకొనలేక మారుతి ధరణి యందు
బడియె స్మృతి తప్పియంత —

ఇంతటివాడు రావణుడు శైవరౌద్రదీప్తి సంయోగమతడు రాముడుకూడా రావణాసురుని బలతేజాలకు ఆశ్చర్యపడ్డాడు

కన్నుల కింత బిట్టుగను గన్పడు సీతయమూర్తి యింత తే
జున్నదియింత దేవతల దుర్విని శక్తిగలాడు ఔరుకలు
ఉన్నెడు మంత్రితోవబడి తూలునె? లేదటె మంత్రితోవ? నే
నెన్నకమున్నె వింటిపయి కేగెడు మత్కరమా విభీషణా!

రాముడు రావణుని రథాన్ని విరగకొట్టి నెత్తిమీది కిరీటాన్ని కూడ పడగొట్టాడు చంపలేదు ఇంటికి పొమ్మన్నాడు రావణుని వదలి రాముడు వెళ్ళిపోయినాడు ఆవిధంగా అవమానం పాలు చేయబడిన రావణునకు 'మానిసు లల్ప శక్తులనిమానితి కోరగ వారినుండియున్, రానటులన్ మృతిన్ మృతియు రానగుచున్నది వారినుండియే' అని అనిపించింది కానీ వెంటనే తన

ప్రతాపాన్ని తానే జ్ఞాపకం చేసుకొని ప్రశ్నించుకొంటూ తనద పైచేయిగా చూచుకొని ధైర్యం తెచ్చుకొంటాడు కుంభకర్ణుని పంపించి అతనిచేత రాముని బంధించి తెప్పించాలనుకొన్నాడు కుంభకర్ణుడు యుద్ధానికి పోయినాడు శ్రీరాముడు కాళ్ళు చేతులూ ఖండించటంతోపాటు శిరస్సును అది ఎగిరిపోయి రావణాసురుని కాంచన సౌధంలో పడేటట్లుగా ఖండించాడు ఇది జూచిన రావణు నకు రాముని విషయంలో మళ్ళీ అనుమానమే

''కానియా వేల్పుల తామసంబయిన శక్తుల్ పొల్చునస్త్రంబులన్
తనరన్ శైవము వైష్ణవంబయిన అస్త్రవ్రాత మీదృక్క్రియా
చణమౌ పట్టుగ పారమేశ్వర మహా సత్వ ప్రధానంబులై
అనయంబున్ పెఱజీవులందిది య సాధ్యం బెంత యోజించినన్ "

ఈ ఊహను రావణుడు నిలువనీయడు విశ్వామిత్రుడు నేర్పివుంటాడా లేక కైక నేర్పి వుంటుందో అని అటు తిప్పుతాడు బుద్ధిని కుంభకర్ణుడు పోయిన తరువాత ఇంద్రజిత్తు పోపటానికి ముందుగా మకరాక్షుని మరణవార్త విన్నప్పుడు రావణాసురునకు శ్రీరాముడు దామోదరుడన్న స్పృహ కలిగింది దాన్ని గూడా వెంటనే "గాడిలి పిన్నతల్లిదగు కార్ముక విద్యయటంచునెంచెద" ననుకొన్నాడు ఇంద్రజిత్తును లక్ష్మణుడు చంపాడు రాముడుండబట్టే లక్ష్మణుడు చంపాడు మనుష్యులు ఇంతలేసి పనులు చేయటాన్ని నమ్మలేకపోతున్నాడు - నమ్మకుండా వుండలేకపోతున్నాడు రావణుడు

"చూడబడు వాడెవ్వడో చూచువాడెవ్వడో తోచకుండ" రాక్షస సైన్యము నాల్గులక్షలది భస్మీపటలమై పోయింది రాముని చేతిలో అంతకుముందున్న సంశయాలు నిస్సంశయం కావటానికి ప్రారంభమైంది

"కైలాసంబుననున్న స్వామికిని నిక్కంబింతగా నాపయిన్
వేలాతీతము కోపమెందులకో? తావేం చేసె రాముండుగా
హేలాక్రీడిగజేయు త్ర్యంబకు డొకండు ఇక్ష్వాకునామ్నాయవి
ద్యాలీలాకృతి ప్రాణకాలయుగ సంధ్యాపుర్మపఙ్క్తాటియై

శివుడు కేశవుడిద్దిపంచికొనెదరు ప్ర
ధానముననిద్ది శివుని కృత్యంబు తత్త్వ
మండభేదము, చేయు కార్యములు విడివి
వారలిర్వురె యీ జగత్కారణములు

సీతం గొంచునుబోవ నీతడిటవచ్చెన్నాగవ్యాజంబు వి
ఖ్యాతిన్ దానవవంశనాశనముకార్యంబు ఈ శివాద్వైతికిన్
సీతంగైకొనిపోవ వేవిధములంజేయంగవచ్చున్ మహా
దైతేయోన్మథనంబు ముఖ్యము సముద్రాంభోవ్యధాకారికిన్

శివుడు, మాధవుడు తత్త్వతః ఒకటే మాధవుడు రాముడుగా పుట్టాడు మాధవు డవతరించవలసివస్తే మానవుడుగా పుడితేనే చాలా చేయగలడు ఎందు వల్లనంటే, "మానవజాతి సూక్ష్మమతి మాధవు డిచ్చటనే జనించెడున్ " క్రమంగా రావణునకు శ్రీరామతత్త్వం - భగవత్తత్వంగా స్ఫురించటం బలంగాసాగేకొద్దీ నిస్సంశయభావం స్థిరపడుతూ వుంటుంది పద్దకొద్దీ రామరావణయుద్ధం తీవ్ర మవుతుంది

ఇది నారాయణమూలమౌ తరువు నా యీ రాముడన్పొదద యొ
ప్పిదమై లక్ష్మణుడన్న పంగయు, మహా భీష్మంబులై శాఖలై
ముదివగ్గైచను జాంబవంతుడు మరుత్పుత్రుండు సుగ్రీవుడం
గద మైంద ద్వివిదుల్ గవాక్ష గవముల్గా వందలే వానరుల్

ఇది యీ కొమ్మలు సాగకున్నమును పేయేదీని ఛేదింపగా
మది నూహించితి జానకీహరణమన్మందుం బ్రయోగించి మొం
డిది యీ చెట్టును కొమ్మలన్ విరిసి నిండెంబూలతో పండ్లతో
జదలం సాగర మావరించినగి ఆశాసంతతింగ్రుమ్ముచున్

శ్రీరామచంద్రుని గురించి ఈ తెలివితో "ఓయీ సారథీ! నేను నా రథ ముతో నున్నానయా ఇంకటో - నీ యా రాముని గుండె కెట్టయెదురై ——" అని యుద్ధానికి దిగాడు రాముడు సత్పదార్థం రావణుడు అసత్పదార్థం సదసత్తుల ధర్మాధర్మముల యుద్ధంగా రామ రావణ యుద్ధం జరిగింది రావణుడు రాముని

మీదకు సౌరస్త్రాన్ని వదలినాడు ఆదేం చేస్తుందంటే వాడి అంచులు గల చిన్న చిన్న చక్రాలను మంటలను కక్కుతూ మహావేగంతో ప్రసరింపజేస్తుంది తగిలిన దానిని తగిలినట్లు కత్తిరించుకొనిపోవటమే దానిపని దానిని మళ్ళింప గల అస్త్రం ఏదీలేదు అటువంటిదాన్ని వదిలాడు రావణుడు - రాముడింక దాంతో అంతం కావాలని రామునకు దాని సంగతి తెలుసు కైకేయి తనకు నేర్పిన కార్ముక విద్యారహస్య తంత్రాన్ని అనుసరించి రకరకాల బాణాలను ఏక దాటిగా వదలటం మొదలు పెట్టాడు ఆ బాణాలు ఆ చక్రాలకు తగిలి, వాటి వేగాన్ని తగ్గించి వృధాచేశాయి అలా తన సౌరాస్త్రం వృధా చేయబడటం చూచేటప్పటికి రావణునికి రాముని విషయంలో ఏమాత్రం సంశయం లేకుండా అంతా నిస్సంశయం అయిపోయింది

బమ్మెరపోయె రావణుడు బ్రహ్మయు చేయగజాలడీపనిన్
నమ్మగరానివయ్యె నయనంబులు వేలునులక్షలైన చ
క్రమ్ములు సూక్ష్మమిక శరపరంపర వమ్ముగజేత చెతచ
క్రమ్ముకలాడు చేయవలెగాని యొరుండొనరింప జాలడున్

అని అనిపించటంతోటే శ్రీరాముడు చక్రిగా కనిపించాడు

అప్పుడు రామచంద్రుడుగన ఆయన చేతి ధనుస్సుచక్రమై
యొప్పెను శీఘ్ర శీఘ్రములను గ్రశరంబులనేయు వేడిలో
త్రిప్పుచు త్రిప్పుచుఙ్ ఎలుధరింపగ నద్దియె నాల్గుబాహులై
కొప్పను శంఖమై విరిసికోలహ్రిఘుంచె కనుల్ భ్రమింపగఙ్

శ్రీరామచంద్రుడు శంఖచక్రధరుడును చతుర్భుజుడును అయి కనిపించిన తరువాత రామ-రావణ యుద్ధంలో రావణుడు తన ఖడ్గరావణ మహామంత్రాధి దైవత్వాన్ని ప్రదర్శించాడు దాంతో రాముడు మహోగ్రుడై పంచభూతాలకు తాను మూలభూతుడవునన్న విషయాన్ని తెలిసేటట్లు చేశాడు తన దేహం నుండి పంచభూతాలను వినిర్గమింపచేశాడు రావణుడది చూచి భయపడ్డాడు ఇంతకు ముందు శ్రీరాముని విషయంలో ఏర్పడ నిస్సంశయ బుద్ధి ఇప్పుడు మరింత నిశ్చయ లక్షణాన్ని పొందింది "లో తెలిసెపో నితండు సుసమధిష్ఠిత దిక్చయ పంచభూత నిర్మల గ్రహరాజి రాజితడు రాముడు నేటికి కోసలంబులన్"

శ్రీరాముడు శివుడు మాత్రమేగాదు- అమ్మవారు కూడా అని రావణునకు స్పృహ పెరిగింది శ్రీరామచంద్రుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు

ప్రాణం బెచ్చట నుండు నాస్థలమునం బట్టెన్ మహాస్త్రంబు అని
ద్రాణంబౌచు త్రిశూల మట్లు హృదయగ్రంథిన్ విభేదించె పా
రీణంబైన సుదర్శనంబన మహాస్త్రజ్ఞాడు లేర్చెన్ మరిం
తూణీరంబును జొచ్చె నస్త్రమును దైత్యుండురిం బై వ్రాలగన్

మఱియును చల్లనౌచు పవమానుడు వీచెను తేతాయెండభా
స్కరుడునుగాచె ధాత్రియు కంపము నొందక నిల్చె వార్ధిశీ
కరములు చల్లె తీరమునకందని నీలిమతోచె మంట నం
గరమఖిలమ్ము చల్లపడి కాయము నిర్వృతి పొందె నెంతయున్

ఉపసంహరణ ఖండంలో సీత అగ్ని ప్రవేశ ఘట్టం ప్రధానమైంది దానికి ముందు వెనుకల రావణాంతఃపుర స్త్రీలు, అనసూయ అరుంధతి కైక మొదలయిన స్త్రీ పాత్రల ప్రవృత్తిని వర్ణించటం వుంది శ్రీరామునికి పట్టాభిషేకం జరుగుతుంది

శివుడు రాముడుగా పుట్టి వచ్చినట్లు రావణుడు భావించటం చెప్పబడింది రాముడు పట్టాభిషేక సమయంలో శివత్వాన్ని పొందుట వర్ణించబడింది

కోం వశిష్ఠ హస్తగత కుంభ సముద్ర నదీ మహాంబువుల్
ధారగ రామమూర్ధ కవితాల్ప జటాగుహలన్ స్రవింప చూ
డారతి నీల లోహిత జటావనలందున జొచ్చుచున్న భా
గీరథి నాజనెన్ కృతయుగీనము ధర్మము వాస్వరూపమై

సీత అగ్ని ప్రవేశ ఘట్టాన్ని నిర్వహించటంలో విశ్వనాథ ఆధునిక మహిళా జనజీవన చైతన్య లక్షణాన్ని తిరస్కరించటాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకొన్నాడు ఇక్కడ ఈలా చేయకుండావుంటే పునర్జన్మ లేకుండా పోవాలన్న ఆయన ఎదిగిన తాత్విక స్థాయి మరింత సముజ్వలంగా వుండేది శరీరం నిలబివున్న కారణంగా వికార భావనాజాలము తప్పని బ్రతుకు బ్రతుకు

తున్నందువల్ల ఆ ఘట్టం వ్రాసేటప్పుడు ఆయనకు ముద్దుకృష్ణ చలం నార్ల మొదలయిన తన సమకాలంలోని రచయితల రచనలు మనస్సులో పొరల్లో తారాడటం జరిగింది అందువల్ల సీతాగ్ని ప్రవేశ ఘట్టాన్ని సమర్థించటానికి అనేక మార్గాలు తర్కాలు సమకూర్చుకొంటూ వ్రాయవలసివచ్చింది

విశ్వనాథ శివభక్తుడు రావణుడు శివభక్తుడు విశ్వనాథకు శ్రీరామ చంద్రుడు శ్రీ మహా విష్ణువనీ - శివరాము లిద్దరూ తత్త్వతః ఒకరేననీ తెలుసు రావణునకు శివుడే దైవము విష్ణువుతో వైరము రాముడు వట్టి మనిషి అనే రావణుడు ఒయలుదేరాడు సీతాపహరణం జరిగింది అప్పటినుండి రాముని మానుషత్వం గురించి రావణునకు విభిన్నమైన ఆలోచనలు మొదలైనాయి ఆ విధంగా రావణుని మనస్సు పనిచేయటమునుండి చక్కని అవకాశాన్ని కల్పించి క్రమంగా శ్రీరాముడు మానవుడా? జన్మించిన భగవంతుడైన శ్రీమన్నారాయణుడే అన్న నమ్మకానికి రావణుని మళ్ళించటానికి విశ్వనాథ తన సర్వ కవితా సంభార మునూ వినియోగించాడు చివరకు విశ్వనాథ కృతార్థుడైనాడు రావణుడు సంశయం నుండి నిస్సంశయానికి ఎదిగాడు రాముడు అయోధ్యలో పట్టాభి షిక్తుడైనాడు రాముడు రాజు రాజే దైవము

నీవే రాజువు నేను సత్కవిని తండ్రీ నిన్ను వర్ణించెదన్
నీవే దైవమ వేను భక్తుడను తండ్రీ నిన్ను ధ్యానించెదన్
నీవే భూమివి నేను కర్షకుడను తండ్రీ నిన్ను పండించెదన్
నా వైదగ్ధ్యము నీవు చూతు కృప సంధానించు విశ్వేశ్వరా!

# HUMAN NATURE
# WOMEN CHARACTERS

Srimad Ramayana Kalpa Vrikshamu of Viswa natha Satyanarayana is a new creative interpretation of the story of Rama as it has been told since Valmiki wrote his immortal epic The title Kalpa Vrikshamu speaks of the poets confidence that his poem like the mythical boon-giving tree yields whatever we desire It is perhaps true that Kalpavrikshamu is full of vigour and sap of the Telugu language which has imbibed the soul of Indian culture by absorbing Sanskrit in a greater measure than many other Indian languages Kalpavrikshamu is in fact an original national epic in Telugu, and it is not a mere Telugu translation of the Ramayana Telugu literature is uniquely rich in that it has the two national epics Mahabharata and Ramayana The former by Kavitrayam and the latter by Viswanatha Satyanarayna The master spirits like Nannaya, Tikkana, Errana and Viswanatha appear once in several centuries to revitalize the ethical and spritual character of the nation through their splendid works It is therefor the proud privilege of our generation to be witness to the mighty contribution of Viswanatha Satyanarayana

---

A Paper Submitted to the all India Senmiar on RAMAYANA from 19th May to 25th May 1977 at Brindavan White field, P O Kadngodi, BANGALORE,

The Poet of Kalpavrikshamu easily excels the other writers of Ramayana in Telugu in his profound awareness of modern human condition He has not ignored the impact of science, it has to great extent shaped his attitude to Ramayana

The story of Rama is popular in Telugu as well The story symbalises the simultaneity of God and Man All the old versions of Ramayana in Telugu depict Rama as God only But in general the poets dealing with the story have aligned themselves with the one or the two aspects The folk writers, for instance, look upon Rama as man There are thus two extremes Viswanatha in his Kalpavrikshamu has given expression to his belief that God and Man are one and that Man and Woman are an indivisible unity His Kalpavrikshamu further emphasises that Man and Woman should go through life with a firm commitment to shoulder the responsibilities of here and now at Rama and Sita did

Viswanatha puts special accent on the fact of the equality of Man and Woman at every level by making the evolution of characters in the story symbolic of spirutual regeneration The materialistic and the spiritualistic philosophies are blended in such a way that they can no longer blind the people to the truth as their contradictions are amicably resolved That is why the Kalpavrikshamu is only next to the Mahabharata of the celebrated Kavitrayam The descriptions of nature in the Kalpavrikshamu reveal the particular situation with intensity

supporting the main sentiment The superb poetic beauty of these descriptions reveal the poet's great understanding of life in its bewildering multiplicity He makes the story very much appealing in its Telugu background and setting and takes care to preserve its national character The poet seeks to draw together the nativity and the nationality by a judicious use of the Sanskrit and Telugu metres to suit and elucidate the variety of characters The metres by their rhythms and alteration in some cases contribute to the technique of narration

His love of Telugu words and phrases is abundantly manifest in the pages of **Kalpavrikshamu** Viswanatha has won over Sanskrit and compehed it to settle in peace with Telugu This may perhaps account for his unconven-tional use of Sanskrit compounds It may be necessary to realise that Sanskrit is absorbed into the idiom of all Indian languages Telugu has an impressive blend of Sanskrit which has thus become indispensable Viswanatha has demons-trated the harmonious combination of Telugu and Sanskrit in his poem **Kalpavrikshamu**

Lord Vishnu accepted to the request of the sages and promised to take birth in order to destroy the evil forces This promise of the Lord is in **Madhyakkara,** a Telugu metre The Telugu metre is appropriate because it makes the divine so very convincingly human

Viswanatha is of the opinion that Sri Rama is the **Brah-mapadartha** As the poet is a staunch advocate of Advai-

ta philosophy he believes in the immanence of the Brahma chaitanva Brahma chaitanya in Sri Rama is thousand lines grater than the fraction of it found in the whole of human race that is why Sri Rama is both Man and God Kalpa vrikshmu deals with him on these planes The greatness of Viswanatha Satyanarayana among the Telugu Ramayana poets is that he could deal with the human and divine at the same time

Viswanatha is of the opinion that Sita is the source of Ramayana Woman is the source of power that moves the mattar in man Further the poet belives that Rama is another name for Sri Lalita the generator of this universe Though there is uncertainty about its being feminine, Brahma chaitanya is however described categorically as being not masculine The poet makes Arundhati the motivating power of Vasista, Kousalya, Sumitra and Kaikeyi of Dasaratha Savita of Rishyasrunga - Anasuya of Atri - Tara of Vali and Sugreeva and Mandodari of Ravana The motivation of the feminine to the activity of the masculine is shown in every part of this great epic It can be said that it is only because of these woman characters th s Ramayana Kalpavrikshamu has become perfectly human

Viswanatha divides that six Kandas of Ramayana into thirty Khandas at the rate of five to each Kandas This pattern is of the Sakta Spirit of the Kalpa vrikshamu Six Kandas are six Chakras Five Khandas in each Kanda are five Kosas, Sita is the

name of the human form of Sakti Ramayana means the great story of Sita That is why the feminine characters do play a prominent role in developing the story a every stage of importance Arundhati is more significant than Vasista , Santa is more carefully drawn than Risyasrunga , Mandodari is shown on a higher plain than Ravana, Tara is given a higher status The position of Anasuya is more elevated than that of Atri Ahalya and Sabari are absolutely pure in spirit The three wives of Dasaratha form the basis for the super structure of the story of Sita Since Rama is Sri Lalita, divine power manifests in Rama and Sita The word 'Rama' with the elongated vovelin the end means woman Ayanam means gamanam The march of life is motivated and guided by the feminine power This power is described in thousand way Durga - Raja Rajes wari - Kali - Saraswati - Chandika and Mangala Chandika etc

In the Upasanakanda of the Sakta worship, Sakti, is said to be in all the five Kosas of the beings as Chit-kala to push forward the Jiva to know himself as no diffe-rent from herself The five Khandas in each Kanda represent the five Kosas of the body Each Kanda in itself has the integral unity of beings Sita is the unifying principle in the Kandas and the Khandas Sahridaya is one whose Pancha kosas are filled with the Chitkala i e , Anandakala which elevates the Jiva at every possible movement to merge in the Anandamritha Rasa Kalpavrikshmu is for those Sahridayas These five Khandas may also be taken as symbolising the Pancha

Yagnas of Dakshinachara Again we may interpret that as Sridevi is seated in the lap of Kameswara in the Sahasrara the abode of Sadasiva lowering Rudra, Vishnu and Brahma to Ajna Anahata and Brahma Gandhi respectively Sita is above all the Pancha Kandas and these are the proper channels to march forward towards her Another interpretation also may be that she is the almighty having full control over the Pancha Bhutas The Pancha Khandas in each Kanda reveal these aspects number five is very dear to Sri Mata Her will is the supreme authority for the performance of the main panchakrityas - (Sristi - Sthiti - Samhara - Tirodhana - and Anugraha)

Thus Ramayana Kalpavrikshamu is an original poetic treatise in Telugu on the work of Valmiki For the last so many centuries Telugu poets have been trying their best to sing of Rama Viswanatha has realised the need to integrate the many approaches to the story of Rama in his Kalpavrikshamu Its spirit serene, humane, and universal

# గిరికుమారుని ప్రేమగీతాలు
# భావకవితా ప్రస్థానగ్రంథం

## I

చిత్తవృత్తి విశేషాలలోనూ ప్రకృతిసిద్ధములయిన పదార్థాలలోనూ ఒక వినూతన సౌందర్యమును తాను దర్శించిన దానిని భావించుటచేత **సూక్ష్మ సూక్ష్మ సుషుమ్నామార్గము**లలో దీప్తీకరించుకొనుచు అవి స్పష్టమైన ఆలంబనముగా కవనము చేసినచో నది రొమాంటిక్కు కవిత్వము ఇది ఇట్టిదియని చెప్పుటకు అంతగా వీలైనదికాదు [1] పందొమ్మిదవ శతాబ్దము మొదట మొదటవచ్చిన ఈ విధమైన కావ్యరచనోద్యమమువలన [2] ఆంగ్లకవిత్వమున సౌందర్యోపాసనమును

---

1 We are bound to admit that we apply the term Romantic to Wordsworth in a sense very different from that in which we use it of Coleridge, to Roussean or Herder in a sense very defferent from that in which we give to Chateaubriand or Burger or Tieck - Romantic Revolt by Charles Edwin Vaughan Romanticism is the active reawakening of a creative impulse of a type formerly current, which for many years had tended to become rare and almost to disappear — LEGOUIS and CAZAMIAN

2 మరియునా శతాబ్దమున యూరపుదేశపు భాషాకవితా కళలయందు రొమాంటిక్కు మూమెంటుననుసరించి వచ్చిన Parnassian మూమెంటుయొక్కయు ప్రభావిలక్షణమునుకూడ పరిగణించుకొనవలసి యున్నది

---

బంపకచెడి వాతావరణ మొకటి యేర్పడినది అందువల్ల కవులయందు కల్పనా శక్తికి మంచి దోహదము జరిగినది భావనకొరక ప్రకృష్టతయు, అభివ్యక్తికొరక ఉదాత్తతోడి రామణీయకమును సమకూడి వచ్చినవి భావనవ్యత సౌందర్యదృష్టి లేనప్పుడు సాహిత్యము నావరించెడు జడిమకు విరుగుడుగా రొమాంటిక్కు మూమెంటును అహ్వానింపనేవలయును కానీ వచ్చిన రొమాంటిక్కు పోయట్రీని చూచినచో ప్రకృష్టమైన భావప్రకర్ష నొక్కదానినే లక్ష్యమునందుంచుకొని అందు కనువైన విభావములను గూర్చి ఆయా కవులు పట్టించుకొనలేదని చెప్పవలయును వారి కవితలకు మహాకవుల కవితలకువలె మానవస్వభావ లక్షణ వైలక్షణ్యము గాని జీవిత పరమార్థ నిరూపణముకాని పట్టవేదు ఊరక ఊహాభావములను పేలిపేలి అస్పష్ట మధురములుగా[1] వ్యక్తీకరించుటలోనే కాలము గడచి పోయినది మరియు దానివల్ల తరువాత కొంత గందరగోళ మేర్పడినది[2]

ఇప్పుడు రొమాంటిసిజము యొక్క మూలతత్త్వమును విచారింపవలయును మానవ జీవితపరమార్థమునకును, ప్రకృతితత్త్వమునకును అవినాభావసంబంధము

---

1 The greater body of Romantic Poetry was inspired by ideas of a rather superficial character or very vaguely conceived. GRIERSON Lirical Poetry P 8

2 The writers of the first group, even if they run counter to orthodox habits of language and style are nevertheless in moral harmony with a large majority of the public They outdistance their contemporaries by the fulness of their spiritual life, but are not in a state of open conflict with them

The second genration of Romanticists breathes a spirit of moral revolt It raises against the established order of things manifold protestation instinct with generous passion hauguty sareasm or aesthetic detachment Thus Romanticism becomes a literature of social conflict

—LEGOUIS and CAZAMIAN P 1002

కలదు ప్రకృతితత్వమును దర్శించుటకు ఒక విలక్షణమైన లోచూపుకావలయును అది వారివారి యందున్న భావనాశక్తి ననుసరించి కొందరయందు చైతన్యముగను మరి కొందరయందు జడముగనూ ఉండును తాదృశమైన భావచైతన్యము ప్రకృతిగత సర్వసౌందర్యతత్వమును దర్శించి కావ్యముగా వ్యక్తీకరించినప్పుడు రొమాంటిక్కు కవిత సిద్ధమగుచున్నది ఇందుకు మూలముగా చెప్పబడిన సౌందర్యదర్శనమే రొమాంటిసిజము 1

ప్రకృతియన్న దంతయు పంచభూతాత్మకము మానవుడు కూడ పంచ భూతాత్మకుడే అందువల్లనే ప్రకృతితత్వముతో వానికవినాభావ సంబంధము మనిషి - ప్రకృతియన్నప్పుడు ప్రకృతిశబ్దముచేత పృథివి - అపస్సు తేజస్సు - వాయువు - ఆకాశము మరియు కాలము మొదలయిన ప్రకృతిగతవస్తు సముదాయ మంతయును గ్రహింపబడుచున్నది ఈ వస్తు సముదాయమంతయును శక్తి మంతము ఈ శక్తి మాహాత్మ్యమువల్లనే ప్రకృతితత్వము మానవతత్వముతో సంపదించుచున్నది ఈ సంపదించుటను అనుభవింపవలయును అనుభవ జ్ఞానమునకు శ్రవణమనన నిధిధ్యాసములు తప్ప మరొక మార్గము లేదు సమర్పణబుద్ధితో సముపాసింపవలయును 2 అప్పుడుగాని సౌందర్యతత్వము యొక్క అనుభవజ్ఞానము కలుగదు

అనుభవము, జ్ఞానము-ఇవి రెండును ఏక ముఖమున మనిషిని తత్వవిచార ణము లోనికి తీసికొనిపోవుచున్నవి అందువలన రొమాంటిక్కు పోయిట్రీ

1 రొమాంటిసిజమ్ అంటే కల్పనకంటే రమణీయతను, చమత్కారంకంటే స్పృహణీయతను, ఆలోచనకంటే హృదయవేగాన్ని ప్రధానం చేసికొన్న సాహిత్యోద్యమం

—ఆర్ యస్ సుదర్శనం సాహిత్యంలో దృక్పథాలు - పుట 5

2 Through contemplation and submission, it was posible to release the secret sympathy which bound the universal mind in nature to the mind of man — Getting to know in English Literature by T G Williams

తాత్త్వికతను ఆలింగనము చేసికొనక తప్పదు [1] అనగా మానవస్వభావముయొక్క పరమార్థతత్త్వము రొమాంటిక్కు కవిత్వముయొక్క హృదయమై యున్నది అందువలన ఈ కవిత్వమును విమర్శించుటయు తత్త్వార్థ విచారణముగానే యుండును [2]

ఆత్మ పదార్థతత్త్వ విచారణమనగానే అది ఆయా దేశకాలములకు సంబంధించిన తాత్త్విక దర్శన సంప్రదాయముల యొక్క అవగాహనమీద ఆధారపడి యుండును కనుకనే రాయప్రోలు విశ్వనాథ కృష్ణశాస్త్రి నాయని వేదుల - వీరందరును రొమాంటిక్కు పోయెట్రీని రచించినవారే అయినను ఎవరిత్రోవ వారిదిగా నున్నది

రొమాంటిసిజమనగా సౌందర్యదర్శనమని చెప్పుచున్నను నిజమునకు దాని చిలుక ప్రాణము సర్వతంత్ర స్వతంత్రతయందున్నది [3] అంతవరకు వచ్చుచున్న కావ్యసంప్రదాయములను కాదని క్రొత్తగా ప్రారంభించుట స్వాతంత్ర్యేచ్ఛను ప్రకటించుటయే రొమాంటిసిజము దాని మౌలికార్థమునందు కృష్ణశాస్త్రిగారి కవితలో చోటు చేసికొన్నది అందుకనే తెలుగులో భావకవియనగానే కృష్ణశాస్త్రిగారి పేరు చెప్పుట అభినవ స్వరకల్పన కుద్యమించి పనిచేసినందు

---

1 రొమాంటిసిజం ఆదర్శాలను తెలిసికోడానికి అవసరమైన తాత్త్విక సిద్ధాంతాలను నూతనోత్తేజాన్ని జర్మను దేశం ఇంగ్లాండుకు ప్రసాదించింది - గోపరాజు సాంబశివరావు ఆంగ్ల సాహిత్య చరిత్ర పుట-325

2 అప్పుడు భౌతికశాస్త్రములకును ఆస్తిక ధర్మమునకును వైరము నశించి సఖ్యముచేకూడగలదు కవితా భావములకు వేదాంత భావములకు చెలిమి కలుగగలదు భావికాలపు మతమిదియే - స్వామి వివేకానంద జ్ఞానయోగము, పుట 142

3 Indeed at the heart of this age there stirs an inclination to revolt against christianity and all authoritative forms of discipline But the rebellion of desire reveals itself for the most part indirectly

— LEGOUIS and CAZAMIAN

వల్లనే రాయప్రోలు తెలుగులో రొమాంటిక్కు పొయట్రీకి ప్రారంభకుడైనది కృష్ణశాస్త్రిగారి యందు రొమాంటిసిజము మితిమీరిన స్వతంత్రముగా నున్నదని శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరుల[1] హెచ్చరిక చేయుచు "ఒక హద్దుకు లోబడ్డ స్వాతంత్ర్యాన్ని ప్రాచీనకాలం నుండి భారతీయులు గౌరవిస్తున్నారు" అని వ్రాసినారు ఈ విధమైన 'అతి' ఒక విధముగా బైరను, షెల్లీ, కీట్సు కవుల విషయమునను వచ్చినది అందుకు ప్రతిగా వారి రచనలవలన ప్రేరితులయిన సాహిత్యపరులు నవ్యాభిరుచుల అభివ్యక్తిపట్ల ఒక సామరస్యమును సంపాదించు ప్రయత్నము చేసిరి[2] సరిగా అటువంటి ప్రయత్నమే కృష్ణపక్షము తరువాత గిరికుమారుని ప్రేమగీతాలు చేసినది నవ్య కవిత్వమునందు కృష్ణశాస్త్రి మలుపుతెచ్చి భావకవిత్వమునకు వేగుచుక్కను[3] కృష్ణపక్షమునందు చూపగా, తన ఆలోచనాధారచేత దానిని పరిపూర్ణముచేసి ప్రస్థాన గ్రంథముగా విశ్వనాథ ప్రేమ గీతాలను రచించినాడు ఆ భౌతిక దర్శనాశక్తి[4] ఒకటి విశ్వనాథకు - గిరికుమారుని ప్రేమ గీతాల రచయితకు - ఇతర కాల్పనిక రచయితల భావనకులేని తత్త్వ పరిపూర్ణతను సమకూర్చినది అందువల్ల ఆయన భావకవిత్వము పరిధి తనకు కాలుచేయి ఆడనంత చిన్నదైపోవుటచేత ఆ తరువాత దాని నధిగమించి మహాకావ్యమునకు ప్రస్థానము చేసినాడు అంతవరకు కృష్ణశాస్త్రి విశ్వనాథల ననుసరించుకొని వికసించుచున్న శ్రీశ్రీ ఇక వారితో కాదని ఆధ్యాత్మిక భావవాద విజ్ఞానమునకు

---

1 వాఙ్మయ పరిశిష్టభాష్యం నేటి కాలపు కవిత్వం పుట - 23

2 The reaction in literary taste, the inverse oscillation of the moral rhythm and the search for valance, are in a large measure accelerated by the direct effect of their work, already the coming of such changes is felt at their very time.

— LEGOUIS and CAZAMIAN, P 1044

3 శ్రీ ఆర్ ఎస్ సుదర్శనం, భారతి, ఫిబ్రవరి 1976, పుట - 48

4 Capacity for spiritual insight

శ్రీ ఆర్ ఎస్ సుదర్శనం సాహిత్యంలో దృక్పథాలు, 48

ప్రతిగానన్నట్లు గతి తార్కిక భౌతికవాద విజ్ఞానమునందుకొనినాడు 1930 నాటకే విశ్వనాథ భావకవిత్వమును భావవాదమార్గమునకు త్రిప్పుచున్నప్పుడు శ్రీశ్రీ దానిని భౌతికవాదమార్గమునకు త్రిప్పినాడు అంతవరకు అంతా నవ్య కవిత్వమే అంతా భావకవిత్వమే అప్పటినుండి ఒకటి సంప్రదాయము ఒకటి అభ్యుదయము అభ్యుదయము సంప్రదాయము నిశ్శ్రేయసము రెండును అన్యోన్యాశ్రయ లక్షణ లక్షితములు [1]

వస్తుతత్వమును విచారించినచో దానికి ఉనికియని యొకటి మార్పు అని ఒకటి రెండు లక్షణములుండును ఉనికిరూపమైనది స్వభావమనియు, మార్పు రూపమైనది స్వరూపమనియు చెప్పవలయును కవిత్వమునకు వస్తువు మనిషి కదా! వాని యునికి శాశ్వతమైనది మార్పు నిత్యపరిణామరూపము ఈ రెంటి యందును ప్రవర్తించెడు చైతన్యమునం దేకరూపము యుండుటచేత అవి పరస్ప రము అన్యోన్యాశ్రయ దోషముచేతను సంఘర్షించుకొనుచున్నట్లుండును ఆ సంఘర్షణ లేనిచో చైతన్య ప్రసారముయొక్క ఉనికి తెలియుటకు మార్గము లేదు

---

1 But it would not ridiculoes to assume that the Marxists believe the attainment of omaterial abundance to be an end in itself Not at all Historical experiance shows that the achivement of material abandance with the appropriate spritual, moral, aesthetic etc Development of society, without the shaping of spiritual requir-ments among men, without their all round develop-ment leads only to surfeit and the corruption of society "If material production itself is not conceived in its specific historical form, it is imposible to under-stand what is specific in the spiitual production cor responding to it and the reciprocal influence of the one on the other' (Marx)

— V Kelie and M Kovalson Historical Materia-lism P 219, 221

అందువలన సాహిత్యమునందు భావవాద భౌతికవాదములు సంఘర్షించుకొనుచుండుట మంచిదే అందు విచారింపవలసినదేమున్నది? అభ్యుదయమునకదే లక్షణము విశ్వనాథ సంప్రదాయము శ్రీశ్రీ అభ్యుదయమునకే దోహదము చేయుచున్నది [1]

II

రాయప్రోలువారి నవ్యకవితా వ్యవసాయము భావకవితా ప్రస్థానముగా విశ్వనాథ యందును అభ్యుదయ కవితా ప్రస్థానముగా శ్రీశ్రీ యందును పర్యవసానమును చూచుకొన్నది విశ్వనాథ భావకవితా ప్రస్థానమును భారత జాతీయతకు బలమైన పునాదిగా సమర్పింపగా శ్రీశ్రీ అభ్యుదయ కవితా ప్రస్థానమును భారత జాతీయ జీవనమునందు సమతా సంపాదనమునకు ప్రేరకముగా సమర్పించినాడు

ప్రస్థానమన్న మాటను విశ్వనాథ వాడనిదానిని శ్రీ శ్రీ వాడినాడు ప్రస్థానమనగా ఆత్మలాభప్రాప్తి సాధనము స్వస్వరూపావగాహన సాధనము. ఆత్మశబ్దము ఆనందమును సౌందర్యమును విజ్ఞానమును అనంతత్వమును చెప్పుచున్నది స్వస్వరూపమనగా జీవునకు తానెవరో తనకు తెలిసి తానేమి చేయ

---

1 An object is a unity of stabitity and chargeabilites, of the positive and the negative of what iis dying out and what is entering life and soon This structure is such that each of the aspects of the whole entirely dependent on its opposite for its extence and this quality is not confined merely to their external relationships The inter connection, interdependence and interpentration of opposit aspects, properties and tendencies of the devoloping whole are an essential feature of any unites of opposites — The Fundamentals of Marxist-Leninist Philosophy P 143

వలయునో తనకు తెలియుట[1] భావకవితా ప్రస్థానము మానవునకు ఆభ్యంతర జీవితవిధానమును, అభ్యుదయ కవితా ప్రస్థానము బాహ్యజీవిత విధానమును ప్రబోధించుచున్నవి సవ్యకవిత్వమునకిట్లుపయోగము నభిలషించి చెరియొక ముఖముగా శ్రీశ్రీ విశ్వనాథలు అభ్యుదయ భావకవితా ప్రస్థానరూప సంస్కారములను సలక్షణముగా చేసిరి అధ్యయనమునకీ రెండును మార్గములు ఒక విధముగా ఆధునికాంధ్ర సాహిత్య దర్శనములకు విశ్వనాథయును శ్రీశ్రీయును వ్యాస జైమినులవంటివారు విశ్వమునకు అభ్యుదయ నిశ్రేయస ఫలములను సంకల్పించి ప్రవర్తించుటలో సామ్యమును చూడవచ్చును ప్రవర్తించుటయనగా జిజ్ఞాస చేయుట ధర్మము జిజ్ఞాస్యమని ఒకరును బ్రహ్మము జిజ్ఞాస్యమని ఒకరును బయలుదేరిరి రెండును అద్వితీయములేగనుక రెండనుకొనుటను వ్యవహారమనవలయును వ్యావహారికముగా విశ్వనాథకును శ్రీశ్రీకిని గల భేదము పరమార్థమునందు లేదు

విశ్వనాథను ప్రాతకాలమువాడనీ, ముసలివాసనలవాడనీ అనుట కలదు విచారణ శీలురుకానివారు ఇవి నిందావాక్యములనీ చమత్కారముగా తాము కల్పించగలిగినామనీ ప్రచారము చేసుకొనుటయు కలదు ప్రాతకొత్తలకు కొలమానము మానవుని విజ్ఞానమే కదా? అవెప్పుడును రెండు ప్రక్కలుగా మానవుల మనస్సుల నావరించి యుండును ఒకటి భావవాదవిజ్ఞానము మరొకటి భౌతికవాద విజ్ఞానము మొదటిది వివర్తవాదము, రెండవది పరిణామవాదము పరిణామమునందు నూతనత్వము ఇంద్రియగోచరముగానున్నది వివర్తమునందు నూతనత్వము బుద్ధి గోచారమునున్నది లోకము సాధారణస్థితిలో ఇంద్రియగోచరములను పట్టుకొని పోవుచున్నది అసాధారణస్థితిలో బుద్ధి గోచరత్వము ననుసరించుచున్నది కవిత్వము సాధారణస్థితిలోనూ, అసాధారణస్థితిలోనూ లోకమునకు విజ్ఞానమార్గదర్శకముగా నుండవలయును ఉభయ పరిస్థితులలోనూ పనికిరాగల కవిత్వమును రచించినవారు మహాకవులు

---

1 The most important thing is a person's spiritual life An account of the external life completely fails to correspond with the tremendous inpostance that inner work has for life -- Tolstoy Soviet Literature No 10, 1975 P 103

భావ వాదము తనయందలి వివర్త లక్షణముచేత ప్రాచీనముగానూ, ఆధునికముగానూ కన్పించగలదు భౌతిక వాదము ఆధునికముగా తప్ప మరొక రీతిగా కన్పించ వలయుననుకొన్నను కన్పించలేదు భౌతికతయు నశింపున్నది గనుక దాని ప్రాచీన రూపము నశించిపోయినది నశించినదానికి ఇంద్రియ గోచరత్వ మెక్కడిది? పరిణామ మనగా పూర్వరూపమునకు నశింపు కనుక భౌతికవాదమునకు వర్తమానమే ఎప్పుడును వున్నచో భవిష్యత్తు ఎట్లు? భవిష్యత్తు ఎట్లు ఇంద్రియములకు గోచరించునదికాదో అట్లే భూతమును కాదు కనుకనే సాధారణులంతగా భూతభవిష్యత్తులను పట్టించుకొనరు భూత భవిష్యత్తులను అతీంద్రియములను చూడగలిగినవారు అసాధారణులు భావపదవిజ్ఞానమునందే అసాధారణ లక్షణమున్నది భౌతిక వాద విజ్ఞానమునందు సాధారణ లక్షణమున్నది భౌతిక వాదము భావవాదమునకు, భావవాదము భౌతికవాదమునకు ఆరోహణావరోహణ చక్రమునందు అన్యోన్యరూపమైన అభిముఖ్యమును భజించుచున్నవి ఈ తత్వము[1] తెలియని సాధారణులకు బుద్ధిలక్షణము ఉండదు కనుక భూతభవిష్యత్తులను చూడలేక, సృష్టి తమతోనే మొదలై తమతోనే అంతమగుచున్నదన్నంతమాత్రపు తెలివితో సంచారము సాగుచున్నది, ఈ తెలివికితోడు భౌతికవాదపు భౌతిక వాయువులు తాకి పులకింపజేసినచో ఇక సాధారణులను పట్టుకొనుట అంత సులభముకాదు విచారణశీలురు కానివారనగా ఈ దృశ్యమైన సాధారణులు

ఆధునికాంధ్ర సాహిత్యమునందు విశ్వనాధ భావవాద విజ్ఞానశాలీయుడు శ్రీ శ్రీ భౌతికవాద విజ్ఞానశాలీయుడు వారివారి ప్రాచీనాధునికతలకు వారివారి

---

1 హిందూ దేశస్థులు మనస్సును, ఆధ్యాత్మిక విషయములను తార్కిక బుద్ధితో పరిశీలించిరి యూరోపుదేశస్థులు బాహ్య (జడ) ప్రకృతితో నారంభించి పరిశీలనములు చేసిరి మానసిక పరిశోధనలద్వారా మనము చివరకు ఏ ఏకత్వమును చేరుదుమో భౌతిక శాస్త్ర పరిశోధనల ద్వారా కూడ మనమా ఏకత్వమునే చేరుదుము అఖిల ప్రపంచమూలమగు నొకే శక్తి సకలచరాచరరూపమున కానిపించుచున్నదనియు, మానవజాతి నడుచునది విముక్తి మార్గమునగాని దాస్యమార్గమున కాదనియు భౌతిక శాస్త్రములు బోధించుచున్నవి —శ్రీ వివేకానందస్వామి జ్ఞానయోగము - పుటలు 143, 144

స్వాధ్యాయశీలమే కారణము అది వారియందు నిత్యజాగ్రలక్షణముగా నుండుట చేత ఎవరికిని ప్రమాదము లేదు

మనము ఒక్క విశ్వనాథనే అని, శ్రీశ్రీని అనకుండా ఊరకొన్నామా?- ఆయన నిలుకడలేనివాడు, రంగులు మార్చుకొనువాడు చెప్పేదు దానికి చేసెదు దానికి సంబంధము లేనివాడు - ఇదియు విచారణశీలము లేకపోవుటవలని ఫలితమే పరిణామమును నమ్మినవాడు వస్తువునుకదా ఆశ్రయించవలయును? అది రూపములను మార్చుకొనుచున్నప్పుడు దాని నాశ్రయించినవాడు దానివలెపోక మరెట్లు పోగలడు? అది రూపము మార్చుకొననిచో దాని వస్తుస్థితికి భంగము కలుగును అనగా దాని భౌతికతకది విరుద్ధము అందువలన శ్రీశ్రీ ఈ 50 సంవత్సరాల సాహిత్య జీవితములో ఎన్ని మార్పులు వచ్చినట్లుగా మనము చూచుచున్నామో అదంతయు భౌతికవాద లక్షణముగా నెరుగవలయును 1

పరిణామము ఇంద్రియ గోచరముగా లేదని విశ్వనాథ సాహిత్యమును, పరిణామమున్నచోట నిలకడ లేదని శ్రీశ్రీ సాహిత్యమును రెండింటిని కాదన్నచో ఇక మనకు మిగిలెడిదేమున్నది నీవూ నేనూతప్ప? ఒకరు భ్రాంతియన్ననూ మరొకరు వాస్తవమన్ననూ ఇద్దరూ ఈ జగత్తును గురించియే ఆలోచించుచున్నారు కదా! ఏదో ఇంత జ్ఞానము ఇంత ఆనందము ఈ లోకమునకు సుఖజీవనార్థము కలిగింపవలయుననియే కదా ఎవరో మెడబట్టి నెట్టినట్లు ఇంతకాలముగా ఈ సాహిత్య వ్యవసాయమును కొనసాగించుచున్నది?2 అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః వివర్తవాద విజ్ఞానము కాలత్రయమునందొక అనుస్యూతిలక్షణ వివేకమును కల్గించును అందువల్ల అక్కడ ఇది ప్రాచీనమని ఇది నవతయని లేదు అఖండజ్ఞానమనగా నట్లుండును అంతర్జాతీయత యని యనుచున్నాము కదా! భౌతికవాద విజ్ఞానము కాలత్రయమునందును వస్తువుల

---

1 వివేకవంతుడెవడును పరిణామవాదులతో తగవులాడబోడు

—శ్రీ స్వామి వివేకానంద

2 పార్వతీజానివోలె పాపంబునెల్ల / కంఠసీమగదించి లోకశుభగీతి / పాడు సత్కవి యమృతశైవాలినీత / తరంగమన గీః ప్రముదితారంభములను

—భ్రష్టయోగి పుట- 108

పృథగస్తిత్వలక్షణ వివేకమును కలిగించును తత్వతః ఈ ఖండజ్ఞానము అఖండము జ్ఞానముగా పరిణమించు లక్షణము కలది [1] దృశ్యముల నాశ్రయించినది ఖండజ్ఞానము శ్రవ్యము నాశ్రయించినది అఖండజ్ఞానము [2] ఒకటి భౌతిక వాదము రెండవది భావవాదము గతితార్కికత దానికెంతయున్నదో దీనికంత కంటె ఎక్కువున్నది విజ్ఞానరూపమునందు రెండింటికిని సమైక్యము [3] అక్కడ నుండి సామ్యవాదము [4]

ఈ ఇరువదియవ శతాబ్దము తెలుగు సాహిత్యమును భావవాద తాత్విక దృక్పథముచేతను, భౌతికవాద తాత్విక దృక్పథముచేతను తమ పలుకుబడి క్రిందకు తెచ్చుకొన్న మహాకవులు విశ్వనాథయును, శ్రీశ్రీయును

ప్రాచీనాధునికతలనగా అవి విచారించినచో ఇట్లుండునూ విచారింపనిచో ఎట్లయిననూ ఉండవచ్చును

---

1 మనయుద్యోగములున్ మరిన్ మనమునస్మద్లౌకిక ప్రజలున్/తనరంజేయుటయే శుభంబనుచు నేతత్కాలపుం మూర్తియొం/చునో - లేకన్ శుభమింక నున్నదొకదంచున్‌వేఱయంచూహించునో —భ్రష్టయోగి పుట - 137

2 అఖండజ్ఞానం అనేది ఒక మహా స్రవంతి అందులో ఒక ప్రత్యేక పరిణామాన్ని గురించి ఒక దశలో మానవుడు ప్రతిపాదించే జ్ఞానం సాపేక్ష జ్ఞానం సాపేక్షక జ్ఞాన సముదాయము యొక్క సమాహారమే అఖండ జ్ఞానం (ఆచరణ ఇంగ్లీషు కాపీ పేజి 2) మార్చి 1956, సందేశం పుట - 34

3 శోకాధిదేవతతో మొదలుపెట్టి కరుణాదేవిని ప్రకృతిని అనందదేవతను ఊహాదేవిని మధ్యలో ప్రవర్తింపజేసి మొత్తమునకు చిట్టచివరకు కాలపురుషునియందు లయమును చెప్పుచున్న 'కాలపురుషుడు' చూడవచ్చును —భ్రష్టయోగి, పు 85 - 88

4 సామ్యవాద సమాజంలో మానవుని భౌతిక సంక్షేమంతోబాటు అతని మానసిక శక్తులకూడా సర్వతోముఖంగా వికసిస్తాయి —శ్రీశ్రీ సాహిత్యం మూడు - పు 260

III

మనము భావకవిత్వమని అనుకొనేదానిలో ముప్పాతికభాగము చిత్తవృత్తుల సహజ లక్షణమునుండి పుట్టిన భావ సముదాయము కలది కాదు మరియు నది విస్పష్ట ప్రకటనమునకు సామాజిక మర్యాద దృష్ట్యా తగినదియు కాదు అందు వలన భావ కవిత్వమునకు క్లిష్టత అస్పష్టత సాధారణ గుణములైనవి ఈ రెండింటిని కలిపి ఉమాకాంత విద్యాశేఖరులు అయోమయముగా చెప్పినారు ఆపరోక్షానుభూతులను చెప్పినవారికంటె పరోక్షానుభూతులను కల్పించుకొని వర్ణించుటకు ప్రయత్నించినవారి సంఖ్యయే భావ కవులయందెక్కువ దీనికితోడు ఆదర్శముగా గ్రహించిన ఆంగ్ల కవులయందును అదే లక్షణము ఇమేజినేషను ప్రక్కన ఫాన్సీ అని కలదు ఇవి రెండును మనం ప్రవృత్తులే మొదటిదాని యందు హేతువు - క్రమము - వికాసము - అనుభవముగా భావనా వ్యాపార ముండును భావనా వ్యాపారము ఇమేజినేషను చిత్తవిభ్రమకారి లక్షణము ఫ్యాన్సీ ఇది వట్టి యూహ ఊహకూడకాదు- నిర్హేతుకి జాయమానమైన భ్రాంతి

ముప్పాతికభాగము భావ కవిత్వమునకు పట్టిన దోషములను తొలగించి దానిని వీలయినంత సలక్షణముగా ప్రతిపాదించు ప్రయత్నము ఎనిమిది సంవత్సరములమీద (1920-28) గిరికుమారుని ప్రేమగీతాలలో లీనమైయున్నది ఈ గీతములయందు అనుభవ తీవ్రత ఎంతయున్నదో దానిని ఇబ్బడిముబ్బడి చేసిపెట్టగల మధుర కవితా రచనవలన అంత రమ్యత దర్శనీయముగా నున్నది మామూలు భావ కవిత్వమున కింతయే యెక్కువ దీనిమీద ఇంకను వనితన మున్నది అది అంతఃకరణ ప్రవృత్తులను సవ్యాఖ్యానముగా స్ఫురింపజేయుట మరియు మానవ జీవిత నియతి లక్షణము నెప్పటికప్పు డెరిగి రచించుట ఈ విధముగా సుఖ దుఃఖముల లోతు పాతు లెరిగిన గజ ఈతగాడుగా విశ్వనాథ రచించుటచేత ఈ ప్రేమ గీతాలు భావ కవితా ప్రస్థాన స్థాయికెక్కినవి కావ్యము నకు ప్రౌఢిమను తెచ్చు రచనా శిల్పమునందు కవి ఎంత గొప్పవాడైనను కావ్య వస్తు తత్వవివేకము స్వచ్ఛంద సుందరమైన స్వానుభవము యొక్క వికసనము

---

1 The greater body of romantic Poetry was inspired by ideas of a rather superficial character or very vaguely conceived —Lyrical Poetry By GRIERSON

కానిచో ఆ కవికి మహాకవి యోగ్యత రాదు భావకవులయం దెవరికిపట్టని ఈ యోగ్యతను విశ్వనాథయందు ఈ గిరికుమారుని ప్రేమగీతాలు ఋజువుపరచుచున్నవి ఈ యంతటికిని కారణము శాశ్వత సౌందర్య ధర్మము నిముడ్చుకొన్న స్త్రీ పుంప యోగాయోగాభావానుభవస్పందనముచేత ప్రతి గీతమును చైతన్యవంతమై యుండుటయే మిగిలిన భావకవులయందు ధర్మశృంగారబుద్ధి ఇంత విస్పష్టముగా లేదు ఉన్నను అది ఇంతగా క్రమవికాసమును చెందుటను వారెవరును ఆలోచింపలేదు అర్థ కామములను అదుపులో పెట్టికొన్న ధర్మమే సమాజము యొక్క నడకకు ప్రేరణశక్తి కామపురుషార్థములు స్త్రీపురుషుల మధ్య ప్రవర్తింపజేయనే వలయును వలయుచో వారు భార్యాభర్తలై యుండవలయును కానిచో పర్యవసానమునందు కావలయును ముప్పాతికవంతు భావ కవిత్వమునందు ఈ విషయము వ్యంగ్యముగా నున్నది ఊహాప్రేయసులని ముందు వెనుకలు లేకుండ స్పష్ట ప్రతిపత్తికి రాకుండ భావమునూరక తెంచి తెంచి రచించుట కొనసాగుచుండగా అది పద్ధతికాదని మోక్షసాధనమైన ధర్మకామమును అనేక అంతస్థులలో నిరూపించుటగా ఈ ప్రేమగీతాలు రచింపబడినవి ఒక్క ధర్మకామన కేంద్రముగా ఎనిమిది సంవత్సరాల వ్యవధానములో ఎడతెగకుండా ఆలోచనమును నిలబెట్టుకొన్న రచయిత బుద్ధిశక్తిని భావింపవలయును

భావకవులందరి వలెనె విశ్వనాథయు ప్రకృతియు సౌందర్యమయముగానే దర్శించి కీర్తించెను ప్రకృతిగతములయిన సర్వవస్తువులను బ్రహ్మమయములు బ్రహ్మానంద సుందరము కనుక వస్తుసౌందర్య సందర్శనమును కూడా మనము ఆంగ్లకవులనుండియే నేర్చుకొనక్కరలేదు తదభివ్యక్తిలో క్రొత్తక్రొత్త ఒడుపులను తెనుగుకవులూహించుకొనుటకు ఆంగ్లభాషా సాహిత్య పరిచయము దోహదకారియై యుండుననవచ్చును ఋతుధర్మముతోడి కాలచక్ర భ్రమణమునందు సౌందర్య సంపదను అటు సంస్కృత కవులును ఇటు తెనుగు ప్రబంధ కవులును తలమునుకలుగా వర్ణించిపోయిరి అక్కడకూడ విశ్వనాథ తన ప్రజ్ఞ చేత క్లాసికలు స్థాయిని, ప్రతిభచేత రొమాంటిక్కు స్థాయిని సమన్వయము చేయుటగా ప్రకృతిని సౌందర్యమును విలక్షణముగా వర్ణించెను సృష్టిలో సౌందర్యమునకు ప్రతీక స్త్రీతప్ప మరొకటిలేదుకదా! అందువలన భావకవులందరును స్త్రీమూర్తులందు సౌందర్యము నుపాసించుటకు మొదలుపెట్టగా కవికి ప్రతీకతోనున్న సంబంధము చర్చనీయమైనది దాని విషయమున స్పష్టమైన

పరిష్కారమును విశ్వనాథయే చేసెను కవియు కవి భార్యయు వీరే భావకావ్యమున నాయకుడును నాయికయును 1 ఇట్టుద్దిష్టముకాకపోవుట విమర్శలకు గురియగుట లోని సామంజస్యమును చూచినమీదట విశ్వనాథ తన గిరికుమారుని ప్రేమగీతాల యందీ విషయమును స్పష్టము చేసెను

ఇక్కడ పరమార్థము నిద్దెరుగవలయును సమస్తమైన ఆత్మతత్త్వము యొక్క ఏకరూపతను అకామమును అపహతపాప్మమును బోధించుటలో నొక ఉపమానము దృష్టాంతముగాను నిదర్శనముగాను చెప్పబడియున్నది కార్య కారణాత్మకమైన శరీర సంబంధములేక పరమాత్మతో నైక్యము భజించిన పురుషునకు బాహ్యాభ్యంతర జ్ఞానముగాని సుఖదుఃఖ జ్ఞానముకాని ఉండదు దీనికి నిదర్శనవాక్యమిది ప్రియాలింగితుడగు పురుషునకు బాహ్యాభ్యంతర జ్ఞానముండుట లేదుకదా? 2 అని జీవాత్మ పరమాత్మలు ప్రియుడును ప్రియురాలును అన్నట్లున్నారు జీవ బ్రహ్మైక్యమునకు ఈ భార్యాభర్తల సంబంధము సాధన మార్గముగా నున్నది ఈ భావమునందిపుచ్చుకొనుటచేత భావ కవిత్వమునకు గిరి కుమారుని ప్రేమగీతాల వలన ఒక ప్రస్థానగౌరవము వచ్చినది భేదబుద్ధి నశించిన స్థితిలో భార్యయనగానేమి? దేవతయనగానేమి? తల్లియనగానేమి? తండ్రియనగా నేమి? అన్నట్లుండును అందువల్ల భావకవిత్వము స్త్రీని ఉపాస్యదేవతగా మార్చినది సంసారము - ప్రేమ - ఉపాసన - కర్మకాండ - తత్త్వము - కాలము - ప్రకృతి - మనుష్యులు - మనస్సులు - ఇంద్రియములు - జ్ఞానము - జన్మలు - వాసనలు సంస్కారములు - లోకము - ధర్మము - మర్యాద - ఈ సమస్తమైన ఒత్తిడులలోబడి పరమార్థమును గూర్చిన ప్రస్థానముగా విశ్వనాథ భావ కవిత్వమును ప్రౌఢసుందరమును చేసెను

1 'కులపాలికా ప్రణయము' అని అధునికాంధ్ర కవిత్వము (358) నందున్న విషయము నిక్కడ చూడవచ్చును

2 తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యంకించన వేద నాన్తరమ్ - ఏవమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో నబాహ్యం కించ నవేదనాంతరమ్ — బృహదారణ్యకోపనిషత్తు 4 3 21

## IV

భావమనగా ధాతువుయొక్క యర్థము శబ్దార్థములన్నప్పుడు శబ్దములలో నామములతోపాటు క్రియలును, అర్థములలో అర్థములతోపాటు భావములును గ్రహింపబడుచున్నవి కావ్యరచనా వ్యాపారము అన్ని భాషలయందు శబ్దార్థములతోనే చేయబడుచున్నది మరి భావకావ్యమనగానేమి? నామార్థములనుకాక ధాత్వర్థములను ప్రధానముచేసి చేయు కావ్యమనవలయును అయినచో ధాత్వర్థమైన భావముయొక్క రూపమెట్లుండుననగా ఫలరూపమునను మరియు దానికి సంబంధించిన వ్యాపారము రూపమునను నుండును ఫలనిర్ణయబుద్ధిలేక వ్యాపారము నందొక క్రమ వికాసము లేదు భావ కవిత్వమును వ్రాయుచున్నప్పుడు ముందు ధాతుపుష్టిని చూచుకొనవలయును [1] ధాతువు కర్త్రర్థమునందును కర్మార్థమునందును వికసించు లక్షణము కలది మొదలది ఆకాంక్ష జనిస్థానము ధాతువుయొక్క కర్మార్థమునకది మూలాధారము భావకవి తాను కర్తృస్థానము నందుండి ప్రేమించు అనుధాతువుయొక్క కర్మార్థవికాసమునకు దోహదముగా రచనావ్యాపారమును చేయును చేయగా భావకవిత్వము అది కవిత్వమగుటకు మరికొంత పనియున్నది

ప్రేమించుట యనగానేమి? ప్రేమించుటకు ఈడుజోడైన స్త్రీపురుషులే కావలయునా? ఇష్టము వచ్చినట్లు ప్రేమించుకొనుటకు వీలులేదా? ఈ ప్రేమించుటతో ఈ సంఘమునకు సంబంధమున్నదా? సృష్టియంతయు ఈ ప్రేమించుట మీదనే ఆధారపడి యున్నదా? - అవును - ఇవన్నియు ఇట్లేయున్నవి అయినచో ఈ స్త్రీపురుషులెవరనగా ఈ ధాతువుయొక్క ఫలరూపము స్త్రీ వ్యాపారరూపము పురుషుడు వ్యాపారము యొక్క సంపూర్ణఫలమునందు వ్యాపారము విలీనమై సమాప్తము కావలయును వ్యాపారము జరుగుచున్నంత కాలము ఇది యింతే దీనిఫలము అని చెప్పుట కుదురదు పరమార్థ మాలోచించినప్పుడు ఫలము నుద్దేశించి వ్యాపారమును చేయవలయును వ్యాపారమున్నంత వరకు ఫలము రాదు ఫలము రాగా వ్యాపారముండదు అగుచో స్త్రీపురుషులు వరుసలో నుండవలసినదే

---

1 ప్రియమిత్యేనదుపాసీత— బృహదారణ్యకోపనిషత్తు

కాని ప్రక్క ప్రక్కగా నుండుటకు వీలులేదా? లేనట్లే కన్పించుచున్నది వ్యాపా ధాశ్రయత్వముచేత పురుషుడు కర్త ఫలాశ్రయత్వముచేత స్త్రీ కర్మ ఇక్కడ ఇద్దరుగా కన్పించుచున్నారుగాని ధాతువునందు భావ రూపమున ఏకత్వమునే భజించుచున్నారు అక్కడ స్త్రీపుం విభేదమే లేదు [1] భావకవిత్వమనగా పురుషుడు స్త్రీ విషయకముగా ప్రేమ వ్యాపారమును చేసిచేసి స్త్రీపుంవిభేదరహితమైన సమైక్యభావమును పొందుటను కావ్యముగా కవిత్వముగా రచించుటయని చెప్ప వలయును [2] ఆ వ్యాపార సరళిమీద భావకవిత్వము యొక్క ఉదాత్తత ఆధార పడియున్నది

మరియు స్త్రీ పురుష ప్రకృతులు కలవు జడ ప్రకృతి కలదు అయా ప్రకృతులయం దాయాధర్మములున్నవి ధర్మములయొక్క జ్ఞానరూపములు భావములు భావ కవిత్వమనగా ప్రకృతి ధర్మ జిజ్ఞాసాత్మకమైన కవిత్వమని యర్థము, పరస్పరము ఉధారాధేయ భావములు కలవగుటచేత ప్రకృతియొక్క ధర్మత్రయమును భావకవిత్వము తనకు విషయముగా చేసుకొన్నది ప్రకృతిలో సగము జడము, సగము చేతనము అది స్త్రీపురుషాత్మకము, చైతన్యమంతయు, క్రియారూపము పురుషుని క్రియావ్యాపారమునకు ఈప్సితతమైనది స్త్రీ పరమాత్మ నిర్వ్యాపారమును భరింపలేక ద్వితీయమును[3] సంకల్పించుకొనెను,

ఆ ద్వితీయమునందున్న ఇచ్ఛాతిశయ మెంతటిదనగా దానికొరకు అనీప్సితమైన సంసారమును పరమాత్మకు నడిపింప వలసి వచ్చుచున్నది పరమాత్మ స్త్రీయన్నచో ద్వితీయము పురుషుడు స్త్రీపురుషభేదబుద్ధి పరమాత్మము

---

1 నైవస్త్రీ నపుమానేష నచైవాయం నపుంసకః— శ్వేతాశ్వతరము 5 10

2 పత్యుఃకామాయ పతిః ప్రియోన భవతి ఆత్మ వస్తుకామాయ (భార్యాయాః) పతిః ప్రియోభవతి జాయాయై కామాయ జాయాప్రియా నభవతీ ఆత్మ వస్తుకామాయ జాయ (పత్యుః ప్రియా భవతి— బృహదారణ్యకోపని షత్తు 4 4 5

3 సవైనైవరేమే తస్మాత్ ఏకాకీ నరమతే సద్వితీయమైచ్ఛత్ స ఇమ మేవాత్మనం ద్వేధా ఉపాతయత్ తతఃపతిశ్చ పత్నీచ అభవతాం స్త్రీయాపూర్వత ఏవ — బృహదారణ్యకోపనిషత్తు 3 4,3

నందులేదు. లోకమునందున్నది లేనిచో సంసారము సాగదు అందుకే ద్వితీయ యనగా భార్యయనియు, అది పురుషుని వ్యాపారమున కాశ్రయమగుటచేత కర్మ యనియు, అసలా వ్యాపారమున కది కారకమనియు చెప్పబడుచున్నది - ఈ దృశ్యమైన చైతన్యప్రేరకముగా క్రియాన్వయ రూపమైన స్త్రీ ప్రకృతి ధర్మ మును పరమోత్తాలముగా భావకవిత్వము తనకు విషయముగా చేసుకొని పలుపరి విధముల విచారించి ప్రదర్శించినది తెనుగున భావకవిత్వమనగా నిది ఇది కానిది ఉన్నది తక్కువ

## V

గిరికుమారుని ప్రేమగీతాలు సర్వభారతీయ సంస్కార హృదయము యొక్క సుందర స్పందనలుగా నుండుటచేతను మరియు నాపేరింత విస్పష్ట ముగా సాహిత్యదర్పణకారుని మాటప్రకారము కవిపేరును[1] వృత్తము పేరును బట్టి కల్పింపబడుటచేతను విమర్శన విద్యాశేఖరులు తన జోలికిరాకుండ చేసికో గలిగినది మరియు విశ్వనాథ భావకవిత్వముమీద వచ్చిన పెనుగాలుల తాకిడి తగులుటకు వీలుకాకుండా జాగ్రత్తలు తీసికొని ఈ ప్రస్థాన కావ్యమును రచించినాడు "సర్వభావాలకు మొదట వశుడై సర్వభావాలను పిమ్మట వశం చేసుకొని భావోద్వేగానికి (Emotion) తాను మొదట వశుడై పిమ్మట భావో ద్వేగాన్ని తన వశం చేసుకొని సర్గానికి ఉన్ముఖుడయ్యే జగన్నిర్మాతవలె అమోఘ వివేకంతో కావ్యసృష్టి ప్రవృత్తుడౌతున్నాడు" గిరికుమారుని ప్రేమ గీతాల రచయితను గురించియు ఆ వాక్యములో చెప్పవలయును విశ్వనాథ భావకవులనతిశయించి ధ్వనిమార్గమును[2] బట్టినాడు గనుక పరిణతబుద్ధుల కుద్దిష్ట

---

1 గిరికుమారుడన్నది విశ్వనాథకు కలముపేరు శ్రీ కొడాలి అంజనేయులు గారితో జంటకవిత్వము చెప్పెడు కాలమున. తవ ఇద్దరకు కలిసిరావల యునని ఈ పేరును కల్పించెను తన తండ్రి పేరు శోభనాద్రి అంజనే యులుగారి తండ్రి పేరు వెంకటాచలం ఇద్దరితండ్రులును గిరులేగనుక తామిరువురు గిరికుమారులు అంజనేయులుగారు విడిపోయినను విశ్వనాథ గిరికుమారుని లక్షణములో మార్పులేదు అందువల్ల అదే ఆయన కలము పేరు

2 దివ్యన్మహా ధ్వనిరాజ్యంబున నీకె కట్టితిమిరా పట్టంబు — భ్రష్టయోగి పుట 84

మైన ఈ కావ్యమునందు నిదర్శన పరంపరాది అపరిణత కావ్యకల్పము లేకుండ పోయినది శబ్ద బ్రహ్మోపాసన ఫలించిన కవి వాక్కునందు అస్పష్టత - కాని దర్శనమునందు గూఢరూపరేఖాజ్ఞత లేకపోవుటగాని లేవు గనుక అయో మయత్వము, పులుముడు మొదలయిన దోషాలకు ఈ కావ్యము అతీతముగా నున్నది మరియు భార్యాభర్తలు నాయికా నాయకులనుటచేత కవి నాయక పాత్రను స్వీకరించుటచేత భార్యాభర్తృభావము ప్రజాతంతువును తెగిపోనీయ కుండా పట్టుకొని మోక్షమునందు పర్యవసానము లక్ష్యముగా కలదన్న విజ్ఞానము చేత శృంగారాధికరణముయొక్క దెబ్బతగలని పరమపదమునందు విశ్వనాథ తన ప్రేమగీతాల కావ్యమును నిలుపగలిగినాడు

భావకవిత్వమనగా పురుషుడు స్త్రీ విషయకముగా వ్యాపారమును చేసి చేసి యని ఇంతకుముందు ప్రారంభించినదానిని గురించి ఇప్పుడిక్కడ విచారింప వలయును ఇహపరములు రెండున్నవి పరములేదన్నను లేకపోవుట ఇహము నకు పరముగా నున్నది అవసానముయొక్క పరగుటను అంగీకరించిన వారిని ప్రథమ విద్వాంసులన్నారు భక్తుడున్నాడు భగవంతుడున్నాడు లేడు లేకుండనే యున్నాడు పురుషుడున్నాడు స్త్రీయున్నది లేదనుటకు లేదు పురుషునివలెలేదు దీనిని తిరగవేయవచ్చును కూడ స్త్రీ యున్నది పురుష డున్నాడు లేడనుటకు లేదు స్త్రీవలె లేడు ఈ విధముగా నిద్దరూ ఉన్నారు గనుక ఒకరికొకరు పరముకాక తప్పదు పరమైనవారి ప్రభావమువల్ల పూర్వ మున వారు ప్రభావితులుకాకను తప్పదు సంసారమంతయు నిట్లే జరుగుచున్నది ఇక్కడ మనస్సు పనిచేయుచున్నది దుఃఖము వద్దని, సుఖము ఇంకనూ కావలయు నని దానివి రెండే కోరికలు అనుభవింపనిదానిని అది వద్దనదు కావలెననదు మనస్సునకు భగవంతుడున్నాడనగా భగవదనుభవము దాని యనుభవములో నున్నదని యర్థము పరమును గురించిన యాలోచన యున్నదనగా పరము యొక్క జ్ఞానము దాని యనుభవములో నున్నదని యర్థము అననుభూతము లుగా అనుభూత విషయములున్నవన్న జ్ఞానముమీద మనస్సు తన తత్కాలాను భవ విషయమునందు అనుభూత పూర్వవిషయమునకు సంకేతమును సంక

ల్పించినది [1] సంకేతమునందు సంకల్పమే భక్తి భావము సంకేతమునందు చైతన్యబుద్ధితో ప్రవర్తించుటయే అర్చన అది క్రియ సంకేతమునందు చైతన్యమనబడుచున్నది పరమార్థతత్వము యొక్క అనుగ్రహలక్షణము స్త్రీ పురుషులు పరస్పరము సంకేతలక్షణమును భజించినచో పరమసుఖావ్యాప్తికది త్రోవ ఈదృశమైన సమర్చన క్రియాకలాపముగా ఈ విశ్వసంసారము కొనసాగుచున్నది ఇదిరా దీని తత్వమని దర్శించుటచేత భావకవిత్వము నవ్యకవిత్వమైనది భావకవిత్వమున పురుషునకు స్త్రీ పరమగుచున్నది దీని వెనుక అధిష్ఠానమన్నట్లున్న సాంఘిక వ్యవహార మర్యాదాలక్షణముయొక్క ఎరిగి యెరుగముల యందలి భేదమునుబట్టి భావకవులలో భేదములు ఇక్కడ పురుషుడు భక్తుడు, స్త్రీ భగవతి [2] భక్తునకు భగవతియందెంత ప్రేమయో భగవతికి భక్తుని యందంతకంటె ఎక్కువ ప్రేమ కానీ అది భక్తునిముఖముగానే వ్యక్తమగును స్వయముగా వ్యక్తము కాదు భగవతి భక్తునకు అనుభవమును ప్రసాదించుట ద్వారా అనుగ్రహము చూపును అక్కడ భక్తి, ఇక్కడ ప్రేమ అక్కడ పూజ ఇక్కడ ప్రణయము [3] సంసారమీవిధముగా స్త్రీపురుషులను ఒకరికొకరు తరణోపాయముగా కల్పించినది ఈ విధముగా దృశ్యమును అదృశ్యమునకు సంకేతముగా గ్రహించుకొనుట తెలిసినదానినుండి తెలియనిది తెలిసికొనుటగా సాగుచున్న మానవుని విజ్ఞానానుభవయాత్రయందు అదొక పద్ధతి భావకవిత్వమునందా

---

1 ఇంతకాలముగా నాకదృష్టముంయి/ఎన్ని ఆనందధామమ్ము లీయనంత భువనసంధుల భాసిల్లు నవియు నేడు/మత్ప్రదాక్రాంతములు భవన్మహిమ జేసి
—నాయని సౌభద్రుని ప్రణయయాత్ర పుట 111

2 సందుపోయిన నా పూర్వజన్మతపము/పట్టుపట్టుపగలేని యుపాసనాధిదైవతమవీవు నీదు ప్రత్యక్షమునకు/గడియలెంచుచునుండు భక్తుడను నేను
—నాయని సౌభద్రుని ప్రణయయాత్ర పుట 63

3 ప్రకృతి దేవతయైన యవ్వాన్నెలాడి
ప్రణయదేవిగ భాటించి వలపుదేనె
లొలుకు నయనసుమముల కోమలపుజూపు
రేకు లుపహారములుగ నర్చించినాను
—నాయని , సౌభద్రుని ప్రణయయాత్ర పుట 37

పద్ధతికి పద్ధతిని నెలకొల్పుటచేత గిరికుమారుని ప్రేమగీతాలకు ప్రస్థానస్థితి వచ్చినది తాదృశమైన సాంకేతికత నవలంబించుటచేత మరియు నా సంకేతమును నిరాలంబనముగా చేయుటచేత భావకవిత్వమునందేర్పడిన ఒక విధమైన అయోమయస్థితినిగూడ గిరికుమారుని ప్రేమగీతాల రచయిత కొంతవరకు తొలగింపగలుగుటచేత దానికాస్థితి వచ్చినది [1] మరియు ఇంగ్లీషు రొమాంటిసిజమ్ వెనుక వెన్నుబలముగా జర్మను తత్త్వశాస్త్రవిజ్ఞానము పనిచేసినట్లే తెనుగు భావకవిత్వము వెనుక భారతీయ తత్త్వశాస్త్రవిజ్ఞానము, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, రవీంద్రనాథ, ఠాకూర్ అరవిందయోగి మొదలయిన మహానుభావుల ముఖములనుండి కొంతగా, ఇంకను ఆయా ప్రాంతములందలి పరమహంస పరివ్రాజక ముఖములనుండి కొంతగా, సర్వేపల్లి రాధాకృష్ణ పండితులవంటి విద్వాంసుల అధ్యాపకఫలముగా కొంతగా, మొత్తముమీద అంతయు అద్వైతముగా పరివ్యాప్తమైయుండి పని చేసినది రష్యను సింబాలిజము వెనుక మార్క్సీయ తత్త్వశాస్త్ర విచారధార యున్నది తెనుగు భావకవులలో విశ్వనాథవంటి తత్త్వజిజ్ఞాసాపరుడింకొకడులేడు గిరికుమారుని ప్రేమగీతాల కావ్యమందువల్ల ప్రస్థాన రచనయైనది

గిరికుమారుని ప్రేమగీతాలన్నీ గీత పద్యాలు ఒకే ఒక ఛందస్సులో మొత్తము కావ్యమును వ్రాయుట నవ్యకవులు సంపాదించిన నవ్యతలలో నొకటి ఈ విషయమున పద్ధతిగా శివశంకరస్వామివారి హృదయేశ్వరి కన్పించుచున్నది సౌభద్రుని ప్రణయ యాత్రలో గూడ పద్ధతి లేక అనేక ఛందస్సులు వాడబడి

1 The symbolist school of Russian Poetry has much in common with romanticism Regarding the visible forms only as symbols of higher realities it endeavours to penetrate "from the real to the more real" This often makes it obscure to the average reader Its difficulty is enhnced also by elaborate technique which was due Partly to western influences and partly to entirely new experiments with the Russian Prosody and language — Tanko Lavrini. Russian Literature P 66

నవి కృష్ణపక్షము ఊర్వశి కూడా అంతే మొత్తము మీద ఆ కాలమున నవ్య కవులందరును గీత పద్యమును తమకన్ని విధములను అనుకూలమైన ఛందముగా నున్నదని గ్రహించినట్లు కన్పించుచున్నది వేంకట పార్వతీశ్వర కవులు మంజరీ ద్విపదను మాలికగా ఏకాంత సేవయందుపయోగించిరి లిరికల్ ఎలిమెంటును మనస్సులో పెట్టుకొని గీతపద్య పదములో పూర్వపదమందుకు సంకేతముగా కూడ ఉన్నదని వారు భావించియున్నను భావించియుండవచ్చును ప్రాస నియమము లేకపోవుట, యతికి ప్రాసయతివేయుట కవకాశముండుట, రెండు రకాలలోనుండి మూడు సూర్యగణాలను, రెండు ఇంద్రగణాలను ఎన్నుకొన్నచో సులభముగా పాదిమైపోవునుండుట మొదలైన ఛందస్సునకు సంబంధించిన కట్టుబాట్లు స్వల్పముగా నుండుట కారణము కావచ్చును మరియు నా సూర్యేంద్రగణములు మూడు మాత్రలతోను నాలుగైదు మాత్రలతోనూ ఉండి గురు లఘువుల స్థాన నియమ మొకవిధముగా నుండకపోవుటచేత గీతపద్యము నడకలకు బహురూపతను కలిగింపగలుగుచున్నవి దేశీ ఛందముల కనుకూలములైన ఈ సూర్యేంద్రగణములందున్న అనులోమ విలోమ గతి విశేషములును[1] గీత పద్యముయొక్క సొగసు నడకలను కల్పించుచున్నవి త్ర్యస్ర - చతురస్ర - ఖంఢగతులను ఆ మూడు నాలుగైదుమాత్రల గణములే సంపాదించుచున్నవి అనగా ఈ ఛందోవైచిత్రి నవగాహన చేసికొన్న కవి ఆ గీతపద్యమునం దనంత సౌందర్య వైభవమును ప్రదర్శింపగలడు అందు కనువుగా నిర్మింపబడిన ప్రదర్శనశాల గిరికుమారుని ప్రేమగీతాలు

1928 ఏప్రిల్ 24 వ తేదీకి ముందు గీత పద్యాలనుగురించి శ్రీశ్రీ వెలిబుచ్చిన అభిప్రాయాల నీ సందర్భమున స్మరింపనేవలయును గిరికుమారుని ప్రేమగీతాల రచన ఈ సంవత్సరముతోనైపోయినది "పద్యములు ముఖ్యముగ గీతపద్యములవె యొసగు నింతింతకాని సంతసము నాకు, గీతములు వ్రాసి గిపెట్టి కేకలిడుచు, మరల మరల మంజులగాన ఝరులదేలి, నాట్యమాడుట మాత్రమే నాకొకపని ఒక యనిర్వచనీయ మహోన్నతమగు హాయియున్నది గీతపద్యములయందు, దరులొరసిపారు గాంగ నిర్ఝరిణి కరణి, చెంగు చెంగున గీతి తురంగలించు, ఆధునిక దివ్యఖండ కావ్యములయందు, ప్రాణసన్నిభమై గీతి

1 డా॥ గిడుగు వేంకట సీతాపతి తెలుగులో ఛందోరీతులు, పుట 242

పరుగులాడు, విస్తృతపనాంతరోదిగ్రపీధులందు గ్రేశ్వరుకు తేడివలె గీతి త్రుళ్ళు లాడు పద్యములు ముఖ్యముగ గీతపద్యములు, రచించి కీర్తించి పూజించి ఎంచరాని ఆ మహోన్నత గీత వితానములను సంతతము సంతసిలి విహరింతు నేను" 1 ఛందోదేవతయొక్క పరమ సుందరాకారమును భావకవులు గీతపద్యము నందు దర్శించి ఆ కాలమున తన్మయత్వమును భజించిరన్నదానికి శ్రీశ్రీయే నిదర్శనము తాదృశమైన వైశిష్ట్యమును గీతపద్యమునందు కల్పించుటకు విశ్వనాథ ప్రదర్శించిన ఛందశ్శిల్పమువల్లను ఈ భావకవితా ప్రస్థాన గ్రంథ మునకు గౌరవము పెంగినది

## VI

రాయప్రోలువారి ననుసరించి మడమలు త్రొక్కుచు నవ్య కవిత్వమును జ్వాలము చేసిన శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు[2] అది భావ కవిత్వముగా మరియు అభ్యుదయ కవిత్వముగా[3] ఆ తరువాతి కాలాన నిలువద్రొక్కికొనుటకు

---

1 శ్రీశ్రీ సాహిత్యం ఒకటి - పుట 42 (ప్రభవ గీతపద్యాలు) "విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి ఈ ఇద్దరిలో ఒక్కొక్కరు ఒక్కొక్కందుకు తన మదికెక్కి అంతటితో ఆగకుండా తనకు వరవడి పెట్టారు "

2 దువ్వూరి రామిరెడ్డి కవికోకిల గ్రంథావళి 4, పుట 181

3 'ప్రకృతింబొల్చు ప్రసన్నతా మహిమ సంభాషించె వేనోళ్ళ దైవిక నైర్మల్యము తూర్పు సన్నపవనావిర్భూతిఁదోతెంచుచున్న కళావైభవ మంత నెల్లయెడలం గాన్పించె మార్తాండుఁ డైహిక సౌందర్యము దివ్య సన్నిభము గావించెం బ్రభామూర్తియై"—జలాంజలి (1909) 1914 ఊహా గానము ఇతర కృతులు పు 11 ఐహిక సౌందర్యమును దివ్య సౌందర్య సన్నిభమును గావించుట కెన్నికొన్ని మార్గముల మలుపులను బట్టి ఒకటి భావ కవిత్వమును, ఆ తరువాతి రెండవది అభ్యుదయ కవిత్వమును అయినవి ఇహమును పరిపూర్ణ రామణీయకము కలదిగా కల్పించి చూపినది భావ కవిత్వము ఇహము నట్లు మార్చుకొనుటకు మనుష్యులకు ప్రేరణము నిచ్చినది అభ్యుదయ కవిత్వము

యథాశక్తిని దోహదము చేసినారని చెప్పవలయును ఆయన ప్రప్రథమముగా నవ్యకవి ఆయన ఊహాగానమునందలి అప్రాప్తమనోహరి తరువాతి తరము భావకవులకు మూలవిరాట్టనుటలో సామంజస్య మెక్కువగా కలదు [1] మరియు నిది ఒకవిధముగా రాయప్రోలువారి అమలిన శృంగార భూమిగాకూడ కన్పించు చున్నది [2] మరి ప్రేమకు దారిచూపుమనుట,[3] ఎటుచూచిన ఎవ్వరులేనిచోట మేను లానుకొనుట్లుగా కూర్చొనుట కభిలషించుట,[4] మనము మోహమున కలత నిద్దురలో మూర్ఛపోయినామనుట[5] ఇత్యాదులందుకు కొంత భిన్నముగా నున్నవి ఈ ప్రియభావములు జనాంతర సౌహృదము[6] లన్నప్పుడాంతర్యము మరొక ఉన్నత భూములకు నెక్కుచున్నది యథాశక్తి దోహదమనగా నది యిట్టిది

మరియు భావకవిత్వ మాతరువాత రవీంద్రుడు మొదలయిన మహనీయులు మేలుకొల్పిన జాతీయ సంస్కృతీ చైతన్యమును[7] పుక్కిలించుచు పాశ్చాత్య నాగరక ప్రభావము నుండి తప్పుకొనుటకు చూచినప్పుడు దానిని అదుకొన్న గౌరవము వేంకట పార్వతీశ్వర కవులను చుట్టుకొన్నది సుఖప్రదము కాని స్వేచ్ఛాభిమానముగా, దుఃఖమునకు విరుగుడని ప్రేమభావమును పెంచి,[8] ఊహాప్రేయసిని సృష్టించుకొనుటగా, అది ఆరని చిచ్చు- తీరని తృష్ణ యగుటగా,[9] ప్రేమవలనను శాంతిలేదని భక్తిభావముతో ఈశ్వరునియందు నిలుకడ

---

1 బూదరాజు రాధాకృష్ణ ఏల్చూరి సుబ్రహ్మణ్యం ఊహాగానము, ఇతర కృతులు పరిచయము— పుట 7

2 మధురమై నిరాకారమై మానవాను / రాగరేఖా కళంకభరమ్ము కాని ప్రణయభావనలెలుగెత్తి పాడలేక / పలుకలేక పూవులవోలె కళవళించు —పుట 68

3 నా ప్రేమకు దారిఁజూపగ వరించితి నాయలరించు నెచ్చెలీ— పుట 62.

4 కాపుపాట— పుట 60

5 ప్రణయవార్త— పుట 117

6 ఎన్నినాళ్లాయె— పుట 119

7 కాటూరి వెంకటేశ్వరరావు సాహిత్య దర్శనము, పుటలు 25-33

8 తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి కృష్ణపక్ష సింహావలోకనము, పుట 20

9 కృష్ణశాస్త్రిగారి రేడియో ప్రసంగము

పొందుటగా భావ కవిత్వము ఆత్మాశ్రయమై కృష్ణశాస్త్రిగారి యందు తిష్ఠ వేసినది

అప్రాప్త మనోహారియైన ఊహాప్రేయసిని కులపాలికయైన అర్ధాంగ లక్ష్మిని ప్రవేశపెట్టి గిరికుమారుని ప్రేమగీతాలు త్రోసిరాజన్నది దీనితో శృంగారముయొక్క మలినామలిన లక్షణ ప్రసక్తి తొలగిపోయినది వట్టి భక్తి భావమును దాటించి జాతీయమైన దార్శనిక సంస్కృతీ సంప్రదాయ మార్గమున ప్రకృతిపురుష సామరస్యోపాసన యోగముగా అర్ధనారీశ్వరముగా దివ్య మాన వతావతరణమును స్త్రీ పురుషుల సామరస్యము సాధించగలుగుటను ప్రదర్శించుట వల్ల తత్త్వజిజ్ఞాసాత్మకమై గిరికుమారుని ప్రేమగీతాలు ప్రస్థానగ్రంధి మర్యాదను పొందుచున్నది

ఈ సామరస్యమునందు విశ్వనాథ ఇహపరములకు అన్యోన్యమును సమ కూర్చినాడు ఆ విధముగా నా రెండింటికిని సంబంధించిన విశృంఖల భావముల నొక నియతికి లాగుటయైనది నిష్క్రియత్వమునకు హేతువుగా విశ్వాత్మ భావనారూపమైన పరమార్థమునుండి తప్పిపోయిన భారత జాతీయ జీవన విధా నమునయందు సుదూర భవిష్యత్తును చూడగల కర్మజ్ఞానజ్యోతిగా ఆయన ఈ భావకావ్యమును రచించినాడు

నామరూపాలను విస్పష్ట వర్ణరేఖలతో నిరూపించిన కథా పురుషులతోడి కావ్యరచనకు రాయప్రోలు సుబ్బారావుగారే భరతవాక్యము పాడినారని చెప్ప వచ్చును ఆయన తరువాతివారంతా నవ్యకవులుగాకంటె భావకవులుగా చెలా మణిలోనికి వచ్చుటకు నాయికానాయక నిరూపణములేని కావ్యములను రచించు టయే ప్రధాన కారణము కథా పురుషులులేకుండా కథ ఎలాగూ కుదురదుకనుక భావకవిత్వములో కథలేకుండా పోయినది భావాభివ్యక్తికైననూ ఒక ఆలంబన ముండవలయునుకదా అన్నప్పుడు కవియే అన్నిభావాలకూ తానే ఆలంబనమన్నట్లు ముందుకు వచ్చినాడు పాత్రలను అవిధముగా త్రోసిరాజని కవి అంతా నేనేనని

1 అబ్బూరి రామకృష్ణరావుగారి జలాంజలి, మల్లికాంబ, పూర్వప్రేమ ఇత్యాది కథతోడి కావ్యములున్నవి

ముందుకు వచ్చుటయే సంప్రదాయమునుంచి నవ్యకవిత్వముగా బయలుదేరినది వెంటనే భావకవిత్వమని పేరు మార్చుకొన్నంత పనిచేసినట్లనిపించుటకు హేతువైనది ఈ నవ్యభావకవిత్వము నాయికానాయకుల నాశ్రయించుకొని ఎట్లు లేదో అట్లే కవినికూడా ఆశ్రయించుకొనిలేదు కానీ కవి ఉత్తమ పురుషము నాశ్రయించుటచేత ఈ కవిత్వమంతా ఆయన సొంతగొడవ క్రింద అందరూకాకపోయినా కొందరైనా అనుకొనుట కవకాశము చిక్కినది ఈ కవిత్వమును అర్థము చేసికొనుటలో చిక్కుకూడా ఉన్నది

ఈ నవ్యకవిత్వమునందు కవిమహాశక్తిమంతుడు తన సర్వశక్తులనూ తన స్వాధీనములోనికి తెచ్చుకొని తన భావసామ్రాజ్యమునకు తానధిపతియైనాడు అసలు కవియైనవాడెప్పుడును ఇట్లేయుండును సంప్రదాయకవిత్వములో పరకాయ ప్రవేశ విద్యాచమత్కారమున్నది కవి అలా ప్రవేశించుటకు వీలుగా నాయికా నాయక నామరూపాలు సిద్ధము చేయబడవలసి వచ్చేది నవ్యకవి పరాకాయ ప్రవేశ విద్యా కౌశల్యమునట్లుంచుకొని విభక్తిపరిణామ విజ్ఞానముమీద ఆలోచించి అవతార పరిణామక్రమలక్షణమును ప్రకృష్టముగా ప్రయోగించి ఆధునిక కవిత్వమునందొక విలక్షణమైన నవ్యతను[1] దీప్తిమంతముచేసినాడు అందువల్ల మొత్తముమీద ఆధునిక కవిత్వమునకు ఆత్మార్థమునందు సుస్థితి అనివార్యముగా నేర్పడినది మనకు కవి ఆత్మార్థముగా కదా ఉండును? ఆత్మార్థభూతుడైన కవి ఉత్తమ పురుషాకృతిని ధరించి యుష్మదర్థకముచు అవసరమునుబట్టి నామ రూపముల ఎక్కనీయకుండా కావ్యరచనా వ్యవహారము చేయుటచేత ఈ నవ్య కవిత్వమంతయు ఆత్మాశ్రయి కవిత్వమన్న పేరునుకూడా పెట్టుకొన్నది

---

1 దీనినే పింగళి లక్ష్మీకాంతంగారు భావకవిత్వమున రెండవ దశ యనిరి "ఇతర ప్రాణివేదనను తనదిగా భావించి వానితో తాదాత్మ్యముపొంది వానిపలుకులే తాను పలుకుటలో భావనయనెడి ఇంకొక ప్రజ్ఞావిశేషము ప్రవర్తిల్లును ఇది భావ కవిత్వమునకు రెండవ దశ " సాహిత్య శిల్ప సమీక్ష పుట 196 ప్రథమదశ అది కవిత్వమునకు ప్రారంభ దశ అని చెప్పుటచేత ఈదృశమైన నవ్యత వల్లనే భావ కవిత్వము భావ కవిత్వమైన దని అంతర్యము

అనగా నవ్య కవిత్వము రెండంతస్థులుగా కొనసాగుచున్నది కవికి ఒక ఉపాధిలో జీవితమున్నది దాని కష్టసుఖములు దానికున్నవి అచ్చమవియే భావ కవిత్వమునకు విషయములు కావు కాకపోయినను అవియున్నవి అవి లేకుండా కవియన్నవాడుండడు వాచ్యార్థములేకుండా ప్రతీయనామారఘుండుటకు వీలులేదు అయితే వాచ్యార్థము ప్రధానముకాదు కవియొక్క ఉపాధితోడి కష్టసుఖములు కావ్యమునకు ప్రధానము కావు కవిత్వమవగతమగుట యనగా నిక్కదేకావలయును ఏది వ్యవహారమో, ఏది పరమార్థమో తెలియవలయును విద్యలన్నియు నిందుకే ఏర్పడినవి కవిత్వముకూడా ఇందుకే ఏర్పడినది మరియు కవిత్వము ఉత్తమవిద్యయగుటచేత అవగాహనకు అక్కడ ఎక్కువ జాగ్రత్త కావలయును అందువలన భావ కవిత్వమునందు వాచ్యార్థముగా కన్పించెడు కవి జీవిత కష్టసుఖముల వెంట అదేపనిగా పడరాదు తమకు తెలిసీతెలియకుండా మానవు లభిలషించుచున్న చెప్పుకొనుటకు చేతకాక తికమకపడుచున్న, దుర్భరములయ్యును భరింపబడుచున్న-ఇచ్ఛలనూ, సుఖదుఃఖాలనూ, వేదనలనూ కవి తాను తనను వ్యక్తముచేసికొనుటను నెపముగా విశ్వమానవుల బాహ్యాభ్యంతర జీవిత తత్వమును ప్రదర్శించుచున్నాడు అందువలన అది కవిత్వమగుచున్నది తత్వస్వరూపమెప్పుడును అమృతానందమయము తత్వజిజ్ఞాస ఒక్క ఉపాధిని పట్టుకొనియుండదు కావ్యమునందు కవిని వెదుకరాదు అవతార పరిణామలక్షణ క్రమము అర్థముకాక కవిని వెదుకుచున్నాము ఈ ప్రమాదము భావ కవిత్వమునందుకంటె అతరువాత వచ్చిన అభ్యుదయ విప్లవ దిగంబర మానవతావాద కవిత్వములయం దెక్కువగా చున్నది అనగా కవుల పరిణతి అందట్లున్నదనియు యర్థము

సర్వతంత్ర స్వతంత్రులయిన ఋషులవంటి కవులెప్పుడును తమ జాతి జనుల యొక్క అచంచలమైన విశ్వాసార్థములమీద భావించి కావ్యసౌధాలు నిర్మించెదరు ఈదృశ్యమైన కావ్య నిర్మాణమునకు వారిని ప్రేరేపించిన కవితావేశమునే తిక్కనగారు భవ్యకవితావేశమని చెప్పినది ఈ జాతి ఎప్పటినుండి యున్నదో? అప్పటినుండియు దీని విశ్వాసములెట్టివి? ఇది పెంపొందించిపెట్టిన విజ్ఞానము స్వరూపమెట్టిది? విజ్ఞానవ్యాప్తి సాధనభూతములయిన విద్యలు శాస్త్రములు-కళలు - ఈ యన్నింటియొక్క అభివృద్ధి లక్షణ మెట్టిది? ఈదృశ్యమైన స్మృతి జ్ఞానము కవికి కలుగవలయును తన జాతి జనులకు తాను ప్రతినిధిగా

నిలవదలచిన కవి తనకు మునుముందా స్మృతి జ్ఞాన మున్నదని నిర్ధారణ చేసి కొనవలయును కావ్యసృష్టికి కారణభూతమైన ద్రవ్యము ఏతాదృశమైన స్మృతి జ్ఞానము స్మృతులన్నియును అభిప్రేతార్థరూపములు, కవిత్వమభిప్రేతార్థములతో నున్నచో అది భవ్యకవిత్వము దానిని రచించుటకు వ్యాసాది ఋషులవంటి కవులకుమాత్రమే సాధ్యము వేదములు వేదాంగములు వేదాంతములు - ఇవి భారతజాతీయులకు అచంచల విశ్వాసార్థములైన విద్యాస్థానములు విద్యాస్థానములన్నియును జ్ఞానసాధనములు జ్ఞానసాధనములే దర్శనములు దార్శనిక విజ్ఞానము యొక్క మట్టము పెరుగుదలన బట్టి కవులు ఋషులవంటివారి స్థాయికి పెరుగుట యుండును ఆధునిక కాలమున అనగా ఈ శతాబ్దారంభమున భవ్య కవితావేశమును పొందిన మొదటి తెనుగుమనిషి రాయప్రోలు సుబ్బారావుగారు ఆయన సంకల్ప సృష్టినుండి బయలుదేరిన నవ్యకవిత్వము భావకవిత్వముగా పరిణమించుచున్నదానిని భవ్యకవితామయము చేసి నిలబెట్టిన దార్శనిక విజ్ఞాన తత్త్వజ్ఞుడు విశ్వనాథ గిరికుమారుని ప్రేమగీతాలకు ముందువెనుకల యందింత యున్నది మరియు నొకింత కలదు

సాంఖ్యదర్శనమునందు ప్రకృతి పురుషులు కలరు అక్కడ ఇద్దరును పరిపూర్ణులుకారు ప్రకృతి పురుషయోగమునందు మాత్రమే పరిపూర్ణత కలదు ఆ విధముగా సాంఖ్యము పూర్ణదర్శనము యోగములేని ప్రకృతి పురుషులు నష్టాశ్వదగ్ధరథులకువలె కదలికలేక పడియుందురు పంగ్వంధులకువలె పడి యుందురు ఇట్లుగా చూపించి ప్రకృతి పురుషయోగమును గమ్యప్రాప్తికి అనివార్యముగా సాంఖ్యదర్శనము నిరూపించినది జగదుత్పత్తికితద్యోగమే హేతువు

లోకమునందు స్త్రీ పురుష సంబంధమును ప్రకృతి పురుషసంబంధ విజ్ఞానమునకు మార్గముగా భావించిన లక్షణము భారతీయులయందు అనాదిగా కలదు [1]

---

1 The Indian idial of the relation between man and woman has always been governed by the symbolism of the relation between the Purusha aue Prakriti (in the Veda NR and GNA) the male and female divine principles in the universe

—M P Pandit Kev to Vedic Symbolism P 42

గుణమంతయు ప్రకృతిది పురుషార్థమది ప్రవర్తించును పురుషుని బంధమోక్షములకు ప్రకృతియే కారణము ప్రకృతికి బంధమోక్షములు లేవు శాక్తచరిత్ర మిక్కడ నుండియే బయలుదేరియుండవచ్చును ప్రకృతి పురుషునియందు జ్ఞానముగానూ, అజ్ఞానముగానూ పని చేయగలదు తత్త్వాభ్యాస మున్నప్పుడు జ్ఞానముగానూ లేనిచో అజ్ఞానముగానూ ఉండి పురుషునకు మోక్షమును బంధమును ప్రకృతి ప్రసాదించుచున్నది సగుణమును నిర్గుణమును అయిన భార్యాభర్తృ సంబంధమనగా అది భోగమోక్షవిషయకేంద్రము ఇహమునుండి పరమునకు పరమసుందరానందధామమునకు ఆ కేంద్రమునుండి బయలుదేరవలయును ఈదృశ్యమైన పరమార్థతత్త్వము రెండు మూడు వందల సంవత్సరములుగా ఆంధ్రభాషాసాహిత్యమునందు పూర్తిగా నష్టమైపోయినది [1] నిగ్రహశక్తులను కోల్పోయిన దుర్బలులవలన సూర్యునకు భగవంతుడుపదేశించిన కర్మజ్ఞాన రూప మహాయోగ సంప్రదాయము విచ్ఛిన్నమైపోయినదికదా ! పోయినది కానీ పోయినదా? ఆంధ్ర భాషాసాహిత్యము నందావిధముగా నవ్య కవిత్వము భవ్యకవితామయముచేసి ప్రదర్శింపబడినది

ప్రకృతి పురుషయోగమును వేదాంతము పరబ్రహ్మమని చెప్పుచున్నది అది స్త్రీకాదు, పురుషుడునుకాదు అనగా అరూపము రూపమున్నది శరీరమునకు తాను ప్రవేశించిన శరీర ధర్మమునుబట్టి పరబ్రహ్మము స్త్రీత్వపుంస్త్వములతో వ్యవహార యోగ్యముగా నుండును శరీరము జడము పరబ్రహ్మము చైతన్యము జడమునకు చైతన్యము కేంద్రస్థానముగా నుండును ఆ విధముగా నవి అవినాభావ సంబంధము కలవి ఆ రూపము లింగరూపమును దాటి నామరూపములలో దిగిన తొలిదశయందది అర్ధనారీశ్వరము [2] లోకమునందలి భార్యాభర్తృ సంబంధమునకది గమ్యము భోగమును మోక్షమున కుపకారముగా నిరూపణము చేసిన శాక్త తంత్రమంతయు అర్ధనారీశ్వరమయము

---

1 దువ్వూరి రామిరెడ్డి కవికోకిల గ్రంథావళి_ 2, పుట 8_9

2 గిరికుమారుని ప్రేమగీతాలు_ 38
అర్ధనారీశ్వరమును దర్శించిన తొలిఋషి కశ్యపుడు పశ్యకుడే కశ్యపుడైనాడని తెలిసినవారందరు.

ఇట్లు శాక్తసాంఖ్య తత్వదర్శన విజ్ఞానమును ఇహపరసాధనముగా తనకు విషయమును చేసికొని అద్వైతాత్మకముగా[1] భావకవిత్వము గిరికుమారుని ప్రేమ గీతాలయందు ప్రస్థానలక్షణము కలిగియున్నది

భావకవిత్వమున కథలేకుండాపోయిన మాట నిజమే అందుకు నిదర్శనముగా గిరికుమారుని ప్రేమగీతాలయందొక అంతర్వాహినిగానున్న కథా గతి యున్నది కథా పురుషుడు సాధువయిన యువకుడు, శ్రోత్రియుడు, సదాచార శీలుడు మరియు అకామహతుడు మానుషానందమునుండి హిరణ్య గర్భానందమువరకు ననుభవింపగలవాడు ఆదిత్యమండలాంతర్వర్తియైన పురుషుడే ఈ కథా పురుషునియం దనుప్రవేశముచేసి యున్నాడు మనుష్యుడుగానున్న కథా పురుషుడు సగుణ చైతన్యము నాశ్రయించుకొని ఉపాసన చేయుటచేత హిరణ్యగర్భ లక్షణమువరకు పరిశీలించుట నిందు చూడవచ్చును హిరణ్య గర్భానందము పరబ్రహ్మానంద సముద్రమునందు బిందురూపమని చెప్ప వలయును ఇదియే బ్రహ్మానంద సహోదరమైన కావ్యానందము ఆనందమునకు ఆనందికిని అభేదము [2] ఆనందియైన పురుషుడు మనుష్యునినుండి హిరణ్యగర్భుని వరకు ఎగయుటలను ఈ కావ్యము ప్రదర్శించుచున్నది

కథా పురుషునకు చిన్నప్పుడే తల్లి దండ్రులొక పిల్లను చూచి పెండ్లి చేసినారు ఆ దంపతులకు ప్రేమభావలతలు పరస్పరాభిముఖముగా కొనలు సాగినవి కాని, అన్యోన్యముగా పెనవేసికొనకుండ (సంసార పరిస్థితులవల్ల) సన్నిధి వియోగ మేర్పడినది శ్రోత్రియత్వ లక్షణముచేతను, అకామహతత్వ లక్షణముచేతను పురుషుడామెను తనకు భావనా విషయము చేసికొన్నాడు అట్లొక కొంతకాలము జరిగినమీదట వియోగహేతువులు మాయమై సామరస్య

---

1 సాంఖ్యముచెప్పు పురుషజీవస్వభావము అద్వైత వేదాంతము ప్రకటించిన జీవాత్మ పరమాత్మ స్వభావముతో సాదృశ్యము కలిగియున్నది—
శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ భారతీయ తత్త్వశాస్త్రము (బులను)— 4, పుట 68

2 ఈ యర్థమును తైత్తిరీయోపనిషత్తు అష్టమానువాకమునుబట్టి లోతుగా విచారించుకొనవలయును

మేర్పడినది ఆమె వానికి అనన్యముగానైనది అయినను మరల వియోగ గీతికలు కొనసాగుచున్నవి ఆ గీతికార్థములకు ముగ్ధహృదయులు వెదకెదరు [1] ప్రకృతియైన ఉత్పత్తి మాతృక తన ప్రసవధర్మమును ప్రకాశింపజేసినది "ఎదురుగాతోచి నాకు నందిచ్చినావు చిన్ని శిశువునుబలె తీర్థసేవఫలము" (46) ప్రజాయైగృహమేధినావన్నది సార్థకతను పొందగా అవ్యయి పదస్ఫూర్తి యేర్పడినది అందుకు తగిన కర్మిష్ఠతకు తిరిగినాడు జిజ్ఞాస చనినాడు భార్యా సహితుడు శివభార్యాపదము లాశ్రయించినాడు కానీ సంస్కృతి ఫలావాప్తికామె కాలిసంకెలయన్న బుద్ధి లక్షణముపోలేదు పోయినప్పుడు అభయాత్మకత తోచుచున్నది శివశక్తులతోడి తాదాత్మ్యస్ఫురణ అనుభవమునకగుచున్నది భార్యవైపు చూడగా నామె శ్రీ శారదామూర్తి తనవైపు చూచుకొనగా తాను విధాతృమూర్తి. సగుణములయిన ప్రకృతిశక్తులను కావ్యరూపముగా కరుగబోసి కళాపురుషుడు కవియైనాడు కవికి భార్యాభర్తృభావ తాత్పర్యము స్వానుభవమునకైనది వివాహమున కగ్ని సాక్షికమెందుకో తెలిసినది కర్మలక్షణజ్ఞాన మొదవినది ప్రేమ భావసోపనిషత్తుగా సంసారమును చేసినమీదట స్త్రీ పురుషులు నిత్యవస్తువైన బిందుభిన్న పరబ్రహ్మాత్మకత్వమును పొందుట కన్పించినది ఈ తను దాంపత్య జీవితములోని ప్రేమ బలముచేత భవిష్యత్ప్రజా సుకుమారహృదయ ప్రణయ జీవిత చరిత్రములు పరిపాలింపబడుటకు ఫలశ్రుతిగా కవి ప్రకటించినాడు [2] ఇది భావ కవిత్వముయొక్క సామాజిక ప్రయోజనము

ఇందెంత సేపటికిని పురుషవాచకమే విన్పించునుగాని, ప్రకృతివాచకము విన్పించదు ఆమె కులపాలిక మరియును ముగ్ధహృదయ, కులమనగా సదాచార విషయము గానీ, వంశమని యర్థముకాదు సదాచార సంప్రదాయ రహస్యములను ప్రకృతి స్వరూపిణియైన స్త్రీ తన ననుసరించెడు పురుషునకు ప్రకటించును ఆ రహస్యములు ఆమె యధికారములోనివి ఆమెయే సదాచారము మరియు కులమనగా పాతివ్రత్యాది గుణశీలములు వానికి తాను ప్రభ్వి [3] అందువలన

---

1 గిరికుమారుని ప్రేమగీతాలు– 41

2 గిరికుమారుని ప్రేమగీతాలు– 94

3 శ్రీ లలితా పరమేశ్వరికి సదాశివ పతివ్రత యని పేరు లస నా

ఆమెను గుప్తముగా సమీపించి సేవింపవలయును ఈ ప్రణయ భావకావ్యము న ఆమె కులవధువు గనుక శాంభవీ విద్యకునువలె పరమగుప్త ఆమె దేవత ఆ విధముగా నామె సమాజమునందు సర్వత్ర పూజింపబడుటను కవి ప్రదర్శించి నాడు దేవతలు మాట్లాడరు అనుగ్రహింతురు కులపాలికలు శ్రోత్రియత్వమును అకామహతత్వములు పురుషులయందు ప్రజ్వలింపింతురు గృహమునందు భార్య పురుషునకు ప్రత్యక్షదేవత ఆమె ఉపాస్య కులమనగా గృహమనికూడా గృహ పాలికను కలవాడు గృహము కలవాడు గృహస్థు ప్రాణముచేతను,మనస్సుచేతను, చక్షుస్సుచేతను, శ్రోత్రముచేతను- అవి పరబ్రహ్మము యొక్క చతుర్థ పాదకళా చతుష్టయముగా నెరిగి షోడశకళాబ్రహ్మరూపిణి నుపాసించినచో ఆయతనవాణ భవతి అట్టివానిని పరమేశ్వరి పతివ్రతలచేత జన్మజన్మములమీద ముక్తిత్రోవలలో నడిపించును ఈ విధముగా కులపాలికాశబ్దమును ప్రయోగించి కుళరూపిణీ కుల సంకేత పాలినీ కులాంగనా[1] మొదలుగాగల శ్రీ లలితా పరమేశ్వరీ నామ సంకేత ములను స్మరింపజేయుచు పతివ్రతమును పురుషునకుపాదేయముగా ప్రబోధించు చున్నది కావ్యము, ఈదృశముగా భార్యాభర్తృ ప్రణయభావమును ఆత్మలాభ ప్రాప్తికి ఏకైక మార్గముగా ప్రతిపాదించినందున గిరికుమారుని ప్రేమగీతాలు భావ కవితా ప్రస్థాన గ్రంథమైనది *

1 శ్రీ లలితా సహస్రనామ భాష్యము నామ సంఖ్య 397 91-92 మరియు 90, 93, 95, 440, 441 నామ భాష్యములను కూడా చూడవచ్చును

# విశ్వనాథ శారదాహృదయము

మానవతా లక్షణమున కాఘాతము కలిగించెడి దంతయు పీడ అది చమత్కారముగా నుండుటచేత మానవులు దానియందలి పీడా లక్షణమును చూడలేరు చూచుటకు దివ్యచక్షువులు కావలయును కవులయందు రచయితల యందును ఆ దివ్యత్వమున్నది అందువల్లనే వారు సాంఘికమైన పీడనమును చక్కగా దర్శించగలరు అందలి చమత్కారమును పట్టుకొనగలరు దేనివలన ప్రజలు దానియందు రమించుచున్నారో దానివలననే కవులు, రచయితలు అది రమణము కాదన్న ప్రబోధమును చేయుదురు చేయవలయును చేయివలసినది చేయుటకు వారికేమి పట్టినదనగా - అది కవితాలోభము అది చిత్తమును బహు విధముల లోబరచుకొని తన పని తాను చేయించుకొనును

ఆంగ్లేయులు మనలను బానిసలుగా చేసి పరిపాలించుట మొదలుపెట్టి వారి విద్యా విధానమును మనకు ప్రవర్తింపజేసిన తరువాత ఈ దేశమున కేమి గతి పట్టినదనగా - వాగను శాసనుంతటి విద్వాంసులును, మహా కవులును అయినవారికి నీళ్ళు పుట్టకుండ పోయినవి దేశీయమైన భాషా సాహిత్యము లడుగు బట్టినవి విద్వత్కవుల విద్యా వైదుష్యములు పాలకులకు అక్కరలేక పోయినవి సంస్కృత మనలక్కరలేదు అది ఈ భారత ఉపఖండమునందు సమైక్యమును కాపాడిన భాష అది కొనసాగినచో విడదీసి పాలించు లక్షణముకల విదేశీయులకు కలసిరాదు మనము మనముగా నున్నచో వారి కిబ్బంది అందువలన మనము మన భాషా సాహిత్యములకు దూరమై, మన సంస్కృతీ సంప్రదాయములకు మరియు దూరమై, మనమెవరమో మనకు తెలియని స్థితి మనకేర్పడవలయునని ఆంగ్లేయులట్లు చేసిరి వాగను శాసనులంతటి విద్వాంసులు ఆంగ్లేయుల విద్యావిధానములో తెలుగు పండితులుగా మార్పు చెందినారు

---

జాగృతి, 30-4-1973

ముప్పది రూపాయల కాశపడి అట్లు మార్పు చెందవలసి వచ్చినది దానితో జాతీయమైన విద్వత్తు పోయినది ఇక అంగ్లేయులు చెప్పవలయును మనము నేర్చుకొనవలయును అ పరిస్థితి ఏర్పడినది

విశ్వవిద్యాలయాలలో ఆచార్య పీఠాల నలంకరించిన విద్వాంసులలో ఎవరికినీ శ్రీ విశ్వనాథ తీసిపోడు ఆ మాటకు వచ్చినచో అందు కన్ని విధముల యోగ్యత గలవాడాయన ఆ విషయ మాయనకు తెలియును కాని, అది అయనకు కలసిరాలేదు అసలాయనకు పదవి ఎందుకు? ఎందుకనగా, ఉన్నత విద్యాసిద్ధిని పొందుటను కోరివచ్చిన యువజనమునకు జాతీయతను మనస్సునకు పట్టించుటకు కావలసిన సంప్రదాయ విజ్ఞానమును త్రవ్విపోయుటకు మన భాషా సాహిత్యములు మనకు నిలిబెట్టిపోయిన మన పూర్వుల మహోన్నతాదర్శములు, వారు చేసిపోయిన పనితనములు యువతరమునకు నిరూపించుటకును కాని, అది ఆయనకు కలగానే మిగిలిపోయినది అని తనకు అట్టిని మాత్రమే అని అయనకు తెలియును

నన్నయగారికి ఆద్యంతములుగా సృష్టి రహస్యములు తెలియును అందు వల్లనే అయన మహాకవి ఆయన విశ్వనాథకును ఆ రహస్యములు ప్రత్యక్ష ముగా చూపించి ప్రబోధించినాడు ఈయనకే ఎందుకు చెప్పవలయును? తనంతటివాడు కనుక ఈయనకు తెలిసినచో అది పదిమందికి తెలియును గనుక అనగా, లోకజ్ఞత్వము నన్నయగారి కెంత కలదో విశ్వనాథకును అంత కలదు మరియు నంతకుమించి కలదు ఈ మించుట కాలముయొక్క నిడివి మీద వచ్చిన బహువిధములుగా నడచిన చారిత్రకమైన గతి విశేషముల వలన అనుభవముఖముగా పండిన ఘన విజ్ఞానము వలన ఈ వసతి ఆయనకు లేదు ఆయన లోకజ్ఞత్వమే లోకజ్ఞత్వము ఈ పరమార్థము గ్రహింపకపోవుట మూర్ఖము

భాష—అది పిచ్చైనను నరే చక్కగా వానికది యొక రీవిని తెచ్చిపెట్టును అందును దేశములు వ్యాపించి ప్రపంచమునకు విజ్ఞానద్వారమై రాజకీయ బలము కలిగిన భాష సంగతి చెప్పవలయునా? ఇంగ్లీషు వచ్చినవాడు సర్వజ్ఞుడు విషయము తెలియుట వేరు ఒక భాష ధారాళముగా మాట్లాడగలుగుట వేరు

ఇంగ్లీషునట్లు మాట్లాడినచో వానికన్నియు తెలిసినట్లే మనకు తెలియవలయునని వాడనుకొనును నిజముగావాడ మనమట్లే అనుకొందుము అది అంత గొప్ప భాష అయికూర్చున్నది గనుకనే అందరును దానినే నేర్తురు ఇంత నేర్చినట్లని పించినప్పటినుండియు కన్నులలో ఒక గర్వరేఖ మెలికలు తిరిగిపోవుటకు మొదలుపెట్టును అది అసలంత గొప్పభాష ఎట్లయినది? తద్భాషా భాషీయుల వలన అయినది వారు దేశములను జయించిరి యుద్ధములు చేసిరి వ్యాపారము చేసిరి, డబ్బు సంపాదించిరి రాజ్యము లేలిరి రాయబారములు నడిపిరి ప్రపంచమును తల్లక్రిందులు చేసి వదలిరి అందువలన ఆ భాష అంత గొప్పదైనది భారతీయులందరును ఒక మాటమీద వ్యవహరించరు అందువలన మన మిట్లైతిమి మన భాషా సాహిత్య విజ్ఞానము లిట్లైనవి మనవి మనకు కాకుండ పోయినవన్న దిగులు మనకు లేదు ఇంగ్లీషు వచ్చినందుకు గర్వము పోవుచున్నాము మనదిఇంగ్లీషు బోర్డులమీది పేర్లు చదువగలిగిన పాటి ఇంగ్లీషు దానికే యింత గర్వము ఆంగ్ల భాషా దరిద్రులని మనము మన పూర్వ మహాకవులను మూర్ఖులని నవ్వుచున్నాము ఇదీ పరిస్థితి అది అసలు నవ్వుకాదు అందుకు మూలమానందము కాదు మొదలందు రమణములేదు అది వట్టి పొడి నవ్వు పొడిదగ్గువంటిది

ఈ సృష్టి కోతుల నుండి పరిణమించినది మనుష్య సృష్టి అక్కడ నుండియే మొదలైనది

మనిషిని మనిషి జంతువుగా మార్చుటకు ప్రయత్నము చేయరాదు ఈ మహాఘోరము అమెరికాలో హద్దు పద్దులు లేకుండ సాగిపోవుచున్నది అమెరికను లెట్లొక జాతి జనులో నీగ్రోలును అట్లే ఒక జాతి జనులు వారి నాగరకతయే నాగరకత కాదు ప్రపంచమున యందనేక జాతులున్నవి అనేక నాగరకతలున్నవి అధికారము, డబ్బు, తెలివితేటలు ఉన్నవిగదా అని అవి లేనివారిని దోచుకొనుట నాగరకుల లక్షణము కాదు కాకపోయినను అవునని అమెరికను లన్నట్లు చేయుచున్నారు మనుష్యులను జంతువులుగా ప్రదర్శించుచున్నారు తమను మనుష్యులుగా బ్రతుకనీయని ధనాధికార మదాంధుల మీద వారి కోపమెప్పటికిని చల్లారదు ఇది కాలముమీద సమసిపోవుననుకొనుటకంటె మూర్ఖము సృష్టిలో లేదు అట్లనుకొన్నవానినే కాలము మరి లేవకుండ అణగ గొట్టును

తమను జంతువులుగా ప్రదర్శించినవారిమీదనే కాదు, తమను జంతువులని చూడ వచ్చినవారిమీదకూడ వారికి కోపమే అసలు మనుష్యులను జంతువులని ఎవరు చూడరాదు మానవతకు సర్వమానవులును సమానము

బానిసలైనవారు మూర్ఖులును అగుదురు వారు తమనట్లు చేసినవారి వేష భాషలయందు మోజును పెంచుకొందురు ఆవిధముగా బానిసలు యజమానుల ననుకరింతురు వారియందు స్వస్థాన వేషభాషాభిమానము లుండవు తమ వేష ములు వేయించి, తమ భాషను మాట్లాడించి, తమయందు బానిసల కభిమానము పెరుగునట్లు యజమానులు కృషి చేయుదురు

ఆంగ్లేయుల పరిపాలనములో భారతదేశము బంధింపబడిపోయినది ఈ దేశములో జనమెట్లైపోయినారనగా ఆంగ్లేయుల పరిపాలనమే బాగున్నది, ఇది ఇట్లే ఉండవలయును అనునట్లైపోయినారు మరియు జైలులో వేళకు తింగితిచుట కంటె మరొక చేయదగిన పని సమాజ జీవితములో లేదనుకొను మూర్ఖులైన ఖైదీవలె అయిపోయినారు స్వాతంత్రము కావలయునన్నవారికంటె ఈ ప్రభుత్వమే స్థిరముగా నుండవలయునన్న మూర్ఖప్రజయెక్కువగానున్నది రైలు, కారు, విమానము— ఇవన్నీ ఇంగ్లీషువాని దయాభిక్షయే మనకు సర్వరక్షాకవచ మని వారనుకొందురు

మరియు ఆంగ్లేయ పరిపాలన ఏమి చెసినదనగా - భారతీయులయందున్న జాతీయలక్షణములను మంటగలిపి వేర్పాటు ధోరణులను పెంచినది ఒకరి మీద కొకరిని ఎగసన్రతోసినది ఒకరి మీద ఒకరి కధికార మిచ్చినది అందువలన భారతీయులందరును పరస్పరము శత్రుత్వమునే భజించిరి వీరట్లు కొట్లాడు కొనుట వారికుపయోగము అధికార వాంఛలను భారతీయులయందు రెచ్చగొట్టి వారన్యోన్యము కలహించుకొనునట్లు చేసి, ఆ విధముగా అందరిని వారు అదుపులో పెట్టుకొన్నారు

భారతీయులలో ఆంధ్ర లోకభాగము ఆంగ్లేయు లాంధ్రులను గుర్తించ లేదు మద్రాసీలని క్రొత్త పేరు పెట్టి, అందులో వేరువేరు తెగలకు చెందినవారిని చేర్చి, వారివారి అస్తిత్వములను రూపుమాపవలయునని గట్టి ప్రయత్నము చెసిరి

ఆంధ్రులనెట్లో ఆంధ్ర భాషనట్లే పైకి రాకుండ చేసిరి మరియు నది అడవి భాష యని ప్రచారము చేసిరి అసలు భారతీయు లెవరన్నను ఆంగ్లేయులకు మంచి యభిప్రాయము లేదు బానిసల మీద యజమానులకెప్పుడును మంచి యభిప్రాయ ముండదు ఆంధ్రులకు పౌరుషము లేదని, ఏమిచేసినా పడియుండగల ఓర్పు మాత్రమే కలదని - ఈ విధముగా ఆంగ్లేయులు మనదేశస్థులను గురించి, అందును ముఖ్యముగా ఆంధ్రులను గురించి భావించినారు ఈ విధముగా విదేశీయులచేత ఛీ ఛీ యనిపించుకొనుచు జాతీయత సమస్తము జీవనాడులయందు చచ్చిపోయిన భారతీయులు బ్రతికి ఏమి? ఆంధ్రులు బ్రతికి ఏమి? ఇది ఏమి లోకము? జీవనాడులయందు జాతీయతలు పొంగిపొరలెడు ఆంధ్రభాషా మహాకవులకు మేల్కొల్పులు పాడెడివారిని జీవచైతన్యమును రంగరించి పోసెడివారిని నన్నయాదులను చూచి ఈ లోకము నవ్వుచున్నది నన్నయాదులకోవ నిగపువ్వు తాను తనను చూచియు నవ్వుచున్నది అయ్యో అజ్ఞానమా! నీవు తొలగిపొమ్ము

ఈ యజ్ఞానము తొలగి, ఈ పిడపోయి, జ్ఞానపీరము వెలుగులు భారతము నిండవలె ఈ వెలుగులు నిజముకావలె ఆ దివ్యచక్షువులకా వెలుగులు కనిపించుచున్నవి అవే ఆంధ్రదేశ భాషాసాహిత్యములకు శ్రీరామరక్ష *

# భ్రమరవాసిని

## మత - తాత్త్విక - మనోవైజ్ఞానిక నవల

[ఇది ఒక పరిశోధన కీలకపత్రము అందువల్ల భ్రమరవాసిని మీద విమర్శనము కాదు విమర్శించుట కిందిన్ని ముఖములున్నవని చూపుట ఇది భ్రమరవాసిని మత తతాత్త్విక మనోవైజ్ఞానిక విషయ విశ్లేషణాత్మకమైన చారిత్రక నవల కనుక అన్ని కోణముల నుండియు విమర్శింపదగినది పరిశోధకుడు లోతులకు దిగి కోణముల నుండి విమర్శించుకొనుచు సమన్వయ ప్రకాశము కనుగొనుటకిది కరదీపికా సదృశము

పరిశోధనములకు విషయములను నిర్దేశించుటకు ముందుగా నిర్దేశకులాయా విషయముల లోతుపాతుల నెఱిగి ఇది ఇట్లని ప్రతిపాదించినచో పరిశోధక విద్యార్థులకు యదభిముఖముగా తాము పురోగమించవలెనో తెలిసియుండును అట్లు తెలియజేయుట నిర్దేశకుల కర్తవ్యము కర్తవ్యమును నిర్వహింపనిచో పరిశోధనము గ్రుడ్డెద్దు చేనులో బడిపోవుటగా నుండును దానిని నివారించుటతోపాటు పంశోధక విద్యార్థులకు మార్గదర్శకముగా నుండుట నభిలషించి అందుకొక ప్రయోగముగా ఈ కీలకపత్రము సిద్ధము చేయబడినది ముందు ముందింత కంటెను సిద్ధష్టములయిన పంశోధన కీలకపత్రములను వ్రాసీ విశ్వవిద్యాలయములలోని అధ్యాపకులు తెలుగుభాషా సాహిత్యములలో పనిచేయవచ్చెడు పరిశోధక విద్యార్థులకు చక్కని చేయూతనిచ్చి ముందుకు నడిపించుట కిది ప్రేరణము కావలయునని అభిలాష ]

---

విమర్శిని, జనవరి 1978

VV 12

I

ఈ సమస్యలకు పరిష్కార మెప్పుడని రణాదిత్యుడు రణరంభను 81 వ పుటలో అడిగినాడు నీకి సమస్యాపరిష్కారములు నేను చేసి పెట్టవలయునన్నచో కాశ్మీరములకు పోవలయును, అప్పుడు నీకు తెలియజేయుదునని ఆమె 84 వ పుటలో సమాధానము చెప్పినది అది అక్కడ ఎందుకు చేయవలయును? ఇక్కడ నెందుకు చెయరాదు? చేయదలచినచో నిక్కడనే చేయవచ్చునని ఆయన తనలో తానుగా 102 వ పుటలో నిశ్చయముగా ననుకొనెను రేపు మనము కాశ్మీరములకు పోవుచున్నాము, నీ సమస్యల నన్నింటి నచ్చట పరిష్కరింతును, ఓపిక పట్టుమని యామె తనంతట తానుగా 106 వ పుటలో చెప్పినది

కాశ్మీరములకు చేరినప్పటి నుండి రణాదిత్యునకు స్వప్నములు 194 వ పుట నుండి మొదలయినవి 307 వ పుటలో ఆయన తనలో తానిట్లనుకొన్నాడు ఈ కథా స్వప్నము తత్సమస్యా పరిష్కారమా? ఏ యొక్క సమస్యయు నింతవరకు పరిష్కరింప బడలేదు ఈ స్వప్నములు తత్పరిష్కారము కొరకు భ్రమరవాసిని నాకు కలిగించుచున్నచో - అబ్బో - అని రణాదిత్యుని కథా స్వప్నము 394 వ పుటలో సమాప్తము చెందినది చివరి స్వప్నముతో సర్వ సంశయ విచ్ఛేదనము చేసినదని సర్వసమస్యా పరిష్కారము చెసినదని భ్రమర వాసినీదేవిని గురించి 396 వ పుటలో రణాదిత్యుడు స్మరించినాడు

ఇట్లీ పుటల సంఖ్యను పేర్కొని మాట్లాడుట యెందుకనగా సమస్యలుత్పన్నము లయ్యేడుదానికి పట్టెడు కాలమల్పమనియు అవి పరిష్కారములయ్యేడు దానికి పట్టెడు కాలము కడు దీర్ఘమనియు రచయిత ఎట్లు సూచించినాడో దానిని చెప్పుటకు

ఇక్కడ మరొక్క సంగతికూడా ఉన్నది రణాదిత్యుడు మానవుడు రణరంభ భ్రమరవాసినీ పరమేశ్వరి మానవునకనేకములయిన జీవిత సమస్యలేర్పడును అవి యెట్లేర్పడుననగా - జీవుని సంస్కార కర్మానుభవముల కనువుగా దైవము చేతనే కల్పింపబడును రణాదిత్యునకు సమస్యలను ఒకదానివెంట నొకటిగా కల్పించినది రణరంభ దైవముయొక్క అనుగ్రహమునకు పాత్రమైన జీవులకు తమకా సమస్యలు దైవ కల్పితములనియు అవి యెప్పుడో దైవము

చేతనే పరిష్కరింపబడుననియును తెలియును రణాదిత్యునకా తెలివి యున్నది ఎంతయైననూ మనుష్యుడు కదా! వానికి వాని సమస్యలన్నియును త్వరగా పరిష్కారము కావలయునని అనిపించును అనుగ్రహింప దలచుకొన్న దైవము జీవున కోపికను ప్రబోధించును రణరంభ ఆపనినే చేసినది జీవుల కర్మ పరిపాకమును బట్టి సమస్యా పరిష్కార మార్గములను కల్పించి వారందు ప్రవర్తించుటకు వీలు కల్పించును అందరు జీవులకును అది దైవ కల్పనమని స్పష్టముగా తెలియదు తనకు వచ్చెడు స్వప్నమును గురించి రణాదిత్యునకు సరిగా అదే యవస్థ యేర్పడినది సమస్యాపరిష్కారము పూర్తియైన తరువాతకానీ అయినదని జీవులకు తెలియదు అది తెలిసిన మీదట అంతయు దైవముయొక్క అనుగ్రహమని తెలియుట విశేషము రణాదిత్యుని యందట్టి విశేషము ఆయన భక్తుడగుటవల్ల ఏర్పడినది

II

రణాదిత్యుడు పూర్వజన్మలోగూడా భక్తుడే ఆ జన్మ వృత్తాంతమేకాక ఆ జన్మలోని పేరు మధుసూదనుడన్నది కూడ వాని భక్తి విషయమున రచయితకొక దృష్టి యుండుటనే సమర్థించుచున్నది మధుసూదనుడు మధుసూదన సరస్వతి కావలయునని యెక్కడను లేదు వాని భార్యపేరు నీలమణి ఉజ్జ్వల నీలమణి నుండియే గ్రహింపబడినదని కూడ చెప్పనక్కరలేదు ఇంత వరకు నిజమే కానీ - బెంగాలున 15 వ శతాబ్దమున వెల్లివిరిసిన వైష్ణవ చైతన్య భక్తి ఉద్యమమునకు సిద్ధాంత గ్రంథముగా నీలమణిని రూపగోస్వామి పదునారవ శతాబ్దమున రచించినాడు అది రాసక్రీడాత్మకమైన కృష్ణభక్తి సిద్ధాంతము గనుక నీలమణి పేరెంతయును బాగున్నది మధుసూదన సరస్వతి 17 వ శతాబ్దము నందుండి భక్తి రసాయనము సిద్ధము చేసిన పరివ్రాజకుడు మధుసూదనునకు భక్తిరసముతోను నీలమణికి దాని వైష్ణవ చైతన్యముతోనూ సంబంధమున్నది గనుక ఆయా రసభావములయొక్క స్ఫూర్తి పాఠకులకుండుట వారి కథ రక్తి గట్టుట కుపకారముగా నుండునని రచయిత భావించి ఆ పేర్లను వారికి పెట్టి యుండునా అని ఉండవచ్చును గానీ - శాలివాహన చక్రవర్తిని చిన్నప్పుడు విన్న రణాధిత్యుని (పుట 404) పూర్వజన్మనామము మరియు వాని భార్యపేరు రెండును పదునేడు పదునారు శతాబ్దములందు వెలసిన ఆలంకారిక గ్రంథముల నామములను బట్టి ఏర్పడినవని చెప్పుటలోగల యౌచిత్యము నింకను విచారింప

వలయును ఈ యౌచిత్య విచారము నట్లుంచినచో రణాదిత్యుడు అమ్మవారి యందు నిశ్చల భావము కలవాడు గనుక అంతయు నామె యనుగ్రహముగా తెలిసికొన్నాడు

## III

ఇంతకును రణాదిత్యునకు పరమేశ్వరి తెచ్చిపెట్టిన సమస్యలెట్టివి? తాను రణరంభగా నవతరించి తనయొక్కయు రణాదిత్యునియొక్కయు పూర్వ వృత్తముయొక్క జ్ఞానముతో ప్రవర్తింమటయే ఆమె తెచ్చిపెట్టిన సమస్య అదొక్కటే కానీ వ్యవహారమునకు దిగునప్పటికి దానినే నాల్గయిదు కోణముల నుండి ఆమె వానిముందు ప్రదర్శించి చకితుడగునట్లుగా చమత్కారము చేసినది దేవత కాకుండ వరమెట్లు రణరంభ ఈయగలదన్న సందేహము తీరుట ఒక సమస్య పరిష్కారమగుట హయగ్రీవ కథా శిల్ప ప్రథమ చిత్రమునందున్న అమ్మవార ఘోరాకృతి నాతడెక్కడనో చూచినాడట - అది ఎచ్చటనో అతనికి తెలియదు అది తెలియుట రెండవ సమస్య పరిష్కారమగుట రణరంభను దేవతగానున్న దశలోనే రణాదిత్యుడు ఆమెను కోరుకొనెను దాని నామె జ్ఞాపకము చేసినను వానికి గుర్తు చిక్కలేదు గుర్తు చిక్కుట మూడవ సమస్య పరిష్కార మగుట ఈ మూడు రకములుగానే ఆ సమస్య యున్నది దేవి చమత్కారము కొరకు తన ఘోరాకృతి దర్శనమును, తన నాతడు భార్యగా కోరుకొనుటను సమయభేదముమీద పునరుక్తము చేసి, సమస్యల సంఖ్య ఎక్కువైనట్లు చేసినది

అమ్మవారి ఘోరాకృతిని ప్రత్యక్షముగా రణాదిత్యు డెచ్చట చూచినాడని 81, 83 పుటలలో లేవనెత్తబడిన సమస్యకు 365 వ పుటలో పరిష్కారము చేసి పెట్టబడినది భ్రమరవాసినీదేవి నాతడేమి కోరినాడన్న సమస్యకు పరిష్కారము 380 వ పుటలో చేసి పెట్టబడినది ఈ సమస్యా పరిష్కారమునందే రణరంభ దేవత యగుట కావా అన్న ప్రథమ సమస్యా పరిష్కారముకూడ చేసి పెట్టబడినది

రణరంభయందు తన భ్రమరవాసినీ లక్షణముయొక్క ఎరుక సమగ్రముగా నున్నది. అందువల్ల ఆమె దేవత రణాదిత్యునకు తన మధుసూదనుని

లక్షణముయొక్క ఎరుక అసలు లేదు అందువల్ల అతడు మనుష్యుడు ఆ యెరుక నామె వానికి తన ఇష్టము వచ్చినప్పుడు కల్పించినది అందువల్లనూ ఆమె దేవత జాగ్రత్స్వప్న సుషుప్తి దశాధిష్ఠాయకమైన ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తిగా తన నావిష్కరించుకొనగలిగిన తురీయ దశాధిష్ఠాయకమైన శాంతశక్తి గనుక పరమేశ్వరియందు తద్దేవతా లక్షణమున్నది మనుష్యుడు జాగ్రత్స్వప్న దశల నధిష్ఠించి మాత్రమే ప్రవర్తింపగలడు సుషుప్తియందసలు ప్రవృత్తియే లేదు నిజముగా చూచినచో జాగ్రద్దశాధిష్ఠాయకమైన ప్రవృత్తియే మనుషుని యందు ప్రధానము స్వప్నదశ నధిష్ఠించుట వాని చేతిలో లేదు అనగా జాగ్రద్దశలో వానికి సప్నదశయందు తన ప్రవృత్తిని నియమించుకొనుటకు తగిన శక్తి సామర్థ్యములు లేవని యర్థము మనుష్యులలో జాగ్రద్దశయందు తద్రూపమైన సామర్థ్యము ఎవరి యందుండునో వారు మంత్రసిద్ధులు - దేవతా శక్తులు కలవారు - ఆయా దేవతలయొక్క మానవావతారములు అని చెప్పబడుదురు రణరంభ భ్రమర వాసినీదేవియొక్క మానవాకృతి గనుక ఆమె వట్టి మనుష్యుడైన రణాదిత్యుని ప్రవృత్తిని వాని స్వప్నదశావిశేషమునందు నియమించినది అనగా సమష్టి జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు జీవులను నియమించు అధికారము కలదియని యర్థము ఆమె అశేష వ్యవహారస్వామిని లీలామానుషత్వ మంగీకరించినది రణాదిత్యునకు సమస్యలను కల్పించి పరిష్కరించి పెట్టినది దేవత యనగా అది

IV

దేవియనగా నెవరని 182 వ పుట చివరను మొదలుపెట్టి చేయబడిన విచారణము అద్వైత వేదాంతముమీద ఎంతగా ఆధారపడియున్నదో అంతకు మించి కారల్ యూంగ్ కనిపెట్టిన (Collective unconscious)[1] సమష్టి అవ్యక్త చైతన్యమునందున్న (Female Principle) స్త్రీ లక్షణ బీజ విషయ విచారణముమీద ఆధారపడియున్నది

"ఈమె యెవ్వరు? మా యింటిలోని లక్ష్మీదేవి విగ్రహము నా భార్య యొక్క దేహపరిణామమును వహించి యెదురుగా నిలుచున్నది" (పుట 377)

---

1 FREUD - His Dream and Sex Theories - P 99

రణాదిత్యుని పూర్వజన్మముయొక్క అవ్యక్తమైన అంతశ్చేతనయందున్న లక్ష్మీదేవి బింబమును ఆయన తన భార్యయందు ప్రతిబింబింప చేసికొన్నాడు గనుక ఆయన కామెయందొక ప్రేమభావము చివరకు పుట్టుకొని వచ్చినది ఎదురుగా అమ్మవారట్లు కనిపింపగా ఆయన కామెయందు కోరిక అందువల్లనే పుట్టినది ఈ విషయమును రచయిత అమ్మవారిచేత చెప్పించనే చెప్పించెను ''ఆ భార్యయందు నీవట్లు భావించితివి కాన నీవిట్లడుగుచుంటివి కాన నీకు నిజముగా కోర్కెలేదు'' (పుట 379) పురుషునియందు స్త్రీ లక్షణ మెట్లో స్త్రీ యందును పురుష లక్షణమట్లే యుండునన్న డాక్టర్ యూంగ్ మనోనిదాన లక్షణమును సూక్ష్మముగా అవగాహన చేసికొన్నచో మధుసూదనుడు రణాదిత్యుడుకాగానే నీలమణి అమృత ప్రభ ఎందుకైనదో తెలియును ఈ కథ ఇట్లు ఆధునిక మనస్తత్వశాస్త్ర పరిశోధనాంశములను తాత్త్వికముగా నిరూపణము చేసినది యూంగ్ చెప్పెడు సర్వశ్రేష్ఠమైన సెల్ఫు (Self) ఈ నవలయందు ఈశ్వరభావముగా (పుట 183) చెప్పబడినది

మరొక్క విషయముగూడా ఉన్నది కారల్ యూంగ్ చెప్పిన పురుషునిలో నుండు 'వృద్ధవిజ్ఞాని' రూపమును స్త్రీలోనుండు 'పృథ్వీమాతృ - జీవనధాత్రి భావమును[1] రణాదిత్యునియందును నిరూపణము జరిగినది ఇది ఇంకను విచారింపవలసినదిగా నున్నది

రణాదిత్యుడు పూర్వజన్మలో మధుసూదనుడుగా నున్నప్పుడు ఊరిలోని వారందరును తాను తన భార్యయనగా పడిచచ్చిపోవుచున్నాడని అనుకొనునట్లు ప్రవర్తించినాడని వ్రాయబడిన కథయంతయు మానవునియందు వ్యక్త మనస్సు (Conscious) నంటిపెట్టికొని యుండు ఆదిమభావరూపాలలో ఒకటిగా యూంగ్ చెప్పిన (Persona) బురఖా మనస్తత్వము నాశ్రయించి వ్రాయబడినది మరియు రణాదిత్య రణారంభల యొక్క భార్యాభర్తృ లక్షణము వెనుకనుకూడా ఆదే మనస్తత్వము కలదు రణాదిత్యుని యందది పూర్వజన్మ వాసన బురఖా మనస్తత్వము అభినయ కళా విశేషాత్మకముగా రణాదిత్యుడు రణరంభతో చెప్పినట్లు

1 డాక్టర్ కారల్ యూంగ్ - శ్రీ బి వి సింగరాచార్య డిసెంబరు 1955 భారతి - పుట 26

వ్రాయుటకూడా (పుట 160) రచయితకు (Persona)మనస్తత్వశాస్త్ర విజ్ఞానమును మనోవ్యాపార చతుష్టయమును చెప్పుచున్నది 1 ఆ లెక్కను చూచినచో ఇందలి పాత్రములలో రణరంభ ప్రజ్ఞావ్యాపారము (Intution) కలది అమృతప్రభ అనుభవ వ్యాపారము (Feeling) కలది రణాదిత్యుడు ఈ జన్మలో భావనా వ్యాపారము (Thinking) కలవాడు క్రిందటి జన్మలో ఇంద్రియ వ్యాపారము (Sensation) కలవాడు ఈ విధముగా రచయిత ఆధునిక మనోవిజ్ఞానము పరిగణించిన నాలుగు రకాల వ్యక్తిత్వాలను ముగ్గురయందు స్మరింపజేయుటకు తగిన అల్లిక పనిచేయగా ఈ భ్రమరవాసిని నవల రూపుగట్టుకొన్నది

V

ఇది కాశ్మీర రాజవంశములకు సంబంధించిన చారిత్రక నవల కదా! చూచినంతవరకు ఇప్పటికి నవలలో చరిత్రయని కన్పించిన దేమియును లేదు దేవతలు - వారి అవతారములు - మనుష్యులు - పునర్జన్మలు మనస్తత్వశాస్త్ర మర్యాదలు- స్వప్నములు - మంత్రములు - జపములు - తపములు ఉన్నదంత యును ఇదేనాయె అవునిది యింతవరకు నిజమే ఇది ఎంత నిజమో ఇది కాశ్మీర రాజవంశ సంబంధి చారిత్రక నవల యన్నదియు అంతే నిజము

రాజతరంగిణి తృతీయ తరంగమునందున్న రణాదిత్యుని విచిత్రమైన కథయే ఈ భ్రమరవాసిని నవలకు మూలాధారము

రణాదిత్యుని కథ ఆ జన్మలో ఆద్యంతములతో సమాప్తి చెందునదికాదు దాని యాది యసలాజన్మములో లేదు అది పూర్వజన్మములో నున్నది అప్పుడమ్మవారి యనుగ్రహమునకు ఏదో విధముగా పాత్రతను సంపాదించుకొని తత్ఫలానుభవమునకై జన్మ యెత్తవలసి వచ్చినది ఈ రణాదిత్యుని కొరకు పరమేశ్వరి రణరంభగా సముద్ర జలములయందు తేలుచు వచ్చి, చోళదేశము రాజు రతిసేనునకు చిక్కి అయనకు కూతురుగా పెరిగి, ఆయన స్నేహితుడైన

1 FREUD. His Dream and Sex Theories, P 98

2 శ్రీ స్వయంపాకుల వేంకటరమణశర్మ (అనువాదకులు) - రాజతరంగిణి (1975) తృతీయ రంగము - పుటలు 89 - 95

కులూత భూపతి ఇంటికి చేర్చబడి, అక్కడ రణాదిత్యుని పెండ్లి చేసికొన్నది చేసుకొన్నది గానీ అమె మానవ సంస్పర్శమును పంహరించుటచేత భర్తకును ఆమె ముట్టరానిదే అయెను ఆమె తనవంటిదాన నొకర్తుకను కల్పించి రాత్రు లందు సెజ్జకు చేర్చెడిది మానవాకారమును దాల్చినను అమెకు దైవీశక్తులట్లే యున్నవి

రణరంభ రణాదిత్యునకు మంత్రోపదేశము చేసి 'ది ఆయన నియమ నిష్ఠలతో జపించి సిద్ధిని సాధించెను స్వప్నముల యందాయనకు మంత్రసిద్ధి కలిగినదన్న దృఢ నిశ్చయము కలిగెను ఆయన మహేశ్వర భక్తుడు, మంచి చక్రవర్తి

రణాదిత్యునకు అ జన్మలోనున్న కథ పెద్ద కథగా లేదు ఉన్నదున్నది లేనిది లేదు దాని మీదనే నవల అల్లబడవలయును అల్లబడగా భ్రమరవాసిని నవలయైనది ఇదియేమి నవల? చారిత్రకమా? కాదామరి! పౌరాణికమా? దేవత లవతరించుట యున్నప్పుడు కాదనుట యెట్లు! సాంఘికముకాదా? మనుష్యుల సుఖదుఃఖములతో నిండిన సంసార విషయ విశ్లేషణము పరచుకొని యున్నప్పు డెందుకు కాదు! నవల లిట్లుండునా? నవల లెట్లయిన నుండును ఇట్లుండవలయు ననిగానీ ఉండరాదనిగానీ అనుటకు మన చేతిలో నేమున్నది? అంతయు రచయిత చేతిలో నున్నది

రాజతరంగిణి చరిత్రయైనచో ఈ నవలయు చారిత్రకమనియే చెప్ప వలయును రణాదిత్యుడు పూర్వజన్మమున జూదరి మరియు సంవదను గౌరి వింధ్యాటవియందున్న భ్రమరవాసినీ దర్శనము చేయవలయునని త్రోవలో తుమ్మెదల బారినుండి తప్పకొనుటకు ఆయన ఒక కవచమును ధరించి బయలు దేరెను అయిదు యోజనముల దూరమిట్లు పయనించుటలో తుమ్మెదలు పొడిచి పొడిచి ఆ కవచమును విదారించినవి వాని శరీరమును రక్కి పెట్టినవి అయినను అతడు పట్టు వదలక అమ్మవారి ఆలయమును చేరి భగవతి పాదములమీదపడి ఆమె దర్శనము చేసికొనగలిగెను కొంత సేద తీరినమీద అమ్మవారిని చూడగా వానికి ఆమె సౌందర్యము సమాకర్షకముగా నుండి వాని కన్యథా భావము కలిగి దానినే వరముగా కోరెను ' దేవి వానియందు దయగలదియై, అది అంకొక

జన్మలో లెమ్మని చెప్పి అంతర్ధానము చందెను అంత నాతడు ప్రయాగకు పోయి అక్కడి వటవృక్షాగ్రము నుండి దూకి ప్రాణములను విడిచి ఆ తరువాతి జన్మలో రణాదిత్యుడుగా పుట్టెను శివభక్తుడు గనుక శివాలయములు కట్టించెను అయనకు రణరంభ హాటకేశ్వరమంత్రము నుపదేశించినది అందువలన అతడు సపరివారముగా పాతాళలోకమునకు పోయి నాగకన్యా భోగములనుకూడా అనుభవించెను రణాదిత్యు దక్కడ అట్లు సుఖముండగా రణరంభ తాను వచ్చిన పనియైపోయినదని తాను తన ఆవాసమగు శ్వేతద్వీపము చేరుకున్నది - ఇది చరిత్ర ఇది నవల యందును ఉన్నది చరిత్రయైనది లేనందువలన వచ్చెడు ఇబ్బంది లేదు గనుక దీనిని చారిత్రక నవల యనవచ్చును మరి చరిత్ర కానిది చాల యున్నది కదా! ఉన్నది అందంతయు ఈ చరిత్రను సమర్థించుటకే అయినప్పుడు దాని ప్రాధాన్యమేమున్నది? అదే ప్రధానముగా కన్పించుచున్నదన్నచో నిది చాల విలక్షణమైన నవల యని యర్థము ఈ వైలక్షణ్యమునందు కొంత చరిత్రకాని తనమును కలదు 1) నరేంద్రాదిత్యుడను ఇంకొక పేరుగల లక్ష్మణుడు - లఃఖనుడు - రణాదిత్యునకు తండ్రియని నవలయం (402) దున్నది సోదరుడని రాజతరంగిణి (89) యందున్నది 2) తారాపీడుని తరువాత కాశ్మీరములను లలితాదిత్యుడు పాలించిన మాటను చెప్పిన రాజతరంగిణి (119) రణాదిత్యుడే లలితాదిత్యుడుగా పాతాళము నుండి తిరిగి వచ్చి మరల రాజ్యము చేసెనని నవల చెప్పుచున్నట్లు (402) చెప్పుటలేదు 3) రణాదిత్యుని భారత జైత్రయాత్రా కథనమును గాక లలితాదిత్యుని భారత జైత్రయాత్రా కథనమును రాజతరంగిణి (119-124) చేసిన దానిని రణాదిత్యుని విషయమున కుడి యెడముగా నవలయందు (406 - 447) కల్పింపబడినదని చెప్పవచ్చును 4) రణాదిత్యునకు అమృతప్రభయని ఒక ధర్మపత్ని రాజతరంగిణి ప్రకారము (94) కలదు ఆమె కులూత దేశాధీశుని కూతురని (439) ఆమెను రణరంభ రణాదిత్యునకు ఇచ్చి చేసినదని ఇదంతయు నవల (175) కల్పించినది అమృతప్రభకు రణరంభకు సంబంధమును చరిత్ర కలుపుట లేదు 5) రణాదిత్యుడు బుద్ధదేవుని యవతారమువలె ఉన్నాడని నవల వ్రాయుటకు (440) వెనుక పూర్వమెప్పుడో మేఘవాహనభూపతి ధర్మపత్ని కట్టించిన విహారమునందు అమృతప్రభ బుద్ధదేవుని విగ్రహమును ప్రతిష్ఠ చేయించినదన్న రాజతరంగిణి (94) వాక్యార్థము పని చేయుచున్నది

ఇంతకూ చారిత్రక నవల యనగానేమియున్నచో నవలకు ముఖ్యమైన కథను సిద్ధముచేయుట కనువైన పాత్రములు చరిత్రలో ప్రసిద్ధములని యర్థము పాత్రములకు ప్రసిద్ధి ఎట్లు వచ్చుననగా వారు కావించిన ఘనకార్యముల వలన వచ్చును ఆయా కార్యములను ఆయా పాత్రములు నిర్వహించుటకు వారిని ప్రేరేపించిన బాహ్యాభ్యంతర శక్తులను చరిత్ర నిరూపించని వానిని రచయిత యైనవాడు దర్శించి సమన్వయ నిరూపణముమీద ఆయా కార్యములయందు ఆయా పాత్రములను ప్రవర్తింపజేయుచు రచించినచో చారిత్రక నవలయన్నది సిద్ధమగును నవలకు కావలసిన అన్ని హంగులును కలిగిన చారిత్రక పాత్రములతోను, సంఘటనలతోను ఉన్న కథ చారిత్రక నవల చారిత్రక నవలకు చరిత్రను చెప్పుట తాత్పర్యము కాదు ఆ చరిత్ర అట్లెందుకు జరిగినదో చెప్పుట ముఖ్యము ఈ చరిత్ర ఇట్లు జరుగుటకు వెనుక ఇంత కథయున్నదా - చరిత్ర ఇట్లింత విజ్ఞానమునకు ప్రేరకమా - అని పాఠకుడు చారిత్రక నవలను చూచి పరమాద్భుతమును అనుభవింపవలయు తన జాతీయ సంప్రదాయములను గర్భమునం దిముడ్చుకొని యుగములమీదబడి వచ్చుచున్న చరిత్రను లోతులకు చూచి వ్యాఖ్యానములను వెలయింపవలసిన యవసరమును గూర్చిన తపనను తన పాఠకులయందు సంకల్పించిన రచయిత చరిత్రమీది గౌరవముచేత అక్కడ ప్రసిద్ధులయిన పాత్రములను, ప్రసిద్ధములయిన సంఘటనలను రేఖా మాత్రముగా గ్రహించి ఆయా చారిత్రక ప్రదేశములందుకూడ కథను కొనసాగించును చారిత్రక నవలలు చారిత్రక ప్రదేశముల నంటిపెట్టుకొని యుండుట అంత ముఖ్యము కాదు బాహ్యాభ్యంతరమైన వాతావరణమును కల్పించుటయే ముఖ్యము చరిత్రలో ఈ కల్పన యుండదు ఉన్నచో అది చరిత్ర కాదు చారిత్రక నవలా రచయిత ఆ చారిత్రక సంఘటనలను ఆ పాత్రలను ఆ వాతావరణములో ప్రదర్శించుట ద్వారా చరిత్ర పునరావృత్తమగునన్న సత్యమును ధ్వనింపచేయగలిగినచో అది చారిత్రక నవలా వాఙ్మయమునకు శేఖరము కాగలదు ప్రతి క్షణము ముందుకు దొర్లుచు భూతములో కలిసిపోవుచున్నట్లే - భూతము విస్మృతి పాలగుచు గడ్డకట్టి నిలబడ గలిగినది చరిత్రయగుచున్నది భూతమున కాదియేమున్నది! జీవులకు గత చరిత్ర యంతయును భూతరూపమే కదా! ఆ జీవునకు ఆ జన్మయే జన్మయా? తత్పూర్వ జన్మము వానికి భూతకాలిక విషయము కాదా? ఇంద్రియగోచరత్వముచేత భూతకాలిక విషయములు

చారిత్రక భూషులగుచున్నవి అతీంద్రియ గోచరత్వముచేత భూతకాలిక విషయములకు వలెనే భవిష్యత్కాలమునందలి విషయములును దార్శనికము లగుచున్నవి ఆ మాత్రము దార్శనికత లేనివాడు మొదలు రచయితయే కాడు అందువలన రచయిత యైనవాడు చరిత్రను మనకు చెప్పవలయునని బయలు దేరడు తన దర్శనమును ప్రదర్శింపవలయునని బయలుదేరును చారిత్రక నవలలలో చారిత్రక సత్యమని యొకటి యున్నది అదేమనగా - ఈ చరిత్ర గర్భమునందున్న త్రికాలాబాధితమైన రచయితకు దర్శనీయమైన సత్యమేది కలదో అది తాదృశమైన చారిత్రక సత్యమునే పాఠకుడను భావింపవలయును అదే విమర్శనీయము

## VI

రణాదిత్యుని పూర్వజన్మ వృత్తాంతమంతయును అతనికి స్వప్నమునందు ప్రత్యక్ష కల్పముగా రచింపబడినది ఆ స్వప్నము మరియు చమత్కారముగా నున్నది కథాను స్యూతి చెడకుండ పది రాత్రులమీద పది స్వప్నములుగా వచ్చినది (పుట 194) అదియైనను వరుసగా వచ్చుటలేదు ఒకనాడసలు స్వపమే రాదు ఒకనాడు వేరొక స్వప్నము వచ్చును మరల ఎప్పుడో ఒకనాడా కథలోని భాగము తరువాయిగా వచ్చినశేషముగా ఆగిపోవును (పుట 303) ఇట్లా పెద్ద కథయం దనుస్యూతి నిలబడి వచ్చుచున్నది (పుట 305) ఈ విధముగా కల్పింపబడిన పూర్వజన్మ వృత్తాంతము మొత్తము 456 పుటల నవలలో 210 పుటలమీద పరివ్యాప్తముగా నున్నది చివరి 56 పుటల గ్రంథము రణాదిత్యుని జైత్రయాత్రా కథనము నెపముగా వాని పూర్వజన్మస్థలంబంధుదర్శన స్పర్శన సహవాససల్లాపసమాదరణ క్రియాకలాపమును లీలామాత్రముగా వర్ణించినది

రణాదిత్యునియందు పూర్వజన్మజ్ఞానము కలుగుటకు స్వప్నకథా విశేష దర్శనమే హేతువు ఈ స్వప్న మీ విధముగా ఆయనకు పాతికయేండ్లు వచ్చిన తరువాతనే ఏల రావలయును? అమ్మవారట్లను గ్రహించినది (పుట 391) గ్రహములను కూలపడినప్పుడు అతీంద్రియ దృష్టి (Sixth Sense) పనిచేసి పూర్వజన్మజ్ఞానము కలుగుటను శ్రీకాంతిదేవి యొక్కయు[1] (భారతి - అక్టోబరు 1957) శ్రీ లలితాదేవియొక్కయు[2] (భారతి - ఏప్రిల్ 1958) జాతకములు ఋజువు పరచినవి "ఇంద్రావరుణులు అప్రమేయశక్తి బుధునిలో మేళవించి

స్వప్నజ్ఞానమును పూర్వజన్మ జ్ఞానముగా పరిణమింపజేసినది " "వృశ్చికరాశిలో బుధుడున్న 28వ భాగం పూర్వజన్మ సంస్కారముతో సన్నిహిత సంబంధము కలది " "ఇంద్రియములకు సాధ్యము కాని అంతరంగిక రహస్యములను కనుగొను చాతుర్యము - స్వప్నకథలను స్పష్టముగా జ్ఞప్తిలో నుంచుకొనగల శక్తి, ఇవి ఇంద్రుని వరప్రసాదము " "నవమభావము పూర్వజన్మమును, పంచమ భావము పునర్జన్మమును సూచించుననుట జ్యోతిశ్శాస్త్ర మర్యాద " - రణాదిత్యుడు తన పూర్వజన్మ దేహ పతన సమయమున పునర్జన్మమును గట్టిగా సంకల్పించి యుండుటను శ్రీ లలితాదేవి జాతకము సమర్థించుచున్నది "పూర్వజన్మ జాతక శక్తి ఆ దేహావసానముతోనే నశించక పునర్జన్మము వచ్చువరకు వ్యాప్తిలో నుండునని వర్షజాతక దైవికజాతకాదులు ధ్రువపరచుచున్నవి "

పూర్వజన్మయు పునర్జన్మయు ఉన్నవి నిజమే ఆ కథావిశేషములు స్వప్నములుగా దృశ్యమానములగుటకేమి చెప్పవలయును? స్వప్నమనగానేమో విచారింపవలయును జీవులకు స్వప్నమొక యవస్థ ఇదొక విధమైన జ్ఞాపకశక్తి కధిష్ఠానము ఇంద్రియాలతో నిమిత్తములేకుండ ఆత్మారాముడొక్క మనస్సును పెట్టుకొని సమస్తమును చేయగలడు జాగ్రదవస్థయందెట్లో అందును అంతయును మిథ్యమే మనః పరికల్పితమంతయును మిథ్యమే ఈ జగత్తు - ఈ సంసారము - ఇదంతయు మిథ్యయే ఈ జన్మ సంస్కారమెట్లో పూర్వజన్మ సంస్కారమును అట్లే కదా! అందువలన మనస్సు దానినికూడా కల్పించగలదు ఈ జన్మ కర్మములవలన ఫలితములననుభవించుటకే యింద్రియాలు పనిచేయవలయును పూర్వజన్మ కర్మముల అనుభవజ్ఞానమునకు మనస్సొక్కటి చాలును అందు కనియే ఈ నవలయందు రణాదిత్యుని పూర్వజన్మ కథ స్వప్నకథగా సమకూర్చ బడినది బ్రహ్మ సత్యం జగన్మిథ్యాజీవో బ్రహ్మైవ నాపరః - ఈ దృశ్యమైన అద్వైత తత్వమును ఋజువుపరచుటలో స్వప్నదృష్టాంతము లెస్సగా పనిచేయు చున్నది

మనస్సునకున్న స్వప్నపరికల్పన శక్తిసామర్థ్యములను గురించి ఆధునిక మనస్తత్వ శాస్త్రవేత్తలు చేసిన విచారణ ఈ విషయమున గమనింపదగినది స్వప్నవిషయ పరిశీలనము మనస్తత్వ విశ్లేషణమునకు సహాయకారిగా నున్నది

స్వప్నమును పొందినవాని వ్యక్తిత్వమునకు స్వప్నము దర్పణము పట్టుచున్నది [1] మరియు స్వప్నములు అర్థవంతములును ఉద్దేశపూర్వకములును అయి ఉన్నవి కాని, వట్టి గందరగోళములు కావు [2] కావు కనుకనే స్వాప్నికుల సంపూర్ణ వ్యక్తిత్వమును అవి స్ఫురింపజేయగలుగుచున్నవి [3] స్వప్నమున కింత పరమార్థభూతమైన లక్షణమున్నదని ఆధునిక విజ్ఞానమును నిరూపణము చేసి యుండుటచేత ఈ నవలయందు ప్రధాన కథావృత్తమంతయు స్వప్నముగా ప్రదర్శింపబడినది స్వప్నమనగానేమో[4] తెలిసి భావించిన కొలదియు 210 పుటలమీద పరివ్యాప్తము చేయబడిన మధుసూదనుని బాహ్యాభ్యంతర స్వరూపస్వభావము సమస్తము ప్రత్యక్షకల్పము కాగలదు [5] ఇక్కడ మరొక్క విషయమున్నది ఈ నవలలో "మీకు భార్య అమ్మ అమ్మ భార్య" (270) "ఈమెను తల్లియనవలయునా? భార్యయనవలయునా?" (394) అని రెండు వాక్యములున్నవి

---

1 A dream was an autobiographical interview, the dreamer a subconcious Journalist, or rather noeturnalist Dreams supplied supplementary and impoitant building for psychoanalysis, and for the comprehension of the deep inner life of the walking and the sleeping psyche alike - FREUD - His Dream and Sex Theories - P 50

2 Dreaning is not quite idle, nor is it in either plot or detail so chaotic and capricious as it sums - FREUD P 51

3 At all events, dreams are highly individualized products of the entire personality - FREUD P 56

4 A dream is often a pictorial rendering of a deeper group of ideas and emotions, a cinema projection of a bit of life filmed by and for the dreamer - Who is actor and spectator in one FREUD P 53

5 బృహదారణ్యకోపనిషత్తు-చతుర్థాధ్యాయమునందీయవస్థాత్రయ విచారణమున్నది చూడవలయును

సూపర్ ఇగో అని చెప్పబడెడు ఒడిపస్ కాంప్లెక్సును[1] తాత్త్విక సమన్వయము మీద సమర్థనీయముగా రచయిత సంకల్పించి పనిచేయుచున్నాడేమో ఇంకను లోతుగా విచారింపవలసి యున్నది

మరియు మంత్రశాస్త్రమునందు స్వప్నవారాహి మంత్రమని యొకటున్నది స్వప్ననాయికామూర్తియైన ఆ వారాహీదేవి జాపకునకు దుస్స్వప్నములను రానీయక పోవుటయేకాక భావి శుభాశుభకార్యములను స్వప్నములందు చూపి కర్తవ్యోపదేశము గావించునని చెప్పబడియున్నది రణాదిత్యునకు రణరంభ ఈ మంత్రమును చెప్పినట్లు లేదు ఆయన పూర్వజన్మలోనే ఈ జన్మకు కావలసిన ఆ మంత్రమును జపించినాడేమో తెలియదు కాక, స్వప్నదుర్గ అని కూడా ఉన్నది అదేమైనా వానికి తెలియునేమో!

స్వప్నము భావి శుభాశుభసూచక మన్నప్పుడు నిదర్శనముగా 1865 వ సంవత్సరమున భూస్వాముల వ్యక్తిగతములయిన ఆస్తులుగానున్న భూములను రష్యాను ప్రజలు తప్పక వారినుండి తొలగింపగలిగినట్లు టాల్‌స్టాయికి వచ్చిన స్వప్నమును చెప్పవలయును మరియు తన యాస్వప్నము నుద్దేశించి 1908 ఏప్రిల్ 16 వ తేదీన ఆయన వ్రాసిపెట్టిన దానిని[2] కూడా గమనింపవచ్చును భూతభవిష్యత్తులు సిద్ధములై యుండుటను స్వప్నములు చూపగలుగుచున్నవనగా - ఇంతవరకు తగాదా లేనప్పుడు ఆ స్వప్నములను కల్పించు శక్తులను గురించి వివాదపడనక్కరలేదు వారాహియే ఆ పని చేయుచుండవచ్చును

---

1 The Super - Ego is an outgrouth of and is a modification of the Ego It is the "heir of the oedipus complex" a precipitate of identification with the parents "in some way combined together" - FREUD P 91

2 This shows me that we are wrong when we imagine the life of the soul in terms of time, where as it already exists as an integral whole
—(The Living Voice of Leo Tolstoy - Recorded by - Dusan Macovicki - Soviet Literature No 10' 1975 P 107)

స్వప్న వృత్తములను వస్తువులుగా చేసి కావ్యములు రచించుట ప్రపంచ వాఙ్మయమునందు క్రొత్తగా వచ్చినది కాదు శ్రీమద్రామాయణమున త్రిజటా స్వప్నమున్నది కదా! భాసరు మహాశయుని కావ్యములు స్వప్న కథేతివృత్తము లతో నున్నవి కదా! తెలుగు కవులు టిక్కన్నగారి నుండి దాదాపుగా నందరును స్వప్నములలో వచ్చిన సూచనల నందుకొని కావ్యములు వ్రాసినవారే కదా! విశ్వనాథ వాఙ్మయమునందు స్వప్న సంగతి కలిగిన కథేతివృత్తము అదొక పెద్ద పరిశోధనకు విషయము కదా! ఈ విధముగా వాఙ్మయమునకు స్వప్నము లకును ఏదో అవినాభావ సంబంధము కన్పించుచున్నది —విశ్వనాథయొక్క స్వప్నవిషయ విజ్ఞానానికింత పంథియు ఉన్నదనియే భావింపవలయును

## VII

మధుసూదనునకు పట్టణమునకు పోయినప్పుడొకసారి ఒక దేవీ విగ్ర హము పాలరాతిది శరీరమునందుగల యాభరణస్థానములందు కనకశలాకలు కలది కనుపాపలయందు మరకతములు కలది కాలిగోళ్ళయందు మాణిక్యములు కలది మూరెడెత్తున్నది కనిపించుటతో (243) వాని జీవితమున నొక పెద్ద మలుపు వచ్చినది సంసారమునకు తన అభిముఖ్యమునకు నోచుకొనని భార్యతో కలిసి చిత్రముగా నాతడు దేవీ ఉపాసకుడయ్యెను (269) ఈ భ్రమరవాసినీ నవలయందు హిందూధర్మతత్త్వ పునరుజ్జీవనమున కెప్పటికప్పుడు దోహదము చేయుచువచ్చిన చిత్ర విగ్రహ నిర్మాణ కళావిలాసములు కథాగతి కుపస్కార ములుగా ప్రపంచింపబడినవి లక్ష్మివిగ్రహమది విగ్రహము కాదు అది జీవ చైతన్యమునకు పరనిర్వృతి స్థానమైన ప్రధానపాత్ర ఆ సంగతి తెలిసినకొద్ది రణరంబా అమృత ప్రభల చైతన్యశక్తుల కదలికల సొగసులు తెలియును ఈ నవలలోని తళ త్తళలన్నియు నా సొగసులే స్వాత్మ చైతన్యప్రాప్తికి ఉపా సనము తదుపాసన కొక ప్రతీకయు భారతీయ వేదాంత దర్శనమునందు ప్రసిద్ధ ముగా నున్నది ప్రతీకలయం దుత్కర్షాపకర్షలున్నవి తదధీనములై ఫల విశేషములు ఉపాసకులను పొందును మధసూదనుని జీవిత మీ విషయమును ప్రత్యక్షరవ్యాఖ్యానముగా చూపుచున్నది 377 380 పుటలలో పర్యవసానమును కలదు

"దేవిపేరు భ్రమరవాసిని వింధ్యాచల నివాసిని యన్నది సామాన్యమైన పేరు ఆ భ్రమరవాసిని యెచ్చటో యున్నది" (పుట 321) ఆ సామాన్యమైన పేరు లలితా సహస్ర నామావళిలో 336 గా నున్నది మరియు నది చిరుమార్పులతో బాలా భవానీ మొదలయిన సహస్రములందును కలదు భ్రమరవాసిని యన్న పేరట్లే యెందును కన్పించుటలేదు మృగ్యముగా నున్నది

బాలాసహస్రములో భ్రమరాంబా (749) యని యున్నది భవానీ సహస్రమునందు భ్రామరీ (790) భ్రమరాలకా (791) యని రెండు నామములుగా నున్నవి అమ్మవారి చతుష్షష్టి యోగినీ నామములలో భ్రమరీనామము (26) కలదు శ్రీదుర్గానవాక్షరీ మహామంత్రము రక్తదంతికా దుర్గా భ్రామరీ బీజాత్మకముగా చెప్పబడుచున్నది భ్రామరీ బీజము భీమాశక్తిని సూర్య సత్యమును సామవేదమూర్తిని కలిగి మహాసరస్వతీదేవతాత్మకముగా కన్పించుచున్నది అసలు మంత్రమే మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ దేవతాత్మకముగా నున్నది భ్రామరీ బీజమును మహాలక్ష్మికి చప్పినను విరోధము లేదు ఇది యట్లుండగా అమ్మవారి ఆయుధములలో భ్రమర నామక మొకటి యున్నది భ్రమరవాసిని యన్నప్పుడు భ్రామరీ బీజమునందే ఆమెకు వసతిని చెప్పవలయునా? క్షురికాద్రోణ తోమరములకువలెనే భ్రమరము కూడా ఆ దేవియొక్క శక్తిని వహించియే ప్రవర్తించుచున్నది అందువల్ల ఆయుధమునందు వసతిని చెప్పినను తప్పులేదు అది యెట్లైనను అమ్మవారు భ్రమర రూపాత్మకతను కలిగియుండుట కభ్యంతరములేదు కనుక ఆమె భ్రమరాంబ వింధ్యాచల నివాసినియైన వరాభట్టారికాదేవి ఆమె సర్వతంత్ర స్వతంత్ర గనుక తనను చేరు ఒక మార్గమున అయిదు యోజనముల వరకు తన పరివారముగా భ్రమరముల నుంచినది (357 365) ఇదంతయు విఘ్నములను కల్పించి భక్తుల దృఢ లక్షణమును పరీక్షించుట కావలయును

స్త్రీ పుంస యోగాత్మకమైన బ్రహ్మ పదార్థము ఈశ్వరభావము పొందినప్పుడు స్త్రీత్వము లక్ష్మీ పార్వతీ సరస్వతీ రూపముగా వికసించెను (183) ఆ రూపములు మానవులకు వలె పంచభూతాత్మకములు కావు అప్పుడప్పుడగుటయు కలదు సంభవామి యుగే యుగే అన్నాడు కదా! భగవంతుడు ఆయా దేవతలుగా వికసించిన తేజోరూపములను దర్శించుటకును, దర్శింప

జేయుటకును గుర్తుగా సాంకేతికముగా చిత్రరచన విగ్రహ శిల్పము కల్పితము లయినవి విగ్రహము లోపమున్నదో ఆ రహస్యమును విశదము చేయుటకే దేవి విగ్రహము పాత్రగా ప్రవేశ పెట్టబడినది

ఈ దేవి శ్రీమహాలక్ష్మిగా ఈ నవల మొదటినుండి (11) చివరిదాకా (456) శిల్పసుందరిగా చైతన్యమూర్తిగా పాంచభౌతికమైన తనువుతో స్త్రీ మూర్తిగా విశ్వరూపమును ప్రదర్శించుచున్నది ఈ నవల కథాగతికి ఈ అమృత చైతన్యమూర్తియే నాయకురాలు

ఈ మహాలక్ష్మి దేవతా స్వరూప స్వభావము లక్కడక్కడ నామమాత్ర ముగా నవలయందు సూచితములై యున్నవి సహస్రనామములలో కాశ్మీరపుర వాసిని యన్నదొకటి (761), భ్రమరాంబయన్నదింకొకటి (757) ముందుగా గమనింపదగినవి

పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాగమ శ్రుతాయై నమః సమాస తద్ధితాకారాయై నమః (లక్ష్మి స నా 556, 667) నాభౌ వహ్ని శిఖాకారా లలాటే చంద్రసన్నిభా భ్రూమధ్యే భాస్కరాకారా సర్వతాకాకృతిర్హృది (హృదిస్సర్వతారాకృతి) (లక్ష్మి స నా 742 - 745) పాశంబిభ్రత్యైనమః (946) అంకుశం బిభ్రత్యైనమః (947) కృపాణికాం వహంత్యైనమః (951) పూర్వకుంభంబిభ్రత్యైనమః (943) - ఈ లక్ష్మి అమ్మవారి సహస్రనామముల యభినయము (పుట 420) చెప్పబడినది అమ్మవారి నామములు అలుక్స మాసములుగా నుండుట లక్ష్మి సహస్రనామములందలి విశేషముగా చెప్పబడినది ఆ విశేషము నింకను విచారింపవలెను సమీపమునందు విభక్తి ప్రత్యయము సాధారణముగా లోపించును కొన్ని సమాసములందు విభక్తి లోపింపదు లోపింపనివి అలుక్సమాసము లోపించినవి లుక్కులు నాభౌలలాటే భ్రూమధ్యే- అంకుశం-పాశం-కృపాణికాం-పూర్వకుంభం ఇవన్నియు విభక్త్యంతములై ఉత్తర పదము పరమగుచుండగా సమాసములందు పూర్వపదములుగా నున్నవి కనుక ఆవన్నియు అలుక్సమాసములు అమ్మవారిని చెప్పచున్నప్పు డేలోపమును కలుగదు ప్రకృతి ప్రత్యయాత్మకమైన శబ్ద బ్రహ్మ మామెకంటె భిన్నము

కాదు మరియు ఈ సహస్రనామములనుబట్టి వైష్ణవి - మహేశ్వరి - మాయా ఈ మొదలయిన సాధారణ నామములేకాక ఈ నవల యుద్ధమధ్యస్థితాయైనమః (183) అష్టాదశ భుజాయైనమః (955) మహాష్టాదశపీఠగాయైనమః (956) ఈ మొదలయిన విశేష నామములను కూడా (446 445) స్మరించినది మరియు రతిసేన మహారాజునకు రణరంభ సముద్రమధ్యము నుండి బంగారుతమ్మిలో తేలుచు వచ్చి లభించినట్లున్న కథ (443) వెనుక క్షీర సముద్రరాజతనయామన్న స్తుతి కలదు ఇంకను రణరంభ స్పష్టముగా చెప్పిన మాటలు గలవు "నేను లక్ష్మిదేవిని లక్ష్మియగా నీకర్థము చెప్పితిని కదా! నిజముగా నా కాకృతి లేదు" (84) ఇట్లెంత చెప్పినను దేవి మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వతీ దేవతాత్మక ముగా నుండును శుంభనిశుంభుల వధ జరిగినప్పుడు దేవత సరస్వతి, వధజరిపి నని చండిక "మహాలక్ష్మిర్మహాకాళీ సైవప్రోక్తా సరస్వతీ" (26) - "త్రిగుణాసా మహాలక్ష్మిస్సాక్షాన్మహిషమర్దినీ" (8) - "పూజయేత్ సర్వలోకానాం సదేవానాం ప్రభుర్భవేత్" (14) వైకృత రహస్యమునందిట్లు చెప్పబడియున్నది ప్రాధానిక రహస్యమునందున్న "మహాలక్ష్మి రేవమజా రాజంత్యర్వమయీశ్వరీ, నిరాకారాచ సాకారా సైవనానావిధాఽభవత్" (32) - ఈ వాక్యములను చూచి "ఆమె నా ప్రతికృతి నిజముగా నా కాకృతి లేదు దాని కాకృతి యున్నది (84) ఆ ప్రతి కృతిని తీసికొనిపోయి మంచముమీద పండబెట్టుకొనుము" (85) అని రణరంభ చెప్పిన మాటలను విన్నచో ఈ నవలలో చేయబడిన పనితనము లక్షణము తెలియును

"నా జన్మకిదియే చారితార్థ్యము సందుడు శ్రీకృష్ణదేవునకు తండ్రి నేను రణరంభకు తండ్రిని" అని రణసేనుడనెను రణరంభ కనులువిచ్చి చూచెను ఆయన కింత తెలియునని యామె అనుకోలేదు (408) ఇంత తెలియుటలోని ఆ తెలియుట ఎంతయో రణరంభా శ్రీకృష్ణదేవులను అనన్వయులనుగా భావించెడు లోతులనుబట్టి యుండును

మరొక్క విషయమున్నది లలితా లక్ష్మి ఉపాసనలయందుగల యెగుడు దిగుళ్ళ ఫలితములను గూర్చిన రచయిత భావన (315, 429) లోకాచారమా? తత్వమా? మధుసూదనుడు తాను తెచ్చి పూజించెడు లక్ష్మి విగ్రహము ముందు కూర్చుండి లలితభావన చేయుట కలదు (311) రణాదిత్యునకును అదే భావన

(429) నీలమణికి అదే లక్ష్మి కావచ్చును అమృతప్రభ దేవిని లక్ష్మియనియే అనును (429)

జపవిధి విధానము జ్ఞానార్ణవ స్వచ్ఛంద తంత్రసారాది గ్రంథముల యందు విగద జపమని, ఉపాంశు జపమని, మానస జపమని మూడు రకములు గాను, వాచిక, మానసిక, యౌగిక, యోగవాచిక, వాఙ్మానసిక, యౌగిక జపములని ఆరు రకములుగాను చెప్పబడి యున్నది ఆయా పేర్లతో చెప్పబడు చున్న జపములను నిర్వర్తించు క్రమముకూడా అందు స్పష్టముగా నున్నది రణాదిత్యుని పూర్వజన్మ భాగధేయమంతయు అప్పటి వాని మంత్ర జప పరా యణతమీద చూపబడినది జపవీరుడని 35 వ పుటలో చెప్పబడుట కూడ గమనింపవచ్చును 355 వ పుటలో ప్రస్తావింపబడిన మంత్ర స్వీకార మంతయు గ్రంథమును సశాస్త్రీయము చేయుచున్నది ముహూర్తచింతామణి రుద్రయామళాది తంత్ర గ్రంథముల యందున్న దేవీ మంత్ర జప విధి పురశ్చరణ విధానాదుల విజ్ఞానము లీలగా భాసించుచున్నది

ఉపాసకుని శరీరమును రక్షించుటకు దేవీకవచమని యున్నది అన్నింటి కిని మూలము శరీరముయొక్క యునికి కదా! అమ్మవారి దర్శన పర్యంతమైనను నిలుచుటకు ఉపాసకులామె దయా కవచములో తమ తనువును ప్రవేశపెట్టెదరు మధుసూదనుడు భ్రమరవాసినీ దర్శనమునకు బయలుదేరుటకు ముందు పట్టణ మునకు బోయి యనుప కవచమును చేయించుకొన్నాడట (పుట 359 ) లోని రహస్యము మంత్రశాస్త్రమునందున్నది అది మంత్ర కవచము

మరొక్క విషయమున్నది ఆయా తంత్రములయందాయా మంత్రముల జప సంఖ్యా నిర్ణయాదులు చెప్పబడియున్నవి భ్రమరవాసినీ మంత్ర విషయ మేతంత్రము నందున్నదో దానిని బట్టి విచారింపవలయును ఈ నవలను బట్టి పోయినచో ఈ మంత్రమును కంఠదఘ్న నదీజల మున్నచోట నుండి లక్ష జపము (పుట 356) చేయవలెను పంచాగ్ని మధ్యమునందుండి లక్ష శ్మశానము నమునందుండి లక్ష అశ్వత్థమునందు కూర్చుండి లక్ష జ్వాలాముఖి పర్వత శిఖరము నుండి లక్ష ఈ విధముగా ఇరువదిసార్లు చేసినచో కోటి మంత్రము

చేసినట్లై దేవీ దర్శనమునకు (పుట 320) ఉపాసకుడు యోగ్యుడగును నదీతీర పర్వతశిఖర అశ్వత్థ బిల్వముల వివిక్త నిజగృహ శ్రీగురుస్వేష్ట దేవతాసన్నిధి ప్రదేశములు జపయోగ్య స్థలములుగా నిత్యోత్సవ నిబంధనాది గ్రంథముల యందు (ప్రౌఢోల్లాసః పుటలు 16,17) కన్పించుచున్నవి పంచాగ్ని మధ్యస్థల శ్మశాన ప్రదేశములను విచారింపవలయును

జపమును అక్షమాలతో లెక్కించుచు చేయవలెనన్న శాస్త్ర మర్యాద మధుసూదనుడు ఇనుప కవచములో చొచ్చినపుడు కూడ (పుట 374) విస్మరింప బడలేదు, కానీ తావళముల మధ్యలోపడి అక్షమాల అక్షమాలగా దృశ్యమాన మగుటలేదు అనగానేమనగా అకారాదిక్షకారాంత మాతృకావర్ణ మాలయన్నట్లని రుద్రాక్షమాలలు ముత్యాలమాలలు మాణిక్యమాలలు స్ఫటికమాలలు ప్రవాళ మాలలు సువర్ణమాలలు రజతమాలలు శంఖమాలలు-ఈ మొదలగు జపమాలా భేదములున్నవి దేని ప్రత్యేక ఫలము దానికున్నది "ఈ నిఘంటుకర్త గత జన్మలో కావేరీ తీరమందు అక్షమాల జపించుటచే యీ జన్మములో నిఘంటుకర్త యయ్యెనని ఒక జ్యోతిష్కుడు వ్రాసియుండెను" ఈ వాక్యము ఆంధ్రవాచ స్పత్యము ప్రథమ సంపుటము 26 వ పుటలో నున్నది పూర్వోత్తరజన్మములకు ఈ అక్షమాల జపమునకు ఏమి సంబంధమో విచారించవలయును "నేను కవిని నేను సంస్కృతమునందు చాల శ్రమజేసితిని ఈ శక్తి నాకున్నదని ఈ స్వప్న ములో నా కనిపించెను" (పుట 251) రణదీత్యుడీమాట ఎందుకనవలయును? మంత్రజపము వెంట హోమమును కూడ శాస్త్రము చెప్పుచున్న దానిని ఈ నవల (376) చిత్రముగా స్పృశించుచున్నది '' కానిమ్ము "పరమేశ్వరి యేమి చేయు చున్నది? తన్నుతానే జపించుకొనుచున్నది తనయందు తానే హోమము చేసు కొనుచున్నది" ఇది అనాదివాసనారూపేంధన ప్రజ్వలితకుండలినీరూప చిదగ్ని మండలమున ''అహమేవాహం మాం జుహోమిస్వాహా అని యనుటగా నున్నది దెవి యమృత చైతన్యమూర్తిని కల్పించుకొనుటకు ముందుపాసకుడట్లు నిరస్త సమస్త దోషుడు కావలయును వెంటనే నవలలో ఈ వాక్యమున్నది (376)- మధుసూదనుడు ''తల్లి దర్శనము చేయుటకు నిశ్చయించుకొనెను" అనగా నిది మూర్తికల్పనమన్నమాట అంతర్బహిర్యాగాత్మకమైన శ్రీవిద్యాతంత్రమున కీనవల కథారూప కల్పన

# అ ను బం ధా లు

## 1

శోభనపు గదిలోనికి తిరిగి వచ్చిన రణరంభా పాద సందర్శనమున రణాదిత్యుడు పొందిన యనుభూతి వర్ణనమునందు ఆమె పాదపద్మములు రెండు శిరస్సుల మహా సర్పము విచ్చిన పడగల నేలవాల్చినట్లున్నవని (71) యున్నది ఉపాసకులు దేవతామూర్తిని పాదముల నుండి ధ్యానముచేత కల్పించుకొనుట యున్నది రణాదిత్యుడు భక్తుడు గనుక రణరంభ దేవత గనుక ఆయన ఆమె నట్లే చూడవలయును అంతవరకు బాగానేయున్నది దేవీస్తోత్రములయందు పాదములకు ఫణములు సమానముగా చెప్పిన వైనము సరిగా చిక్కుటలేదు మూర్తి కల్పనమునందు ప్రధానముగా పరాశక్తి యునికిని జ్యేష్ఠాంగ బాహు పదాగ్ర మధ్యస్థానములందు దర్శనీయముగా చెప్పుట కలదు పరాశక్తియైన కుండలిని ఉపాసకుల ననుగ్రహించుటకు దేవతామూర్తుల యందధోముఖియై పాదములయందు దర్శన మిచ్చుచున్నదని చెప్పవచ్చునేమో చూడవలయును

లావాణకము నుండి రాజోమికి పోవుచున్నప్పుడు పల్యంకికలో చూడగా రణరంభ నోటినుండి పక్కకు చంద్రవంకవలె నొక కోర తిరిగియున్నట్లు (424) కనిపించినదనగా ఆమె అర్ధచంద్రోల్ల సద్దంష్ట్రియై నమః (లక్ష్మీ స నా 831) అని యనవలసినదని యర్థము

## 2

ఐతేరేయ బ్రాహ్మణమునందు (1.1 3) యజ్ఞదీక్షా స్వీకార విషయ విచారణ సందర్భమున దీక్షాకాముడు ముందుగానొక చర్మకవచమును ధరింపవలయు ననియు, అది పూర్వజన్మ సంస్కార విశేషములను భద్రపరచుకొన్న జీవుని విజ్ఞానమయతకు సూచకమనియు చెప్పబడియున్నది 1

---

1 The Aitareya - brahmana (1.1 3) describes the diksa for Yajnas in it the candidate for initiation is clothed with a skin to symbolize the foetus being incased in the amniotic membrane

—ALEX WAYMAN The Adyar Library Bulletin Vol XXXIX 1975 Page 70

# 3

ఇది కావ్యగతమైన రసలక్షణము "రసోవైసః" అన్న వేదవాక్యమునందలి రసశబ్దమునకు దీనికి పెద్ద సంబంధము లేదు (96) రసచర్చా రహస్యములలో నిది యొకటి సంభోగ విప్రలంభ శృంగార భేదములలో విప్రలంభము అను భావ వ్యభిచారి సాత్త్విక భావములయొక్క పౌష్కల్యముచేత గొప్పదనియు (97) చెప్పబడినది దృశ్యకావ్యమునందు సామాజిక నిష్ఠముగా పరిష్కారమును పొందిన రసము శ్రవ్య కావ్యమునందు నిస్సందేహముగా పరితృనిష్ఠమేయైనను మనస్సు తాదాత్మ్యము పొందినచో "నటనిష్ఠము కూడా కావచ్చు" ననుట విచార్యముగా నున్నది ఇంతకును రసము మననముచేత సిద్ధించునది - ఇది సిద్ధాంతము (96) మానవజన్మతో వాడు పరమయోగి కాకపోయినచో "రసోవైసః" యన్న స్థితి పొందలేడు కావ్యరసమువంటి రసమును పొందగలడు (100) మరియు శృంగారమనగానేమో 146 వ పుటలో కలదు- 189 వ పుటలో కలదు 193 వ పుట వరకును కలదు శృంగారము వేరు శృంగార రసము వేరు ఈ పరమార్థ నిరూపణ మీ నవలయొక్క బహుముఖములలో నొక్కటియా? శరీర సంబంధముచేత జీవగతమై జీవసంబంధముచేత శరీరగతముగా ఫలించు లక్షణము గల స్త్రీ పురుష వాంఛారూపమైన మోహమును వర్ణించుట వట్టి శృంగారమును వర్ణించుట స్త్రీ పురుష శరీరములు ఆలంబన మాత్రముగానున్న అన్యోన్యాభిముఖమైన జీవ చైతన్య సౌందర్యమును వర్ణించుట శృంగార రసమును వర్ణించుట ఒకటి మలిన శృంగారము రెండవది అమలిన శృంగారము నాయికా నాయకుల విషయమున శృంగార రసమును భావించుటకు వీలుగా కావ్యము లుండవలయునన్నదే సిద్ధాంతమన్నట్లున్నది మరియు దేవతా మానవ విభేద పరిజ్ఞానమునకు (185) శృంగార రస శృంగారభేద పరిజ్ఞానము పీఠికాప్రాయము కావచ్చును [1]

# 4

ద్వైవవాదమును యథా సంభవవాదమును కాదని (30) గతి తార్కిక జన్మ సంస్కార వాదమును ప్రపంచించి చూపుటకు వ్రాయబడిన నవల ఈ భ్రమర

1 ఈ వ్యవహారము పేరు శృంగార రసమందురు (146) ఈ వాక్యమును ఈ వ్యవహారము పేరు శృంగారమందురు అని పఠించి చూడవలయును

వాసిని ఈ జన్మ సంస్కారవాదము భావవాదమును అపరోక్షానభూతిగా ప్రతిపాదించునది గుణమైన చైతన్యశక్తికిని గుణియైన పదార్థమునకును అవినాభావ సంబంధమే చాలవరకు సంబంధము జడ చైతన్యాలు రెండు అని తర్కబుద్ధి చేత కల్పించుకొనుచున్నాము కాని అవి నిజమున కేకరూపతకలవియె జడమైన పదార్థమునందు చైతన్యమును దర్శించి పదార్థము పరమార్థమన్నచో అది భౌతికవాదము చైతన్యమున కాశ్రయముగా పదార్థమును చూచి చైతన్యము పరమార్థమన్నచో అది భావవాదము ఇంతకుమించిన పెద్ద చెప్పుకోదగిన భేదము అద్వైత్వమునకు భౌతికవాదమునకు లేదు ఈ దృశ్యమైన సమన్వయ దృక్పథమును అవలంభించి అవగాహనలో కుడిసె సంఘర్షణమునకు దిగని ప్రవాహరూపమైన గతిభావనతోడి చక్కని ప్రాపంచిక దృక్పథమును అందించునదిగా జన్మ సంస్కారవాదము సోపపత్తికముగా ప్రతిపాదింపబడినది

భావవాదము నందుండెడి ఈశ్వర పరికల్పిత నియతి లక్షణమును భౌతికవాదము త్రోసిపుచ్చి, దానిని ప్రకృతి గత లక్షణముగానే చెప్పును దైవవాదమును రచయిత త్రోసిపుచ్చుటలోను పదార్థమునకు గోచరత్వ లక్షణముచేత ఉనికి చెప్పుటలోను బౌతికవాదమును కలుపుకొని పోవుట కన్పించుచున్నది ఖండకాలజ్ఞానమును అల్పవిషయముగానూ, అనంత కాలజ్ఞానమును ఋషి విషయముగానూ, మరియు నది మానవ జీవితమునందు సుఖమును సంపాదించుటకు మూలభూతముగానూ చెప్పుటకూడా (128) జాగ్రత్తగా విచారింపవలసియున్నది ప్రకృతిగత లక్షణమైన నియతి పంచభూతములయందును పరినిష్ఠితమైయున్నది దానికి మించిన దేవతాశక్తి యనగా నేమి?

జలము గడ్డకట్టి భూమిగా నైనదన్న సిద్ధాంతమును రచయిత సామంజస్యము కుదరనిదిగా చెప్పిన (123, 124) విషయమునకు పరీక్ష యవసరము

## 5

ఎవరు పామరులు? "లోకముయొక్క దృష్టియెట్టి దోతెలిసినదా? తానొక విధముగా నాలోచించుట కలవాటుపడినది అట్లే యాలోచించును దానికి నుత్సర్గ శాస్త్రమునందే విశ్వాసము అపవాదశాస్త్రముయొక్క జ్ఞానము దానికిలేదు వట్టి యుత్సర్గ శాస్త్ర ప్రమాణము కలది లోకము అందుకనియే వారిని పామరు

లందురు" (95) ఉత ర్గాపవాదములనగానేమి? మహాభాష్యము పస్పశాహ్నికము నందు ఈ వాక్యములు కలవు "కథం తర్హీమే శబ్దాః ప్రతిపత్తవ్యాః? కించిత్సామాన్య విశేషవల్లక్షణం ప్రవర్తవ్యమ్ యేనాల్పేన మహతో మహతః శబ్దౌఘాన్ ప్రతిపద్యేరన్ కింపునస్తత్? ఉత్సర్గాపవాదౌ కశ్చిదుత్సర్గః కర్తవ్యః, కశ్చిదపవాదః శబ్దోపదేశమార్గము ప్రతిపదసాధుత్వాసాధుత్వములను చెప్పుట పెట్టుకున్నచో అది ఒక నాటిగ వగదెగదని, పతంజలి మహర్షి, అల్పప్రయత్నముచేత అధిక శబ్ద జ్ఞానము కలుగుట కనువుగా సామాన్య విశేష లక్షణములను నిరూపించు నదిగా తత్సర్గాపవాద రూపమున నుండును అని చెప్పెను అట్లు రచింపబడినదే వ్యాకరణశాస్త్రము [1] ఏ శాస్త్రమైనను దాని శాస్త్రీయమైన లక్షణమట్లే ఉత్సర్గాపవాదముగా నుండును అపవాదమునకు ఉత్సర్గమును బాధించు లక్షణమున్నది అపవాదశాస్త్రము ఎప్పుడో కాని రాదు కనుక దానిని విషయమైన జ్ఞానము ఎవరికో శాస్త్రాధ్యయనము చేసిన వారికికాని కలుగదు సశాస్త్రీయమైన విషయ వివేచనము అపవాదశాస్త్రము ఈదృశమైన బుద్ధి కలవాడు బుద్ధికలవాడు లేనివాడు లేనివాడు పామరుడనగా వాడు

## 6

యాజ్ఞవల్క్యుడు జనకమహారాజునకు మోక్షముపదేశించెను (391) ఈ వాక్యమునకు ముందు వెనకలుగానున్న మృత్యుభయము, అభయప్రాప్తి- ఈ మొదలయిన విషయ విచారణము వెనుక బృహదారణ్యకోపనిషత్తు యాజ్ఞవల్క్యకాండ భాష్య విజ్ఞాన సంస్కార మున్నది మరణించు వేళ దేనిని గూర్చి మరణింతువో పునర్జన్మయందది సిద్ధించునని చెప్పుదురు (390) ఈ యర్థమును చెప్పినది భగవంతుడు (భగవద్గీత 8 6) ఇక్కడ నవలా రచయిత గీతార్థమును విమర్శించుటలోని యౌచిత్యమును విచారింపవలయును

---

1 ఈ లక్షణమును బాల వ్యాకరణమునందును చూడవచ్చును ఇకాదులకు దప్ప ద్రుత ప్రకృతికములకు సంధిలేదు - ఇది ఉత్సర్గశాస్త్రము, ప్రథమేతర విభక్తి విధి అపవాదశాస్త్రము

## 7

రసో వై సః - ఇక్కడి రసశబ్దముయొక్క అర్థమునకును, కావ్యరసమన్నప్పుడున్న రసశబ్దముయొక్క అర్థమునకును పెద్ద సంబంధము లేదు (పుట 96)

## 8

నేనహంకారిని - అని భ్రమరవాసిని అన్న యర్థమును అస్మత్ప్రత్యయగోచరముగా చెప్పబడుచున్న ఆత్మమునందు విచారింపవలయును అమ్మవారు నామరూప రహితమైన బ్రహ్మపదార్థము గనుక అహం ప్రత్యయమున సూచింపబడుచున్నదని కావలయును అహం శబ్దార్థము నామె చేయుచున్నది అమెయే కర్త అమెయే కారయితకూడా

## 9

జీవునకు విశ్వచైతన్య స్వరూపమున అనుభవము స్వప్నావస్థయందే సాధ్యము మహాపురుష జీవలక్షణమును ప్రదర్శించుటకదియే తగిన రంగస్థలము కాశ్మీర చక్రవర్తి సామాన్యుడు కాడు కదా!

అతీంద్రియ సత్యవిషయమును అపరోక్షానుభూతిగా తెలిసికొనుటకు స్వప్నమే సరియైన మార్గము అచ్ఛమైన జీవ సంస్కార వాసనల కక్కడ సంచారమునకున్న వసతి మరొకచోట లేదు

## 10

దేశ ప్రాంతీయ భాషా భేదములు తాత్కాలికములయినవన్న వివేకము ప్రజలకు లేనప్పుడునూ లేకుండా చేయబడినప్పుడునూ అంతఃకలహములు పుట్టును అనంత కాల జ్ఞాన సంపన్నతయే ఈ యన్నింటికి విరుగుడు (పుట 127)

# ఏకవీర

ఏకవీర పేరడైజు లాస్టు అండ్ రీగెయిండు
నిర్మాణ శిల్పానల్ప చారిత్రిక నైతిక నవల

అందుకు సందేహము లేదు ఏకవీరయందు పైకి రాజసాహంకారము కన్పించుచున్నది నిజమే లోపల పనిచేయుచున్నది తామసాహంకారము అందువల్లనే బోధజనకమైన అంతఃకరణము యొక్క బుద్ధిసుఖము తెలివితేటలను ఆమె ప్రాణశక్తు ఒణచివేయగలిగినవి ప్రాణశక్తియనగా క్రియాశీలమైన అంతఃకరణముయొక్క ఒకానొక ముఖమే కదా! మరియు నామె లక్ష్యము తృతీయ పురుషార్థమునందున్నది ఇందుకు దేహేంద్రియమే సాధనము దానికి స్నేహమొక లక్షణము అందువల్లనే స్త్రీ పురుష దేహములకు పరస్పరాకర్షక లక్షణమున్నది ఈ దేహేంద్రియ గతమైన స్నిగ్ధత్వము యొక్క బహుముఖాభివ్యక్తియే రాగద్వేషాత్మకమైన మనోలక్షణము ఇక్కడ మనస్సు శరీరము రెండును కలసిపోవుచున్నట్లే యుండును మరియు ఈ శరీరమునకు స్వార్థమెక్కువ అనగా తన సుఖమునకు తానే సాధనము దానియవసరముండుటచేత దాని స్వార్థమును దానిని ననుభవింపవచ్చును అన్య ప్రయోజనము యొక్క సముత్పత్తికి దానిని వినియోగించుటకు ధర్మ మవతరించినది ఈ దశలోనే కామము పురుషార్థమగుచున్నది అనగా సంతానము ప్రయోజనముగా దేహేంద్రియముల యొక్క స్నేహలక్షణములు క్రియాశీలములు కావలయును ఏకవీరకు సంతాన కాంక్ష లేనేలేదు అయినచో వట్టి శరీరసౌఖ్యము నభిలషించి ప్రవర్తించినదా యన్నచో అసలది కానేకాదు మనస్సు, శరీరము కలసిపోవుచుండెడు దశయందే ఏకవీర జీవితము మూడు వంతులకు పైగా అయిపోయినది మరియు నామెయందలి అప్పటి వైశిష్ట్య మేమనగా మనోలక్షణమునందు రాగమేకాని ద్వేషము లేకపోవుట ఆ విధముగా నామె ద్వంద్వాతీతురాలు కామమును పురుషార్థముగా పొందుటకు దేహేంద్రియముతో ఆమె ప్రయత్నము చెయ్యకపోలేదు చెయ్యకపోలేదు కాదు - గట్టిగా చేసినదికూడ కుట్టాను ఆ ప్రయత్నమును ఫలవంతము

కానిచ్చినాడు కాడు ఆయన చేసినదంతమాత్రమే కాదు తామిరువురయొక్క యోగసిద్ధికి ఏకవీర నిర్మించిన ప్రేమసౌధమునకు కుట్టాను నిర్దయాద్వారము నొకదానిని తెరచినాడు దానిని మూయుట ఏకవీరవల్ల కాలేదు పురుషార్థముగా కామమును సేవించుటయే ధర్మము వట్టి కామసేవనము నందును మాధుర్యమున్నది అది వట్టి స్వార్థము అది ఉపాదేయముకాదు అనుభవింపబడుచున్న మాధుర్యమును ధర్మము రక్షింపవలయును పురుషార్థములన్నియు ధర్మములు ధర్మానుష్ఠానమునందు మాధుర్యానుభవమున్నది ధర్మానుష్ఠానము కాకను మాధుర్యానుభవమున్నది మొదటిది వీలుకానప్పుడు కుట్టాను తీసిన నిర్దయద్వారము నుండి తరలొల్లిటి వలపుకాడు మనసులో ప్రవేశించుచున్న సంగతి ఆమె కవగతము కాలేదని రచయిత చెప్పిన మాటలో కీలకమున్నది మరియు నామె ప్రవృత్తి యంతయు దేహేంద్రియమును చిత్తసౌఖ్య రూపమైన ఆనందానుభవమునకు అభిముఖము చేయుచున్నట్లే యున్నది వేసినదా అన్నచో శరీరము తదభిముఖమగుచున్నప్పుడు దానినామె నిషేధింపలేకపోయినది తెలిసితెలియని ఒక అవ్యక్తావస్థలో ఆమె తదనుభవము వెంట పర్రిభమించినది ప్రమాదము జరుగనంతవరకు తాదృశమైన ప్రవృత్తి వల్ల ఇబ్బందిలేదు లేదనగా అదియున్నట్లే తెలియదు ప్రమాదమనగా చిత్తసౌఖ్యము శరీరసౌఖ్యము స్థాయికి దిగుటయని యర్థము కూచిపూడి భాగవతము నాటివరకు వీరభూపతి కంటపడువరకు జరుగని ప్రమాదమప్పుడు జరుగనే జరిగినది జరిగినదని తెలిసిన వెంటనే ఏకవీర నాలుక కరచుకొన్నది బుద్ధిధర్మము బలహీనపడి మనోధర్మము కూడ దేహధర్మమునకు ప్రాణశక్తుల చేత దిగలాగబడుటయే ప్రమాదము ఈ ప్రమాదము జరుగరాదని ఏకవీర ఎంత చేసినదో ఈ ప్రమాదము జరుగుటకు పరిస్థితులంత కంటె ఎక్కువ చేసినవి దేహేంద్రియ మా విధముగా విజయము సాధించిన తరువాతగాని అది బుద్ధీంద్రియము నంతగా అవమానపరచిన సంగతి ఏకవీరకు తెలియలేదు బుద్ధీంద్రీయమునకు జాగృతిని ప్రేరేపించుటకే ఆమె అన్ని అవస్థలును పడినది కానీ, అది కలసి రాలేదు

ఏకవీర సుందరేశ్వరుని చెక్కబడిన విగ్రహమును చూచి "నీకు కూడా నీ మోహపాశములు వదలలేదా?" (53) అని యేకాంతము నందన్నది అవి తనను వదలక పట్టుకొని వేధించుట నామె యెరిగి యెరిగి అనుభవించుచున్నదని యర్థము ఈ యుపాధి రూపముననున్న త్వగింద్రియానుభవమునందలి సుఖాపేక్ష

యా ప్రవృత్తి ప్రేరకమైన చిత్తప్రవృత్తియే ఆ మోహము అది అంత బలవంతమగుట వల్లనే ఆమెను నిషిద్ధ విషయమునందు ప్రవర్తింపచేసినది కలసి రాకపోయినను బుద్ధీంద్రియమునందు కొంత జాగృతి లక్షణమున్నది కనుక తన సుఖరూపమైన మోహమునందు ప్రవర్తించుటలోని అధర్మ లక్షణమున కామె అంత భయపడినది ఆ భయ విహ్వలతను పోగొట్టుకొనుటకే ఆమె భగవంతునియందు మోహలీలా లక్షణమును సంభావించినది ఇంతకను ఏకవీర విషయమున వీరభూపతిమీది ప్రేమ గొప్పదా? ఇంద్రియ విషయ సుఖాసక్తి గొప్పదా యన్నచో తరువాత దానిముందు మొదటి దాగదు ఆమె సౌందర్య మామెకు అనుభవానుకూలము నందున దుఃఖహేతువైనది ఆమెలో కుములు దంతయును ఏతదనుభూతి రాహిత్యమును విపరీతముగా భావించుటగానే యున్నది వీరభూపతి విషయమున ఏకవీరకు ప్రేమయే మొదలు విషయోపభోగాసక్తి దాని కనుకరణము అసలు వీరభూతి చాల విలక్షణమైనవాడు గృహస్థ ధర్మమనగానేమో అది ఎంత విధియో కూడా అయనకు తెలియును భార్యను ప్రేమింపలేనివాడు జీవితములో ఏమియును సంపాదింపలేడని తెలిసియు తెలియనివాడు వలె ప్రవర్తించి ఈ జన్మ యెత్తినది సుఖము లనుభవించుటకు కాదని సన్యసించిన స్త్రీ లెక్కవగా మెచ్చుకొనెడు ముఖ సౌందర్యమువాడు కుట్టాను విషయమున ఏకవీరకు ఏదీ మొదలన్నచో భోగాసక్తియే మొదలు దాని బాహ్యరూపమునే ఆమె ప్రేమగా భావించినది ఒకసారి కుట్టాను ఆమెను తన ఎదురు రొమ్మున కదుము కొన్నప్పుడు ఆమె మహానంద సముద్రములో మునిగి తేలి "ఇప్పుడే ప్రేమించు"మని ఏడ్చినది కూడా అదంతయు విషయోపభోగాసక్తి లక్షణము తృతీయ పురుషార్థము నిజముగా పురుషార్థమగుటకు లక్ష ఆవరణలకది ఒదిగి పోవలయును ఒదుగకపోవుటయనగానేమో ఒదుగనప్పుడది ఎంత దుర్భరమో దాని పరిణామములెంత భయంకరములో ఏకవీర అందుకు నిదర్శనముగా నున్నది

II

"ఏకవీర కనులు భగవంతుని కన్నులతో గలసెను స్వామి యాచూపు వెంట నామెలో ప్రవేశించెను రాబర్టు నొబిలి పని అపుచేయవలయునని చొక్కనాథ శివునియాజ్ఞ ఏకవీరలో స్వామియాజ్ఞ వినబడినది" (179) వీరభూపతితో ఏకవీరకు విచిత్ర సంయోగము జరిగినదన్న తరువాత పైవాక్యార్థములు సంభ

వించినట్లు వ్రాయబడినది ఇక్కడ భగవంతుడు, రాబర్టు నొబిలి, ఏకవీర ఈ ముగ్గురు కనిపించుచున్నారు భగవంతుని అట్లుంచినచో రాబర్టు నొబిలీని SATAN గానూ, ఏకవీరను జీససుగానూ ప్రదర్శించు సంకల్పము రచయిత మనస్సులో ఉండియుండునేమో అని అనిపించుచున్నది జీససును ప్రలోభపెట్టి పరీక్షించుటకు వచ్చిన సాతానువలె రాబర్టు నొబిలీ లౌకికముగా సమాజము దృష్టిలో పతితగానై పిచ్చిదానివలె తిరుగుచున్నదన్న ఏకవీర వద్దకు ఎందుకు వచ్చినాడనగా, తాను తన మతము ఆమెను సముద్ధరించుటకు సిద్ధముగానున్న వైనము చెప్పి ప్రలోభపెట్టి మతములో చేర్చుకొనుటకు సాతానుకు జీసస ఎదురు చెప్పినట్లే నొబిలీకి ఏకవీర చెప్పినది సాతాను జీససుముందు నిలువలేకపోయి నట్లే నొబిలీ ఏకవీరముందు నిలువలేకపోయెను "జనుల నిందా వాక్యములు వినలేక యదేపోకపోయెను అతడు గతించిన నాలుగేండ్లుగా నిర్మించిన సౌధమా నాటితో నేలగూలెను " వీరభూపతితో తాను పొందిన విచిత్ర సంయోగము పాప కార్యమన్న తెలివి ఏకవీరకు వెంటనే కలిగినది అనగా నామె మనస్సు అంతకు పూర్వమువలె సంకల్ప వికల్పములతో కొట్టుమిట్టాడుటలేదు క్రైస్తవమత పరి భాషలో చెప్పినచో పశ్చాత్తాపతప్తమైన ఏకవీర పరిశుద్ధాత్మగానున్నది ఇట్లగు నట్లుచేయు క్రియా కలాపమునకే బాప్టిజము అని పేరు జీసస జానువద్దకు వచ్చి బాప్టిజమును పొందిన తరువాతనే సాతాను వెంటబడినది అందువల్లనే జీసస సాతానును వదలించుకొనగలిగినాడు అందువల్లనే ఏకవీరముందు నొబిలీ ఆగలేకపోయినాడు ఈ విధముగా కల్పించుటచేత నవలలో ముందు వెనుకలుగా నున్న ఏకవీర పాత్రసమస్తమును ఇక్కడ ప్రవక్తృస్థాయి కెక్కినట్లుగా కన్పించుచున్నది స్వామి ఏకవీరలో ప్రవేశించుట దేవుని పరమాత్మతత్వము పావురమువలె జీససుమీద వచ్చి వాలినట్లుకంటెను ప్రగాఢముగా నున్నది ఏకవీరలో వినబడిన స్వామియాజ్ఞ జీససను గురించి ఆకాశము నుండి వినబడిన దేవవాణివలెనున్నది ఏకవీర భగవంతుని చూచినదనగా ఆమె హృదయమునందంత పరిశుద్ధమైనదని యర్థము నవల యంతయును ఆమె విషయమున హృదయ పారిశుద్ధ్యమును సంపాదించుటకే సాగినది భగవంతుని చూడగలుగుటకు, ఆయన అభీష్టమును ఈడేర్చుటకు తగిన సాధనమగుటకు అంత సంఘర్షణ, అంత ఒత్తిడి, అంత విచారణ, అంత ప్రేరణ, అంతర్ముఖీనమైన వివేకము, అంత మనో నిశ్చయము

కావలయునన్నమాట! ఏకవీర జన్మించినదానికిదే పరమార్థముగా నున్నది మిగిలిన కథయంతయును ఆమె వ్యక్తిగతమైన సొంత జీవిత విషయము అందు పెద్ద సాధించిన దేమియులేదు ఉన్నదన్నను అది సిగ్గుపడవలసినదేకాని అగ్గింపదగినదికాదు అయినను అంచుకామె తనకుతానే శిక్షను నిశ్చయించుకొన్నది గనుక సమాజ మాశ్చర్య చకితమై ఆమెనప్పుడును అగ్గించుచునే యున్నది ఏకవీర తన వాదమును ముగించుచు నోబిలీతో అన్నమాటలు జీసను కొంద కొమ్మెక్కి శిష్యులకు చేసిన ప్రబోధముయొక్క తాత్పర్యముగా నున్నవి క్రైస్తవ మతమును ప్రచారము చెయుచున్నాననుకొన్న వానికా తాత్పర్యము పట్టలేదు ఒక మతమును నిందించి మరొక మతమును ప్రచారము చేయరాదన్నదే పరమార్థము ఆ పరమార్థమును ప్రకటించుటకే ఏకవీరను శివసుందరుడను గ్రహించినాడు వ్యవస్థా ధర్మము నతిక్రమించి ఇంద్రియ కామము వెంట మైమరచి పోయిన తన ధర్మచ్యుతి లక్షణమును తానే తెలిసికొని శిక్షను కూడా తానే నిర్ణయించుకొనునంతటి వివేకము యొక్క పరిపక్వదశయందే భగవంతుడామెను అనుగ్రహించినాడు తన అంతర్యమున కామెను ప్రతినిధిగా చేసి మాట్లాడించినాడు "భర్త జీవితమును సుఖపరుపవలెనని తల్లి నేర్పించిన యేకవీర చదువు శ్రీసుందర చొక్కనాథశివుని కుపయోగపడినది"— పైన వ్రాసినందతయును ఈ వాక్యము నుండి వచ్చుటకు వీలున్న అర్థ విశేషము యొక్క స్వభావమే మరియు నామెయెవరికోసమో యెదురుచూచున్నట్లుండెను నోబిలీకి తెలిసినది పరుగెత్తుకొని వచ్చెను " ఆమె అతనికోసరమే యెదురు చూచుచున్నదా? అట్లేయున్నదికదా! దేవుడు తన సంకల్పము నీడేర్చుకొనుటకు ఏకవీర నట్లుచేసెనా? ఇక్కడ కథ ఎంత భౌతికమో అంత ఆధ్యాత్మికముగా నున్నది ఈ దేవకార్యనిమిత్తమే ఏకవీర జన్మించినది కావలయును కానిచో సుందరేశ్వరుడు— భామాకలాప ప్రదర్శనము - రాబర్టు నొబిలి - మొదలయిన ఈ సన్నివేశముల అంతర్యము లింకను భావింపవలయును

III

ముద్దుకృష్ణప్ప నాయకుడు మధురను పాలించినది పదునేడవ శతాబ్దము మొట్టమొదటి పదిసంవత్సరాలు ఆ కాలముతో మొదలయిన కథ ఆ తరువాత ముద్దువీరప్ప నాయకుడు పాలించిన పది పన్నెండేండ్లలో మొదటి కొంత కాలము జరిగి ముగిసినవి మధురను రాజధానిగా దక్షిణదేశమును పాలించిన తెలుగు

నాయకుల చరిత్ర వెలుగులోనికి వచ్చినది 1924 వ సంవత్సరములో మద్రాసు విశ్వవిద్యాలయము చారిత్రక విభాగము మధుర నాయక రాజుల చరిత్రమును ప్రచురించినది విశ్వనాథవారి ఈ నవలలోని కథ కాగ్రంథమే ఆధారమో ఏమో చూడవలయును ఈ తండ్రికొడుకుల పరిపాలనా కాలంలోనే దక్షిణ భారత దేశములో క్రైస్తవ మత ప్రచారము మొదలయినది [1] ప్రచారము కాదు యూరోపియనులు భారతదేశముమీదపడి దోచుకొనుటయే బ్రతుకుతెరువుగా బ్రతుకుటలు మొదలయినవి భారత జాతీయోద్యమము తీవ్రమగుచున్న కాలమునందుండి స్వస్థాన వేష భాషాభిమానముగల రచయిత ఆ క్రైస్తవ మత ప్రచార ప్రారంభ కాలమునాటి కథను నవలగా రచించుచున్నాడనగా అందుండవలసిన తీవ్రత ఉండనే యుండును తొమ్మిదవ అధ్యాయమందుకే యున్నది భారతదేశమునకు వచ్చిన యాపదయంతయు సముద్రయానమున నౌకాజీవనమున శ్రద్ధ లేకపోవుట వల్లనే వచ్చినదన్న రచయిత అంతర్యమును విచారించినచో మహమ్మదీయుల వల్లకానీ మరియే విదేశీయుల దండయాత్రల వల్లనగానీ జరుగని విలక్షణ పరిణామమును పాశ్చాత్యుల ప్రవేశము తీసికొని వచ్చినదని తెలియగలదు భారత జాతీయ సంస్కృతీ సంప్రదాయముల మౌలికతకు భంగము కలిగింపగలిగినంతటి తీవ్రాభినివేశముతో పశ్చిమ భావవాయువులు విసరివిసరి వీచుచుండుటను రచయిత అనుభవించి రచించినాడు

రాబర్టుడీ నోబిలీ జగద్గురు తత్త్వబోధకస్వామి అను పేరున హిందూ సన్యాసి వేషమున క్రైస్తవ మతమును భారతీయులయందు ప్రచారము చేయుట కుపక్రమించి పనిచేసిన చారిత్రక సత్యమును విశ్వనాథ కథాకాలమున కనువై యున్నందున ఒక మహాప్రయోజనము నభిలషించి ఈ నవలలో ప్రవేశపెట్టినాడు సరిగా ముద్దుపీరప్ప నాయకులవారి కాలములోనే ఈ నోబిలీ - ఐరోపా దేశపు స్వాములవారు - మధురలో ప్రసిద్ధులుగా ఉన్నారు ఈయన ప్రచారము నాలుగైదు సంవత్సరాలే సాగినది

## IV

ఒక విధముగా చూచినచో మిల్టను మహాకవి తెలుగులో విశ్వనాథ సత్యనారాయణగా పుట్టినట్లు కన్పించుచున్నది ఆంగ్లభాషా వాఙ్మయములో ఆయనకు

1 ఏకవీర - పుట 33

శైలీ వైశిష్ట్య మెంతయున్నదో ఈయనకు మన ఆంధ్రభాషా వాఙ్మయములో తాదృశమైన శైలీ వైశిష్ట్యమంతకంటె ఆరాకు లెక్కువగా నున్నది సంగీత మాధుర్యరూపమైన లయాన్వితత్వము ఉభయుల రచనలయందును పుష్కలముగా నున్నది మరొక్కటిగూడా ఉన్నది ఎవరి దేశ కాల మత తాత్త్విక గతి విశేషములను వారు గ్రహించి రచనలు చేసినారు మత తాత్త్విక విషయాలను గ్రహించిన రచయితల రచనలకు శాశ్వతత్వము పట్టు అవకాశమున్నదాయని ఒక యభిప్రాయమున్నది అసలుసంగతి యేమనగా - మతము లేదు తత్త్వము లేదు చరిత్రలేదు సంస్కృతిలేదు నాగరకతలేదు ఏమియునులేదు ఉన్నదల్లా ఒక్క మనిషి మనిషి ఉన్నాడనగా అవన్నియును ఉన్నవనియే అర్థము మనిషి తన ఉనికి కొరకు వాటినన్నింటిని సృష్టించుకొన్నాడు అవి లేకుండా మనిషి లేడన్నమాట అందువల్ల మనమూరక పైకి మతమని వేదాంతమని రాజకీయమని వెసులుబాటు కొరకు అనుటయేకాని నిజముగా మన మనుకొనుచున్నది మనిషిని గురించియే అవన్నియును మనిషిని గురించి చెప్పుటకే కల్పింపబడినవి అనగా, మనిషి తనను గురించి తనకు తెలియజెప్పుటకు వాటినన్నింటిని సృష్టించినాడు మత తాత్త్విక గతి తార్కిక చారిత్రక భౌతిక విజ్ఞానశాస్త్ర మర్యాదలన్నియును మానవునియొక్క విభూతి విస్తార లక్షణములు మాత్రమే పరమేశ్వరుడు తన విభూతులచేత తాను ఈ లోకములను వ్యాపించియున్నట్లు మనిషి తన మనస్సంజాతములయిన మత తాత్త్వికాది విజ్ఞాన భావ విశేషములచేత నాగరకుడును సంస్కృతీ సంపన్నుడును అయి విశ్వమును వ్యాపించియున్నాడు అందువలన మనిషిని గురించి తెలిసికొనవలయుననగా మనిషియొక్క విభూతి లక్షణములయిన మతతాత్త్విక భావములయందు ప్రవేశింపవలయును సాహిత్యమంతయును మనిషిని గురించి మనిషికొరకు మనిషిచేత కల్పింపబడినదే కనుక అది మత తాత్త్విక విషయములకు దూరముగా నుండలేదు ఉన్నదే ఒక మనిషియైనప్పుడు తనను గురించి తప్ప తనకు మరొకటి తెలియుటకు వీలులేదు కదా? తానసగా తన మత తాత్త్విక భావ రూపమున తప్ప మరొక విధముగా నుండుటకు వీలు లేదుకదా? అందువల్లనే ప్రపంచ భాషా సాహిత్యము లన్నియును మనిషిని చుట్టుకొనియే అల్లికపని చేయబడినవి ఆ విధముగా ప్రతి రచయితకును తానే మనిషి తనను గురించియే తాను వ్రాసికొనుచున్నాడు మరి వారిని గురించియే వారు వ్రాసికొనుటకు వారియందంత యున్నదా అన్నచో ఉన్నదనియే చెప్పవల

యును తనదిగాని దానిమీద ఎవరికి స్వాతంత్ర్య మేమి యధికారముండుటకు వీలున్నది గనుక? ఎంత ఉన్నదో ఆ రచయితలంత మహాపురుషులు మహాపురుషులనగా మానవులకు కొంత తెలిసి కొంత తెలియక వారిని చుట్టుకొని వారి బ్రతుకుతెరువులను నిర్ణయించెడు అదృష్ట విషయసంపత్తిని పరమార్థభూతముగా భావింపగల ధీకౌశల్యము కలవారు మానవజాతి పకగడకు సంబంధించిన ఏతాదృశమైన అదృష్టముయొక్క జ్ఞానముయొక్క పరిపూర్ణాభిగమనము స్థాయి పురుషులను మహాపురుషులను చేసినట్లే రచయితలను మహా రచయితలను చేయును

కాబట్టి విశ్వనాథ వాఙ్మయమంతా విశ్వనాథను గురించినదే అదృష్ట జ్ఞానము యొక్క స్థాయి నందుకొనుచున్న కొలదియు మనిషి తన వ్యష్టిలక్షణము నుండి సమష్టి లక్షణమునకు పరిణమించును రచయితలో ప్రధానముగా పరిణామమనగా నిదే సమష్టి మానవజాతియొక్క సమష్టి చైతన్యమునందున్న జ్ఞాతము - అజ్ఞాతము అయిన రెండు ముఖములలోని రంగుల మార్పుల రహస్యము తెలిగిన రచయితలే దార్శనికులయిన రచయితలు ఇంద్రియ గోచరము లయ్యెడు విషయముల యొక్క ప్రత్యక్ష తారతమ్యములను ప్రదర్శించు రచనలవి యేమిరచనలని త్రోసివేయుట పనికిరాదుకాని, అవి ప్రాథమికములని చెప్పవలయును దార్శనికులయిన రచయితలు భావనాశక్తికి పరమ విషయము లయిన అదృష్టముల నాధ్యాత్మిక భూములనుండి వాఙ్మయమున కవతరింపజేసెదరు మిల్టనూ అదే చేసినాడు విశ్వనాథయును అదే చేసినాడు

ఇంతకునూ మనిషి యనగానేమి? ఏమనగా, ఇంత భౌతికతను ఆశ్రయించిన ఆధ్యాత్మికత ఇంత ఆధ్యాత్మికతను గర్భమునం దిముడ్చుకొన్న భౌతికత ఇట్లది యొక ద్వంద్వముగా కన్పించుచున్నది కదా అని వేరువేరుగా చేసి నిజముగా నిందేది మనిషి అని చూచినచో ఎందును మనిషి కన్పింపడు అసలవి వేరు చేయబడవు అందువల్ల మనిషియనగా భౌతిక ఆధ్యాత్మిక చైతన్య సంపుటి అంచు మేల్కొన్న మహా మనీషులయిన రచయితలే వసుధైక కుటుంబమును దర్శింపగలవారు సాధారణ మానవులా సంపుటియందు గాక అజ్ఞానము చేత దానియందో దీనియందో ప్రవర్తించుటచేత తూకము కుదురక జీవితములు దుఃఖముల పాలగుచున్నవి నిక్కచ్చిగా చెప్పవలయునన్నచో మానవ సమస్య అనగా నిదే సమస్య ప్రపంచ భాషా మహారచయితలందరకును నిదే సమస్య

V

ప్రపంచ వ్యవహార లక్షణమైన భౌతికత కన్పించినంతగా ఆధ్యాత్మికత కన్పించదు కన్పించకపోయినను భౌతిక వస్తుసంపద ఇంద్రియముల నాకట్టుకొని ఆధ్యాత్మికమైన చైతన్యమును ఇరకాటమున పెట్టిన దాని యనుభవమును జీవుడు పొందుచున్నాడు ఆ యనుభవ జ్ఞానము వలన మరొకసారి అట్టిది సంభవింపకుండ భౌతిక వస్తుసంపదల యందు ఇంద్రియములకు ప్రవృత్తి లేకుండ చేయగలుగుటచేత ప్రపంచముయొక్క పరమోదాత్తమైన సాగుదలను జీవుడు సాధింపగలుగుచున్నాడు ఆధ్యాత్మిక చైతన్యము యొక్క విజ్ఞాన ఫలమిది ఇంద్రియముల ప్రవృత్తిని ప్రపంచముయొక్క సాగుదలకు దోహదకారులుగా చేసి చేసెడు ఆధ్యాత్మిక చైతన్యశక్తికి నీతియని పేరు అది లోకమును నడిపించుచున్నది గనుక నీతి అది లోకమును ధరించుచున్నది కనుక ధర్మము ధర్మముయొక్క భౌతికత నీతి నీతియొక్క ఆధ్యాత్మికత పేరు ధర్మము నైతికాదర్శములను సాహిత్యము సమాజము ముందు పెట్టి దానిని తదభిముఖముగా నడిపింపవలెను చేతనులు జడమును జడముగా నుపయోగించుట నీతి జడీభూతులై ప్రవర్తించుట అవినీతి

తన ఆధ్యాత్మిక శక్తి సామర్థ్యముల వివేకమును మరుగుపరచు దేశ కాల పరిస్థితుల విషయమున మనిషి మేల్కొనియుండుట నుద్దేశించియే సాహిత్యము ప్రవర్తించుచున్నది తాదృశమైన జాగృతిలేని విస్తృతమైన సమాజమును సముద్ధరింపవలయుచన్న తీవ్రభావావిళివేశముకలవారే రచయితలు జాగ్రత్తగా ఉండుట ఎంత అవసరమో - ఆ ఉండుటలో ఎంత కష్టమున్నదో - మరియు నది ఏపాటి త్యాగమును కోరు లక్షణము కలదియో నిరూపించి, మనిషిని ఆధ్యాత్మిక శక్తి సామర్థ్యముల మీద నిలబెట్టి చూపుటయే వారి పద్ధతి కనుక, మనిషి లేకుండా ఏమియును లేదు ఏకవీరలో మనిషియనగా ఏకవీర ఆ నవలకామె కేంద్రము. ఆమె తనను తా నుపసంహరించుకొనుటతో నవల అయిపోయినది ఆమె ఎందుకు మరణింపవలయును? ఆమె నామె యెందుకు చంపుకొన్నది? ఆమె కేవలము ఇంద్రియముల గూడు మాత్రమే కాదు ఆమె బుద్ధి నైశిత్యము కలది అనగా, సామాజిక స్పృహ కలదియని యర్థము అందువలన ఆమె శీలవతి శీలమనగా నేమనగా - తన త్రికరణములచేతను విశ్వము యొక్క శ్రేయోభావమునకు ద్రోహకారికాక ప్రవర్తించుట ద్రోహము తనవల్ల జరిగినదని అనిపించగనే

అంత చేసిన ఆ శరీరము తనకిక పనికిరాదని ఆమె దానిని వేగ్గె నదిలోనికి విసరి పారవేసినది ఆమె నైతికాదర్శమే ఆమెను తనను మన్నించనప్పుడు బలి గొన్నది ఏకవీర జీవుడు నైతిక ధర్మ విజ్ఞానము పుష్కలముగా కలవాడు. అంతగా ఉన్నందువల్లనే అంత ట్రాజెడీ ఇక్కడ పారడైజు లాస్టులోని సైతానును గమనించవచ్చును అతనికున్న సదసద్వివేకము తక్కువదికాదు వివేకమునకంటె కొన్ని కొన్ని సందర్భములలో అవివేకమెంత బలవంతముగానుండి దానిని దిగ ద్రమింగి తాను ప్రవర్తించి మనిషిలో అనూహ్యములయిన ఘోరవికారాలను కల్పించి సామాజిక స్పృహాలక్షణము నుండి విపరీత దూర ప్రాంతాలకు మనిషిని ఎలా విసరి నేలకుకొట్టగలదో అన్నదానిని మిల్టనెంతగా ప్రదర్శించినాడో విశ్వనాథ మరొక కోణమునుండి అంతగా ప్రదర్శించినాడు ఇద్దరూ కూడా మనిషి యొక్క పతనానికి హేతువును స్త్రీ పుంసయోగమునందే చూచినారు ప్రపంచము స్త్రీపుంసయోగోద్భవము ఏది తనకు జనకస్థానమో అదే తనకు వినాశన స్థానము కూడా ప్రపంచ అభ్యుదయమునకు ప్రపంచ వినాశనమునకు ఉన్న దూరము పరమ సూక్ష్మమైనది అది సామాజిక స్పృహయందున్నది. వ్యక్తి యొక్క ఇంద్రియ సుఖ స్పృహా లక్షణమునందు లేదు ఉన్నచోటును చూచుకొనక లేనిచోటకు దూకినప్పుడు పతనము తప్పదు ఉన్నచోటుకు సంబం ధించి ప్రవర్తించుట నియతి లక్షణము అనియమ ప్రవృత్తి లక్షణము నాగరకము కాదు అభ్యుదయ మార్గము కాదు నియమము సంస్కారార్థమన్న విశ్వశ్రేయోభావమును ప్రబోధించుటకు ఒకరొక కావ్యమును, ఒకరొక నవలను- ఒకరింగ్లీషులోను, ఒకరు తెలుగులోను - ఒకరు పదిహేడవ శతాబ్దములోను, ఒకరు ఇరవయ్యో శతాబ్దములోనూ రచించిపోయినారు అటు మిల్టను ఇటు విశ్వనాథ ఇద్దరూ కూడా సమష్టి విశ్వ చైతన్యమైన ఈశ్వరేచ్ఛలను సామాజిక ప్రయోజనాలనుగా తమ తమ దేశీయులను పవిత్రమును ఉదాత్తమును అయిన జీవిత విధానమునకు ప్రేరేపించుట కొరకు తమ తమ ప్రజ్ఞలను ధారపోసి రచనలు చేసినారు మిల్టను పురుషుని కేంద్రముగా చేసికొని చెప్పగా విశ్వనాథ స్త్రీని కేంద్రముగా చేసికొని చెప్పినాడు అసలు సృష్టిలో ఉన్నది ఒక్కరే అయినను కనిపించునది ఇద్దరుగా గనుక ఆ యిద్దరిలో చెరి యొకరిని చెరి యొకరు పట్టుకొని విచారణ ప్రారంభించినారు ఈవు కనిపించినప్పుడు ఆదమేమై నాడు? వీరభూపతి కనిపించినప్పుడు ఏకవీర అంతకు పదిరెట్లైనది.

విధినిషేధముల బలము నాలోచింపక మనిషి అతిక్రమించి ప్రవర్తించుట వల్ల నయ్యేడు ప్రళయమునే ఇదువురు మహా రచయితలను చెఱియొక కోణము నుండి కావ్య వస్తువునుగా చేసికొన్నారు తెలుగులో వచ్చిన పారడైజు లాస్టు ఏకవీర[1] - రీగెయిందు కూడా

మనోవాక్కాయములచేత మనిషి చేసెడు ప్రతి చర్యకు అది ఎంత స్వల్పమైనదని మనుమనుకొన్నను దాని పరిణామ ఫలితము దానికుండకుండా పోదు ఏకవీర చేసినపని వీరభూపతి నుద్దేశించి మనస్సుచేత మధుర ప్రేమలతను ఎగబాకించుట అది ఆ విధముగా మనో వ్యాపారముగా నున్నంతవరకు ధాతువు ధాత్వర్థమునందున్నట్లు అప్పుడు దానివల్ల దేశకాలములు సంబద్ధములు కావు కాబట్టి, దేశకాల స్వరూపమైన సమాజమునకు పెద్ద చిక్కులేదు ధాతువునకు పురుష ప్రత్యయములతో యోగము కలిగిన దనగా అది దేశకాలములయందు క్రియగా పరిణామము చెందినదన్న మాట లోకము సర్వక్రియాకలాపస్థానము అసలు లోకమే క్రియారూపము ధాత్వర్థము భావరూపమున అభ్యంతరమున స్ఫూర్తి కలది క్రియ బాహ్యరూపమున ప్రవృత్తి కలది ఏకవీరా వీరభూపతుల విషయికముగా జరిగిన హఠాత్సంభవమైన ప్రేమ క్రియావృత్తి యొక్క తొందర లక్షణము దాని పరిణామ ఫలితముయొక్క తీవ్రతకు సంకేతము

## VI

మనిషి బ్రతుకుతెరువు లన్నియును సామాజికములు అందువల్ల ఎవరి ఇష్టము వారిదిగా మనుగడ సాగదు సామాజిక స్పృహలేని వ్యక్తి తిండికి చేటువాడు సాహిత్య స్పృహగల రచయితలు తమ రచనలయం దట్టివారి సుఖ జీవనమును కొనసాగినట్లు చిత్రింపరు సామాజిక స్పృహగల వారి జీవితము అష్టకష్టముల పాలు కావచ్చును ఆ జీవితములో వారు సాధించుకొన్నది లేక

---

1 డ్రైడను వ్రాసిన Marriage a - la Mode అను కామెడీలోని ఇతివృత్తమునకును ఏకవీరకును దగ్గరపోలికలున్నవన్న ఒక వాక్యము డా॥ బొడ్డపాటి కుటుంబరావుగారి 'ఆంధ్ర నవలా పరిణామము' 353వ పుటలో అధోజ్ఞాపికగా నున్నది డ్రైడనుకూడా మిల్టనుకంటె చిన్నవాడుగా పదునేడవ శతాబ్దమునందున్నవాడే

పోవచ్చును - సాధించుకొనుటకంటె సాధించుటలో సామాజిక స్పృహ చైతన్య లక్షణము యొక్క పరమార్థమున్నది ఆ సాధించుటను చిత్రించుటలో రచయిత లనుసరించెడు విజ్ఞానమార్గముల అతిశయములనుబట్టి వారి సాహిత్య స్పృహ నవగతము చేసికొనవలయును పైన చెప్పిన పరమార్థబుద్ధి ఏకవీర యందు న్నది చిట్టచివరి కామె కావలయుననుకొన్నది సాధించుకొన్నది కావలయునన్న ఇష్టమును ఇష్టమువచ్చినట్లు పోనీయక అదుపుచేసి చేసి చివరక్షణములో సమాజ మును త్రోసిరాజని ఇష్టము ననుసరించినది ఆ మైకము వదలగనే ఆమెకది ఒక ఘనకార్యముగా కన్పించలేదు తానింతకాలము చేసిన సాధన క్షణములో వృధాయైనది అందువల్ల సాధించుకొన్నది సాధింపదలచిన దానిముందు పరమ నీచముగా కన్పించినది తాను తనకసహ్యముగానైనది సాహిత్యస్పృహ ధ్వన్య ర్థ్వములయందు మేల్కొన్న రచయిత ఒక శీఘ్రగతిశీలమైన వేగముతో ఏకవీరను నడిపించి నడిపించి నేలబారు చూపులకు కామెడీ జరిగినదనిపించుచు పరమోదాత్త ప్రకృతి విజ్ఞానభూములకు సహృదయులను గూడవేయుటలోని రెక్కవాటుదనము చేత సమున్నయము చేసి అక్కడ ట్రాజెడీ చూపించినాడు ఏకవీర నవల ఎందుకు గొప్పదనగా - అక్కడ సామాజిక సాహిత్యస్పృహలు సమైక్యమును భజించినవి స్పృహ వ్యవహారము కొరకు సామాజిక సాహిత్య లక్షణములను పులుముకొనును బుద్ధిమంతులయిన రచయితలు పాత్రములు ఆ రెండింటి విషయమునను పండితులుగా వ్యవహరించెదరు

ఏకవీర పండితురాలు అందుకనే ఆమె తన శరీరమును కుట్టాను నుండి తప్పించుకొని నెట్టుకొని పోయి వైగై దిలో పారవేసినది సమష్టి సామాజిక చైతన్యమునకు సాధించి పెట్టవలసిన సంస్కారార్థమైన నియమము నుల్లంఘించి శరీరము స్వార్థము వైపు మొగ్గినందుకు ఏకవీర దాని ఉనికిని సమాజము నుండి తప్పించినది దుష్టాంగమును ఖండించి శిష్టాంగమును రక్షించినట్లు చేసినది ఇదంతయు నామెకు సామాజిక స్పృహ సలక్షణముగా నున్నదనుటకే నిదర్శనము మరియు విచారింపగా ఆమెకే కాదు వీరభూపతికి కూడా ఉన్నదని చెప్పవలయును లేనిచో ఆయన సన్యాసము స్వీకరింపడు వ్యవస్థాధర్మము ననుష్ఠించుటయే మానవతకు లక్షణమన్న సామాజిక స్పృహ వివేకముండి, అను ష్ఠానమునందు చ్యుతికల్గుటచేత తాదృశ్యమైన ప్రత్యవాయమునకు అను కూలముగా ప్రవర్తించిన ఇంద్రియశక్తుల బలహీన లక్షణమును సహింపలేక అందుకు తాము

పూచీపడి తట్టుకొనలేకనే ఆ యిరువురును ఈ వ్యవస్థా ధర్మ ప్రపంచము నుండి తమను తాము చెరియొక విధముగా బహిష్కరించుకొన్నారు

మరి కుట్టాను సంగతి? ఆయనకును సామాజిక స్పృహ ఉన్నది కాదు లేదు వ్యవస్థాధర్మానుష్ఠానము నందాయన కాభిముఖ్యమున్నది లేదు - ఇట్టి సమస్యను తెలనీయకుండా రచయిత విధినడ్డువేసినట్లుగా ఇది చారిత్రక నవల యగుటవల్ల కథాకాలమునాటి కుట్టానుయొక్క రాజకీయోద్యోగ నిర్వాహకత్వ మును ప్రదర్శించినాడు అదియును ఒక విధముగా వ్యవస్థాధర్మానుష్ఠాన రూప మైన సామాజిక స్పృహతోడి ప్రవృత్తి అనియే అనవలయును అక్కడ కుట్టాను రాజధర్మ నిర్వహణము కొరకని సీతాదేవిని పరిత్యజించిన శ్రీరామచంద్రుపలె ఉన్నాడనవచ్చునా? ఉపమానము నెక్కువ దూరము తీసికొని పోగూడదు పర్యవసానమునందు మాడగా వ్యవస్థాధర్మము నతిక్రమించినది లేదు భౌతిక నైతిక సంస్కృతీ సంప్రదాయ వాసనల అలజడికి ఏకవీర వీరభూపతులకు వలె కుట్టాను కొట్టుమిట్టాడలేదు

అవును మరి మీనాక్షి సంగతియేమి? ఏమనగా - ఆమెయే నిజమునకు గొప్పదిగా కన్పించుచున్నది మీనాక్షి సహజముగా వివేకవతి యనుటలో అర్థ మున్నది కుట్టాను చేసిన మధుర ప్రేమ భావముయొక్క త్యాగమును వ్యవస్థా ధర్మమే ధర్మమనుకొనుట వల్లనే ఆమె సంతోషముగా స్వీకరింపగలిగినది తన భర్తయైన వీరభూపతి విషయమున అంతకు ముందున్న తన ప్రవృత్తిని పూర్తిగా మార్చుకొన్నది ఆ ప్రవృత్తిలోని దోషమును కూడా తెలుసుకొని ఆమె వ్యథ చెందినది కుట్టాను సంగతి తెలిసిన తరువాత వీరభూపతి మీనాక్షియొక్క భర్తృ స్థానము నుండి తనను తాను భావమునందు తొలగించుకొన్నాడు అందువలన అతనికి తనపట్ల ప్రవర్తనలో వచ్చిన తూష్ణీంభావమును మీనాక్షి మిక్కిలిగా సహించినది మరియు నామె దాని నాసరా చేసికొని వీరభూపతినింకను ప్రేమిం చినది అయినను ఆమె అనుభవించిన దేమియునులేదు ఏకవీరా వీరభూపతుల విచిత్ర సంయోగ సంఘటనకు తాను ప్రత్యక్ష సాక్షియై దానివలన యుద్వేగము యొక్క స్పర్శకూడా తాను పొందకుండ నిబ్బరించుకొన్న ఆమె నిండుకుండ తనమునకు ఆమె కున్నదన్న సహజవివేకమే మట్టు ఆమె తనను నిరాదరించిన తన భర్తయొక్క పూర్వప్రణయినీ సంయోగమునకు తన మనస్సును వ్యథపాలు

కాసీయలేదు అట్లు కాసీయకపోవుట ఒక అసాధారణమైన చర్య ఇందువల్ల మాత్రమే ఆమె ఉదాత్తురాలు కాలేదు ఆ జరిగిన సన్నివేశమును చూచిన వెంటనే ఆమెకు జ్ఞాపకము వచ్చినది కుట్టాను "పాపమా కుట్టాను నిండుగా నీయందలి ప్రేమచే పరిభ్రమించుచున్నాడు ప్రేమోద్వేగియగు నతడు నేడు వచ్చునో రేపు వచ్చునో! నీవింత యుద్వేగప్రణయినివి' నవలలో ఇక మీనాక్షి మాట్లాడదు కుట్టాను ఇక ఎలాగా అనే సమస్య ఒక్కటే మీనాక్షి కండ్లముందు నిలబడినది ఇక ఏకవీరా కుట్టానుల సంబంధము సంబంధము కాదు కాదని తనకు తెలియును, కుట్టానుకు తెలియదు కనుక తెలియదు మరి ఏకవీరకు తెలియునా? ఎందుకు తెలియదు? తెలియవలయును తెలిసీ ఏమి చేయవల యును? తనకు తెలియును - తానేమి చేయగలదు? ఇది సమస్య ఏమి చేసినను ఏకవీరయే చేయవలయును అందుకన్నది - "ఏకవీరా! నీవెంత యుద్వేగ ప్రణయినివి?" అని ఈ మాటలు ఏకవీరకు వినబడలేదనగా ఆమెకు సమస్య అర్థ మైనదని యర్థము పరిష్కారము తెలియనంత వరకు సమస్య అర్థమైనట్లు కాదు అది ఏకవీర ఆమె మీనాక్షి వివేకవతియనగా ఆమెయే వివేకవతి అందుకే రచయిత ఆమెనేమియు చేయవలసిన అవసరము లేకపోయినది వ్యవస్థాధర్మబద్ధమైన ప్రవృత్తి కలవాడగుటచేత కుట్టాను తన బ్రతుకు తాను బ్రతికినాడు వ్యక్తి స్వేచ్ఛకు వ్యవస్థాధర్మమును బలిచేయజూచుట ప్రళయమును కొనితెచ్చుకొనుటయే అని తెలిసీ తెలిసీ అనుభవ మాధుర్యము నుండి మనస్సు లను మరల్చుకొనలేక అధర్మభీతి నంకుదింపసీయని స్వేచ్ఛనుబడి ప్రవర్తించి నందుకు ఏకవీరా వీరభూపతులు తమ్ము తామే శిక్షించుకొనిరి అనగా అధర్మ భీతిని వారెంతగా పరిస్థితుల ప్రభావముయొక్క బలమువల్ల నణగద్రొక్కి పట్టి ప్రవర్తించిరో - ప్రవర్తించిన మరుక్షణమునే దాని బలము సడలి వారియం దువ్వెత్తుగా లేచిన ధర్మభీతి ఆయా శిక్ష లనుభవించుటకు వారిని ప్రేరేపించినది ధర్మభీతి యన్నదే సామాజిక స్పృహ ముందు వెనుకలుగా దానిని మ్రింగుటకు మనిషిలో ఉండి బుసలుకొట్టెడి నాగుయొక్క రెండుతలలు మోహ లోభములు మోహలోభములువ్యక్తి పక్షము ధర్మము సంఘపక్షము సామాజిక ధర్మవ్యవస్థను మోహవ్యక్తిలోభములుకూలద్రోయరాదు ఆ ప్రయత్నములెప్పుడును శిక్షార్హములు వ్యష్టి స్వభావమునకు సమష్టి ధార్మిక నైతిక శక్తులకు సంఘర్షణ వచ్చి మానవుల బ్రతుకు తెరువులకు రూపకల్పన చేయగలవు మిల్టను పారడైజులాస్టు ఈ

విషయమును నిరూపించుటకే రచించినాడు రచయిత ఎప్పుడును విధి స్థానము నందుండును ఆయా పాత్రల బ్రతుకు లెట్లు వెళ్ళునో ముందుగా రచయితకు తెలియును. అది నిశ్చయించి తన చేతిలో పెట్టుకొని ఆయా పాత్రల మనస్సు లకు నేచ్ఛ యిచ్చినట్లుగా ఉండి కథను నడిపించును మిల్టను పాత్రలకున్న వ్యక్తిత్వమునకు తీసిపోని వ్యక్తిత్వమున్నది ఏకవీరయందు అందరకును వ్యక్తిత్వము యొక్క ప్రథమ లక్షణ మేమనగా తాను చేసిన దానికి తానే బాధ్యుడనన్న తెలివి కుట్టాను స్పర్శను కూడా పరిహరించుటకు ప్రాణత్యాగము చేసిన ఏకవీర వ్యక్తిత్వమే ఆమె నేకవీరను చేసినది

## VII

మిల్టనుకూ విశ్వనాథకూ మరొక పోలిక ఏమిటనగా అది ధిషణాహంకార ప్రకటనము కానీ రచయితా అన్న ప్రతివానికీ కాస్త స్వాతిశయముండుటకు వీలున్నది. ఏదీ కాని వాళ్ళకు మనకే లేదా! పూర్వకాలంలో కూడా కవులు తమ తమ శక్తి సామర్థ్యాలను తమతమ కృతిపతులు పేర్కొన్నట్లుగా వ్రాసికొని ప్రకటించుకొన్నారు అయితే ఒకటి మన పూర్వులవి ఆ ఒకటి రెండు పద్యాలు తప్పితే వాళ్ళ నిత్యజీవిత విశేషములలోని స్వాతిశయాలు మనకు తెలియవు అందువల్లనూ, మొన్న మొన్నటిదాకా ఆ పద్యాలు కూడా తాటాకులలోపడి ఉండి ఎవడుబడితే వాడు తీసి చూడటానికి అంతగా అవకాశం లేకపోవుట వల్లనూ ఆయా కవులయొక్క స్వాతిశయాలు మంది నోళ్ళల్లోపడి బజారు కెక్కలేదు నిజంగా ఈ అహంకార ప్రకటనమొక జాడ్యమే అనుకొన్నా ఇది ప్రపంచ భాషా మహాకవులందరకూ ఉన్నది అంతో ఇంతో ఉన్నదని ఋజువు చెయ్యమని అనటానికి ముందు లేదని ఋజువు చెయ్యవలసి వున్నది అందువల్ల అందరు కవులకూ ఈ స్వాతిశయమున్నది విశ్వనాథకున్నదని మనకు తెలియును మిల్టను మహాకవికి ఇంతకంటె ఇబ్బడిముబ్బడిగా ధిషణాహంకార మున్నదని కూడా తెలియవలెను కాలరిడ్జి మహాబుద్ధిమంతుడు కదా! అంతటి వాడు ఏమన్నాడు? మిల్టను వట్టి మహాకవి మాత్రమేనా - అయన మహాపురుషుడు కూడానూ - అని ఎందువల్ల? ఆయన రచనల్లో ఉన్న దీప్తి అంతా ఆయన యందలి మహాపురుష చైతన్యమే కదా! అందువల్ల ఆయన యందలి ధిషణా హంకారమే ఆయన యందలి మహా పురుష చైతన్యము అలాగే విశ్వనాథ అందువల్లనే వారిద్దరూ కూడా తమ తమ రచనలనిండా తామే పరచుకొని

ఉన్నాడు పురుషుడు స్వాతిశయాన్ని తెచ్చి పెట్టుకొని మహాపురుడుగా కని పించాలని తహతహపడుతున్నాడు అభినయించటం చేతకాక వెలాతెలా పోవు చున్నాడు కవులు మహానటులు వారి అభినయ పరమార్థము అందరికీ అర్థము కాదు అర్థము కానంతవరకూ మంచిదే కాని అది విపరీతముగా అర్థమగుటలో ప్రమాదమున్నది వారు తమ విషయమును స్వభావోక్తులనే చెప్పుదురు అవి మనకు ఉత్ప్రేక్షలుగా, అతిశయోక్తులుగా అర్థమగుచున్నవి ఈ దురవస్థ ఇక్కడ విశ్వనాథకెంతో అక్కడ మిల్టను మహాకవికీ అంతే మరొక్కటి కూడా ఉన్నది తమ కాలంలో తమ తమ భాషా సాహిత్యాలకు తామే ప్రభువులు పదిహేడవ శతాబ్దంలో మిల్టను ఇంగ్లీషులో మహాకవి ఇరవదియవ శతాబ్దంలో విశ్వనాథ తెలుగులో మహాకవి సంస్కృతాంగ్ల భాషా సాహిత్య ప్రక్రియారచనాశిల్ప రామణీయకములను తెలుగు వాఙ్మయమును గ్రుచ్చి యెత్తిన కవి శబ్దమున కర్హమైనవాడు విశ్వనాథ ప్రాచ్య పాశ్చాత్య విద్యా సంస్కార ధారా ప్రవాహము నకు వసిష్ఠుని బ్రహ్మదండము వంటివాడు విశ్వనాథ మత నైతిక తాత్త్విక దృక్పథము చేత కావ్య వస్తువును, నిర్మాణ కౌశల్యముచేత రచనాశిల్పమును అభిన్నముగా ప్రవర్తింపజేసి, సమకాలము వారిని మించి మహా కవిత్వమును వెలయింపజేయుటలో విశ్వనాథ మిల్టనుకు చాల సన్నిహితుడు

## VIII

అయితే ఒక్క విషయమున్నది ఏకవీర నవల కదా! పేరడైజు లాస్టు కావ్యము కదా - అని అనరాదు ఇద్దరు మహారచయితలు దేశాంతర కాలాంతర ముల యందు మనిషిని గురించి ఎంత సమానాంతరముగా ఆలోచించి వ్రాసినా రన్నదే ఇక్కడ ముఖ్యము కాని, ప్రక్రియా వైవిధ్యము కాదు ఆ లెక్కను జూచినచో మిల్టను కావ్యవస్తు వసలు రొమాంటిక్కు కాదు, ఏకవీర పూర్తిగా రొమాంటిక్కు సంప్రదాయపు నవల అయినచో ఈ రొమాన్సనగానేమోకూడా విచారింపవలయును చమత్కారమే రొమాన్సు అది వట్టి చమత్కారముకాక కథాగతమైనదైనచో అ కథ రొమాంటిక్కుగా ఉన్నట్లు చెప్పదము కథయందు చమత్కారము కల్పించుటకు విధానాలు ఎన్ని ఉన్నవో అవన్నియు కలసి రొమాన్సు స్త్రీ పురుష విషయముగా నున్నప్పటి ప్రేమ భావమునందు ప్రవృత్తి సాహసోపేతముగా ప్రతిపాదితమైనప్పుడు అది చమత్కారకారి కావచ్చును వ్యష్టి సమష్టి సాధారణ ధర్మాల నతిక్రమించిన ప్రవృత్తి ప్రదర్శనము సామాజి

కుల యందు చమత్కారమును పట్టింపగలదు మరియు సహజాతములయిన వ్యక్తులయందలి భావ ప్రపంచ లీలాగతులను మిథ్యాజగత్తుయొక్క నిత్య నైతిక ప్రవృత్తి పద్ధతుల యొత్తిడులకు ఒదిగిపోనట్లు ప్రదర్శించినందువల్లను కథ రొమాంటిక్కు కావచ్చును ఈ దశలో ఇది మరికొంత ముందుకు సాగినచో ఆధునిక మనస్తత్వ శాస్త్ర ప్రయోగ పరిశోధనాంశముల నవలంబించినచో అస్తిత్వ వాద అసంబద్ధ వాద సాహిత్య మర్యాద లక్షణ లక్షితమును కావచ్చును వర్తమానమున కెప్పుడును భూతకాలము నందొక చమత్కారమున్నది అట్లే భవిష్యత్తునందును కలదు చరిత్ర భూతకాలిక విషయము గనుక చారిత్రకము లయిన నవలలన్నియును రొమాన్సులే కావచ్చును అయినచో ఈ శతాబ్దమున స్వతంత్రించి విశ్వనాథను మించి రొమాంటిక్కు నవలలు వ్రాసినవాడు లేడు ఆ విధముగా కూడా ఏకవీర రొమాంటిక్కు సంప్రదాయపు నవల అయినా వస్తుతత్వమునందు నిషిద్ధ విషయ ప్రవృత్తిని ప్రవేశపెట్టుటలో ఈ నవలకు పేరడైజు లాస్టుతో సామ్యమున్నది ఇక్కడ మిల్టను ప్రతిపాదనమున కంటె విశ్వనాథ ప్రతిపాదించినది బలవంతముగా నున్నది తినగూడదన్న చెట్టుపండు తినుటకు ప్రేరకమైన జిహ్వాచాపల్యమున కంటె, సమాజముయొక్క సుష్ఠువ్యవస్థకు భంగము కలిగించెడు వ్యభిచారమునకు ప్రేమకరమైన కామోద్విగ్నత నిస్సంశయముగా బలవత్తరమైనది ఇది సర్వకాల సర్వావస్థలయందును సర్వమానవ మనః ప్రపంచమునందును నేనున్నాననిపించునంతటి శక్తి కలది వ్యక్తికీ వ్యవస్థకూ ఎక్కడ తగాదా వస్తున్నదో- వ్యక్తికి వ్యవస్థాధర్మనిష్ఠ కుదురుట ఎంత అవసరమో-అది ఎంత కష్టమో-ఈ మహాసంఘర్షణలో వ్యక్తి చైతన్యము చెయ్యి ఎటు పడిన ఏమి ప్రమాదమో, సలక్షణముగా ప్రతిపాదించిన నవల ఏకవీర శిల్పరమణీయమైన కావ్య నవల అది మిల్టనులో తక్కువగా ఉన్న నాటకీయ రచనా చాకచక్యము విశ్వనాథలో పుష్కలముగా నున్నందున ఆ నవలకు కావ్యత్వము కూడ వచ్చినది పారడైజు లాస్టును ఆయన మొదట నాటకముగా వ్రాయవలయుననియే ఒకటికి రెండుసార్లయినను గట్టిగా అనుకొన్నాడు కదా అన్నది వేరు విషయము

## IX

చెట్టు పండును గురించికూడా కొంత చెప్పవలయును అది మంచి చెడ్డల మహా వృక్షము పండు కదా? మంచి చెడ్డల విషయము విజ్ఞాన విషయము విజ్ఞాన

వృక్షము ఫలములను ఆస్వాదింపరాదన్న నిషేధమేమి నిషేధము? దాని నట్లుంచినచో జిహ్వాచాపల్యము ఇంద్రియ చాపల్యమునకు మోహమునకు సంకేతముగా చెప్పవచ్చును అనుభవ ద్వారములయిన ఇంద్రియములు అపమార్గమున పోవుట భగవంతుని ఆజ్ఞలను త్రోసి రాజనుట సామాజిక వ్యవస్థాధర్మము భగవంతుడు ధర్మము నతిక్రమించుటయే పతన హేతువు పతనమునకు ప్రేరణనిచ్చు దానిని నిగ్రహింపగలుగుటయే వివేకము దానిని మనుష్యుల కనుగ్రహింపకపోవుటయు కూడా ఎవరిచేతిలోనో ఉన్నట్లున్నది కానీ, అది మోహముగా మనుష్యులయందే ఉండి, ఉత్పత్తి వికాస వినాశ దశా భేదములను పొందుచు వారిని వ్యవహరింపజేయుచున్నది

పారడైజులాస్టులో సైతాను మనము చెప్పుచున్న మోహముయొక్క వ్యక్తి అమూర్తములయిన భావవృత్తులకు మూర్తి కల్పనమును అందరు మహారచయితలకు వలెనే మిల్టనుకూడా చేసినాడు ఏకవీరలోని నాబిలీ సైతానన్నచో అంత వరకు నక్కడ వ్యక్తికరణము జరిగినట్లు సైతానుయొక్క భావరూపమైన మోహము ఏకవీరయందు కుట్టాను తెరిచిన నిర్ణయద్వారము గుండా ప్రవేశించినట్లు ఈ నవలలో రచయిత చెప్పినది, ఈడెను తోటలోనికి తలుపులు నెట్టుకొని దోపిడికి ప్రవేశించిన దొంగగా చెప్పబడిన సైతానును స్ఫురింపజేయుచున్నది అక్కడ ఈవును సైతానెంత చేసినాడో అంతకంటెను ఎక్కువగా ఇక్కడ ఏకవీరలో ప్రవేశించిన తొలివలపుకానివలని మోహము చేసినది మిల్టను సైతాను విజృంభణమును క్రమముగా తగ్గుముఖము పట్టినట్లు వర్ణింపగా విశ్వనాథ మోహ లక్షణమును అరికట్టుచున్నట్లుగా అదంతయును ఏకవీరయందు నిగ్రహశక్తిగా మరియు నందుకు ప్రయత్నముగా వర్ణించి వర్ణించి ఏకవీరా వీరభూపతుల హఠాత్సన్నివేశమును కల్పించుటచేత ఆ మందుగుండు సామానునకు నిప్పుపెట్టి దాని నొక్కసారిగా పేల్చినాడు ఆ విధముగా మోహము యొక్క ప్రేలుడు గుణమును ప్రదర్శించి దానివలన ఏకవీరయందు సహితము కావింపబడిన సామాజిక వ్యవస్థాధర్మస్మృతిని సంపాదించి తను చేసిన తప్పునకు తానే శిక్షను విధించుకొనునంతటి ఉన్నతిని ప్రదర్శించి ఏకవీరను క్షణములో ఏకవీరను చేసినాడు మనిషి పతనమునకును సముత్పతనమునకును మిల్టను కల్పించినంత వ్యవధానమును విశ్వనాథ కల్పింపలేదు మన వివేకమునందు జీవులయొక్క ఊర్ధ్వగమన శీలమునకు శీఘ్రగతి యున్నది నిత్యానిత్య వస్తు వివేక విజ్ఞానము మీద ఏకవీరను నిలబెట్టి ఆమెతో మోహముచేత పందెము గట్టించి మోహముయొక్క

తాత్కాలిక విజయమును కామెడీగానూ, వివేకముయొక్క తుది విజయమును మరుక్షణములో ట్రాజెడీగానూ చేసి చేయుటలో రచయిత ప్రదర్శించిన శిల్ప కౌశలము లోకాతిశాయిగా నున్నది మరొక్కటి కూడా ఉన్నది దేశ చరిత్రను పిండి మహాకావ్యరచనమును చేయవలయునన్న ప్రయత్నమున మిల్టను కంటె విశ్వనాథ విజయము సాధించినాడని చెప్పవలయును

సాహిత్య నిర్మాణ శిల్ప మార్మికతను నైతికవిలువల వ్యవస్థీకరణమునకు మిల్టను ఒక విధముగా అంతర్ముఖుడై ఎంతగా వినియోగించినాడో మరొక విధముగా అంతర్ముఖీన లక్షణమును సాధించి విశ్వనాథ అంతగా కాదు - అంత కంటె ఎక్కువగా - వినియోగించినాడు

ఇట్లింకను బహుముఖములుగా విచారణ చేయవచ్చును నవల వ్రాయుట ఎట్లో దాని విమర్శనమును అట్లే

## ఉపజీవ్యాలు .

1 శ్రీ దిగవల్లి వెంకటశివరావు - 1) జగద్గురు తత్త్వబోధకస్వామి - 1944 ఏప్రిల్, భారతి పుటలు 335 - 346 352) మధురనేలిన తెలుగునాయక రాజులు - 1945 ఏప్రిల్, భారతి పుటలు 363 - 369

2 శ్రీ ఆర్ యస్ సుదర్శనం - సాహిత్యంలో దృక్పథాలు

3 శ్రీ నిడదవోలు వేంకటరావు దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము పుట 311

4 శ్రీ ఎ ఎస్ త్యాగరాజు - పారడైజ్ లాస్టు 1955 అక్టోబరు, భారతి 81 - 85

5 The New Testment - The Gospel According to St Mathew

6 C S Lewis - A Preface to Paradise Lost 1952

7 E M W Tillyard - Milton 1951

8 శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ - హిందూ జీవనపథము (అనువాదము - శ్రీ కామరాజు హనుమంతరావు) 1938

9 Rebert Daglish - The Fundamentals of Marxist - Leninist Philosphy 1974

*

# పౌరాణిక నవలారచయితగా విశ్వనాథ

ఇంగ్లీషులో ఆర్కేటైపలు నవల అంటే ఏమిటర్థమో పౌరాణిక నవలంటే తెలుగులో ఇప్పుడు సరిగ్గా అదే అర్థం ఆర్కేటైపు అంటే ఆ టైపులో అది మొదటిదని తెలియ వచ్చినంతలో అతిపురాతనమైన నమూనా అన్నమాట మారిన దేశ కాల పరిస్థితులలో ప్రయోజనాన్ని ఉద్దేశించి ఆ నమూనా లాధారంగా పాత్రలను, సన్నివేశాలను, కథలను, ఆలోచనా విధానాలనూ పునర్నిర్మాణం చేస్తే ఆ పాత్ర, ఆ సన్నివేశం, ఆ కథ, ఆ ఆలోచన అన్నీ కూడా ఆర్కేటైపలుగా సిద్ధం చేయబడినట్లు, ఆర్కేటైపలు నవల అంటే ఏవో అతి పురాతనమైన నమూనాలను మనస్సులో పెట్టుకొని ఏదో ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి పాత్రలను సన్నివేశాలను కథలనూ కల్పించి నవలగా వ్రాయబడిన రచన అని అనుకోవాలి పౌరాణిక నవల అంటే సరిగ్గా ఆలా కల్పించి నవలగా వ్రాయబడిన రచన అనే అర్థం ఆర్కేటైపుకు సంబంధించింది ఆర్కేటైపలు పురాణానికి సంబంధించింది పౌరాణికం

యూరోపియను భాషా సాహిత్యాలలో ఆర్కేటైపలు లిటరేచరన్నది ఎంత విస్తృతంగానూ, ప్రౌఢసుందరంగానూ ఉన్నదో మనకు బాగా తెలియదు కానీ మన భారతీయ భాషా సాహిత్యాలలో పౌరాణిక వాఙ్మయం చాలా విస్తృతంగానూ ఎంతో ప్రౌఢ సుందరంగానూ ఉన్నది అష్టాదశ మహా పురాణాలూ, ఉప పురాణాలూ - అసలు భారతీయ భాషా సాహిత్యమంతా ఇవేనన్నప్పటికీ పరవాలేనంతగా విస్తరించి ఉన్నది మన పురాణ వాఙ్మయం ఇదంతా రికార్డు చేయబడింది రికార్డుచేయబడనిది కూడా ఇంకా ఎంతో ఉన్నదని ఆధునిక శాస్త్రీయ పరిశోధనలవల్ల తెలుస్తున్నది జానపద సంప్రదాయాల్లోను ఆటవిక నాగరికతలోనూ కూడామన ఇప్పటి సామాజిక సాంస్కృతిక వ్యవహారాలకు మూలభూతంగా కనిపించే అంశాలెన్నో ఉన్నాయనీ అవి మన పురాణాలకు పురాణాలని ఆధునిక పరిశోధకులు భావిస్తున్నారు పురాణ శబ్దాన్ని మనమీనాడింత మహా విస్తృతార్థంలో వాడుతున్నాం.

ఆంత్రపాలజీ అన్న పేరుమీద అభివృద్ధి అయి- అవుతూవున్న నృశాస్త్రము - అంటే అనాదినుండి మానవ జీవనాభివృద్ధి దశా పరిణామ వివేచన శాస్త్రం - మొత్తానికి మన పురాణ వాఙ్మయం కావలసిన సహాయ సంపత్తులను అందజేయ గలిగిన స్థితిలో ఉన్నది ఇంగ్లీషులో ఆర్కిట్రైపలు లిటరేచరనబడు తున్నదంతా మన భాషలో చెప్పాలంటే పురాణ వాఙ్మయమనే చెప్పాలి అంటే పురాణ శబ్దానికి అష్టాదశ మహాపురాణ - ఉప పురాణములను చెప్పగలుగుటవరకే కాక, పూర్వాపరములందు రికార్డు చేయబడి, చేయబడక ఉన్న మానవ భౌతిక అధ్యాత్మిక జీవన పరిణామాలకు ప్రేరకాలూ, మూలకాలూ అయిన విజ్ఞాన విశేషాల సమస్తాన్ని చెప్పగలిగే శక్తి ఉన్నట్లు మనం గమనిస్తున్నాం అవసరాన్ని బట్టి దాన్ని అంత శక్తితోనూ అర్థ ప్రతీతికి దోహదకారి అయ్యేటట్లుగా మనం వాడుతున్నాం అందువల్లనే ఆర్కిట్రైపలు నవల అంటే పౌరాణిక నవల అని అంటున్నాం

మన భాషలో ఇంత ప్రసిద్ధంగానూ, ఇంత అర్థవంతంగానూ పురాణ శబ్దం ఉంటే దాని అర్థపరిధిని గమనించటానికి నిరాకరిస్తున్నవారిలాగా కొందరు ఆర్కిట్రైపు అన్న దాన్ని ప్రాగ్రూపమనీ, ప్రాక్కథ అనీ, ప్రాచీన గాథలనీ - ఇలా క్రొత్తగా ఒక పదబంధాన్ని కల్పించి వ్యవహారంలోనికి దించుతున్నారు దించుతున్నారు కానీ, ఈ క్రొత్త కల్పనలు పురాణ శబ్దమంత ప్రసిద్ధాలు కాకపోవటంవల్ల ఇంగ్లీషు పదాన్ని చెప్పి, దాని విస్తృతార్థాన్ని విశదీకరించి, దానినంతటినీ ప్రాగ్రూపమన్నప్పుడు గ్రహింపుమనీ, ప్రాక్కథ అన్నప్పుడు గ్రహింపుమనీ, ప్రాచీన గాథలన్నప్పుడు గ్రహింపుమనీ హెచ్చరించినట్లు చెప్పక తప్పటలేదు తప్పనప్పుడు తెలుగులో ప్రసిద్ధంగా వ్యవహారంలో ఉన్న పురాణ శబ్దాన్నే వాడుకొంటే ఇంగ్లీషుకు అనువాదంగా చెప్పిన తెలుగు భాషలోని పదమైనా కాస్త తెలిసిందిగా ఉంటున్నదన్న భావం కలుగుతుంది కదా! అదీ కాక ప్రాగ్రూపు - ప్రాక్కథ అంటే తెలిసిన దానికంటే పురాణమంటే నిస్సంశయంగా తెలుగువాడికి కాస్త ఎక్కువే తెలుస్తుంది పురాణ శబ్దార్థం కొంత తెలిస్తున్నది కనుక అది ఆర్కిట్రైపు శబ్దానికర్థమైన దాంట్లో ఎంతో తెలుసుకొనటానికి ఒక ప్రేరణ కూడా కలుగుతుంది ఆ విధంగా పురాణ శబ్దం ఎక్కువ ప్రయోజనకారి

కనుకనే ఆర్క్డైవలు నవలలు తెలుగులో పనిగట్టుకొని కావలెనని వ్రాసిన విశ్వనాథ సత్యనారాయణగారు తమ పదునారు నవలలను నవలలనక పురాణవైరగ్రంథమాలయనీ, ఈ నవలలన్నింటికి పురాణవైరమన్న దొక్కటే శీర్షికయనీ వ్రాసినారు మరి ఆయన దృష్టిలో పురాణమనగానేమి? పురాణవైర మనగానేమి? అన్న సంగతులను విచారింపవలయును పురాణమనగా మన ప్రాచీనులు చెప్పిన అయిదు లక్షణములలో చివరి రెండింటిని అనగా వంశమును వంశానుచరితమును ఆయన ప్రధానముగా గ్రహించినాడు వంశములనగా సూర్య చంద్రవంశాలు ఆ రెండు వంశాలనుండి కాలముయొక్క నిడివి మీద పుట్టి పెరిగి రాజ్యాలు చేసిపోయిన బహు రాజవంశాల చరిత్ర అంతా వంశాను చరితము సత్యనారాయణగారు వంశాల విషయంకంటె అనువంశాల విష యాలనే ప్రధానంగా గ్రహించారు పురాణమంటే కలియుగంలో భారతదేశాన్ని పరిపాలించిపోయిన క్షత్రియులయొక్క చరిత్ర అని ఆయన అభిప్రాయం

పరిపాలించిన రాజవంశముల వారి బ్రతుకు తెరువులు, ఆలోచనా విధానములు, కార్యాచరణములు - ఇవన్నీ కూడా ఆయా దేశకాలాలలోని ప్రజా జీవితాలకు, ఆలోచనలకు, ఆచరణలకు నిదర్శనాలు యథారాజా తథాప్రజా కదా! రాజెట్లో చెప్పుచున్నావనగా ప్రజయెట్లో చెప్పుచున్నట్లే చరిత్ర అంటే ప్రజా జీవన విధానము తప్ప మరొకటికాదు ప్రజల మీద చెప్పబడినది పరచి నట్లుండి సూటిగా మనస్సు కెక్కదేమోనని మన ప్రాచీనులు రాజుల మీద పెట్టి చెప్పవలసిందాన్ని సూచిస్తూ ఉండేటట్లు చెప్పినారు కనుక మన ప్రాచీనుల దృష్టిలో పురాణమంటే పాశ్చాత్య ధోరణి వచ్చిన తరువాత ప్రసిద్ధికి వచ్చిన "ఏ యుద్ధం ఎందుకు జరిగెను? ఏ రాజ్యం ఎన్నాళ్లుందో? తారీఖులు దస్తా వేజులు" మొదలయిన చరిత్రకాదు మరి ఏమంటే, 'చారిత్రక విఘాత సంధ్యల మానవకథ వికాసమెట్టిది? ఏ దేశం ఏకాలంలో సాధించినదే పరమార్థం" - ఈ మొదలయిన దృష్టికోణం నుండి విచారించి కలకాలం మానవ జాతిని ముందుకు నడిపించటానికి కావలసిన "ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి" ఉన్న కతలతో కూడిన నాగరకత వారి చారిత్రక దృక్పథము వక్ర భాష్యాలకు గురి చేయబడుతున్నప్పుడు వారికీ వారి సంస్కృతీ సంప్రదాయాలకు తాను వారసుడ నన్న విజ్ఞానం వివేకం పుష్కలంగా కలిగిన విశ్వనాథ తన తెలుగు ప్రజా నీకానికి తాను చేయగలిగిన సేవాసహాయం చేయకుండాపోతే సమాజ ఋణాన పోయినట్లవుతుంది, ఆలా ఋణం తీర్చకుండాపోతే అందుకోసం మళ్ళీ అయినా

రావలసి వస్తుంది - ఇదంతా ఎందుకని ఈ పురాణ వైర గ్రంథమాలను వ్రాసి ఇచ్చిపోయినాడు

చరిత్ర అంటే విశ్వనాథ ఏమని భావించాడో విచారించుకోవచ్చు చరిత్ర అంటే పూర్వనాగరకత మన భారతీయమైన పూర్వనాగరకతను అసలు లేనిదిగా, ఉన్ననూ హీనమైనదిగా తక్కువ పరచి, మన భారతీయుల చేతనే అవుననిపించినచో తమ ప్రభుత్వము కొనసాగగలదన్న ఆలోచనతో పాశ్చాత్యులు మన పురాణములకు చారిత్రకత లేదనీ, అందువల్ల మనకు చరిత్ర లేదనీ, చరిత్ర లేని జాతికి నాగరకత లేదనీ - ఈ విధముగా పాశ్చాత్య బోధన సాగినదానికి వ్యతిరేకముగా మన పురాణములనుబట్టి మన చరిత్రను అనగా మన ప్రాచీన నాగరకతను అనగా మన పూర్వపూర్వ పితామహుల సాంఘిక రాజకీయ నైతిక మత తాత్త్విక జీవిత విధానములను వర్తమాన కాలమునకు విజ్ఞానప్రదములుగా యథాశక్తి విశ్వనాథ సత్యనారాయణగారు ఈ నవలలు వ్రాసినారు పాశ్చాత్యులు మన పురాణ చారిత్రక దృక్పథమును అడ్డదారులకు త్రిప్పి చేసిన అవకతవకలను కాదని నవలల రూపమున నిరూపించుటకు చేసిన ఆయన ప్రయత్నము అగ్గింపదగినది భారతీయ పురాణ చారిత్రక విజ్ఞానముతో వైరము పెట్టుకొని ప్రవర్తించిన పాశ్చాత్యుల దుర్మార్గములను త్రోసి రాజనుటయే లక్ష్యముగా సాగినందున ఈ నవల లన్నియు పురాణ వైర గ్రంథమాల

ఒక జాతి యొక్క పౌరాణికమైన శక్తిసామర్థ్యాలను ఆ జాతిలో పుట్టే ఒకానొక జాతీయ స్థాయినందుకొన్న రచయిత మాత్రమే అవగాహన చేసుకో గలడు పౌరాణికమైన శక్తికి మరొక పేరే సంస్కృతీ సంప్రదాయం సాధార ణంగా పురాణ వాఙ్మయంలోని ఆయా కథాంశములను ఆధారంగా గ్రహించి తరువాత తరువాత వచ్చేడు కవులూ రచయితలూ ఆయా భాషలలో గ్రంథాలు రచించడం మనం గమనింపవచ్చును ముఖ్యంగా మన భారతీయ భాషల్లో వచ్చిన ప్రాచీన సాహిత్యమంతా కూడా మన పురాణేతిహాసాలలోని అల్పాల్పములయిన అంశాలను ఆధారంగా చేసుకొనివచ్చినదే భారత భాగవత రామాయణాలను ప్రక్కనపెట్టినప్పటికీ ఒక్క మార్కండెయ పురాణాన్ని ఏదో విధంగా ఆశ్ర యించి తెలుగులో వచ్చిన కావ్యాలే పాతికముప్పై దాకా ఉన్నవి కావ్య వస్తువు దృష్ట్యా చూస్తే అయిదారు కథాంశాలే పురాణం నుండి గ్రహింపబడివుండవచ్చు అంటే తీసుకొన్న కథాంశాన్నే తీసుకొని అయిదారుగురు కవులు వ్రాశారన్న మాట.

భారతీయ పౌరాణిక శక్తి సామర్థ్యాలను తెలుగు భాషా కవులందరూ అవగాహన చేసుకొన్ననూ చేసుకొనకపోయిననూ, ఆశ్రయించి తామీ తెలుగు భాషా సాహిత్య ప్రపంచంలో నిలబడాలని మాత్రం గట్టి ప్రయత్నం చేశారు అందరూ ఆ పనే చేయటంచేత మన ప్రాచీన సాహిత్యమంతా పురాణ వాసన ఒక్కటే కొట్టి తరువాతి ఆధునికులకు కొందరకు అదంటే వెగటు పుట్టటానికీ ద్వేషం పుట్టటానికీ కూడా కారణమైనది పురాణ వాసన ఇంత మొత్తంగాలేని భాషాసాహిత్యాలవారు దాన్ని వెతుక్కుంటున్నారు అది ఎక్కడ కాస్త కనిపిస్తే దానిని తమ భాషా సాహిత్యంలో నిక్షిప్తం చేసి ఆ రచయితకు తమ జాతీయ సంస్కృతీ సంప్రదాయాల విషయంలో గల సదవగాహనను అక్కడ కీర్తిస్తున్నారు జానపద వాఙ్మయంలోవున్న ఈ పురాణ వాసనలను మరింతగా గుబాళింపచేయటమే అక్కడ పరిశోధనగా పరిగణన కెక్కుతున్నది అంటే దీని అర్థమేమిటంటే పురాణ వాసనలు ఎటూ తప్పవు - అవి ఆ జాతిజనులకు ఇష్టంగానూ ఉంటవి - అయితే, అవి అప్పుడప్పుడు అక్కడక్కడ ఎడారులలో జలాశయాల్లాగా కనిపిస్తూ ఇవన్నీ మన పూర్వ పూర్వ పితామహుల అనుభవాలనీ, ఆలోచనా విధానాలనీ అనిపిస్తూ ఉండాలి అంతేకానీ, ఎప్పుడు పడితే అప్పుడుగా ఎక్కడపడితే అక్కడగా సాహిత్యమంతా అదేగా ఉండకూడదు మన పూర్వుల అనుభవాలూ ఆలోచనలూ మనకు పురాణ వాసనలయినట్లే మన తరువాతి వారికి మన అనుభవాలూ, ఆలోచనలూ పురాణవాసనలుగా స్ఫురించాలంటే ఇప్పుడు ఇక్కడ మనం మన అనుభవాలకూ ఆలోచనలకూ ప్రాధాన్యం ఇయ్యాలి కదా!

తెలుగు పూర్వ సాహిత్యమంటే- ముఖ్యంగా ప్రబంధ యుగం తరువాత నుండి- ఆధునికులకు అసహ్యంగా ఉండటానికి కారణం పదునారవ శతాబ్దం తరువాత మూడువందల సంవత్సరాలపాటు మన పూర్వులు తమ అనుభవాలకూ, ఆలోచనలకూ ప్రాధాన్యం ఇయ్యకుండా సాహిత్యాన్ని సృష్టించటానికి పూనుకోవటం వట్టి పురాణ వాసనలతో తమ సాహిత్యాన్ని నింపటం అందువల్ల సంస్కృతీ సంప్రదాయ రూపమైన పురాణ శక్తి సామర్థ్యాలు వద్దనికాదు కానీ అవే కావాలని మాత్రం కాదు అవగాహన లేకపోతే గ్రుడ్డెద్దు చేలో పడ్డట్లు అవే అవే అనుసరింపబడతవి అవగాహన ఏర్పడితే రచయితలు జాతీయ స్థాయిలో తమ భాషాసాహిత్యాలు నిలబడగలిగినట్లు రచనలు చేయగలుగుతారు సంస్కృతీ సంప్రదాయ బలంలేని రచనలు కాలం మీద నిలువవు పురాణ వాసనలంత బలీయములయినవి జాతి జాతీయారోగ్యానికి అవి ఆయుర్వేద ఔషధాలవంటివి

# పరీక్ష గురించి రెండు మాటలు

1941 42 సంవత్సరాల్లో పరీక్ష కథానాయకుడు గోపాలానికి 14 ఏండ్లు

ఈ నవల వ్రాయబడింది 1951 జూలై 14 వ తేదీ కంటే ముందు అంటే కథ 50 ఆగస్టు నుండి 15 తరువాత 51 జూలై 14 వరకు నడిచింది ఇందులో ఆస్తి సమస్య వుంది

గోపాలానికి 1941 నాటికి 14 ఏండ్లంటే 1927 లో పుట్టి వుంటాడు రామయ్య 1900 ప్రాంతంలో పుట్టి వుంటాడు

ఇంగ్లీషు పెట్టుబడిదారీ పరిపాలన వల్ల తన కళ్ళముందు జరుగుతున్న గ్రామీణ వ్యావసాయిక నాగరికతా జీవిత విధాన పరిణామక్రమాన్ని అనుసరించి కొత్త కొత్తగా ఉత్పన్నమవుతున్న సమస్యల వలయంలో నిస్సహాయులైన సామాన్య సంసారుల వాస్తవ జీవిత సంబంధాలను వర్ణచిత్రంగా విశ్వనాథ రచించిన నవల పరీక్ష

గ్రామీణ వ్యావసాయిక నాగరికత సమష్టిప్రయోజనాలు కలది బస్తీ వ్యాపార నాగరికత వ్యష్టిప్రయోజనం కలది బస్తీ వ్యాపార నాగరకత గ్రామీణ జీవితాన్ని ఆక్రమించింది అందువల్ల దాని స్వరూపమే మారిపోయింది అంటే, గ్రామజీవితంలో కూడా వ్యష్టిప్రయోజన దృష్టి ఏర్పడింది అందుకే గోపాలం పొలాన్ని ఎవడికి వాడే కాజేయాలని చూస్తాడు ఆస్తి సంబంధాలు- ముఖ్యంగా భూమి సంబంధాలు దెబ్బతిన్నాయి

# చెలియలికట్టలో రంగారావు గురించి

చెలియలికట్ట రంగారావు తాను జగద్రహస్య సిద్ధాంతాలను గూర్చి విచారించుచున్నట్టనుకొనుటలో తన ఆలోచనా విషయాల అసంపూర్ణ లక్షణాలను కానీ, వాటి అల్పత్వాన్నిగానీ, తన వివేక పరిమితులను గురించికానీ అతనికి చూపులేదు మరొకటి కూడా ఉన్నది సూత్ర విచారణ దశలోనే తలమున్కలుగా నున్న పరిస్థితిలో ఆచరణ దశలోనికి దాని సాధక బాధకాల నూహింపకుండా దూకటం కూడా అతనికా చూపు లేదనటానికే నిదర్శనంగా ఉన్నది ఆలోచనకూ ఆచరణకూ పొత్తును కుదుర్చుకోలేక పోవటానికి రంగారావుకు సంఘానికీ వ్యక్తికీ ఉన్న ఆధార ఆధేయ బావ లక్షణాన్ని గురించిన అవగాహన సరిగ్గా లేకపోవటమే కారణం వ్యక్తికంటే ఎప్పుడూ సంఘమే బలవత్తరమైంది సాంఘిక వ్యవస్థలో కుటుంబమొక వ్యక్తి వంటిది రంగారావు సాంఘిక వ్యవస్థలో మిగిలిన ఆర్థిక సంబంధాలనట్లుంచి ఒక్క స్త్రీ పురుష సంబంధం గురించి ఆలోచించటంలో తప్పులేదు కానీ, ఆ దశలోనే దానికి విరుగుడుగా ఒక ఆచరణను అమలు చేద్దామని సాహసం చేయటంలోనే తప్పున్నట్లున్నది సాంఘిక దౌర్జన్యాలను గురించి విచారించడమంటే తప్పనిసరిగా ఆర్థిక సంబంధాల గురించి విచారించటమే ఈ పని రంగారావు చేయటం లేదని రచయిత విస్పష్టంగా చెబుతున్నాడు "లోకములో సంపదయు దారిద్ర్యము నెట్లు బహు విషయముల నెగుడు దిగుడులు తెచ్చుచున్నవో విచారింపడు" (పు 19) సాంఘికమైన మానవ జీవన వికాస చరిత్ర గతి లోతుపాతులు చూడని పైపై విషయములకు మెరుగులను దిద్దవలయు ననెడి చాపల్యము తప్ప సంస్కరణ స్వరూప స్వభావాల గురించిన శాస్త్రీయమైన అవగాహనలేనివాడు రంగారావు ఆధునిక భావబంధురంగా కనిపించే యువతరానికి హెచ్చరికగా విశ్వనాథ రంగారావును చెలియలికట్ట నవలలో చిత్రించారు

# వేయి పడగలు
# నవలాజీవితము

సుబ్బన్నపేట తెలుగు దేశానికి సంకేతము కావచ్చును అది వేరే విషయము వేయిపడగలు గ్రంధముగానైన చరిత్రకు సుబ్బన్న పేట మూలము చరిత్రను చేసేది మనుషులు కదా! సుబ్బన్న పేటలోని ఎవరు ఏమి చేస్తే వేయి పడగలయినది? సుబ్బన్న పేట మరే పేటతోనూ సంబంధం లేకుండా ఉండదు అందువల్ల భారతదేశంలోని వివిధ ప్రదేశాలలోని మనుషుల, భావాల, పరిస్థితుల ప్రభావంవల్ల సుబ్బన్నపేటలోని మనుషులు కూడా వాళ్ళ చరిత్రను వాళ్ళు నిర్మించుచున్నారు అయితే, సుబ్బన్న పేటలో వున్న దెవరు? నవలా రచయిత ఒక బ్రాహ్మణ కుటుంబాన్ని చూపించాడు ఆ కుటుంబ యజమాని రామేశ్వర శాస్త్రికి బ్రాహ్మణ భార్య నరేసరి ఆమెకాక ఒక క్షత్రియ భార్య ఒక వైశ్య భార్య ఒక శూద్రభార్య కూడా వున్నారు దీన్నిబట్టి ఆ పేటలో నాలుగు కులాల ప్రజలున్నారనుకొందాం రచయిత మరొక కుటుంబాన్ని చూపించాడు అది ఆ యూరి జమీందారుది ఆయన పేరు కృష్ణమనాయుడు ఆయన కొడుకు రంగారావు ఆయన కొడుకు హరప్ప వీళ్ళది మూడు తరాల వంశ కథ బ్రాహ్మణ కుటుంబానిది రెండు తరాలదే రామేశ్వరశాస్త్రి, ధర్మారావు ఆ తండ్రి కొడుకులతో ఆ వంశకథ నవలలో సరి రచయిత ఒక బ్రాహ్మణ కుటుంబాన్ని ఒక జమీందారీ కుటుంబాన్ని మాత్రమే నవల నిండా సూత్ర బ్రహ్మలాగా వ్యాపింపజేశాడు రామేశ్వరశాస్త్రి మిగిలిన మూడు కులాల నుండి భార్యలను స్వీకరించాడు కదా - వాళ్ళకూ పిల్లలున్నారు మరి వాళ్ళ కథలను ప్రత్యేకంగా పెంచలేదు ముఖ్యంగా వైశ్య స్త్రీ హెమవతికి రామేశ్వరశాస్త్రి కొడుకుగా పుట్టిన శ్రీధరం సంగతిని అసలు రచయితే మరచిపోయినాడా అని పిస్తుంది రంగాజమ్మగారి కొడుకు రామచంద్రరాజు సంగతి, శూద్ర భార్యయైన మంగమ్మ సంతానం పసిరిక సంగతి నవల్లో వస్తుంది రామేశ్వరశాస్త్రి బ్రాహ్మణ సంతానమైన ధర్మారావును చుట్టుకొనే నవలంతా నడుస్తుంది రచయిత దృష్టిలో జమీందారీ కుటుంబమంటే క్షత్రియ వర్ణం కిందనే లెక్కగా వుంది నవలా వస్తువును తయారు చేయటంలో వైశ్య శూద్ర వర్ణాలను రచయిత ప్రక్కకు పెట్టి పని చేశాడనిపిస్తుంది మనుషులలోని నాలుగు వర్ణాల వారిలో రెండు వర్ణాల నసలు వదలివేసి మిగిలిన రెండు వర్ణాల వారికి ఒక దైవాన్ని జోడించి ఆ మూడింటి సమష్టి లక్షణంగా నవలా జీవితాన్ని పోషించటానికి చేసిన ప్రయత్నమే వేయిపడగలు

## సుబ్బన్నపేట రూపొందిన వైనం :

సుబ్బన్నపేట గ్రామం ఏర్పాటు కావటం - వీరన్నకోట కట్టటం నుండి అంతకు ముందు అది మహారణ్యంలో పల్లె అక్కడి కాపు జీవితాన్ని విశ్వనాథ "అడవిలో పుల్లలనేరి తెచ్చి - కట్టెలను కొట్టి తెచ్చి పక్కనగల పట్టణములకు బోయి అమ్ముకొని జీవించు చుండెను" అని చెప్పాడు పుల్లలేరుకొని అనేది ప్రకృతి నుండి మనిషి ఆహార సేకరణ చేసే యుగాన్ని స్మరింప చేస్తుంది ఆ తరువాత ఆహారాన్ని ఉత్పత్తిచేసే యుగం దాన్ని కోటకట్టటం అంటే గ్రామాన్ని నిర్మించటం స్మరింప చేస్తుంది గ్రామ జీవితమే వ్యావసాయక జీవితానికి మొదలు వ్యవసాయక గ్రామీణ నాగరికత నశించిపోతున్న వైనాన్నే కదా విశ్వనాథ వేయిపడగల్లో చిత్రించాడు అందువల్ల ఆయన సుబ్బన్నపేట నిర్మాణం గురించి చెప్పడం పూర్వ చారిత్రక చారిత్రయుగ ధర్మాలను స్పృశించి చూపాడనిపిస్తుంది ఆయనకు చరిత్ర తెలియక పోలేదు చరిత్రమీద దృష్టి లేక పోలేదు చరిత్ర యొక్క అభివృద్ధి క్రమాన్ని అవగాహన చేసుకోటానికి కావలసిన భౌతిక వాస్తవిక దృక్పథం లేదు

సుబ్బన్నపేట కోట వెలిసిందే ఒక అద్భుత కథా విశేషం మీద

1 ఆవుపాలను పాము తాగడం - ఆవు పోయి పోయి పుట్ట మీద నిలబడి ఆ పాముకు పాలు తన పొదుగు నుండి తానే జార్చటం

2 దాన్ని చూచిన కాపురు ఆ రాత్రే సుబ్రహ్మణ్యేశ్వర స్వామి కలలో కనిపించి, తాను పాలు తాగిన చోట తనకొక గుడికట్టించమని కోరటం

3 ఆ వూళ్ళో వాళ్ళకు గుడి కట్టించే స్తోమత లేకపోతే-స్వామి తన మహిమలను ప్రదర్శించటం ద్వారా తనను గురించి తాను చుట్టుప్రక్కల ఊళ్ళల్లో ప్రచారం చేసుకొంటాడు

4 దగ్గరలో వున్న ఒక వూళ్ళో ఒక బ్రాహ్మణుడు తనకు కొడుకు పుడితే గుడి కట్టిస్తానని మొక్కుకొంటే కొడుకు పుడతాడు ఆ బ్రాహ్మడే గుడి కట్టిస్తాడు ఆ కొడుకు పేరు నాగేశ్వర శాస్త్రి

ఈ అద్భుతాలన్నీ జరిగాక (వీరన్న) భాగ్యశాలి ఇంగ్లీషు వాళ్ళ పక్షాన టిప్పు సుల్తానుతో వాళ్ళుచేసిన యుద్ధంలో ఎడ్లను బాడుగకు తోలి, వారి విజయా

నంతరం వారిచ్చిన నవరసులతో తిరిగివచ్చి-పై బ్రాహ్మణ్ణి కోట కట్టుకోడానికి స్థలనిర్దేశం చెయ్యమంటే- తాముండి గడి కట్టిస్తున్న స్థలమే మంచిదని చెబితే అక్కడే ఆయన కోట కట్టాడు అదే సుబ్బనపేట జమీందారి

ఒక విషయం ఎవడు బడితే వాడు నాకు డబ్బున్నదని కోట గట్టుకొని జమీందారని అనుకొంటాడా? జమీందారుకు భూమి కావాలి కదా? బహుశా కోట కట్టట మంటే భూమిని ఆక్రమించుకొని కట్టుకోటమే కావచ్చు ఆ బ్రాహ్మణుడు ఈ భూమంతా నీదే అనుకో, కోట కట్టుకో, నేను ఇక్కడే వుంటాను అని చెప్పివుంటాడు దీనినే కావచ్చు ధర్మారావు కృష్ణమనాయుడు గారికి వ్రాసిన జాబులో మా పూర్వులే మీ పూర్వులను తెచ్చి నిలిపిరన్నట్లు చెబుతాడు

ఆస్తులను సంపాదించి - వ్యాపారం వల్లగానీ, శౌర్యప్రతాపాలను వల్లగానీ బలపడిన వారిని, వారి పదవిని కాపాడటంలో బ్రాహ్మణులు ప్రముఖ పాత్ర వహించినట్లు చరిత్ర చెబుతున్నది కదంబ మయూరవర్మ రాజ్యాధికారాన్ని నిలబెట్టుకోటానికి బ్రాహ్మణులను తెచ్చుకొన్నాడు

"The Brahmins with their caste system and Vedic sacrifices, Provided a new social Theory which raised These warriors above the rest of the tribe, as a Privileged caste The generosity of the kings to monasteries and to the Brahmins has a clear, logical foundation in the changed mode of Production "- (D D Kosambi myth and reality-1983, P 114) సుబ్బన్నపేట కోట నిర్మాణంలో ఈ పద్ధతేమన్నా సూచనగా వుందా?

ఇంత డబ్బున్నది గనుక అది పెట్టి కోట కట్టుకొంటే నేను పెద్ద జమీందారు నవుతానని పీరన్న అనుకొన్నాడు అనుకొన్నాడని విశ్వనాథ తన నవలా ఇతివృత్త నిర్మాణానికి పునాది వేయటం ప్రారంభించాడు కోట కట్టంగానే ఎవరైనా జమీందారు అయిపోతాడా? కోట కట్టుకోటానికి కూడా జాగా లేనివాడు కోట కట్టి పెద్ద జమీందారు కావలయునని వూహించాడనటం కుదిరే విషయమేనా? అంతా అసందర్భంగా లేదా? కోట కట్టుకోటానికి స్థలం కోసం తిరిగేవాడు స్థలాల యజమానులను వెతుక్కొంటాడా? లేక జ్యోతిషము

నందు వాస్తువు నందు అఖండ ప్రజ్ఞాశాలి ఎవడా అని వెతుక్కుంటూ పోతాడా? పీరన్న ఒక అటువంటి ప్రజ్ఞాశాలి ప్రశస్తి విని, ఆయన దగ్గరకు పోయి అడిగాడు అయ్యా నాకు కోట కట్టుకోవాలని వుంది ఎక్కడ, కట్టుకోమంటారు అని ఆ బ్రాహ్మణుడు నేనున్నాను గదా ఇదే యోగ్యమైన స్థలము, ఇక్కడే కోట కట్టుకో అని చెప్పాడు పీరన్న అక్కడే కోట కట్టాడు

1802 - 4 సంవత్సరాల నాటికే శాశ్వత భూమిశిస్తు విధానం కిందికి జమీందారీ, హవేలి భూములను తెచ్చింది కంపెనీ పాలన భూమిమీద ఆస్తి హక్కు - కంపెనీ వారికి డబ్బు కట్టి కొనుక్కోక తప్పని పరిస్థితి ఏర్పడిన 1800-10 మధ్యకాలంలో పీరన్న కంపెనీ పాలకులతో సంబంధం లేకుండా - మరే యజమాని యొక్క అనుమతి లేకుండా కోట కట్టటం అసంభవం కనుక సుబ్బన్నపేట కోట కట్టిన స్థలం అప్పటికే ఎవ'రో ఒకరిది అయ్యే వుంటుంది కాకపోతే ఊరి ఉమ్మడి స్థలమై యుంటుంది అక్కడి సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి గుడి కట్టించటానికి ఆలోచిస్తున్న బ్రాహ్మణుడు పీరన్న వచ్చి అడిగితే, ఆ చుట్టు పక్కల స్థలమంతా తనదే అయినట్లు - కోట కట్టుటకు యోగ్యమైన స్థలం తానున్నదే అని చెప్పి కట్టుకోమనటం అప్పుడిక ఎట్లా వీలవుతుంది? ఆయన అలా అంటే ఆ వూళ్ళో వాళ్ళూరుకొంటారా? ఆ వూరు ఏ ప్రభువు రాజ్యంలోను లేకుండా విడిగా వుంటుందా? వుండే వీలున్నదా?

ఈ కోటకట్టే కోలాహలమంతా ప్రారంభమైంది 1800 ప్రాంతంలో కదా! అప్పటికి శాశ్వత భూమిశిస్తు విధానం బెంగాలులోనే కాక ఆంధ్రాసర్కారు జిల్లాల్లో కూడా ప్రవేశపెట్టబడింది అప్పటికే ఆంధ్రప్రాంతం (సర్కారు, రాయలసీమ) మొత్తం బ్రిటిషు కంపెనీ అధికారం కిందికి వచ్చింది విశాఖ పట్నం, గోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లా లేర్పడ్డాయి కలెక్టర్లు వచ్చారు సర్కారు జిల్లాల్లో తిరుగుబాట్లను అణచటానికి కంపెనీవారు ప్రత్యేక అధికారు లను కూడా నియమించిన కాలమది అటువంటి దేశకాలాలలో సుబ్బన్నపేటను కట్టిన అడవిలోని పల్లె పరిసర ప్రాంతాలు ఎవరి అధీనంలోనూ లేకుండా గాలికి పడివున్నట్లూ, దబ్బుందిగాబట్టి కోటగట్టి పీరన్న జమీందారైనట్లూ విశ్వనాథ వ్రాశాడు

19 వ శతాబ్దం ప్రారంభంలో తెలుగు దేశంలోని కృష్ణాజిల్లా ప్రాంతపు భూములు అవిధంగా ఎవరిపీ కాకుండా గాలికి పడివుండటం సాధ్యమయ్యే విషయమేమనా అని నిజంగానే విచారించాలి పందొమ్మిదవ శతాబ్దం ప్రారంభానికి వెంకటగిరి సంస్థానం ఇరవైఎనిమిది తరాలుగా అవిచ్ఛిన్నంగా కొనసాగివస్తున్నది దాదాపు గుంటూరు దాకా వాళ్ళ ప్రభుత్వమే పిఠాపురం సంస్థానం గొల్లప్రోలుదాకా వ్యాపించివుంది కృష్ణాజిల్లాలోనే నూజివీటి వారి మైలవరం సంస్థానం వుంది మేకా వారి నూజివీటి సంస్థానం వుంది కలవకొలను వంశం వారు బెజవాడ జమీందారులుగా వున్నారు

ఈ జమీందారీ ప్రాంతాలన్నింటి మీదా నిజాం నవాబుల అధికారంగానీ ఈస్టిండియా కంపెనీ వారి అజమాయిషీగానీ ఏదో ఒకటి వుంది ఎవరి అధికారం కిందా లేని అడవి ప్రాంతంగాగానీ, మైదానప్రాంతంగానీ 1800 నాటికి తెలుగుదేశంలో - కృష్ణాజిల్లా ప్రాంతంలో వుండే అవకాశమేలేదు కానీ విశ్వనాథ సత్యనారాయణ వుందని వ్రాశాడు వ్రాయటమేకాదు అక్కడొక కోటనూ పేటనూ కట్టించాడు అదే సుబ్బన్నపేట - శనివారపుపేట, నరసరావుపేట - చిలకలూరిపేటల్లాగా

డబ్బున్నవాళ్ళు దివాలా తీసిన జమీందారుల గ్రామాలను కొనుక్కొని చిన్నచిన్న జమీందారులుగా స్థిరపడటం 19 వ శతాబ్దం ప్రారంభంలో వుంది కలవకొలనువారు బెజవాడ ప్రాంతాన్ని కొనుక్కొని జమీందారులైనవాళ్ళే బందరులోను, మద్రాసులోనూ ఈస్టిండియా కంపెనీ బలపడి రాజ్యం చేస్తున్న కాలమది అటువంటి పరిస్థితుల్లో కృష్ణాజిల్లా బెజవాడ బందరు ప్రాంతాల్లో అడవిప్రాంతం - డబ్బున్నవాళ్ళు వచ్చి ఆక్రమించుకొని కోటగట్టుకొని మేము జమీందార్లం అని అనుకోటానికి వీలుగా గాలికి పడివుందని చెప్పటం చారిత్రక వాస్తవికతకు విరుద్ధంగా వుంది

## సుబ్బన్నపేట - నాలుగు స్తంభముల ధర్మమంటపము :

కాపుకు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కాలయము కట్టించుమని ఆజ్ఞయైనది నాగేశ్వరశాస్త్రి తండ్రి వచ్చి ఆ మహారణ్యమధ్యగల పల్లెలో ఆలయ నిర్మాణ ప్రయత్నములో నుండగానే భాగ్యశాలి వీరన్న యేబది యేండ్లవాడు వచ్చి

అక్కడ కోట కట్టుకొని ఆ ప్రాంతమునకు తానొక జమీందారుడయినాడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి తనకు గుడి కట్టించమని ఏ రైతుకు కలలో కనిపించాడో, ఆ రైతుకు ఒక కూతురు ఆమెకు స్వామి ఆవేశిస్తుంటాడు ఆమెకు పెండ్లి కాలేదు ఆమె గణాచారి స్వామి ఆవేశించినప్పుడామె ఆ వూరికీ, ఆ వూళ్ళోవాళ్ళకు జరుగబోయే మంచీ చెడూ చెబుతుంటుంది చెడుకు పరిహారాలు కూడా సూచిస్తుంది ఆ విధంగా సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆ వూళ్ళోను చుట్టు ప్రక్కలా పిలిస్తే పలికే దైవం అయినాడు ఆ కాపు వంశంలో తరువాత తరాల్లో కూడా పెద్దకూతురు గణాచారే అవుతుంటుంది ఆమెను స్వామి పూనుతూనే వుంటాడు కాపు వంశము నుండి గణాచారి - నాగేశ్వరశాస్త్రి వంశము నుండి బ్రాహ్మణుడు - పీరన్న వంశము నుండి జమీందారు ఈ మూడు ప్రవాహములు యెడతెగక సాగినంతకాలం అది ధర్మకాలము

మూడు వందల సంవత్సరాలట్లే సాగింది బ్రాహ్మణుడు శివభక్తుడు పీరన్న విష్ణుభక్తుడు ఆయన వేణుగోపాలస్వామి గడి ఒకటి కట్టించాడు నాగేశ్వరస్వామి గుడి అంటే శివుని గుడి అది బ్రాహ్మణుడు కట్టించింది సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయం పీరన్న కట్టించిందే ఆ కోట, ఆ దేవాలయాలు వున్న చుట్టు పక్కల ప్రదేశంలో వెలసిన ఊరే సుబ్బన్నపేట

ఈ జమీందారీ గ్రామం సనాతన ధర్మస్థానానికి ప్రతీక పీరన్న నాయని వంశమువారు స్వామికి ప్రతినిధులు అంటే నా విష్ణు పృధివీ పతి అని కదా! అందుకే పీరన్నకు విష్ణుభక్తి యెక్కువ అని చెప్పటం - ఆ విధంగా ప్రభువులు దైవానికి ప్రతినిధులు దైవము - రాజు - బ్రాహ్మణుడు కాపు (కూతురు గణాచారి) పైని భగవంతుడు - కింద రాజు, బ్రాహ్మణుడు - భగవంతుడొక సంస్థ రాజా బ్రాహ్మణుడు కలిసి ఒక సంస్థ స్వర్గమర్త్యములయిన ఈ రెండు సంస్థలకు గణాచారి తెంచరాని లంకె అంటాడు విశ్వనాథ పైని భగవంతుడు- ఆకాశం అప్రత్యక్షం క్రింద రాజు, బ్రాహ్మణుడు - భూమి ప్రత్యక్షం కాపు వంశస్థులు ప్రత్యక్షానికీ అప్రత్యక్షానికీ లంకె




ఈ విధంగా వుండే 'ధర్మమంటపం' వ్యవస్థ గొప్ప వ్యవస్థ అని విశ్వనాథ సత్యనారాయణ




అప్పుడది ముక్కాలిపీట దానిని ధర్మమంటపంగా చేయటం కోసం భగవంతుడే ఒక స్తంభం అయినాడు ధర్మమంటపానికి భగవంతుడు కూడా జమీందారువలె, బ్రాహ్మణునివలె, గణాచారివలె ఒక స్తంభం అంటాడు రచయిత ఈ ధర్మమంటపంలో ధర్మము స్వామి అయితే, ఆచరణ ప్రభువు ప్రచారం బ్రాహ్మణుడు వ్యాఖ్యానించి ప్రజలలో వ్యాపింపచేసేది గణాచారి

ఈ ధర్మమంటపం ధర్మార్థ కామ మోక్ష పురుషార్థాల సాధన మంటపం. పైన భగవంతుడు బాగానే వుంది కింద రాజును బ్రాహ్మణుడును - ఈ రెండు సంస్థలకు ముఖ్యలంకె గణాచారి - రాజు అంటే క్షత్రియుడనుకొందాం గణాచారి కాపు కూతురు కనుక శూద్రవర్ణం మరి వైశ్యుడేడి? చాతుర్వర్ణ్య వ్యవస్థ అయితే పాపం వైశ్య కులానికి కూడా ప్రాతినిధ్యం వుండాలి కదా! నిజానికి రాజనబడే జమీందారు క్షత్రియుడు కాడు నాయుడు శూద్రుడే ఎవడు ప్రభువైతే వాడు క్షత్రియుడనే పథకం కింద పీరన్న క్షత్రియుడవుతాడు.

పైని భగవంతుడు (Super structure), ఉపరితల నిర్మాణం క్రింద రాజును - బ్రాహ్మణుడును (Base) పునాది సమాజానికి పునాది సంస్థలు రెండు రాచరికమూ, బ్రాహ్మణీకము ఈ రెండు సంస్థలూ మనటానికి కాపు (గణాచారి) లంకె విశ్వనాథ భావించిన సనాతన ధర్మ వ్యవస్థలోనూ పునాది - ఉపరితలాంశాల ఆధార - ఆదేయతా లక్షణాలను చూచాడు ఆయన చూచిన చూపును భౌతికవాద దృక్పథంనుండి మనం చూస్తే దాని యధార్థత్వం ఈలా వుంటుంది

పునాది - సాంఘిక ఆర్థిక వ్యవస్థ కదా మనకు? రాచరికమూ - బ్రాహ్మణీకమూ సామాజిక ఆర్థిక వ్యవస్థారూపంగాను ఆ రెండు సంస్థలమధ్యా కాపు లంకెగా వున్నాడంటే అర్థం - సామాజికంగా ఉత్పత్తి సాధనాలను స్వాయత్తం చేసుకొన్నవాళ్ళూ - వాళ్ళను తమ శారీరక శక్తి సామర్థ్యాల చేత సేవిస్తూ వున్న వాళ్ళూగా సమాజం వున్నదన్నమాట ఇందులో బ్రాహ్మణ క్షత్రియ శూద్రులనే స్వీకరించాడు విశ్వనాథ అంటే-వైశ్యులను ప్రత్యేకంగా చెప్పలేదు క్షత్రియులు దేశాన్ని రాజులుగా ఏలిన కాలం పురాణకాలంలో కలిసిపోయింది ఆ తరువాత ఎవరు పాలకులయితే వాళ్ళే రాజులయినారు రాజు అనేది కులవాచకంగా క్షత్రియ శబ్దంతో సమానార్థకం కాకుండా పోయిన కాలం గురించే విశ్వనాథ వ్రాస్తున్నది అదే సనాతన ధర్మం అని అంటాడు నిజానికి అది మధ్యకాలం సనాతన ధర్మాలు అప్పటికే కాలం చెల్లిపోయినాయి మానవ సంబంధాల రూపమైన జీవితం ఉత్పత్తి సంబంధాలుగా కాక కుల మత సంబంధాలుగా వుంటుంది అని విశ్వనాథ రాజ్యం - మతం ఈ రెండే పునాది సంస్థలు రాజ్యమూ మతమూ కలిసి సుఖంగా బ్రతకటానికి కావలసిన భౌతిక వసతులు చేసేది కాపు (శూద్రుడు) ఈ కాపు మత పరిధిని దాటిపోకుండా పైనుండి భగవంతుడు ఆవేశిస్తుంటాడు ఆ విధంగా ప్రజానీకాన్ని మత భావాల పరిధిలో బంధించేట్లు కాపు - అంటే ప్రజానీకమే చేస్తుంటే, బ్రాహ్మణుల పని రాజుని బలపరుస్తూ వుండటం రాచరికం బ్రాహ్మణీకాన్ని పోషిస్తుంటే - బ్రాహ్మణీకం మతాన్ని, మతం ప్రజలనూ అదుపులో వుంచుతాయి అంటే, ప్రజలు రాచరికానికి లొంగి వుండేట్లు మత భావాల ప్రచారం ద్వారా బ్రాహ్మణుడు చేస్తున్నాడు మత భావ ప్రచారకేంద్ర స్థాపనమే భగవంతుని సృష్టి తమను తాము మత భావాల వలయంలో బంధించుకొనేందుకు ముందుకు వచ్చిన శూద్రులే భగవంతునికి వ్యాఖ్యానం చెప్పేవాళ్ళంటాడు ఆ విధంగా వాళ్ళను ఉబ్బవేస్తాడు

పునాది ఉపరితల నిర్మాణాలన్న లెక్కలో ఒకరీతిగా చెప్పి - తానే మరొక రీతిగా చెబుతున్నాడు - ఇది నాల్గు స్తంభముల మంటపము అని ఏవి? పైన చెప్పిన పునాది ఉపరితలాల మొత్తం ఈ స్థితిలో పునాదీ లేదూ - ఉపరితలమూ లేదు అన్నీ స్తంభాలే ఇప్పుడు రాజూ, బ్రాహ్మణుడూ, కాపు ఎలాగో భగవంతుడూ అలాగే మొదటి మూడు భౌతిక సత్యాలు భగవంతుడు కాదు కాకపోయినా అయినట్లే ఇదెందుకంటే, రాజులయొక్క సర్వాధిపత్యాలనూ సమర్థించటానికి రాజుల యందు భగవల్లక్షణాలన్నీ ఆరోపితాలు భగవంతుణ్ణి కాకతీయ ప్రతాపరుద్రుడి స్థాయికి దించిన కాలం మరీ ఏడెనిమిది వందల సంవత్సరాలు ముందుకు వచ్చింది కాబట్టి రాజ్యాలు పోయి దేశంనిండా వట్టి జమీదారులే మిగిలారు కాబట్టి, ఈ జమీందారులనే భగవంతుని స్థాయికి ఎత్తి చూపించబోతూ వ్యవస్థ అంతా చెయి దాటి దిగజారిపోతున్న వైనాన్ని వ్యాఖ్యానిస్తున్నట్లుగా విశ్వనాథ వేయిపడగలు నవల వ్రాశాడు

చరిత్రలో ఎన్ని మార్పులు వచ్చినా వాటిని గమనంలోకి తీసుకొనకుండా భగవంతుడు, రాజు, బ్రాహ్మణుడు కాపు - అదే భగవద్విశ్వాసమూ, రాచరిక వ్యవస్థ - బ్రాహ్మణ్య మత వ్యవస్థ, కాపుదలగా వుండే ప్రజానీకం - కనీసం ఈ పేర్లు బలంగా వినిపించిన కాలమంతా ధర్మకాలంగానూ, అది సుబ్బన్నపేట విషయంలో మూడు వందల యేండ్లు నిరంతరంగానూ, అవ్యవహితంగానూ శోభాయమానంగానూ సాగిందనీ, ఆ తరువాత అది శిథిలమైపోవటం జరిగిందనీ ఆ శిథిలమైపోతున్న క్రమాన్ని చిత్రించాడు విశ్వనాథ

## సుబ్బన్నపేటకు మూడు వందల యేండ్లు :

"ఇప్పుడు సుబ్బన్నపేటయున్న ప్రదేశమంతయు మూడు వందల యేండ్ల క్రిందట మహారణ్యము" (2) ఇప్పుడు అంటే వేయిపడగలు నవలను వ్రాస్తున్న కాలమన్నమాట

విశ్వనాథ సత్యనారాయణగారు ఈ నవలను 1932 అక్టోబరు తరువాత 1933 అక్టోబరు లోపలగానీ మహా అయితే 1934 అక్టోబరులోగా గానీ వ్రాసి వుంటారు అంతకంటే ముందుగాగానీ ఆ తరువాతగాని వ్రాసి వుండటానికి వీలు లేదు అందువల్ల ఇప్పటికి మూడు వందల యేండ్ల క్రిందట అంటే 1634వ సంవత్సరానికి ముందు అన్నమాట

సుబ్బన్న పేటను కట్టినవాడు వీరన్న వీరన్న కోట కట్టాడు ఆ కోట చుట్టుకొని వెలసిన గ్రామం సుబన్న పేట వీరన్న కోట ఎలా కట్టాడు? ఇంగ్లీషు వాళ్ళు మన భారత దేశాన్ని క్రమక్రమంగా ఆక్రమించుకొంటూ వస్తున్న కాలంలో మైసూరును పాలిస్తున్న టిప్పు సుల్తాను ఇంగ్లీషు వాళ్ళకు లోబడకుండా ఎదురు తిరిగి తన మైసూరు రాజ్య స్వతంత్రతను నిలబెట్టు కోటానికి వాళ్ళతో పోరాటానికి దిగాడు ఆ యుద్ధాల్లో ఆంగ్లేయుల అధికారానికి భయపడి, వాళ్ళు ఆశ చూపిన డబ్బుకు కక్కుర్తిపడి చాలామంది దేశీయులు ఇంగ్లీషు వాళ్ళ సైన్యంలో రకరకాల పనులకు కుదిరి టిప్పు మీది దండయాత్రలో పాల్గొన్నారు అటువంటి దేశీయులలో వీరన్న ఒకడు "అతడు పూర్వమైదారు జతల యడ్లను బెట్టుకొని కిరాయికి దోలుచు జీవించెడివాడు ఇంగ్లీషువారు టిప్పుసుల్తాను మీద దండయాత్రకు బోయినప్పుడు వీని యెడ్లను కూడా బాడుగకు తోలించుకొనిరి వారు టిప్పును గెలిచి శ్రీరంగపురము దోచుకొన్నప్పుడితడు తనవంతు దోపిడికై వారి నడిగెనట వారును కోటలో నొక కొట్టు చూపించి యందులో ఏమున్నదో తెలియక యది యతని వంతని చూపించిరట అతని యదృష్టము! దాని నిండ నవరసులుండెను అవియతడు రహస్యముగా నెడ్లమీది కెత్తుకొని యింటికి తోలుకొని వచ్చెను (అతని పేరు వీరన్న) ఇప్పుడా ధనముతో వాడొక కోట కట్టి పెద్ద జమీందారు కావలయునని యూహ" (పు 7) పుట్టే ఇక ఆ ప్రయత్నం మొదలుపెట్టాడు

టిప్పు సుల్తానును ఇంగ్లీషువాళ్ళు చంపటం, శ్రీరంగ పట్నాన్ని దోచుకోవటం రెండూ చారిత్ర వాస్తవాలు గనుక ఈ సంఘటన మీద ఆధారపడే మిగిలిన అన్ని విషయాలను అన్వయించాలి

టిప్పుసుల్తాను ఆంగ్లేయుల యుద్ధంలో 1799 మే 4 వ తేదీన మరణించాడు అందువల్ల వీరన్న సుబ్బన్న పేట కోటను ఏటువంటి పరిస్థితుల్లోనూ 1799 కంటే ముందు కట్టటానికి అవకాశం లేదు వీరన్న ప్రారంభించిన కోటా పేటా సుబ్రహ్మణ్యస్వామి ఆలయమూ 'పూర్తియగుటకు పదియేండ్లు పట్టెను' (పు 8) ఈ వాక్యార్థాన్ని కూడా కలుపుకొంటే సుబ్బన్న పేట, కోట ఆలయం 1809 - 10 సంవత్సరంలో పూర్తి అయివుంటుందని ఖచ్చితంగా చెప్పవచ్చు టిప్పు సుల్తాను మరణానంతరం 1799 మే జూన్ నెలలనుండి ఎంత తొందరగా

ప్రారంభించినా సుబ్బన్నపేట పట్టణ నిర్మాణం 1810 నాటికిగానీ పూర్తి అయి వుండదు సుబ్బన్నపేట కోట శంకుస్థాపన 1800 సంవత్సరంలో జరిగి 'వుంటుందని అనుకోవచ్చు దానికి ముహూర్తం పెట్టిన బ్రాహ్మణుడు "ఇట నిర్మించిన పట్టణము మూడు నాల్గు వందల యేండ్లవరకు మహాదశననుభవించు నని" (పు 7) చెప్పాడు మరొకచోట కూడా "ఈ ధర్మమంటపము నిత్య కల్యాణము పచ్చతోరణముగా మూడు వందలయేండ్లు నిరంతరముగా నవ్యవహిత ముగా శోభాయమానమై యుప్పెను "(పు 9) అని తాను నవల రాస్తున్న కాలానికి మూడువందల సంవత్సరాలు ముగిసినట్లుగా కూడా చెబుతున్నాడు అంతేకాకుండా "మూడు వందల యేండ్లయిన తరువాత సుబ్బన్నపేట నశించిపోవుటకు బీజ నిక్షేపము కలుగుననియు నాయన (సుబ్బన్నపేట కోట కట్టించిన బ్రాహ్మణుడు - నాగేశ్వరశాస్త్రి తండ్రి) నిర్దేశించెను ఆ హేతువులు పుట్టినవని నేటి గణాచారి సూచించుచుండెను" (పు 10) అని కూడా రచయిత స్పష్టం చేస్తున్నాడు

1934 వ సంవత్సరంలో నవల వ్రాస్తూ రచయిత - మూడు వందల సంవత్సరాల తరువాత సుబ్బన్నపేట నశించిపోవుటకు బీజనిక్షేపము కలుగునన్న బ్రాహ్మణుని మాట నిజమవుతున్నదని నేటి గణాచారి సూచిస్తున్నదని వ్రాస్తే- ఈ మాట నమ్మాలా? లేక టిప్పు సుల్తాను ఓటమి ఘట్టాన్ని నమ్మాలా? ఆ మాటా రచయితే చెప్పాడు రచయిత చెప్పినా చెప్పకపోయినా ఒక చారిత్రక వాస్తవికత ఖచ్చితంగా తెలియవచ్చినప్పుడు దాన్నే ప్రమాణంగా స్వీకరించాలి చారిత్రక వాస్తవికతను రచయితల ఊహాపోహలు వమ్ము చేయలేవు

టిప్పు సుల్తాను ఓటమి ప్రస్తావననుబట్టి 1779 నుండి కోట కట్టటానికి పట్టిన పదేండ్లకాలాన్ని కలుపుకొని ప్రామాణికంగా తీసుకొంటే సుబ్బన్నపేట 1800 నాటిది అవుతుంది నవల రాస్తున్న రచయిత ఇప్పుడు, "నేటి" అని నిర్దేశించిన దానిని బట్టి 1933-34 ను ప్రామాణికంగా స్వీకరిస్తే సుబ్బన్నపేట మూడువందల సంవత్సరాలు వెనక్కివెళ్ళి 1634 ది అవుతుంది కోట 1800 నాటిది అనుకొంటే అప్పటినుండి మూడు వందల యేండ్లంటే మనం 21 వ శతాబ్దంలోకి వెళ్ళిపోతాం మరి రచయిత 1934 లో 'ఇప్పటికి మూడు వందల యేండ్ల క్రిందట' అంటున్నాడు ఆ మాటను పట్టుకొంటే 1634 వ సంవత్సరాని కంటే వెనక్కిపోతాం - రెండూ కుదిరే విషయాలు కావు

సుబ్బన్నపేట కోట కట్టడం ప్రారంభించేనాటికి వీరన్నకు "యేబది యేడులు" (పు 6) వీరన్నకు కోట కట్టటానికి సలహా యిచ్చి ముహూర్తం పెట్టిన బ్రాహ్మణునకు కూడా అప్పటికి "యేబది యేడులు" ఉంటాయని అనుకోవచ్చు అతని కప్పటికి రెండేండ్ల కొడుకు అతనిపేరు నాగేశ్వరశాస్త్రి అసలెక్కడ కోట కట్టటానికి ప్రథమ కారణమైన ఆ స్థల మాహాత్మ్యాన్ని స్వయంగా గుర్తించి, వెలుగులోకి తెచ్చిన కాపుకు అప్పటికి 16, 17 ఏండ్ల కూతురున్నందువల్ల (పు 7) ఆ కాపుకు 40 50 యేండ్ల మధ్య వయస్సుండవచ్చు

వేయిపడగలు నవల రచనాకాలమైన 1934వ సంవత్సరానికి కథానాయకుడైన ధర్మారావుకు వయస్సు ఇరవైయేండ్లు (పు 12) ధర్మారావు తండ్రి రామేశ్వరశాస్త్రి నాగేశ్వరశాస్త్రికి అయిదవ తరంవాడు (పు 12) అంటే ధర్మారావు ఆరవతరంవాడు నాగేశ్వరశాస్త్రి తండ్రికి రచయిత పేరు పెట్టలేదు ఆయన వట్టి బ్రాహ్మణుడు తరానికి 30 సంవత్సరాలుగా వెనక్కుపోతే - ధర్మారావు ఆరవతరంవాడు గనుక అతనికి 1934 కు 20 ఏండ్లు గనుక అతను 1914 లో పుట్టివుంటాడు ఆ లెక్కన నగేశ్వరశాస్త్రి 1764 లో పుట్టివుంటాడు నాగేశ్వరశాస్త్రి పుట్టిన ఒకటి రెండేండ్లలోనే సుబ్బన్నపేట కోటకు ప్రారంభం జరిగింది కనుక నవలలోని కథాకాలానికి ప్రారంభం 1764 అనే అనుకోవాలి అప్పటినుండి మూడు వందల సంవత్సరాలు ఆ పట్టణం మహాదశను అనుభవిస్తుంది గనుక 2040 దాకా సుబ్బన్నపేట సంక్షణంగా వుంటుంది

కానీ, విశ్వనాథ సత్యనారాయణగారు 1934లో ఇప్పటికి మూడువందల యేండ్ల క్రిందట అని చెప్పటం వల్ల ఆ కాలం 1634 కు పోతున్నది ఈ తరాల లెక్కకూడా 1634 దాకా పోవటంలేదు అందువల్ల ఇదీ కుదిరే విషయంగా లేదు

సుబ్బన్నపేట కోటగట్టి జమీందారైన వీరన్న సంతాన పరంపర గురించి కూడా రచయిత ఒక లెక్క చూపించాడు "హరప్ప - వీరన్ననాయడు, నాగన్ననాయడు, హరిహరనాయడు గోపాలస్వామినాయడు, హరప్పనాయడు, కృష్ణమనాయడు - వీరి రక్తబిందువుల నివసించు తేజోలేశముగనే కన్పించును" (పు 272) ఆ తేజోలేశంగా కన్పించే హరప్ప కృష్ణమనాయని మనుమడు రచయిత కృష్ణమనాయని కొడుకు రంగారావును చెప్పలేదు

కృష్ణమనాయడు ధర్మారావు బి ఏ మొదటి సంవత్సరం చదువుతున్న సంవత్సరంలో చనిపోయినాడు 15 ఏండ్లకు ఆరవ ఫారానికి వచ్చి ఆ సంవత్సరం పరీక్ష తప్పి, మరుసటి సంవత్సరం తన తండ్రి చనిపోవటంచేత "చదువుటకే వీలులేక" (పు 40) ఆ తరువాత సంవత్సరం నుండి వరుసగా స్కూలు ఫైనలు పరీక్షయిచ్చి, యఫ్ ఎ పరీక్ష యిచ్చి బి ఏ మొదటి సంవత్సరానికి వచ్చాడు ధర్మారావు అంటే 17 వ యేట S S L C పాసై, 19 వ ఏట F A పాసై, 20 వ యేట బి ఏ లో చేరాడన్న మాట 1934 నాటికి 20 యేండ్లయితే ధర్మారావు 1914 లో పుట్టివుంటాడు 1934 లో కృష్ణమనాయడు-ధర్మారావు బి ఏ మొదటి సంవత్సరం చదువుతుండగా - వరణించాడు అప్పటికాయన బాగా 'ముసలివాడు" (పు 23, 40) కృష్ణమనాయని మరణానంతరం రెండు మూడు నెలల వ్యవధిలో రంగారావుకు పట్టాభిషేకం జరిగింది పట్టాభిషేక సమయానికి రంగారావుకు "ముప్పదియైదేండ్లు" (పు 52) అంటే రంగారావు 1899 ప్రాంతంలో పుట్టివుంటాడు ధర్మారావు రంగారావు కంటే 15 ఏండ్లు చిన్నవాడు 1899 లో రంగారావు పుట్టివుంటే, 1869 ప్రాంతంలో కృష్ణమనాయడు పుట్టి వుండాలి అప్పటి నుండి తరానికి 30 ఏండ్లుగా అయిదు తరాలు వెనుక్కుపోతే వీరన్ననాయడు 1689 ప్రాంతంలో పుట్టి వుంటాడు

అయితే, 1689 లో పుట్టి వీరన్న నూటపదకొండు సంవత్సరాలు బతికి 1800లో సుబ్బన్నపేటకోట కట్టివుంటాడనటం అంత సమంజసంగా కనిపించదు

'ఈ ధర్మారావుకు గణాచారి యెదురు వచ్చినది' (పు 41) ఈ అనగా ఏ ధర్మారావుకు అంటే - 1934 నాటికి బి ఏ మొదటి సంవత్సరం చదువుతూ కృష్ణమనాయని వారి మరణవార్త విని బందరు నుండి సుబ్బన్నపేట వచ్చినప్పటి ధర్మారావుకు అన్న మాట అప్పటి కాతని వయస్సు ఇరవై యేండ్లకు మించి వుండటానికి వీలులేదు అప్పుడే అతని కార్యమైనది తండ్రి చనిపోయిన నాలుగేండ్లకు (పు 92) అనగా ధర్మారావుకు 20 ఏండ్లప్పుడు 14 సంవత్సరాల అరుంధతి కాపురానికి వచ్చింది ధర్మారావు భార్య కాపురానికి వచ్చింది ఆనంద నామ సంవత్సరంలో (పు 105) ఆనంద అంటే 1914 అన్నమాట నవల వ్రాస్తున్న కాలంనుండి 20 ఏండ్లు వెనకకు లెక్కగట్టి ధర్మారావు పుట్టింది 1914 అనుకోవటానికి ఈ విధంగా చూచినప్పుడు అవకాశం కనిపించదు

ఆనందనామ సంవత్సరంలో ధర్మారావు కార్యమైంది కనుక, అప్పుడతనికి ఇరువది యేండ్లు కనుక అక్కడి నుండి 20 వ సంవత్సరాలు వెనకకు లెక్కగడితే 1894 ధర్మారావు పుట్టిన కాలమవుతుంది కానీ, అది నవలలోని ఇతర సందర్భాలలో చెప్పిన కాలగణనంతో సంప్రదించదు ఈ సమస్యకు పరిష్కారం ఎట్లా?

నవలలోని పదకొండవ అధ్యాయం మొదటి వాక్యం "అప్పటికి మహాత్ములైన గాంధీ సహాయ నిరాకరణోద్యమ మారంభించి రెండేండ్లయినది" అని అంటే అప్పుడు 1922 జరుగుతున్నదన్నమాట 1920 ఆగస్టు 31 న సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమైంది (ఆధునిక భారతదేశ చరిత్ర - బిపిన్‌చంద్ర - పు 252) పదవ అధ్యాయంలో కృష్ణా పుష్కరాల ప్రస్తావన (పు 275) వుంది కృష్ణా పుష్కరాలు వచ్చిన సంవత్సరం 1920 "గాంధీగారు స్వరాజ్యమాసంవత్సరములో వచ్చునని చెప్పిరి గాంధీగారు పెట్టిన గడువైనంతనే దేశము నందలకును విరక్తి జనించెను" (పు 312) గాంధీగారామాట చెప్పినది 1921 లో గడువై పోయినది 1922 లో అప్పటికే ధర్మారావు జాతీయ కళాశాలలో ఉద్యోగంలో చేరాడు (పు 310) జాతీయ కళాశాలలో అధ్యాపకుడు శివరావు తన అవతార పరిపక్వతను గూర్చి చెబుతూ "ఇది పందొమ్మిది వందల ఇరువది నాలుగువ సంవత్సరము" (పు 376) అని చెప్పాడు ధర్మారావు బి ఏ పరీక్షలు వ్రాసేనాటికే అతని వయస్సు 24 25 సంవత్సరాలు (పు 199) 1921-22 సంవత్సరాల్లో ఉద్యోగంలో చేరినా ధర్మారావు 1897 ప్రాంతంలో పుట్టి వుండాలి ధర్మారావే విశ్వనాథ సత్యనారాయణ అనుకొంటే ఈయన పుట్టింది 1895 సెప్టెంబరు 10 ఇక్కడ ఈ లెక్క ప్రకారం మనం ధర్మారావు పుట్టిన కాలాన్ని కొంత కుడి యెడంగా సంగ్గానే కనుక్కోగలిగాం

కానీ, రచయిత చెప్పిన ఆ మూడు వందల సంవత్సరాల కథ మాత్రం అసలు పొసగదు అయితే, ఎందుకా విధంగా చెప్పి వుంటాడు అంటే జవాబు లేదు ఏదో పొరపాటు లెమ్మనటానికి వీలు లేకుండా చంద్రారెడ్డి ఊహమాటగా "ఇట్టి సంఘము లేక పేటలో మూడు వందల యేండ్లు జరిగిన నష్టమేమి" (పుట 321) అని పురపాలక సంఘ సౌధ నిర్మాణం గురించి వ్రాస్తున్నాడు రచయిత ఎంత చూచినా మూడు వందల సంవత్సరాల లెక్క అతకటం లేదు

రచయిత అయిన విశ్వనాథ సత్యనారాయణ అన్నీ లెక్కగట్టి చెప్పినట్లు చెప్పినా ఒకదానితో ఒకటి పొసగక నవలాకాలం గందరగోళంలో పడిపోయింది కనుక సుబ్బన్నపేట కోట ఫలానా కాలంలో కట్టబడింది అని ఖచ్చితంగా చెప్పటానికి వీలుగా కథాగతాంశాలు వుండటాన్ని రచయిత సంకల్పించలేదు సంకల్పించాడనుకొంటే ఆ సంకల్పాన్ని సలక్షణంగా నిర్వహించటంలో జాగ్రత్త వహించలేదని చెప్పాలి

అందువల్ల 134 సంవత్సరాల జీవితం గల సుబ్బన్నపేటను - మూడు వందల సంవత్సరాల నాటిదిగా రచయిత చెప్పటమే పొరపాటు బ్రాహ్మణుడు గాదు బ్రహ్మదేవుడు చెప్పినా ఆ మూడు వందల యేండ్లన్నది చరిత్రకు విరుద్ధం చరిత్రను కూడా రచయితే అందించాడు గనుక - చరిత్రను ప్రమాణంగా స్వీకరించి రచయిత చెప్పిన అందుకు వ్యతిరేకమైన ఇతర విషయాన్ని రచయిత పొరపాటు పడ్డాడని దాన్ని త్రోసివెయ్యాలి

నవల ప్రారంభంలోనే దేశ కాలాలను అనుసంధించుకోటంలో రచయిత అంత పొరపాటు చేశాడు అంటే అది సామాన్యమైన విషయంగా త్రోసిపారేయటానికి వీలులేదు అందులో విశ్వనాథ సత్యనారాయణ అంత పొరపాటు చేశాడనటం అంత తేలిక విషయంకాదు పొరపాటు పడటానికి కూడా కారణం వుండాలి అదేమై వుంటుందంటే- (1) సుబ్బన్నపేట నిర్మాణానికి రచయితకు ప్రేరణ విజయనగర (సామ్రాజ్య) సంస్థాపన గాథ కావచ్చు కుందేలు కుక్కలను తరిమికొట్టిన స్థల విశేషం విజయనగర నిర్మాణానికి హేతువుగా చెప్పబడుతున్న సాంప్రదాయిక వచనప్రభావాన్ని అనుసరించే పాముకు పాలిచ్చిన ఆవు తిరిగిన స్థలమహాత్మ్యం భావించబడింది - సుబ్బన్నపేట కట్టడానికి లక్ష్మి అమ్మనారు నగరం కట్టించమని సన్యాసం తీసుకొని విద్యారణ్యులైన మాధవాచార్యులకు కలలో చెప్పటం - హరిహర బుక్కరాయ సోదరులకు విద్యారణ్యుడు విరూపాక్షస్వామి అసలు ప్రభువు అని, అతని పక్షాన మీరు రాజ్యం చెయ్యమనటం - విద్యారణ్యుడు విజయనగర శంకుస్థాపనకు ముహూర్తం పెట్టటం - ముహూర్తానికి ముందే శంకుస్థాపన జరగటం - అందువల్ల విజయనగర సామ్రాజ్యం మూడువందల యేండ్లకంటే ఎక్కువ మనజాలదని అప్పుడే విద్యారణ్యుడు చెప్పటం - మొదలయిన ఈ చరిత్రకాని చరిత్ర యొక్క అనుఖ్యాతి విశ్వనాథ మనస్సులో పడి, ఆ మూడువందల యేండ్ల ఊహచేసి వుంటాడు

విరూపాక్షస్వామికి బదులు సుబ్రహ్మణేశ్వరస్వామి విద్యారణ్యుడికి బదులు నాగేశ్వరశాస్త్రి తండ్రియైన బ్రహ్మణుడు హరిహర బుక్కరాయ సోదరులకు బదులు వీరన్ననాయుడు హరిహర బుక్కరాయ సోదరుల అనుయాయి సైన్యానికి బదులు కాపు - ఈ విధంగా పైన భగవంతుడు - కింద రాజు బ్రహ్మణుడు - కాపువంశం ఆ కాలంలో యుద్ధాలు చేయవలసి వచ్చింది గనుక కాపు వంశం వారిని సైనికులుగా వాడుకొన్నారు ఇప్పుడు అసిలేని యుద్ధం - సాంస్కృతిక - సమరం గనుక కాపువంశం స్త్రీలు - బ్రాహ్మణులకు వత్తాసిగా భగవదావేశంతో స్వామికి వ్యాఖ్యాతలుగా పనిచేయటం కల్పించబడింది

ఈ నాల్గు స్తంభముల ధర్మమంటపం అన్నది విజయనగర హిందూ సామ్రాజ్యం నమూనా మీద నిర్మించబడింది అందువల్ల మూడువందలయేండ్లుండు నట్లుగా కల్పించబడింది మరొక కారణాన్ని కూడు ఇక్కడ మనం గమనంలోకి తీసుకోవచ్చు

1934 నాటికి మనం మద్రాసు రాజధానిలో వున్నాం అప్పుడు మద్రాసు నగరం మనదే అప్పటికి మద్రాసు నగరం ఏర్పడి మూడువందల సంవత్సరాలయింది (Madras 350 years-commemoration Suppliment-Hindu Monday, April 30, 1990) మద్రాసు మహానగర సంస్కృతి పాశ్చాత్యీకరణం చెందటం (చెడిపోవటం) ప్రారంభమై అప్పటికే చాలా కాలమైంది 'డాంజిలీసు హోటలు' (పు 80) సంస్కృతి దేశంలోని జమీందారులను ఆకర్షిస్తున్న కాలమది ధనవంతులు మద్రాసు మహానగరమును సుఖనివాస భూమిగా భావించుచుండిరి' - రంగారావు జమీందారును మద్రాసు తనవానినిగా చేసికొన్నందుకు పల్లె అయిన పేట లాభము లేకపోయినను ఏడ్చినది (పు 80)

రచయితకు మహారణ్య మధ్యమున నున్న ఒక చిన్నపల్లె క్రమముగా సుబ్బన్నపేట అనే పేరుతో పెద్ద జమీందారీ గ్రామం కావటం వరకు బాగానే వుంది మహారణ్యంలోని చిన్నపల్లె - జమీందారి గ్రామంగా మారటంలో అడవి పల్లెతనాన్ని ఎంతో కొంత కోల్పోయి వుంటుంది అడవి పల్లెతనం పోయి కోట-దేవాలయాలు రావటం, అది పెద్ద జమీందారీ గ్రామం కావటం-అంతవరకు అభివృద్ధిగానే భావించాడు రచయిత ఆ విధంగా నూరు - నూట పాతికేండ్లు కొనసాగటం ధర్మం స్థిరంగా వుండటం అనుకొన్నాడు

అడవి పల్లెగా వున్నప్పుడు సుబ్బన్నపేట ధర్మమంటపం కాదు ఎందు వల్లనంటే, అక్కడ బ్రాహ్మణుడు లేడు జమీందారు-రాజు లేడు దేవుడుండి వుంటాడు కాని బయట పడలేదు అందువల్ల కాపు సంశస్తులున్నారు కానీ, వాళ్ళు (వాళ్ళ ఆడవాళ్ళు) స్వామికి వ్యాఖ్యాతలు కాలేదు

అదట్లా వుంచి-మద్రాసు మహానగరం మూడు వందల సంవత్సరాల క్రితం ప్రారంభం కావటం గురించిన కథ కూడా ఆంగ్లేయులు సెంటు జార్జి పేరు మీద 1640 (ఏప్రిల్ 23) లో కోటను నిర్మించటంతో ప్రారంభమవుతుంది దామర్ల వెంకటాద్రి నాయకుని నుండి 10 కిలోమీటర్ల భూమికి అనుమతిని పొంది తూర్పు ఇండియా కంపెనీ ఇంగ్లీషువాళ్ళు ఆ కోట కట్టారు అదే మద్రాసు నగర ప్రారంభం 1934 నాటికి ఆంధ్రుల ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ప్రారంభం కావటం, మద్రాసు తమిళులకు - ఆంధ్రులకు వైమనస్యాలు ఏర్పడటం-రాజకీయాల్లో ఒకరినొకరు ఒరుసుకోవటం ఇవన్నీ మొదలై మద్రాసు నగరం మీద-మద్రాసు మహానగరం పాశ్చాత్య సంఘ ప్రభావానికి లోనవుతూ మారిపోతూ వుండటం - ఆంధ్రులకు అందులో సముచిత స్థానం లేకపోతూ వుండటం - ఇవన్నీ జరుగుతున్న కాలమది అందువల్ల మూడువందల సంవత్సరాల క్రితం రూపొందిన ఒక మహానగరం పాశ్చాత్య సంస్కృతీ సంప్రదాయాలకు ఆలవాలమై దేశీయతా ముద్రను విడనాడటం - ఒక పతనావస్థగా భావించిన విశ్వనాథ - తన నవలలో సుబ్బన్నపేట సందుకు ప్రతినిధిగా వర్ణించటానికి పూనుకొన్నాడన వచ్చుననిపిస్తుంది

"మూడు వందల యేండ్ల"ను అంత గట్టిగా రెండు మూడుసార్లు చెప్పటాన్ని - నవలేతివృత్తంతో అన్వయం కుదరటం లేదన్న వాస్తవాన్ని గుర్తిస్తూనే-అదొక పొరబాటుగా నిరూపిస్తూనే-మనం విశ్వనాథ విషయంలో ఈ విధంగా అర్థం చేసుకోవచ్చు

ఇక మిగిలిన అంశం ఒకటి వుంది సుబ్బన్నపేట కోట కట్టించిన ఆ బ్రాహ్మణుడా యూరికి మూడు వందల యేండ్లే ఆయుర్దాయమున్నదని నిర్ణయించాడు అట్లేల చేసినట్లు? నిత్యమైన దానినిగా ఏల చేయలేదన్న మనబోటి వారి ప్రశ్నలను విశ్వనాథ ఊహించాడు ఈ ప్రశ్ననెంత వాస్తవిక పునాది మీద

భావించినాడో సమాధానము నంత ఆధ్యాత్మిక వాతావరణంలో తేలగొట్టాడు 'ఆయన సరజ్ఞుడే కాని సర్వాధికారి కాడు వాస్తు విజ్ఞాతయే గానీ వాస్తు నిర్మాతగాడు శాస్త్రపారంగతుడే గానీ శాస్త్ర స్రష్టగాడు (పు 10) ఈ మూడు సమాధాన వాక్యాలను అర్థం చేసుకోవటం గురించి కూడా ఆలోచించాలి• తాత్పర్యం విధి విలాసం

అందువల్ల మూడు వందల సంవత్సరాలు గొప్పగా వెలిగిన సుబ్బన్న పేట - ఇక నశించి పోవుటకు బీజము పడిన కాలం నడుస్తున్నదని రచయిత నవల మొదలుపెట్టాడు

ధర్మారావుకు ఇరవై నుండి ముప్పై ఎనిమిది సంవత్సరాలు వచ్చిన దాకా 18 సంవత్సరాలు నడుస్తుంది ఈ వేయి పడగలు నవలాకాలం అంతకు ముందు కథ ఫ్లాష్‌బాక్‌గా వుంది ఆ లెక్కలో దాదాపు 25 సంవత్సరాల కాలంలో జరిగిన సాంఘిక పరిణామాల చరిత్ర ఈ నవలా వస్తువు మొదటి ప్రపంచ యుద్ధం ముగిసి - రెండో ప్రపంచ యుద్ధం కాని మధ్యకాలంలో తెలుగు దేశంలో వచ్చిన పరిణామాలను విశ్వనాథ ప్రతి ఫలించిన తీరు తెన్నులు ఈ పుస్తకం నిండా వున్నాయి

కేశవబ్రహ్మమతం, దివ్యజ్ఞాన సమాజం, బ్రాహ్మణేతరోద్యమం మొదలైన మత సంస్కరణ ఉద్యమాలు ఈ నవలలో ప్రస్తావనకు వచ్చాయి 1900 - 1934 మధ్యకాలంలో జమీందారీ వ్యవస్థ శిథిలమవుతూ క్రమంగా పురపాలక సంఘ పరిపాలనా వ్యవస్థ దాకా వస్తున్న మార్పులను, పాశ్చాత్యా నాగరికతా వ్యతిరేక దృష్టితో, ప్రాచీన వర్ణాశ్రమాచార సంప్రదాయాభిమాన దృష్టితో చిత్రించటం జరిగింది

రచయిత తాను చిత్రిస్తున్న సమాజం ఫలానా నిర్దిష్ట దేశకాలాల్లోది అని నిరూపించాలి వేయి పడగల రచయితకు చారిత్రక దృష్టి ఉండవలసినంతగా లేదు సాంఘికమైన మార్పుకు వ్యతిరేకమైన సంప్రదాయాభిమానమెంత తీవ్రంగా వుందో చారిత్రక వాస్తవిక దృష్టి అందులో కొంతగానైనా లేదు

సుబ్బన్నపేట జమీందారీ ఉన్నది కృష్ణమనాయుడున్నాడు రామేశ్వర శాస్త్రి ఉన్నాడు మార్పు మొదలయింది కథ మొదలయింది ఇది నవల అయితే అంతా వాస్తవిక భౌతిక పునాదిమీద వుండాలి లేదు మారుతున్న సమాజంలో మారని పాత విలువలకు ప్రతినిధులు గణాచారి - ధర్మారావు గణాచారిది దైవావేశం ధర్మారావు మామూలు మనిషికానీ తన తర్కబుద్ధి చేత అభౌతిక దైవభావాన్ని నిలబెట్టే ప్రయత్నం చేస్తాడు గణాచారి తన పనిని తాను చేసుకుంటూ పోతుంటుంది - భవిష్యత్తును సూచిస్తూ మాట్లాడుతుంది ఊళ్ళో ఆమె మాటలను విశ్వసించే కాలం పోయింది అది మార్పు అయినా ఆమె చెబుతూనే వుంటుంది అది పాత విలువ నవలా రచయిత పాత విలువలు నశించిపోతున్నందుకు విచారిస్తుంటాడు తాను నిలబెట్టలేడు తానే ఆచరించలేడు తాను కాలంతోపాటు ఇష్టంలేకపోయినా మారకపోయినా సర్దుకొని పోతూ పాత విలువల గొప్పతనాన్ని కలవరించేవాడు

ఒక విధంగా చూస్తే ఆ 1930 - 1935 మధ్యకాలం అటు విశ్వనాథా ఇటు శ్రీ శ్రీ నశించిపోతున్న దానికొరకు ఒకరూ - ఇంకారూపు గట్టుకొని అవతరించని దానికొరకు ఇంకొకరూ పలవరించిన కాలమది శ్రీశ్రీ పలవరింత అభ్యుదయ వాదమైంది విశ్వనాథ పలవరింత సంప్రదాయవాదమైంది శ్రీశ్రీది ముందుచూపైతే విశ్వనాథది వెనుక చూపైంది వెనక్కుచూచి గత వైభవాన్ని కీర్తించినవాడు విశ్వనాథ ముందుకు చూచి భవిష్యదాశాలతలను కొనసాగించినవాడు శ్రీశ్రీ సంగా విశ్వనాథ వేయిపడగలు - శ్రీశ్రీ మహాప్రస్థానం రెండింటి ఆవిర్భావానికీ భౌతిక పునాదిని సమకూర్చిన కాలం 1930-35 విశ్వనాథకు ప్రాతినిధ్యం వహించేది వేయిపడగలు శ్రీశ్రీకి మహాప్రస్థానం

రామేశ్వరశాస్త్రి బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు నాలుగు వర్ణములలోని స్త్రీలను వివాహమాడవచ్చునని ఉన్న ధర్మశాస్త్ర మెప్పటిది? రామేశ్వరశాస్త్రి కాలమునకు అది ధర్మము కాదు అయినా,రామేశ్వరశాస్త్రి సావిత్రమ్మను వివాహమైన తరువాత క్షత్రియకాంత రంగాజమ్మను, వైశ్య స్త్రీ అయిన హైమవతిని, శూద్ర స్త్రీ మంగను క్రమంగా పెండ్లి చేసుకొన్నాడు భోగాంగన రత్నగిరిని ఉంచుకొన్నాడు




ఇది 1900 ప్రాంతానికి ఉన్న స్థితి జమీందారులు బహుస్త్రీ లోలురు కావటం సరేసరి వారి దివానులు కుడా అందులో సనాతన ధర్మ పరాయణు డైన దివాను సనాతనధర్మాన్ని ఆచరించి చూపించాడు దాన్ని సుబ్బన్నపేటలో గానీ చుట్టుపక్కలగానీ ఎవరూ ప్రశ్నించలేదు అంతా ఆమోదించారు

కృష్ణమనాయని వారి తరువాత రంగారావుగారు జమిందారై మొదటి భార్య సరోజనీదేవిగారు గతించాక - ఇంగ్లాండు వెళ్ళి సుసానీ ఆంగ్ల వనితను పెండ్లి చేసుకొని తెచ్చుకొన్నాడు, ఆమె తల్లి దండ్రులను చూడటానికి ఇంగ్లాండు వెళ్ళితే - ఆమెను ఇంగ్లాండుకు సాగనంపి కొలంబోనుండివస్తూ బియాట్రెస్ అనే ఫ్రెంచి వనితను పెండ్లాడినాడు భారతదేశంలోని జమీందారులు యూరోపియను వనితల వెంట బడటం - అలా పడటాన్ని యూరోపియను అధికారులు ప్రోత్స హించటం - అందువల్ల భారత జమీందారీ కుటుంబాల్లో నైతిక విలువలు దిగ జారటం ఇరవయ్యో శతాబ్ద మొదటినుండే మొదలయింది ఇది ఒక చారిత్రక అవసరమైన సంఘటనగా అప్పటి పరిస్థితులు నిరూపిస్తాయి విశ్వనాథ మన జమీందారులు యూరోపియను వనితల వెంటపడటానికి అనుకూలపడిన అప్పటి దేశ కాల పరిస్థితులను చిత్రించివుంటే ఇంకా బాగుండేది విశ్వనాథ ఆ పరిస్థితు లను కొంత చెప్పకపోలేదు అయినా యూరోపియనులమీద ద్వేషంతో చెప్పి నట్లుంటుందిగానీ, చారిత్రక, సామాజిక నేపథ్యాన్ని సూచిస్తున్నట్లుండదు

ఈ నవలలో వేయిపడగలస్వామి - హామ్లెట్ నాటకంలో భూతంలాంటి వాడు అప్పుడప్పుడు కనిపిస్తుంటాడు

1 కాపుకు - కలలో కనిపించి గుడికట్టించుమని అడిగెను
2 కృష్ణమనాయుడు - రామేశ్వరశాస్త్రి అరేండ్ల తరువాత కలిసి మాట్లాడు కొన్నప్పుడు - స్వామి కనిపించెను
3 కృష్ణమనాయుడు ధర్మారావును ఋణబాధావిముక్తుణ్ణి చేసినప్పుడు స్వామి కనిపించెను
4 రంగారావు పట్టాభిషేక ఉత్సవంలో స్వామి కనిపించెను
5 రంగారావుకు అంతకుముందే కలలో
6 ధర్మారావు భార్య అరుంధతికి - గర్భాదానములో
7 రంగారావుకు కలలో సరోజినీదేవి పాములతో కనిపించింది
8 కిరీటికి ఆలయంలో నాగేశ్వరస్వామి విగ్రహం నిజమైన పాముగా కనిపించటం
9 పశుపతికి ఇంటిలో అరుంధతికి, కలలో రంగమ్మకు రెండు పడగలతో కనిపించెను
10 పురపాలక సంఘ నిర్మాణ కాలంలో

**వేయిపడగల్లో వివాహాలు**

1 ఒకడు నలుగుర్ని చేసుకోవటం
2 సావిత్రీ రామేశ్వరశాస్త్రి, అరుంధతీ ధర్మారావులది - బాల్యవివాహాలు. సావిత్రికి మూడేళ్లు, రామేశ్వరశాస్త్రికి పద్దెనిమిది అరుంధతికి ఐదేళ్ళు, ధర్మారావుకి పదకొండు
3 రంగారావు సరోజిని మరణానంతరం ఇంగ్లాండునుండి సుసాసీని, తరువాత ఫ్రెంచి కవిత బియాట్రేస్‌ను పెండ్లాడి తీసుకురావటం
4 కిరీటి శశిరేఖలది ప్రేమ వివాహం
5 శ్యామలా కుమారస్వాములది సంఘ సంస్కరణ వివాహం.

వేయిపడగల్లో జంటలు

1 అరుంధతీ ధర్మారావులు
2 రుక్మిణమ్మారావు కృష్ణమనాయుడు
3 సరోజినీ రంగారావులు
4 సుసానీ రంగారావులు
5 బియాట్రిస్ రంగారావులు
6 కిరిటీ శశిరేఖలు
7 ఛాయా సూర్యపతులు
8 పశుపతి అనసూయలు
9 శ్యామలా కుమారస్వాములు
10 రంగమ్మ రంగయ్యలు

వేయిపడగల్లో పోలీసులు

1 మ్యాజిక్ ప్రదర్శన దగ్గర - పందిరి ద్వారం దగ్గర
2 పట్టాభిషేక దినము లో రక్షకభటులు
3 సర్కసు ద్వారం దగ్గర

## వేయిపడగలు - విశ్వనాథ సంప్రదాయము ·

వేయిపడగలతో నేలదాల్చినవాడు, నాల్గు పడగలతో పురుషార్థములు సాగించువాడు, రెండు పడగలతో దంపతుల పాలించువాడు, ఒక్క పడగ విప్పి పైరుకు పచ్చకు గొడుగుపట్టినవాడు, త్రిమూర్త్యాకృతి, శూలము నాలుకయందు, శంఖచక్రములు ఫణాగ్రములయందు తాల్చిన దేవుడు, ధర్మమయ తనువు కరుణా తరంగితాంతరంగుడై నన్నుగూడ **నా పితురల వలెనే సంప్రదాయమునకు దూరము కాకుండా కాపాడువాడు** నాకు ప్రసన్నుడగు గాక! నన్ను సర్వథా రక్షించు గాక!' (పు 117)

ధర్మారావు పితరులు సంప్రదాయము ననుసరించిన వైఖరి లక్షణం ఏమిటి? ముఖ్యంగా తండ్రి రామేశ్వర శాస్త్రి జీవితాన్ని గొప్పగా భావించాడు గనుక ఆ జీవిత విధానాన్నే సంప్రదాయంగా ధర్మారావు స్వీకరించాడు అదే

భగవంతునకు చాలా ఇష్టమైన సంప్రదాయమనుకొన్నాడు "మా తండ్రి ఏమను కొంటివి? ఆయన లోకసామాన్యుడు కాడు ఆయన గొప్పతనము దౌర్భాగ్యుల కెట్లు తెలియును?" (పు 116) లోకసామాన్యుడు కాని తండ్రియొక్క అతిలోక మైన "వర్ణాశ్రమ ధర్మముల'' ముద్ద రూపము ''భారతదేశము యొక్క ఆత్మ'' రూపము (పు 51) అయిన అనుష్ఠాన జీవన విధానమును సంప్రదాయముగా భావించటం వల్ల దాని యందొక ఆరాధన బుద్ధి స్థిరపడింది ధర్మారావుకు

లోకసామాన్యుడు కాని ధర్మారావు తండ్రి రామేశ్వర శాస్త్రి ఎటువంటి వాడు? -"శృతిస్మృతులు చక్కగా చదివినవాడు కొంత కర్మిష్ఠి యాగాదులు చేయక పోయినను, వైశ్వదేవము చేసి గృహమున నగ్నిహోత్ర మారనీయని గేస్తు బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్ర కన్యలను వివాహమాడి, నలుగరి యందును సంతానమును బడసెను ఇదియుగాక రత్నగిరి యను నొక భోగాంగన నుంచు కొనెను ఆమె యందును సంతానము కలిగెను" "లోక దృష్టిలో నీ వివాహములు, నాయన కాముకతయు ప్రవాద హేతువులైనను రామేశ్వర శాస్త్రిగారి యౌదార్య గుణ సముద్రమున నవి మునిగిపోయెను" (పు 12)

బ్రాహ్మణ పురుషులు నాలుగు వర్ణాల స్త్రీలనూ వివాహం చేసుకోవటం గురించి మనుస్మృతిలో వుంది మనుస్మృతి ఏది చెప్పినా పురుషుల దృష్టి కోణం నుండే సమస్తాన్నీ చూచి చెప్పేది గనుక పెండ్లిండ్ల విషయాన్ని కూడా అలాగే చెప్పింది అటువంటి మనుస్మృతి కూడా బ్రాహ్మణులే కాదు - ఏ కులం వారైనా తమ కులాన్ని దాటి ఇతర కులాల స్త్రీలను కావాలని పెండ్లి చేసుకోటం చేస్తే అది కామాతిరేకం వల్ల చేయటంగానే భావించింది ఆ విషయాన్ని గౌరవ ప్రదమైందిగానూ ఆచరణీయమైందిగానూ స్మృతి చెప్పలేదు ముఖ్యంగా బ్రాహ్మణుడు శూద్రస్త్రీని పెండ్లి చేసుకొంటే అతడు భ్రష్టుడనీ (3-16) బ్రాహ్మణత్వాన్నే కోల్పోయిన వాడవుతాడనీ (3 17) అసలటువంటి అధర్మ చేష్టకు ప్రాయశ్చిత్తం కూడా లేదనీ (3-19) మనుస్మృతి ఘోషిస్తుంటే విశ్వనాథ సత్యనారాయణగారు తన కథా నాయకుని తండ్రిని అట్టివాడుగా చేసి నవలను వ్రాయటంద్వారా ఆయన తన పాఠకులకు ఏమి తెలియజెప్పదలచుకొన్నాడు?

అటువంటి - బ్రాహ్మణత్వమునే కోల్పోయిన భ్రష్టుడుగా మనుస్మృతి నిర్ణయించే రామేశ్వర శాస్త్రిని గురించి రచయితగా విశ్వనాథ, అసలు కొడుకైన ధర్మారావు కంటే ఎక్కువ గొప్పగానూ గర్వంగానూ చెప్పటాన్ని మనం గమనించవచ్చు ఆ విధంగా దాపరికం లేకుండా విశ్వనాథ రామేశ్వర శాస్త్రిని గురించి శ్రుతి స్మృతులు చక్కగా చదివినవాడు - కర్మిష్ఠి అనీ వర్ణాశ్రమ ధర్మములన్నియు ముద్దకట్టిన మూర్తి (పు 51) అనీ చెప్పటాన్ని మనం ఎలా అర్థం చేసుకోవాలి? ఇన్ని వైరుధ్యాలను తెలిసితెలిసి ప్రవేశపెట్టిన రచయితను తప్పకుండా మనం అర్థం చేసుకోవాలి గొప్ప రచయితలు గొప్ప పొరపాట్లు చేసే అవకాశం లేదని కండ్లు మూసుకొనిపోవటం అసలే మంచిది కాదు

ధర్మారావుకు తన తండ్రియందు ఎంత గౌరవాభిప్రాయమైనా వుండవచ్చు ఆయన చేసినవన్నీ గొప్ప ధర్మకార్యములుగానే కనిపించవచ్చు కానీ ధర్మరావు కంటే ఎక్కువ ఉత్సాహంతో రచయిత రామేశ్వరశాస్త్రిని గూర్చి వ్రాయటమెందుకు? - అంటే ఆ రామేశ్వరశాస్త్రి జీవిత విధానాన్నే సంప్రదాయ సంబద్ధతగా భావించాడు కనుక

రామేశ్వరశాస్త్రికి 18 ఏండ్లప్పుడు సావిత్రమ్మతో పెండ్లి అప్పుడామెకు వయస్సు 3 ఏండ్లు (పు 44) అంటే రామేశ్వరశాస్త్రికి సావిత్రిమ్మకు 15 ఏండ్లు వార ఆమె కాపురానికి వచ్చేనాటికి రామేశ్వరశాస్త్రికి దాదాపు 30 ఏండ్లు వస్తున్నాయి అది కారణంగా యౌవనపు పొంగులో ఆయనకు రంగాజమ్మగారితో సంబంధం ఏర్పడింది ఆమె ఆయనతో లేచివచ్చింది రామేశ్వరశాస్త్రి తన 20 ఏండ్లప్పుడు క్షత్రియస్త్రీని రంగాజమ్మను లేవదీసుకొని వచ్చి "శాస్త్రీయముగా" (పు 45) పెండ్లి చేసుకొన్నాడు

రామేశ్వరశాస్త్రి తనకు 25 యేండ్లప్పుడు తీర్థయాత్రలకు బయలుదేరాడు అప్పటికి సావిత్రమ్మగారి వయస్సు 10 ఏండ్లే అందువల్ల ఆమె కాపురానికిరాలేదు కాబట్టి రంగాజమ్మను వెంటబెట్టుకొని రామేశ్వరశాస్త్రి తీర్థయాత్రలకు బయలుదేరాడు ఆ తీర్థయాత్రలో - మధ్యలో ఒక వైశ్యకుటుంబం తటస్థపడింది పరిచయం పెరిగింది అప్పటికే క్షత్రియ కాంత రంగాజమ్మను 'శాస్త్రీయంగా' పెండ్లి చేసుకొన్న రామేశ్వరశాస్త్రి 'వైశ్యశూద్ర స్త్రీలను గూడ చేసుకొనవలెనని

యున్నదని' (పు 45) తన అభిప్రాయం చెప్పాడు అందుకు రామకృష్ణారావు 'మందహాసము చేసి యూరకుండె'నే గాని తన కూతుర్ని హైమవతిని ఇస్తాను చేసుకొమ్మనలేదు

బ్రాహ్మణుడు చేసుకొంటానన్నాడు కదా అని తమ కూతుళ్ళనియ్యటానికి ఇతర కులాల వారు ఉత్సాహాన్ని చూపించటంలేదు వైశ్య స్త్రీని హైమవతిని కూడా రామేశ్వర శాస్త్రి లేవదీసుకొని వచ్చి చేసుకొన్నట్లే ఆ తరువాత నాలుగేండ్లకు రామేశ్వర శాస్త్రి తనకు 30 ఏండ్లప్పుడు మంగయను ఒక కాపు (శూద్ర) కులస్త్రురాల్ని వుంచుకొన్నాడు బలవంతం మీద ఆమెకు పుస్తెకట్టాడు అంటే - తానుగా ఆమెను చేసుకోటానికి సిద్ధపడలేదన్నమాట సావిత్రమ్మగారు కాపురానికి వచ్చిన తరువాత ఈ నాల్గవ పెండ్లి చేసుకొన్నాడు ఈ విధంగా వచ్చిన నలుగురు భార్యలూ కాక భోగాంగన రత్నగిరిని వుంచుకోటం కూడా రామేశ్వర శాస్త్రి వర్ణాశ్రమాచార ధర్మ ఆచరణలో భాగమన్నట్లే రచయిత వ్రాశాడు

ఇటువంటి బ్రాహ్మణుడు బ్రాహ్మణ కులానికి గానీ - ఇతర కులాలకు గానీ ఆదర్శప్రాయుడు కాగలడా? వేద ధర్మమునకు ఆయనయే ప్రతినిధి అంటే అటువంటి వేద ధర్మము మీద ఎటువంటి గౌరవ భావమేర్పడుతుంది?

# బద్దన్న సేనాని
# సంప్రదాయ సాంస్కృతిక ధర్మం

'అది శాలివాహన శకము 1048 సంవత్సరము" అనగా క్రీస్తు శకము 1127 ఫిబ్రవరి, మార్చి నెలలు అయేడు శివరాత్రి నాటి రాత్రి నుండియే బద్దన్న సేనాని నవలలోని కథ మొదలైంది 1130 ఏప్రిల్, మే మాసాల దాకా కథ నడిచింది

తూర్పు చాళుక్యుల రాజ్యమైన ఆంధ్రదేశమును వారి సామంతుల నోడించి ఏడు సంవత్సరాల నుండి పశ్చిమ చాళుక్యుల- కల్యాణి చాళుక్యుల విక్రమాంక దేవ చక్రవర్తి పాలిస్తున్నాడు తెలుగుదేశం తూర్పు చాళుక్య చక్రవర్తులదనీ- పశ్చిమ చాళుక్య పరిపాలనవల్ల తెలుగుదేశానికి స్వాతంత్ర్యం పోయిందనీ దాన్ని తిరిగి సంపాదించటానికి బద్దన్న అనే ఒక మహా వీరుడు ప్రయత్నించి విజయం సాధించిన విషయాన్ని వస్తువుగా చేసి విశ్వనాథ ఈ నవల వ్రాశాడు చారిత్రకంగా బద్దన్న లేడు వెలనాటి చోడులు మాత్రం పశ్చిమ చాళుక్యులను వేంగి నుండి పారద్రోలుటకు రహస్య యత్నం చేసినట్లు చరిత్ర సూచిస్తుంది ఈ సూచన నందుకొనే విశ్వనాధ ఈ బద్దన్న సేనాని నవలేతివృత్తాన్ని కల్పించాడు ఇది చారిత్రక నవల కావటానికి ఇదే కారణం ఇది మఱింత బలంగా కన్పించటానికి వీలుగా అప్పటి చరిత్రలో ప్రసిద్ధంగా కన్పిస్తున్న వెలనాటి చోడుడైన గొంక భూపతి చాళుక్య చోళ చక్రవర్తి కులోత్తుంగ చోళుడు, నాదెండ్ల విషయము, శత సహస్ర (షట్ సహస్ర) విషయము, వేంగి విషయము, రెండేరుల నడిమి విషయము మొదలయిన వ్యక్తుల యొక్కయు స్థలముల యొక్కయు పేర్లు నవలేతివృత్తంలో చొప్పించబడ్డాయి

పశ్చిమ చాళుక్యుల ఒక శాఖయే తూర్పు చాళుక్యులు ఆంధ్రదేశాన్ని అయిదు వందల సంవత్సరాల పాటు పరిపాలించిన కాలంలో దాక్షిణాత్యులయిన చోళులతో సంబంధ బాంధవ్యాలు ఏర్పడ్డాయి ఆ విధంగా ఆంధ్రదేశానికి

చక్రవర్తి స్థానీయులు చాళుక్య చోళులయినారు చోళ రాజధానియైన కాంచీ పురమే ఆంధ్రులకు చక్రవర్తి వుండే రాజధాని అయింది ఆంధ్రదేశంలోని ఆయా ప్రాంతాలను సర్వాధికారములతో పాలించే వారంతా కాంచీపుర చక్రవర్తి సామంతులు ఈ పరిస్థితి రెండు మూడు వందల సంవత్సరాలు కొనసాగిన దాని ఫలితంగా ఆంధ్రులకు కాంచీపురాధీశ్వరుని యందు రాజభక్తి కుదురుకొన్నది చాళుక్య చోళుల ఆధిపత్యం క్రింద వుండటాన్ని ఆంధ్రులు ఆనందంగా అంగీకరించారనీ, వారి ఆధిపత్యాన్ని కూలద్రోసి పశ్చిమ చాళుక్య చక్రవర్తి ఆంధ్ర దేశం మీద ఆధిపత్యం వహిస్తే దాన్ని ఆంధ్రులు సహించక తమ స్వాతంత్ర్యం తాము నిలబెట్టుకోటానికి అంటే - తమను తాము పశ్చిమ చాళుక్యుల ఆధిపత్యం నుండి విముక్తం చేసికొని తమను తాము కాంచీపురాధీశ్వరుని బంటులుగా సమర్పించుకోటానికి పెద్ద ప్రయత్నం చేశారనీ - అది ఆంధ్రుల స్వాతంత్ర్యాభిలాష అనీ, అది ఆంధ్రుల దేశ భక్తి అనీ కీర్తిస్తూ వ్రాయబడిన నవల బద్దన్న సేనాని ఆ విధంగా అది చారిత్రక నవల

ఏ కొంత మాత్రమే అయినా చరిత్ర ఆధారంగా నిర్మింపబడిన సృజనాత్మక వచన రచనా విశేషాన్ని చారిత్రక నవల అంటారు చరిత్ర అంటే ఏమిటి అన్న పెద్ద ప్రశ్న వేసుకోకుండా రాజులూ రాజ్యాలూ యుద్ధాలూ పరిపాలనలూ మొదలయిన వాటితోపాటు ఆయా రాజుల పరిపాలనల కాలాల్లో ఆయా రాజ్యాలలో జీవించిన ప్రజల సాంఘిక ఆర్థిక సంబంధాల రూపమైన జీవన వ్యవస్థ కూడా చేరితేనేగాని అది చరిత్ర కాదు అని మనం అనుకోవచ్చు చరిత్రను ప్రజా జీవనం, ప్రజా జీవనాన్ని చరిత్రా - రెండూ అన్యోన్యంగా ప్రభావితం చేసుకొంటూ నడచిన వైనాన్ని మానవ సంబంధాల కథగా కల్పించి రచిస్తే చారిత్రక నవల అవుతుంది చారిత్రక నవలను ఒక రచయిత ఎందుకు రచిస్తాడు? ఏ ప్రయోజనాన్నీ ఆశించకుండా ఏ రచయితా ఏ రచనా చెయ్యడు కనుక చారిత్రక నవలా రచయితకు కూడా ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించటం వుంటుంది పాఠకుల ఆలోచనలను ప్రభావితం చేసి ఆచరణకు ప్రేరణ ఇయ్యటం సాహిత్య కళా రూపాలన్నింటికీ ఏకైక సాధారణ ప్రయోజనం నిర్దిష్ట దేశ కాలాలకు సంబంధించి మాత్రమే చరిత్ర వున్నట్లుగా సాహిత్య రచయిత కూడా ఒక నిర్దిష్ట దేశ కాలాలకు సంబంధించే వుంటాడు ఆ రచయిత ఆలోచనలూ ప్రయోజనాలూ ఆ దేశ కాల పరిస్థితుల ప్రభావం నుండే రూపొందుతాయి

1895 లో పుట్టిన విశ్వనాథ ఇరవయ్యో శతాబ్దంతో మొదలయిన స్వదేశీ జాతీయోద్యమ భావజాల ప్రభావంతో పెరిగి పెద్దవాడైనాడు ఆనాటి జాతీయోద్యమ భావజాలాన్ని రూపొందించ గలిగిన బలవత్తరమైన సాంఘిక వ్యవస్థలు కులమతాలు కులమతాచార సాంస్కృతిక దృక్పథంనుండే జాతీయత రూపుగట్టుకొన్నది ఒక జాతి జాతీయతకు సంప్రదాయం పునాది అని విశ్వనాథ స్పష్టంగా అనుకొన్నాడు అనుకొన్నదే చెప్పాడు చెప్పిందే రచయితగా తన రచనల నిండా ఆచరణలో ప్రదర్శించాడు పెట్టుబడిదారీ వ్యాపార నాగరకత యొక్క అనివార్యమైన ప్రథమ శిశువు జాతీయత, భూస్వామ్య రాచరిక సంప్రదాయ సంస్కృతి పునాదిగా పుట్టి పెరుగుతున్న జాతీయ భావనతో అభేద ప్రతిపత్తిగా విశ్వనాథ ప్రతిభా పాటవాలు వికసించాయి కొత్త సాంఘిక ఆర్థిక వ్యవస్థ వెంటబడి జీవిస్తూ పాత వ్యవస్థ యొక్క సాంస్కృతిక మహనీయతను సంరక్షించుకొనటం గురించిన చైతన్యాన్ని కలిగించటం ప్రయోజనంగా ఆశించి విశ్వనాథ తన సర్వ సాహిత్యాన్నీ సృష్టించాడు కొత్తదనంనుండి తప్పించుకో లేక పాతదనాన్ని వదులుకోటానికి ఇష్టపడని Neo traditional - నవ్య సంప్రదాయ వాద రచయితగా విశ్వనాథ ఆధునికాంధ్ర సాహిత్యంలో నిలదొక్కుకున్నాడు

ఈ నవ్య సంప్రదాయ సాహిత్యం భారత జాతీయోద్యమ బూర్జువా నాయక రాజకీయ స్వాతంత్ర్యాన్ని స్వాతంత్ర్యంగా భావించే వారినీ, ప్రపంచ వ్యాప్తంగా సోషలిస్టు వ్యవస్థ యొక్క నిర్మూలన లక్ష్యంగా బహుళ జాతుల కూటాలు పెంచి పోషిస్తున్న జాతీయతా భావనను శిరసావహించే వారినీ - వారి ప్రయోజనాలకు దోహద పడటంవల్ల - సంతృప్తి పరుస్తుంది రాజకీయ స్వాతంత్ర్యం కొరకు బూర్జువా నాయకత్వం నడిపిస్తున్న జాతీయోద్యమ భావజాలంలో పాలల్లో నీళ్లలాగా కలిసిపోయిన సంబద్ధాలు కాని సోషలిస్టు భావాలు చూపుడు దంతాలుగా పనికివచ్చేవి కొన్ని వుంటాయి విశ్వనాథ నవ్య సంప్రదాయ సాహిత్యంలో ఈ లక్షణం కూడా వుంది నవ్య సంప్రదాయమన్న పదబంధమే దాని అర్థమైన పదార్థంలోని వైరుధ్యాలకు ప్రబలమైన సంకేతం

మన దేశంలోని సామాజిక వైరుధ్యాలకు వర్ణాశ్రమాచార ధర్మాలని పేరు వైరుద్ధ్యాలనూ వాటి సంఘర్షణ లక్షణాలన్నీ గుర్తించిన మన పూర్వీకులు సంఘర్షణను అదుపుచేస్తూ సమైక్యతను సంపాదించే సాధనంగా ప్రబోధించిన ఆలోచనకూ ఆచరణకే ధర్మమని పేరు ఆ ధర్మమును మనుషులు రక్షిస్తే అంటే - ఆచరిస్తే అప్పుడా ధర్మమే మనుషులను రక్షిస్తుంది అన్న విశ్వాసాన్ని

కలిగించారు సంఘర్షణలు సమయాన్ని చూచుకొని తలయెత్తుతున్నా వాటి నణచివుంచే సమైక్యతాభావ సమాలోచనా బలాన్ని ప్రయోగించటం చరిత్రలో భాగంగా కొనసాగుతున్నదే సంఘర్షణను సమైక్యతా భావబలంచేత అదుపు చేస్తూ వస్తూ, ఆ కాలమంతా వైరుద్ధ్యాలు తమ సహజలక్షణాలను కోల్పోయి సహజీవనం చేసిన ధర్మకాలంగా కీర్తించటం జరిగింది ఆలా కీర్తిస్తూ రావటమే మన సాంస్కృతిక సంప్రదాయంగా చెప్పబడుతున్నది

సహజీవనంలోనూ సంఘర్షణ వుంటుంది ''మా యూరిలోపలను మామా అన్నా అంచు వరుసలై యుందుము మేమాయుచటి కమ్మవారును మాయదియును కమ్మటూరు మతిమతి తలపన్''— ఈ పద్యానికర్థం— మా వూళ్లోని కమ్మవారూ మేమూ మామా అన్నా అనే వరుసలు పెట్టి పిలుచుకొంటూ కలిసిమెలిసి జీవిస్తున్నాం అని ఈ సహజీవనాన్ని ఎందుకు చెప్పినట్లు? సంఘర్షణ వుంది ఉన్న దాన్ని లేనట్లుగా చేసి ప్రవర్తించటానికి చెస్తున్న ప్రయత్నమది మిగిలిన కులాలకు బ్రాహ్మణులతో అంత సంఘర్షణ లేదన్నమాట బాలకాండ మొదట్లో చెప్పబడ్డ కమ్మ, బ్రాహ్మణ సహజీవనం యుద్ధకాండం చివంకు మాయమై పోయిందేమి? సమైక్యతలేదు అని చాటిచెప్పే దశకు సంఘర్షణ అభివృద్ధి అయిందన్నమాట! అప్పుడు విశ్వనాథ ఏం చేయవలసి వచ్చింది? 'వాని కులంబును (అంటే ముక్త్యాలరాజా శ్రీ రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదు కులమును) సుగుణాస్థానంబుగజేయవే వృథాహంకార స్థానముగ జేయకేశవ—'' అని శివునకు మొర పెట్టుకోవలసి వచ్చింది ఇరవయ్యో శతాబ్దంలో కొత్త పరిస్థితులు దినదినాభివృద్ధి అవుతున్న దశలో పాత సామాజిక వ్యవస్థలోని వైరుద్ధ్యాలు సంఘర్షణ స్థాయికి ఎదిగి పేలబోతున్న, పేలుతున్న సమయంలో సంఘర్షణ నదిమి సమైక్యతా సహజీవనంగా కీర్తింపబడ్డ సంప్రదాయ సాంస్కృతిక ధర్మాన్ని వర్తమానానికి వర్తించగల మహోన్నతమైన ఆదర్శంగా తన తర్కసుందరమైన అల్లిక జిగిబిగి రచనాశిల్పంచేత నవలగా చేసి పాఠకుల ఆలోచనారీతిని ఆధునిక ప్రవాహం వెంటబడిపోకుండా ఆపటానికి చేసిన ప్రయత్నం, సాహిత్య ప్రయోజనం తెలిసి చేసిన ప్రయత్నం

సాహిత్యం దానంతట అది ఏమీ చెయ్యదు అది దాని నిర్మాత దృక్పథాన్ని ప్రతిఫలిస్తుంది ఆ నిర్మాత ఆశించిన ప్రయోజనాన్ని సంపాదించిపెడుతుంది దృక్పథానికీ, ప్రయోజనానికీ విలువకట్టవలసింది సంఘర్షణా సమైక్యతల పరస్పర సంవర్తనల తత్త్వజిజ్ఞాసాపరులయిన సాహిత్య సహృదయులు *

# విశ్వనాథ జీవిత దర్శనం - I

విశ్వనాథ సత్యనారాయణగారి సృజనశీలంతో కూడిన ఆలోచనాక్రమం అయన సమకాలంలోని సాంఘిక జీవనంతోను, సామాజిక చైతన్యంతోనూ, వాఙ్మయ సంప్రదాయరూపంగా ప్రాప్తించిన పూర్వకాలిక సామాజిక చైతన్యం తోనూ అనుకూలంగాగాని, ప్రతికూలంగాగాని, అటుకొంతగా ఇటుకొంతగా కాని తప్పనిసరిగా సంబంధం కలిగి ఉంటుంది అసలు మామూలు మనుషులకైనా వాళ్ళ వాళ్ళ ఆలోచనలకు వాళ్ళకు ఇతర విషయాలతో వున్న సంబంధమే కారణం అది ఒక రచయిత విషయంలో మరీ ముఖ్యమైన కారణం అందువల్లనే అన్నిరకాల సృజన కళారూపాలు కూడా సామాజిక చైతన్య స్వరూపాలే అని చెప్పటం

విశ్వనాథ జీవిత దర్శనం అంటే భూస్వామ్య సామాజిక జీవన దృక్పథమే అయన అన్ని రచనలనిండా అదే పరుచుకొని ఉంటుంది అయన అన్నిరకాల సాహిత్య ప్రక్రియల్లోనూ తానే మొనగాడుగా వ్రాశాడు అయా ప్రక్రియల్లోని ఆయా రచనల్లోని వస్తువులు రకరకాలుగా వుంటాయి ఆ వస్తువులను అలా రచించటంలో లీనమైవుండే రచయిత దృక్పథాన్ని పట్టుకొని అది ఇది అని చెప్పటం అంత సులభమైన పనికాదు శాస్త్రీయమైన ఆలోచనకాని, ఆచరణకాని, విచారణకాని, విమర్శనకాని అంత సులభంగా ఎప్పుడూ ఉండవు

విశ్వనాథ జీవిత దర్శనం గురించి తెలుసుకోటానికి ఆయనలోని కవిని పక్కకుపెట్టి రచయితను అనుసరించటం మంచిది నిజంగా కూడా ఆయన కవిగా చేసినదానికంటే రచయితగా ఎక్కువ చేశాడు ఏదిచేసినా తెలిసిచెయ్యటం

---

హైదరాబాద్ ఆకాశవాణి 17-10 1979
తెలుగు ఏప్రిల్ - జూన్ 1980

ఆయనలోని విశేషం అంటే-ఆయన చెప్పినదేదైనా తెలియక పొరపాటుపడి చెప్పాడని మనం అనటానికి వీల్లేదు ''నాకు గ్రంథరచన అంటే ఏమిటో తెలుసు సగం నిద్రలో లేపి ఒక నవలను డిక్టేటు చేయమంటే చేయగలను నేనేది వ్రాసినా తెలిసివ్రాస్తా నేను Conscious artist ను నేను Inspired Fool ను కాను నేను Inspired wiseman ను '' అని ఢంకాబజాయించి చెప్పిన రచయిత విషయంలో విమర్శకులు భయపడకుండాను జాగ్రత్తగానూ నిలబడాలి ఆయన రచనల్లో దృక్పథంలో దోషాలుండవచ్చు ఉంటాయి కూడా మరి ఆయన ఏంతెలిసి చేశాడంటే అవి గుణాలని తెలిసిచేశాడు నిజంగా అవి గుణాలేనా అంటే-అది సాహిత్యవిమర్శకుల శాస్త్రీయ విశ్లేషణమీద, విచారణమీద, వాద ప్రతివాద సమన్వయంమీద ఆధారపడి ఉంటుంది

రచయితగా విశ్వనాథ అంటే నవలారచయితగా అని అర్థం అన్ని దేశ కాలాల్లోనూ మానవజీవితం భూతకాలికమైతే స్థితిలోను, వర్తమానంలో అయితే గతిలోను కనిపిస్తుంది భవిష్యత్తు విషయమైతే భావనారూపంగా బుద్ధిలో వుంటుంది మొత్తంమీద రచయితగా విశ్వనాథ జీవిత దృక్పథం గతిశీలాన్ని వాస్తవికంగా నిరూపించటంకంటే స్థితి లక్షణాన్ని గొప్పగా చూపించాలన్న ప్రయత్నంగా వుంటుంది

మానవజీవితాన్ని దర్శించటమంటే, రచనల్లో దానిని ప్రకటించటమంటే ప్రకృతి పదార్థాలు, వాతావరణం, మనుషులు, సంఘం, వనిపాటులు, ప్రయోజనాలు, మతాలు, రాజకీయాలు, కలిమిలేములూ, భోగభాగ్యాలూ, ప్రేమలు, స్నేహాలు, ద్వేషాలు, అనుమానాలు, అసూయలు, ఈర్ష్యలు ఈ మొదలైన వివిధాంశాలు ఒకదానితో ఒకటి కలిసిపోతూ, ఎదురుతిరుగుతూ, సర్దుకొనిపోతూ గెలుస్తూ, ఓడుతూ క్రొత్త క్రొత్త అనుభూతులను సిద్ధం చేస్తూ మొత్తం మీద సమాజం యొక్క జీవితప్రమాణస్థాయిని పెంచుతున్న వైనాన్నయినా, లేక కుంచింపచేస్తున్న వైనాన్నయినా చెప్పటంగా వుంటుంది ఈ విధంగా చెప్పటం లోనే రచయిత సమాజాన్ని ఎలా అర్థం చెసుకొన్నాడు, తన సోదర ప్రజానీకం ఎలా అర్థం చెసుకోవాలని తాననుకొంటున్నది బయటపడుతుంది

విశ్వనాథ అవగాహనలో సమాజమంటేను, దేశమంటేను ఆదేదో నాలుగు సరిహద్దుల మధ్యభాగం మాత్రమే కాదని, అందులోని ప్రజల సాంఘిక మతా

చారాలనే భావమే వుంది అది సమగ్రం కాకపోయినా సరిఅయినదే అయితే మతా చారాలను బట్టి దేశాలను కొలవడంచేత వేదవతం ఒక్కటే వున్న దేశాన్ని ఆయన చూచాడు వేదాలు నాలుగుకనక ఆ దేశంలో ప్రజలు నాలుగు వర్ణాలుగా వున్నారు వేద ధర్మాన్ని నాలుగు వర్ణాల వాళ్ళూ అనుసరించవలసిందే అనాదిలో సంఘాన్ని పూర్వ ఋషులు నిర్మించారు అప్పుడు వాళ్ళు వేదాన్ని రక్షించేందుకు బ్రాహ్మణ్ణి నియమించారు అన్ని వర్ణాలవారు తమతమ వర్ణాల ఆచారం ప్రకారం తమ తమ విధులను నిర్వర్తించాలి నిర్వర్తించేటట్లు బ్రాహ్మణుడు చూస్తూ వేద ధర్మాన్ని పాలించాలి అలా అయితే సంఘం సువ్యవస్థితంగా వుంటుంది - ఇది తన జీవిత దృక్పథమని విశ్వనాథ స్పష్టంగా వేయిపడగలలోని అంతరార్థం చెబుతున్నానని చెప్పాడు ఆధునికులు దీన్ని అసమగ్రమని మాత్రమేకాక అశాస్త్రీయమైనదని కూడా అంటున్నారు అసమగ్రతను గురించి పెద్ద పట్టించుకో వలసింది ఏమీలేదు అది ఎప్పుడూ అంతే అన్నట్లుగా వుంటుంది మరి సంఘంయొక్క సుష్ఠుదనమంతా దాని వర్ణవ్యవస్థమీదే ఆధారపడి ఉందన్న ఇంత శాస్త్రీయమైన ఆలోచన ఎందుకేర్పడింది? - దానికి జాతీయోద్యమ చరిత్ర లోనికి పోవాలి

విశ్వనాథ సత్యనారాయణ పుట్టి కాస్త కళ్ళు తెరిచేటప్పటికి ఆయన చుట్టూవున్నది గాంధీగారి నాయకత్వం, ఇంకా ఏర్పడీ ఏర్పడని జాతీయో ద్యమం ఆ ఉద్యమంలో అంతర్భాగంగా వీరేశలింగంగారినుండి మొదలై కొన్ని మత సాంఘిక సంస్కరణోద్యమాలు దేశంలో కొనసాగుతున్నాయి అందులో మిగతా వర్ణాలవాళ్ళు క్షత్రియులు ఎటూ అంతగా చేరుగనక - వైశ్యులు, శూద్రులు బ్రాహ్మణులతో పోటీపడి వాళ్ళ ఆధిపత్యాన్ని కాదని తాము బ్రాహ్మ ణులవలె కావటానికి కోర్టులకెక్కటంగా మంత్రతంత్రాలు నేర్చుకోటంగా వేద శాస్త్రాలు అభ్యసించటంగా తమ పురోహితులను తమ కులంవారినుండే ఏర్పాటు చేసుకోటంగా తమతమ కులాలకు బ్రాహ్మణశబ్దం తగిలించి చెప్పుకోటంగా నడిపించిన వర్ణచైతన్య ఉద్యమం ఒకటి అలా వర్ణస్వభావంతో ఒక అపమార్గ చైతన్యాన్ని పెంచుకోటం వాళ్ళకూ అభివృద్ధిమార్గం కాదనటం అది వేరే విషయం సమకాలీన సమాజంలోని ఒక అపమార్గ చైతన్యానికి ప్రతికూలంగా ఒక రచయిత ప్రతిస్పందించటంవరకు బాగానే వుంది చిక్కంతా దానికి ఖిరుగుడు వర్ణవ్యవస్థ సుష్ఠుగా ఉండటమేనని భావించటంలో వుంది ఈ విధంగా

బ్రాహ్మణ కుల వ్యతిరేక ఉద్యమకారణంగా ఈ ప్రతీపగామి ఆలోచన విశ్వనాథలో చోటుచేసుకొన్నది ఈ ఉద్యమం లేవటానికి కారణం భూస్వామ్య వ్యవస్థ సడలిపోతూ, ధనస్వామ్య వ్యవస్థ సడలిపోతూ, ధనస్వామ్య పారిశ్రామిక నాగరికత, పాశ్చాత్య విద్యాసంస్కృతులు దేశంలో ఒక వినూతన వివేకాన్ని వికాసాన్ని కలిగించటం జాతీయోద్యమంలో మత తత్వాలూ, కుల తత్వాలూ, ప్రాంతీయతత్వాలూ స్థాయీభేదాల్లో చోటు చేసుకోటం భూస్వామ్యంలోనే చతుర్వర్ణ వ్యవస్థ కొనసాగుతుంది పెట్టుబడిదారీ సామ్రాజ్య వ్యవస్థలో ఇది శిథిలమవుతుంది భౌతిక చారిత్రక గతితర్క విజ్ఞానదృక్పథం ఏర్పడకపోతే తప్పుడు చైతన్యాలు పెరుగుతూ అవే ఒప్పులుగా అనిపించే ప్రమాదం ఉంది సరిగ్గా అదే జరిగింది సమకాలీన సమాజంలో కలిగిన వర్ణ చైతన్యదృక్పథం ఎంత అప్రశస్తమైందో దానికి ప్రతిక్రియగా విశ్వనాథ సృష్టించిన సాహిత్యంలోని వర్ణ స్వభావ నిరూపణలు కూడా అంతే అప్రశస్తమైనవి అంతకంటే ఎక్కువగా అశాస్త్రీయమైనవి

బ్రాహ్మణకుల వ్యతిరేక ఉద్యమంగా బయలుదేరిన తదితర వర్ణ చైతన్యంలో అది అభివృద్ధిమార్గం కాదన్న తెలివి క్రమంగా ఏర్పడటంవల్ల ఆ ఉద్యమం క్రమక్రమంగా అదృశ్యమైంది దానికి విశ్వనాథ చేసిన ప్రతిక్రియా రచన మాత్రం సాహిత్య కళారూపాల్లో స్థిరపడిపోయింది సాహిత్య కళారూపాలు సామాజిక చైతన్య రూపాలంటే ఇదంతా అర్థమే. ఇది విశ్వనాథ సత్యనారాయణకు వర్ణ చైతన్య మేర్పడిన వైనం

ఇక జాతీయోద్యమం జాతి అంటే కూడా ఆయనకున్న అవగాహన ఉద్యమ నాయకుల అవగాహన వంటిదే భూస్వామ్య వ్యవస్థకు సంబంధించిందే "భాష జాతి నిష్ఠము ఈ జాతి నిష్ఠమైన భాష భావములయందు కూడా విలక్షణత్వమును సంపాదించును " ఇది ఒక జాతికి ఒక భాష అన్న ప్రాథమిక సూత్రం తెగలు తెగలుగా గుంపులు గుంపులుగా వాళ్ళ వాళ్ళ భాషా వ్యవహారాలతో వుండే ప్రజలు పరస్పరం ఆర్థిక మానసిక సంబంధాలు ఎక్కువవుతున్నకొద్దీ క్రమక్రమంగా ఒక జాతిగా రూపుదిద్దుకొంటారు అలాంటి క్రమాభివృద్ధిలో భాగంగా వాళ్ళవాళ్ళ భాషా వ్యవహారాలనుండి సమష్టిమీద ఒక జాతీయ వ్యవహార భాష ఏర్పడుతుంది ఒక జాతికి ఒక భాష అన్న ప్రాథమిక

సిద్ధాంతం అక్కడ మొదలవుతుంది సత్యనారాయణగారు పేర్కొన్న సూత్రం ఆయనచుట్టూ జరుగుతున్న భారత జాతీయోద్యమంలోని భారత జాతినిగాక, తెలుగుజాతిని చెపుతున్నది జాతీయోద్యమాన్ని తెలుగుజాతి ప్రతిఫలించుకోటం గురించి ఆయన ఆలోచించాడు ప్రాంతీయ భాషాజాతుల వాళ్ళంతా కలిసి ఒక లక్ష్యానికి అభిముఖంగా నడిపించె ఉద్యమమే భారత జాతీయోద్యమం జాతీయోద్యమ కవిగా ఆయన ఆంధ్ర పౌరుషం, ఆంధ్ర ప్రశస్తి రాయటం వరకు మొత్తం దేశంలో ఒక జాతిఎంతు పని యధాశక్తి నిర్వహించినట్టు, ఆ తరువాత ఆయన తెలుగుజాతి జాతీయతను అంటే దాని జీవన విధానాన్ని ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, వినోదాలు, మత తాత్త్విక విషయాలు మొదలైన సంప్రదాయ లక్షణాలన్నింటితోనూ తన రచనలను నింపటం మొదలుపెట్టాడు

విశ్వనాథ సత్యనారాయణగారి సృజనశీలమైన ఆలోచనా విధానానికి ఆధారభూతాలయిన సమకాలీన సాంఘిక విషయాలు రెండు ఒకటి వర్ణ చైతన్యం, రెండు జాతీయోద్యమ చైతన్యం ఈ రెండింటి మంచిచెడ్డల ప్రభావాలతో కూడుకొని వుంటుంది ఆయన జీవిత దృక్పథం

జాతీయోద్యమం విదేశీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగుతున్నప్పుడు విదేశీయమైన ప్రతి దీనునకు విరుద్ధంగానే కనిపిస్తుంది తప్పదు మన దేశంలోని సంఘ సంస్కరణోద్యమాలు కూడా ఇంగ్లీషు విద్యావిజ్ఞాన ప్రభావంవల్లనే పుంజుకొంటున్నట్లు కనిపించటంచేత వాటినికూడా విరుద్ధంగానే భావించటం మరీ తీవ్రమైన జాతీయవాదం సహపంక్తి భోజనాలు, స్త్రీ జనోద్ధరణ, వర్ణాంతర వివాహాలు, హరిజనోద్ధరణ ఇవన్నీ సంస్కరణ వాదాలుగా వ్యాప్తిలోకి రావడం వల్ల ప్రత్యక్షంగా దెబ్బ వర్ణవ్యవస్థకు తగిలినట్లవుతున్నది అయితే, ఆ దెబ్బంతా తనకే తగిలినట్లుగా బ్రాహ్మణ వర్ణ చైతన్యమే బాధపడింది ఎందుకంటే, సామాజికుల దైనందిన సాంస్కృతిక జీవన విధానాలమీద అధికారం చేసే తమ యోగ్యత ప్రశ్నార్థకంలో పడుతున్నది అందుకని, ఇంగ్లీషు చదువులు అన్ని కులాలవారిని సమానస్థాయికి తెస్తున్నాయి ఇంగ్లీషువాళ్ళ రాకతోనే ఇప్పుడు జరుగుతున్న మార్పులన్నీ జరుగుతున్నాయి వీళ్ళు రాకముందు వర్ణ వ్యవస్థ జమీందారులయిన ప్రభువులచేత, కుల బ్రాహ్మణులచేత చక్కగా పాలింప

బడింది అలాంటి పరిస్థితుల స్వరూపం సమస్తమూ తన కండ్లముందు జారిపోతూ ఉంటే విశ్వనాథ వర్ణవ్యవస్థా రూపమైన వెనుకటి సామాజిక స్థితియొక్క మహనీయతను, నెట్టుకొనివస్తున్న సామాజిక పరిణామాల వెల్లువను వేదనతోనైనా పక్క పక్కగా చూపించటం తప్పనిసరి అయింది రచయితగా ఆ విధంగా అప్పుడాయన ప్రవర్తించక తప్పలేదు

వస్తునిర్మాణం వల్ల సరే- దాన్నిమించి అసాధారణమైన రచనా శిల్ప కళా కౌశలంవల్ల విశ్వనాథ శారద ప్రకాశిస్తున్నది ఆయన తను దర్శించిన తెలుగు జీవిత వాతావరణాన్ని, భావించిన తెనుగుతనన్ని సువ్యక్తం చేయటానికి కల్పించిన భావచిత్రాలు రచించిన సమాసాలు వ్రాసిన తెలుగు వాక్యాలు, చేసిన వర్ణనలు సమకాలికులలో ఆయనను మహా రచయితను చేశాయి తెలుగుదేశంలోని జాతీయ జీవన విధానాలను, చరిత్రను, సంస్కృతిని ఆయన తన రచనలలో గ్రుచ్చి ఎత్తాడు తెలుగుదేశంలోని ప్రకృతి నియత పరిణామాలను, గ్రామీణ వ్యావసాయిక నాగరక మహాజన దైనందిన ప్రవృత్తిని గ్రామీణుల వర్ణ ధర్మాచరణ సామరస్యాన్ని ఆయన దర్శించినట్లుగా మరొక తెలుగు రచయిత దర్శించచలేదు ఒక్క భాషా విషయంలో తప్ప మిగిలిన అన్ని విషయాల్లోనూ తెలుగు జాతి భారతజాతిలో భాగంగానే ఆయన భావించి రచనలు చేశాడు భారత దేశీయ సంప్రదాయాన్ని, పాండిత్యాన్ని, సంస్కారాన్ని అప్పటి పాలకవర్గం- అంటే బ్రిటిష ప్రభుత్వం నిరాదరణకు గురిచేస్తున్నది కనక అది పోవాలని, భారతీయ సంస్కృతికి పునాదిగా వున్న వైదిక ధర్మం, వర్ణవ్యవస్థ మారటానికి వీలు కాకుండా పాలించిన జమీందారీ ప్రభువుల పాలన నశించటం సాంస్కృతిక వినాశనానికి మార్గమని ఆయన అభిప్రాయ పడతాడు ఈ సిద్ధాంతాలు అభ్యుదయ పంథాలోవి అయినా కాకపోయినా ఆయన తన రచనా సామర్థ్యం చేత —అంటే కథా కథన వైలక్షణ్యంచేత, తెలుగు పలుకుబడిని గుప్పించటం చేత భావచిత్రాలను కల్పించటంచేత ప్రజల మనస్సులకు ఎక్కేటట్లు చేస్తాడు సిద్ధాంతం కంటే భాషా ప్రభుత్వాన్ని ప్రకటించే రచనా వైశిష్ట్యం ఒక రచన నిలబడటానికి కారణమవుతుందన్న విశ్వాసం కలవాడాయన నవ్యభావన కంటే నవ్యమైన రచనా విధానం ఆయన కిష్టం కొత్త జీవితానికి అలవాటుపడితే కొత్త భావన వస్తుంది ఆయనకది లేదు అందువల్లనే వచ్చి బలవంతంగా నెత్తిన

పడుతున్నా జీవిత పునాది వ్యవస్థలో మార్పును ఆయన ఆహ్వానించలేదు ఈ తగాదాలన్నీ ఆయన రచనలో వున్నాయి అంటే, ఆయన జీవిత దర్శనంలోనే వున్నాయన్న మాట

వర్ణ చైతన్యంతోనూ, జాతీయ చైతన్యంతోనూ, ఆధునిక తెలుగు మహా రచయిత అయిన విశ్వనాథ అలా కావడానికి దోహదం చేసిన అనేక విషయాల్లో ఒకటి- ఆయన బ్రాహ్మణ వర్ణ స్వభావంలో వచ్చిన శైథిల్యాన్ని ప్రదర్శించటంలో కూడా అభినివేశంతో ప్రవర్తించటం రచయితగా ఆయన పెంచుకొన్న జీవిత దృక్పథం వాస్తవికతను గ్రహించటంలో ఏ మాత్రం పొరపాటు పడదు వాస్తవికతాంశాల వివిధ ముఖాలను దర్శించటంలో రచయిత ఎంత శక్తిమంతుడైతే అతని దృక్పథ అంత విశాలంగా వుంటుంది ఒక మహా రచయిత జీవిత దర్శన విధానాన్ని రూళ్ళ గళ్ళల్లో ఇమిడిపోయేంత అల్పవిషయంగా భావించరాదు పూర్వోత్తర విరోధాలతో పరస్పర వైరుధ్యాలతో ఎక్కడికక్కడ కనిపిస్తున్నవాద ప్రతివాద మథనం నుండి అమృత కళాజ్ఞానోద్భవకాలం ఆగమించేవరకు ఆ రచయితను అధ్యయనం చేస్తూనే ఉండాలి

వాస్తవికతనెంతగా గ్రహించినా దాన్ని ప్రతిపాదించటంలో మరీ కొన్ని చోట్ల ఆయనలోని రియాక్షనరీ స్వభావము నెట్టుకొని కనిపిస్తుందన్నా అంత మాత్రం చేత ఆయన తన రచనలచేత తెలుగుల విజ్ఞాన వికాసాలకు ప్రేరణనిచ్చి జాతినిష్టమైన భాషా సరస్వతికి భారత జాతీయ స్థాయిలో జ్ఞానపీఠ పురస్కార గౌరవం కల్పించిన మహా విషయం మరుగున పడదు

వ్యవసాయిక నాగరకతా లక్షణాలయిన సర్వసామాజిక, సాంస్కృతిక, నైతిక సంబంధాలు ముఖ్యంగా తెలుగు దేశంలో బెడిసిపోతున్న దృశ్యాలను ఆయన తన రచనలో చిత్రించాడు అందుకాయన చెప్పిన కారణాలు కాని, విరుగుడు కాని - సరియైనవి అగునా కాదా అన్నది అయితే ఆమోదించటంగాను, కాకపోతే తిరస్కరించటంగానూ ఉంటుంది ఆయన భావవాద పక్షం నిలబడి భౌతికవాద విషయాలను అయినంతవరకు సమన్వయించుకొనిపోవటమే జీవిత దృక్పథంగా ప్రతిపాదిస్తాడు భారతీయ మత తాత్త్విక సాంస్కృతిక సంప్రదాయ విషయాల విలువలను ఆధునిక చైతన్యంతో పునర్విచారణ పరీక్షకు పెట్ట

కుండా మూక ఉమ్మడిని తిరస్కరించటం లక్షణం కాదంటాడు అధునిక అవసరాలకు పనికి వచ్చేది మన సంప్రదాయంలో కొంత ఉన్నప్పుడు దాన్ని పోగొట్టుకోవటంవల్ల మన మాశిస్తున్న అభివృద్ధి యొక్క వేగాన్ని మనమే తగ్గిస్తున్న వాళ్ళమవుతున్నాం అలా తెలుగు జాతి కాకూడదనే ఆ జాతి నిష్టమైన భాషలో అన్ని విషయాలనూ కుమ్మరించి ఆలోచనకు వదలి వెళ్ళిపోయాడు ఏ విషయాన్నయినా ఏ సమస్యనైనా తాత్కాలిక దృష్టితో కంటే అనంతకాల దృష్టితో విచారించటం, పరిష్కరించటం సరిఅయినదిగా ఆయన దర్శించాడు ప్రాచ్య పాశ్చాత్య రచనా శిల్ప విశేషాలతో తెలుగు భాషా సాహిత్య రచనను సుసంపన్నం చేయడానికి ఉద్యమించటం చేత ఆయన ఆలోచనలు, ఆంతర్యాలు ఒక్కొక్కసారి మన విస్పష్టతకు నోచుకోక అపార్థాలకు గురి అయ్యే ప్రమాదం ఏర్పడింది అది నిత్యవేగి అయిన ఆయన చేతన లక్షణం అందుకని విచారణ జాగ్రత్తగా చేయాలి

విశ్వనాథ జీవిత దర్శనం శాస్త్రీయం కాదని, సమగ్రం కాదని ఋజువు చెయ్యాలంటే చెయ్యవచ్చు కాని, సర్వసృష్టిని గతి శీలంకలదిగా భావించే మనం ప్రతిదాన్ని అభివృద్ధి క్రమంలో ఒక దశగా మాత్రమే తెలుసుకొనే మనం, విరుద్ధ శక్తుల సంఘర్షణ నుండి సమున్నత రూపమైన అభివృద్ధిని అవలోకిస్తున్న మనం, సత్యనారాయణగారిలో సమగ్రత లేకపోవటాన్ని, వైరుధ్యాలుండటాన్ని, అశాస్త్రీయత చోటుచేసుకోవటాన్ని, ఆయన పుట్టి పెరిగిన దేశ కాల సామాజిక చైతన్య పరిస్థితులతో సంబంధింపచేసి అర్థం చేసుకొంటాం

ఆయన రచనల నిండా పరచుకొన్న వర్ణ చైతన్యానికి గ్రామీణ వ్యావసాయిక భూస్వామ్య నాగరికతా సంబంధాల మహోజ్జ్వల ప్రదర్శనానికి, అభారతీయమైన ప్రతి దాని విషయంలోనూ వ్యతిరేకతగా చోటు చేసుకొన్న అతి జాతీయతత్త్వానికి ఆయన పుట్టి రచయితగా పెరిగిన కాలాన్ని స్థూలంగా ఈ శతాబ్ది పూర్వార్థాన్ని ఆధారభూమిగా చేసి వివరించాలి ఏ మహారచయితనైనా అలాంటి చారిత్రక విధానాన్ననుసరించి చూడకపోతే ప్రమాదం ఎందుకంటే, వాళ్ళు అనేక సందర్భాలలో అనేక ప్రభావాలచేత, విషయాలమీద, అనేక రకాలుగా ఆలోచనలచేత సద్యఃస్ఫురణలచేత వ్రాస్తారు మాట్లాడుతారు

పునాది లేకుండా ఏ నిర్మాణమూ ఉండదు రచయిత ఆలోచనలు రచనలకు పునాది రచయిత ఆలోచనలకు దేశ కాల రూపమైన సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు, తత్కాలీన చైతన్యము సాంప్రదాయిక సామాజిక చైతన్య రూపమైన ప్రాచీన వాఙ్మయమూ పునాది ఈ దృష్ట్యా సమన్వయపరచి చూస్తే విశ్వనాథ సత్యనారాయణగారి రచనల నిండా తెలుగుల యొక్క భారతీయ చారిత్రక జీవిత వైభవ ప్రదర్శనం ఉంటుంది

"ఇవి రెడ్డిరాజుల యెదలలో బూరించు
కోరాని కోర్కెలు గుములు కట్టి
ఇవి తెల్గుబంటుల యిందుపగింజలై
నాత్మలు పీడలే కరుగుదెంచి
ఇవియు శ్రీనాథుని యెఱ్ఱప్రెగ్గడ కావ్య
తకు రాని భావముల్ తరక గట్టి
అవచి తిప్పయసెట్టి వివి రత్నరాశిగా
మలచిన ప్రాణముల్ మగిడి వచ్చి
కొండవీటి పొలాల్వీడికోనులేక
ఆశబలమున మగుడు ప్రేతాత్మలవలె
సొరిది నీ గిరి కొమ్ములం జుట్టుపట్ల
నిట్టి పొగమబ్బులై భ్రమియించుగాక!"

—ఆంధ్రప్రశస్తి నుండి

# విశ్వనాథ జీవితదర్శనం - II

తన తొలి రచన గురించి చెప్తూ విశ్వనాథ సత్యనారాయణ ఆకస్మిక ప్రత్యక్షసాన్ని ప్రశ్నార్థకంలో పెట్టాడు ఆకస్మిక ప్రత్యక్షాస మంటే మానవ శ్రమ రూపమైన కార్యాచరణ ఫలితంగా కాకుండా ఒక వస్తువు ఉనికిలో రావటం తనకు కవిత్వం అలా వచ్చిందని చెప్పటానికి ఆయన అంగీకరించలేదు ముఖ్యంగా ఛందోవృత్త మార్గాల్లో వ్రాసే తాను స్వయం భూలక్షణం చేత కవి కావటానికి వీలులేదని ఆయన ఉద్దేశ్యం మానవ జీవితము యొక్క అభివృద్ధి రూపమైన ఉత్పత్తులన్నీ శ్రమ శక్తి ఫలితాలే కానీ మరొక రకమైనవి కావన్న నిశ్చయంతోనే విశ్వనాథ తన కవిత్వం గురించి అలా చెప్పాడు ప్రాచీనమైన తెలుగు కవులలాగే చెప్పారు అందుకనే వాళ్ళ కావ్యాలను భాషా దృష్టితో చదువాలంటాడు భాషా ప్రాధాన్య బుద్ధితో చదివితేనే వాటి అంతర్యం తెలుస్తుందంటాడు భారత జాతీయాలయిన భావాలు తెలుగు జాతికి తెలుగు బాషలో చెప్పటం తెలుగు సాహిత్యం పని అని ఆయన అభిప్రాయం

జాతి అనేవి భూస్వామ్య వ్యవస్థ ప్రారంభదశనుండి క్రమంగా ఆ వ్యవస్థ ఎంతగా అభివృద్ధి అవుతూవుంటే దానితోపాటే తానూ అంతగా అభివృద్ధి చెందుతూ వుంటుంది ప్రపంచ చరిత్రలో భూస్వామ్య వ్యవస్థే ఎక్కువ కాలం సాగుతుంది అందువల్ల చారిత్రకంగా జాతీయ భావం సనాతనమైంది అది ధన స్వామ్య వ్యవస్థలో సామ్రాజ్య నిర్మాణ ఉద్యమాలలో దావానలంవలె ప్రజా సామాన్యంలో వ్యాపిస్తుంది

భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగమై ధన స్వామ్య వ్యాపార వ్యవస్థకు మొగ్గటానికి సిద్ధమవుతున్నప్పుడు స్వాతంత్ర్యం కావాలని జాతీయోద్యమం సాగుతున్న కాలంలో విశ్వనాథ సత్యనారాయణ పుట్టి పెరిగాడు అందువల్ల ఆయనకు కండ్లు తెరవగానే కనిపించింది, వినిపించింది, అనిపించింది కూడా జాతీయ భావమే ఆయనకు జాతి అంటే ముందు తెలుగు జాతి అది భారత జాతిలో అంతర్భాగం అయినా తెలుగు భాషా - తెలుగు జాతీ ఈ రెండూ ఆయన్ను ఉత్తేజపరచిన అంశాలు.

తెలుగు భాష ఎంతో సాహిత్యాన్ని మోసుకొని తనదాకా వచ్చింది చాలా వున్నది తాను తెలుగు జాతి జనుల మధ్య వున్నాడు భారత జాతీయతకూ, తెలుగు జాతీయతకూ భిన్నమైన విజాతీయ లక్షణాల నేమాత్రమూ అంగీకరించ లేని తీవ్రవాది అయినాడు

ఆయన పుట్టి బుద్ధెరిగి పెరుగుతూ వున్న కాలంలో ఆయన చుట్టూవున్న తెలుగుదేశంలో బ్రిటీషు పాలనా వ్యవహార ఫలితంగా చతుర్వర్ణరూపమైన సమాజంలో మిగతా వర్ణాలు బ్రాహ్మణ వర్ణంతో పోటీపడి, వాళ్ళ అధిపత్యాన్ని కాదనటానికి తామూ బ్రాహ్మల వలె కావటానికి ఆ స్థాయిలో ఉద్యమాలు చేశారు కోర్టకెక్కారు వేదశాస్త్రి లభ్యసించారు తమ కుల పురోహితులను తా మేర్పాటు చేసుకొన్నారు బ్రాహ్మణాచారాలను తామూ అవలంబించారు నిజానికిది వాళ్ళ అభివృద్ధి మార్గం కాదు కానీ బ్రాహ్మణులంటే వాళ్ళకూ, వాళ్ళంటే బ్రాహ్మణులకూ ద్వేషాలను పెంచింది ఇతర కులాలు మేమూ బ్రాహ్మలమే అంటే మరి చాతుర్వర్ణ వ్యవస్థ ఏమైనట్లు? విశ్వనాథ సత్య నారాయణ ఆలోచనకు వర్ణ దృక్పథమేర్పడటానికిదే పునాది ఫ్యూడల్ నాగ రికతా లక్షణమైన సామాజికుల నిత్య వ్యవహారాలమీద, సాంస్కృతిక జీవితం మీద అధికారం చేసే బ్రాహ్మణ వర్గం అధిపత్యాన్ని క్రమంగా ఇతర కులాలూ ఇంగ్లీషు చదువుల్లో ప్రవేశించి కూడా త్రోసిపుచ్చుతున్నారు ఇంగ్లీషు చదువులు బ్రాహ్మలను ఇతర కులాల వాళ్ళను సాంఘిక ఆర్థిక ఉద్యోగ జీవితాల్లో సమానం చేశాయి ఇది ఇంగ్లీషు భాషాసాహిత్యాలపట్ల బ్రాహ్మణవర్గానికి ద్వేషం పుట్టటానికికొక కారణం విశ్వనాథ సత్యనారాయణ గారి పాశ్చాత్య భాషా సాహిత్య విద్యా వివేకాల పట్ల విరోధి భావ- ప్రకటనలకు వర్ణ దృక్పథమే కారణం అన్ని కులాల్లోను వితంతు వివాహాలూ - సహపంక్తి భోజనాలూ, స్త్రీ విద్యా-హరిజనోద్ధరణ గాంధీ గారి నాయకత్వాన జాతీయోద్యమంలో సాగుతున్న కాలంలో రాజకీయ చైతన్యం కూడా తోడ్పడటం చేత మరికాస్త ఎక్కువే అయినాయి ఈ రకమైన సంఘసంస్కరణ విధానం కూడా చాతుర్వర్ణ వ్యవస్థను నాశనం చేస్తున్నదని విశ్వనాథ దానికీ వ్యతిరేకతనే పెంచుకున్నాడు

విశ్వనాథ తన సాహిత్య రచనల్లో ప్రదర్శించిన జీవిత దృక్పథానికి మూలం చతుర్వర్ణ దృక్పథం, వైదిక బ్రాహ్మణ ఆధిపత్యం మిగతా కులాలమీద చెల్లుబాటు కావటం అది అనేక కారణాల వల్ల కాకుండా పోవటం వర్ణ దృక్పథమనగానే అది భారతదేశానికి పరిమితం అది తెలుగు జాతీయతగా అభి

వ్యక్తం కావటం వల్ల దాని పరిధి మరీ సంకుచితమైంది ఆధునికమైన వర్గ దృక్పథం అంతకంటే ఎంతో విస్తృతమైంది ఉన్నతి మైందీకూడా పరమా శ్చర్యంగా అనిపించే విష యమేమిటంటే విశ్వనాథ సత్యనారాయణ గారిలో వర్ణ దృక్పథం - శ్రీరంగం శ్రీనివాసరావు గారిలో వర్గ దృక్పథం ఏకకాలంలో ఏర్పడి వాళ్ళను ఆధునికాంధ్ర సాహిత్యంలో మహాకవులుగా నిలబెట్టటం

ఈ రెండు దృక్పథాల్లోనూ వుండే భేద సాదృశ్యాలు ఇలా వుంటాయి

1 పాలక వర్గాన్ని రెండు దృక్పథాలూ నిందిస్తాయి కారణాలు వేరు వాళ్ల సంప్రదాయాన్ని, అంటే చతుర్వర్ణ వ్యవస్థను రక్షించటం బాధ్యతగా చేయటం లేదని వర్ణ దృక్పథం అంటుంది పాలితులకు లేకుండా అన్ని సౌకర్యాలనూ పాలకు లనుభవిస్తున్నారనీ, పాలితుల శ్రమ నావిధంగా దోచు కుంటున్నారనీ వర్గ దృక్పథం చెబుతుంది ఈ రెండూ పాలకవర్గానికి ఇష్టమైన మాటలు కాకపోయినా రెండవ దానికంటే మొదటిదే నయం

2 గ్రామీణ వ్యవసాయిక నాగరికత పారిశ్రామిక నాగరికత వల్ల చెడి పోతున్నదని వర్ణ దృక్పథమంటుంది అదొక అనివార్యమైన పరిణామమంటుంది వర్గ దృక్పథం వ్యవసాయిక నాగరికత వర్ణ వ్యవస్థను కాపాడుతుంది అందుకు పారిశ్రామిక నాగరికతను ఆహ్వానించకపోవటం ఉత్తమం పారిశ్రామిక నాగరికత వర్గ స్వభావాన్ని చైతన్యాన్ని పెంచుతుంది అది వర్గ దృక్పథాని క్కావాలి

3 వ్యవసాయ నాగరికత చెడిపోవటానికి మరొక కారణాన్ని వర్ణ దృక్పథం చెబుతున్నది నదులకు ఆనకట్టలు కట్టి కాలువలు త్రవ్వి పంటలకు నీటి వసతి కల్పించటం అని కారణమేమిటంటే "పల్లపుటూళ్ళ పంటలవారు బోలెడంత విశ్రాంతి కలవాళ్ళు తేలికగా పండుతో వుంటే బోలెడంత విశ్రాంతి వుంటే ధర్మాన్ని పాడు చేస్తారు మూడు వందల అరవై రోజులూ పొలంలో పాటు బడవలసిన వాడు రాజకీయ మత సాంఘికాభిప్రాయాల మీదకు దండె త్తేందుకు వాడికి విశ్రాంతేది?' (విమర్శిని 2 P 33)

మాతృకలచేత వ్యవసాయాభివృద్ధి చేస్తే వచ్చే నష్టమిదన్నమాట దీని అంతర్యమేమిటంటే - పని పాటుల వ్యవసాయదారులు బ్రాహ్మణ వర్గం ఆధీనములో వున్న ఉపరితల సామాజిక చైతన్య వాఙ్మయ రూపాలయిన సాంఘిక మత రాజకీయాలలోకి ప్రవేశించ కూడదని శ్రమించ వలసిన కాలం తగ్గి విరామం దొరకడం చేత వాళ్ళు బ్రాహ్మణాదీనంగా వున్న వాఙ్మయ రూపాల మీదికి దండెత్తుతున్నారని ఇది అభ్యుదయకరమైన ఆలోచన కాదు రచయిత వర్ణ చైతన్య ప్రయోజనాన్ని చూచుకొంటున్నది

బోలెడంత విశ్రాంతి వుంటే ధర్మాన్ని పాడు చేస్తారన్న అభిప్రాయాన్ని వర్గ దృక్పథం నుండి చూడవచ్చు విశ్రాంతి ఎవరికి వుంటుంది? ఇతరుల శ్రమ మీద బ్రతికే వారికుంటుంది అలా బ్రతికేవ అధికార వర్గమే అసలు ధర్మ మేమిటి? శ్రమించటం - ఫలితాన్ని అనుభవించటం ధర్మాన్ని పాడు చెయ్యట మంటే శ్రమకు ఫలితం లేకుండా చెయ్యటం బోలెడంత తీరికవున్న పాలక వర్గం శ్రమకు ఫలితం లేకుండా వుండటం ఎలా ధర్మమనిపించుకుంటుందో ఆలోచిస్తుంది తన చతుర్వర్ణ వ్యవస్థను గురించిన ఆలోచనలో - విశ్వనాథకు దేశంలో ఇన్ని అసంఖ్యాకమైన కులాలు ఎలా వచ్చాయన్న ప్రశ్న పుట్టినట్లు లేదు వర్ణం వేరు - కులం వేరు అన్న దృష్టికూడా లేదు క్షత్రియ కులముంది రాజ్యాన్ని పాలించే ఏ కులం వాళ్ళయినా క్షత్రియులే అన్న విశ్వనాథకు కులాల గురించి వున్న అభిప్రాయం విచారణీయంగా వుంది వైశ్యులను గురించిన విషయం తగాదాగా లేదు శూద్రులంతా ఒకటే వర్ణం కావాలి వాళ్ళల్లో పెద్ద కులాలవాళ్ళుగా రెడ్లనూ కమ్మవారినీ ప్రస్తావిస్తాడు ఇంతవరకూ దీన్ని ఒప్పుకొన్నా పంచమ వర్ణంగా ఒక పెద్ద కులం తయారు కావటం గురించి ఆయన ఆలోచించలేదు ఋషులు ఏర్పాటు చేసిన సాంఘిక చతుర్వర్ణ వ్యవస్థ నతిక్రమించి పంచమ వర్ణం భారత జాతీయుల్లో వుండటం ఎలా సంబంధించిందన్న విచారణ కాయన పోకుండా గాంధీగారి జాతీయోద్య మంతో ఆ పంచమ వర్ణానికి వచ్చిన గుర్తింపును ప్రాధాన్యాన్ని గమనించి నవలల్లో వాళ్ళను కథాపురుషులుగా చిత్రించాడు విశ్వనాథ బ్రాహ్మణవర్ణ చైతన్యంతో వాళ్ళు ప్రవర్తిస్తారు ఎందుకంటే, వేదధర్మాన్ని అన్ని కులాలవాళ్ళు అనుస రించేటట్లు బ్రాహ్మణులు చూడాలి కదా! అందుకని - బ్రాహ్మణ వర్ణం చెడి పోయిన వాస్తవాన్ని చూపిస్తూ వేద ధర్మమైన బ్రాహ్మణ చైతన్యంతో వాళ్ల ప్రవర్తించటాన్ని ప్రదర్శించటం జరిగాయి

సామాజిక, నైతిక, సాంస్కృతిక సంబంధాలు బెడిసిపోతున్న వైనాలను ఆయన చిత్రించాడు అందుకాయన చెప్పిన కారణాలు కానీ, విరుగుళ్లుకానీ సరియైనవి అవునా కావా అన్నది అయితే అచరించటంగానూ, కాకపోతే అవలకు నెట్టటంగానూ వుంటుంది ఆయన రచనల్లో భావవాద పక్షం నిలబడి భౌతిక వాదంతో సమన్వయించుకొని పోవటమే సరియైన ప్రాపంచిక జీవిత దృక్పథ మన్నట్లు రచించటం కన్పిస్తుంది భారతీయ మత తాత్విక సంప్రదాయ విషయాల నన్నింటినీ ఆధునిక చైతన్యంతో పునర్విచారణ చేసుకొని, కలిసి వచ్చిన వాటిని కలిసివచ్చినంత కలుపుకొనిపోవటం అభివృద్ధి లక్షణమన్న శాస్త్రీయ దృక్పథానికి ఆయన ఎక్కువగా అనుకూలుడు ప్రతి విషయాన్ని సమస్యను

తాత్కాలిక దృష్టితోనూ అనంత కాల జ్ఞానంతోనూ విచారించాలని పరిష్కరించాలని అది మానవ జీవితానికి సరియైన మార్గమని ఆయన ఉద్దేశం ఆయన మహా నిర్మాణ శిల్పియైన రచయిత కావటంతో అన్ని సంగతులనూ వైషయిక దృష్టితో సమంగా చిత్రించటం చేత అర్థం చేసుకోవటంలో మనం జాగ్రత్తగా వుండాలి

విశ్వనాథ వారి ఆయా రచనలు ఆయా కాలాల్లో రావటానికి తోడ్పడిన పరిస్థితులేమిటి? అప్పుడు ఏ ప్రయోజనం కోసరం అవి వ్రాయబడ్డాయి? ఆయా రచనల్లోని వస్తువు ఏ కాలానికి సంబంధించింది? ఇప్పుడు దాని ఉపయోగమేమిటి? ఆ రచనల్లో అప్పటి దేశ కాల పరిస్థితులకు అనుకూలంగా వున్న ఆలోచనలూ, ఇప్పటికి మనకు పనికి వచ్చే ఆలోచనలూ ఏమిటి? ఇలా అనేక విషయాలను అనేక కోణాల నుండి విచారణకు పెడితేనేగాని వాటి అంతర్యాలు బయటపడవు

ఒక రచనకు రచయిత ఆలోచన మూలమైతే దానికి అతని దృక్పథం మూలం దానికి అతని జీవిత విధానం మూలం దానికి సాంఘిక వ్యవస్థ మూలం దాని ఏర్పాటుకు అందులోని ఆర్థిక రాజకీయ తాత్వికమైన సామాజిక సంబంధాలు మూలం సంబంధాలు మారాలంటే ఆర్థిక రాజకీయాలవల్ల రూపు గట్టుకొను సామాజిక చైతన్య రూపమైన తాత్వికత మారాలి అది మారితే సాంఘిక వ్యవస్థ మారుతుంది అది మారితే దాని కనుకూలంగా సామాజికుల జీవన విధానం మారుతుంది అది మారితే దృక్పథమూ దాన్నిబట్టి ఆలోచన మారుతుంది ఆలోచన మారితే రచన మారుతుంది రచనల్లో మార్పులు కనిపిస్తున్నాయంటే అర్థం వాళ్ళ వాళ్ళ జీవన విధానానికి సంబంధించిన దృక్పథంలో మార్పు చోటుచేసుకుంటున్నదన్నమాట మార్పు వాస్తవంగా గానీ, భావనగా గానీ, అనుభవంలోగానీ, ఆలోచనలోగానీ లేకుండా అభివృద్ధి లేదు

మార్పును గురించి మనమిప్పుడిలా అనుకుంటున్నాంగానీ, మన ప్రాచీనులు అనుకున్నారా? అనుకోలేదు భావవాదులూ, భౌతికవాదులూ అయిన తాత్వికులు ప్రపంచమంతా వున్నట్లే మన దేశంలోనూ వున్నారు ఆస్తికులూ - నాస్తికులూ, ఈశ్వరవాదులూ - నిరీశ్వరవాదులూ అని, ఆస్తికులూ - ఈశ్వరవాదులూ - భావవాదులు - జీవేశ్వరైక్యతా భావవాదులు కూడా భావవాదులే

ఈశ్వరవాదులు వైషయిక భావవాదులు జీవేశ్వరైక్యతావాదులు ఆత్మ భావవాదులు-వీళ్లెవరూ మార్పును సత్యంగా భావించినవాళ్లు కాదు జగత్తు అను

క్షణమూ మార్పుల అనుక్రమంగా సాగటంవల్లనే వాళ్ళకది సత్యంగా కనిపించక దాన్ని మిథ్య అన్నారు ఆత్మ నిత్యమన్నారు ఆత్మ అంటే బ్రహ్మం అంటే జీవుడు అంటే మనిషి నిత్యమన్నమాట మనిషి కూడా నిత్యం కాదని వాళ్ళకు తెలుసు అందుకని మనిషిని వదలేసి జీవునికి పట్టం కట్టారు

విశ్వనాథ రచయితగా ప్రదర్శించిన జీవిత దృక్పథం వాస్తవికతను గ్రహించటంలో ఏ విధమైన పొరపాటూ పడదు దాన్ని ప్రతిపాదించటంలో ఆయనలోని రియాక్షనరీ స్వభావం దాన్ని చుట్టుకోటం కొన్ని చోట్ల తొల్తగించ టానికి వీల్లేనట్లుగా వుంటుంది రియాక్షనరీ స్వభావం మనిషిని అభ్యుదయ పంథాలో చూపించకపోయినా రచయితగా మహనీయ స్థితికి చేర్చటంలో అది తోడ్పడుతుంది విశ్వనాథ ఆదునిక తెలుగు సాహిత్యంలో ఒక ప్రౌఢ రచయిత కావటానికి మిగిలిన అనేక కారణాలతోపాటు ఆయన రియాక్షనరీ స్వభావం కూడా ఒక కారణం నిజానికి ఆయన జనమనుకుంటున్నంత ఎక్కువ రియాక్ష నరీ కాదు ఆయన సామాజిక దృక థం భారత జాతీయ సనాతన దృక్పథం ఆయన తెలుగు భాషాకవి కావటంచేత మరింత సంకుచిత పరిధిలో పడ్డాడు

సనాతన భారత జాతీయ జీవన దృక్పథం నాల్గు వర్ణములవారు వేద ధర్మమును ఆచరించవలెను, ఆచరించునట్లు బ్రాహ్మణుడు చూడవలెను అంటుంది ఈ పరిస్థితి తాను పుట్టేటప్పటికే చాలా మారిపోయింది ఆ మార్పును గుర్తిస్తాడు అదంతా ఏదో జాతి చేసుకున్న పాపం వల్ల చెడిపోతున్నట్లుగానూ, మళ్ళీ కొన్నాళ్ళకు ఆ పాపం నశించిన మీదట మళ్ళీ సనాతన ధర్మం నెలకొన బోతున్నట్లుగానూ భావించటం కనిపిస్తుంది చరిత్రను గురించిన శాస్త్రీయమైన దృక్పథం కూడా ఆయనకు లేదు అయినా, పురాణవైర గ్రంథమాల పేర పురాణ కథలను నవలలుగా చెప్పాడు ఆచరణ యోగ్యతకు నోచుకోని కొన్ని ఆచారాలను, కొన్ని విశ్వాసాలను ఆదేపనిగా ఒక తర్కాన్ని పెంచి నిరూపించ టానికి గట్టి ప్రయత్నం చేశాడు మగవాడు ఎంత వయస్సులోనైనా చిన్న పిల్లలను పెళ్ళి చేసుకొనే ఆచారాన్ని, అన్ని జన్మల్లోనూ ఆ స్త్రీ పురుషులే భార్యా భర్తలుగా అవుతుంటారన్న విశ్వాసాన్ని ఆయన తీవ్రాభినివేశంతో నిరూపిస్తాడు

పాశ్చాత్య విద్యా సంస్కృతులు వచ్చి భారతీయ మర్యాదలను సర్వ నాశనం చేశాయన్న వేదన ఒకటున్నది అయితే, ఆయనకు అసలు మనదేశాన్ని విదేశీయులు తరచూ ఆక్రమించుకోటానికి కారణం తెలియదు దానివైపు దృష్టిలేదు

పారిశ్రామికీకరణ వల్ల గ్రామీణ వ్యావసాయిక నాగరికత నశించి పట్టణ వ్యాపార నాగరికత అభివృద్ధి అవుతున్నదని గుర్తించాడు వాటివల్ల ఎవరికి ఎలాంటి లాభనష్టాలు కలుగుతున్నాయన్న విచారణ లేనందున వల్ల ఆయనకు ఆధునిక జీవితదృక్పథం లేదు వున్నది పోతున్నదన్న గుర్తింపు, వేదన వున్నాయి

చుట్టుపక్కల ప్రపంచంలో వస్తున్న భౌతికమైన మార్పులకూ, అంత కంటె ఎక్కువగా తాము పుట్టి పెరుగుతున్న మానవ సమాజంలో జరుగుతున్న మార్పులకూ కవులూ రచయితలూ, కళాకారులూ, వాళ్ళ వస్తు రచనలూ అనుకూలంగా గానీ, ప్రతికూలంగా గానీ ప్రతిస్పందించటం తప్పనిసరి సమాజంలో వర్ణ వ్యవస్థ నశిపోతూవుండటం అంటే భూస్వామ్య వ్యవస్థ నశిపోతూ వుండటం చూచి దాని కనుకూలంగాకాక ప్రతికూలంగా ప్రతిస్పందించాడు

మానవ జీవితానికి కొన్ని సిద్ధాంతాలుండాలని కూడా ఆయనకు తెలుసు ఆచరణలో అవి లోపభూయిష్ఠంగా వున్నాయనీ తెలుసు అయితే, అవి ఎందుకు లోపభూయిష్ఠాలవుతున్నాయో ఆయన విచారించడు విచారించాలన్నా అధికార వాంఛా స్వార్థమూ మనిషికి పుట్టుకతో వున్నవన్న నిశ్చితాభిప్రాయం వున్న వాడు ఏమి విచారిస్తాడు? అయితే, మనిషినిక బాగుచేయటం సాధ్యంకాదు కదా అన్న నిశ్చయ జ్ఞానంతోనూ వుండడు అయ్యో, మనిషి జీవితం ఆచరణలో లోపభూయిష్ఠంగా వున్నదే అని ఆవేదన పడతాడు ఇంత ఆవేదన వున్నవాడు నిజంగా ఆలోచన పరిధులను అంతర్జాతీయ స్థాయికి పెంచుకొన్నట్లయితే ప్రపంచ దృక్పథం కలిగిన ప్రపంచ భాషామహాకవుల మహా రచయితలపంక్తిలో శ్రీశ్రీ కంటే ముందుసీట్లో వుండేవాడు అంత జీవుని వేదనకూడా సనాతన భారత జాతీయ స్థాయికి కుదించబడింది కావటంచేత సత్యనారాయణ గారి జీవిత దృక్పథం పరిధి చాలా చిన్నదై పోయింది అయితే, ఆయన అనంతమైన సృజన ప్రతిభాశక్తి కలవాడు కావటం చేత మనిషి అంతశ్చాలన సీమల్లోకి యథేచ్ఛగా ప్రవేశించాడు అది అభేదకం గనుక ఆయన వీర విహారం చేయటానికి వీలయింది

